ంగారకావ్య గ్రంథమండలి ప్రబంధపరంపర — ౮

# హంసవింశతి.

అయ్యలరాజు నారాయణామాత్యుఁడు.

---

PUBLISHED BY
K. G. MURTHY.
FOR SRUNGARA KAVYA GRANDHA MANDALI.
MASULIPATAM.



పదిమాసముల కెక్కుడుగ, మేమొనరించుచుండిన భగీరథప్రయత్నంబు, భగవతి యగు వాగ్దేవతానుగ్రహంబున ఫలించి, యమరాపగా కల్లోలధోరణీమాధురుల జవికిం దెచ్చు నయ్యాల రాజుకవి దేవేంద్రుని కావ్యామృతప్రవాహం బాంధ్రసారస్వతేయుల నోలలాడించెడి శుభావసరంబు లభించినది.

ఇంతవరకు నొకటి రెండుసారులు ముద్రిత మయ్యూ, నీ మహామహుని రచనఁ సమగ్రముగ సుసంస్కృతమై లభింపమి, తీరని లోటుగా నెంతయోకాల మాంధ్రవాఙ్మయ వినోదుల కారాటము కలిగించుచుండుట తలంచుకొనినకొలఁది, నాదోసగును నివారింప మాచేతనైనవట్టుకు, వ్యగ్రోత్సాహముతో సన్నద్ధులమై శక్తివంచనలేక, తలపెట్టినదానిని మాచేతనైనంతవర కేలోపము కలుగకుండ నిర్వహింపజాలితిమని రసజ్ఞ పాఠకమండలి కెరుకపఱచుకొనుచున్నారము. మండలాంతరముల, మారుమూలలదాగియున్న ప్రతులందలి పాఠభేదములారసి చూచికొని జతగూర్చుకొన్న, మాప్రతిని చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందలి ప్రతులతో సరిచూపించి, యటులఁ బరిష్కృతమైన, దానినే ముద్రింపఁదొరకొంటిమి.

ఆంధ్రవారపత్రికా సంపాదకులును, సిద్ధసారస్వతులునగు తిరుమల వేంకట రంగాచార్య శిరోమణులు, మాకు వెనుకటి యటులంబలె నెంతయూ సాయపడి, చెన్నపుర పుస్తకభాండాగారమునందుగల

తాళపత్రప్రతి — 13-3-35

కాగితపుప్రతి 12—1—47

,, 12—3—44 Vol. I.

,, 12—3—45 Vol. II.

వీనిసాహాయ్యమున, మరల గ్రంథమును సంశోధించి, పాఠభేదంబుల సూచించి, మిగిలిపోయిన పద్యములఁజేర్చి, మాతృకను సిద్ధపఱచి, మాయుద్యమంబున కన్నివిధముల చేదోడు వాదోడై ప్రోత్సాహించిరని, యా సౌమ్యమూర్తికి కృతజ్ఞతతో నమోవాకములని వారి దీర్ఘాప్రశస్తి నిట నుగ్గడింతుము.

ఆంధ్రసారస్వత ప్రచారమునకుగా నించుమించుగ నధునాతనులలోఁ బ్రథమగణనీయుఁడగు బ్రౌనుపండితుఁడు తన నిఘంటువునం దుదాహరించిన హంసవింశతి పాఠముల నన్నింటిని మేమంగీకరించి, గ్రంథముత్తమోత్తమమైనదని యాతఁడిచ్చిన యభిప్రాయముతో మేము పూర్ణముగ నేకీభవించుచు— పాఠకమండలికూడ, తఱచి చూచి యటులనే నొనరించుగాత యని యాచించెదము.

తెలుఁగునాఁటను జీవనమొనరించు నాయాజాతుల వృత్తులఁ దెలియఁజేయు పారిభాషిక పదసముదాయం బంతయూ వీసమేని పొల్లుపోసియక సమకూర్పంగలిగిన కార్యదీక్షయే మా యీ వ్యవసాయంబున విజయతారమై ధన్యులఁజేసినది.

ఇఁక నుత్సాహ పారవశ్యాందోళితులగు భావుకులు, నయ్యలరాజువాని తియ్యని కవితా-కన్నియ నుడుల గిలిగింతలతో రసదేవిని సమ్యాటములకు బోలించి - కావ్యాలాపన లందలి మేలెంచి కృతకృత్యులయ్యెదరుగాక.

హంసవింశతికిఁ దరువాత ప్రయాగ కామేశ్వరకవి విరచితమగు 'గోపాల లీలాసుధాల

హారి' యను శృంగార ప్రబంధమును బ్రకటింపఁ దలఁచితిమి. ఆ మహాకవిని గూర్చి యాంధ్ర కవుల చరిత్రమునందు, స్వర్గీయ కందుకూరి వీరేశలింగము పంతులుగారిటుల వ్రాసి యున్నారు.

'ఇతఁడు గోపాల లీలాసుధాలహరి యను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి రామ తీర్థస్వామి కంకితము చేసెను. ఈకవి విశాఖ పట్టణమండలపువాఁడు. వైదిక బ్రాహ్మణుఁడు, కౌశికగోత్రుఁడు; నారసింహ పౌత్రుఁడు, సర్వేశ్వర పుత్రుఁడు. ఇతఁడు నూరుసంవత్సరముల క్రిందట నుండినవాఁడు. కవిత్వము మంచిదేయైనను శృంగారవర్ణనము నితఁడు మిక్కిలి పచ్చిగాఁ జేసియున్నాఁడు.'

ఈ ప్రశంసను బట్టిచూచిన, ప్రయాగకామేశకవి లాక్షణికుఁడై నిర్దుష్టమగు మధురకవితఁ జెప్ప వలంతియనియు, నాతని గ్రంథమునందు శృంగారవర్ణనము లతివేలములుగ నొనర్పం బడినవనియు నాపండితుఁ డభిప్రాయపడి నటులఁ దెల్లమగుచున్నది. పంతులుగారు, కావ్యకన్యక కచకుచాద్యాకార వైలక్షణ్య శోభల గురు తెఱుఁగఁ దలఁచని సాత్త్విక నిర్గుణమూర్తి యగుటఁజేసి, కవి శృంగార వర్ణనమునకు దిగినభాగములఁ బ్రతులందు బరిశోధనావసరమునఁజూచినపుడెల్ల కంటగించుకొనుట యాయనకుఁ బరిపాటియాయెనని విజ్ఞులెఱింగినదే. ముద్దుపళనిఁగూర్చి వ్రాయుచు, 'ఇది సంగీత సాహిత్య భరతశాస్త్రములలోఁ బ్రవీణురాలైనట్టు తానే చెప్పుకొన్నది. దీని కవిత్వము నాతి కఠినమై మృదువుగానుండిన దనుటకు సందేహములేదు, ... జారత్వమే కులవృత్తిగాఁగల వేశ్యయగుటచేత...శృంగార రసమును పేర సంభోగాది వర్ణనములను పుస్తకమునిండ మిక్కిలి పచ్చిగాఁజేసినది' అనియు, ప్రస్తుత గ్రంథమును, కవిత్వమును గూర్చి 'ఈతనికవిత్వము మొత్తముమీఁద ప్రౌఢమై రసవంతమైనదిగానున్నది... అయినను పుస్తకమునిండ, అంకుపోయి బొంకాడి తప్పించుకొన్న యుపాయములే వర్ణింపఁబడి యుండుటచేత నిది దుర్నీతిబోధకమై నీతిపరులకుఁ బఠనయోగ్యము కానిదయియున్నది' అని యిటుల నుడివియున్నారు. కావ్యములందలినీతి కవి, రచనావసరములఁ బాటించు రస-నియమము, విమర్శకునికన్న రసజ్ఞుఁడే యెఱుంగఁదగినవాఁడగుటవలన, నాయాకృతుల నజరామర వ్యాప్తియే, వారల కావ్యప్రతిభ దీరిచిన యౌచిత్యంబు కుదాహరణంబని నుడివిన చాలును. ఇళాదేవీయంబును, మామండలి ప్రథమంబుననే బ్రకటించినదిగదా; యిప్పుడు, హంసవింశతి, యికమీఁద గోపాలలీలాసుధాలహరి ప్రకటితముకానున్నదన, యే మారని మాయత్నంబులందైన కార్యగౌరవంబు సభ్యులకుఁ దెల్లమగును. గోపాలలీలాసుధాలహరి, మామండలి ప్రచురణము లన్నిటివలెనె శుద్ధప్రతిగా, సమగ్రముగ ముద్రణమునందుకొన సిద్ధమగుచున్నది. మాయభిప్రాయంబుననది, రాధికాసాంత్వనంబున కెనవచ్చు కవిత్వసంపదలతో నొప్పుచున్న సత్ప్రబంధమై, సారస్వతాభిమానులందఱి కరంబుల నలంకరింపఁదగిన యర్హతకుఁ జాలినదై యున్నదనియు, దానినచిరంబున మామండలి సభ్యుల కందజేయగలమనియు విన్నవింతుము.

కే. జీ. మూర్తి,
వ్యవస్థాపకుఁడు.



బ్రాహ్మణాః పాదతో మేధ్యా
గావో మేధ్యాశ్చపృష్ఠతః
అజాశ్చ ముఖతో మేధ్యాః
స్త్రియో మేధ్యాస్తు సర్వతః. 1

— ప్రాకృత మాయా జాలకాంతరాల్లో ప్రణయకల్లోల విభ్రమాన శోష్ణిల్లనీయకుండా వైదిక-చైతన్య ధీరుడైన ఆదికవి కూడా, ఆడుపులుగుకు జరిగిన అపరాధానికి శ్లోకమై పోతలపెట్టిన శోకా క్రోశంలో మాతృదేవి అయిన నారీమూర్తి ధర్మవ్రతనిర్వాహణ దీక్షా ప్రశంసగా మంగళాభివాదం పొంగి పోయింది. భగవత్పాదుల శివానంద - సౌందర్యలహరీ మాలికలలో తొలిపంకజ కోరకమైనది - ఈ పరమార్థాధిగమనమే.

వరాహ మిహిరాచార్యుడు, పారంపర్యంగా, ఆచార్యమండలికి తాత్త్వికముగా అభిజ్ఞాతమైన ప్రజనన మూలాధారసూత్రాన్నే ఛందోనియమాచరణాన కావ్యఫలదాయినిగా ప్రశంసకు తెచ్చుకున్నాడు. స్త్రియో మేధ్యాస్తు సర్వతః - పవిత్రతను స్త్రీ అయి అవతరింపచేయడానికి ఋషులు ఆభిజాత్య దోహద విధానాలల్లో ఉపాదులు ఏలా కల్పించినారా,

సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద
ఉత్తరః తృతీయో అగ్నిష్టే పతిః...
సోమోదద ద్గంధర్వాయ గంధర్వోదద
దగ్నయే రయించ పుత్రాం శ్చాదా దగ్ని
ర్మహ్యా మథో ఇమామ్...

(ఋగ్వేదం 10-85; 40-41)

---

1 బ్రాహ్మణాః పాదయోర్మేధ్యాః పవిత్రాః బ్రాహ్మణానాం పాదగ్రహణం సర్వైః కర్తుం యుజ్యత ఇత్యర్థః.... యోషితః తు సర్వతః సర్వేష్వంగేషు స్పర్శాలింగ నాధర పానాదిష్విత్యర్థః మేధ్యాః పవిత్రాః

తథా చౌశానసీ స్మృతిః — గావోమేధ్యా పృష్ఠే పురస్తాదజాదయః స్త్రియః సర్వతః (3—17—19) బృహస్పతి రప్యాహ —

పాదాశుచీ బ్రాహ్మణానా మజాశ్వస్య
ముఖంశుచిః
గవాం పృష్ఠాని మేధ్యాని సర్వగాత్రాణి
యోషితామ్.

ఇతి 'శుచిర్నారీ పతివ్రతా' (4—34) ఇతి యమ వచనానుసారేణ పతివ్రతానామేవ సర్వాస్వవస్థాసు సర్వేషు చాంగేషు మేధ్యత్వం సిధ్యతి. — (క్షితీశ చంద్రుని వివరణం).

ఈ అర్థమునే మిహిరుడు,

సోమస్తాసా మదా చ్ఛౌచం గంధర్వాః
శిక్షితాం గిరామ్

పావకః సర్వమేధ్యత్వం తస్మాన్నిష్క-
సమాః స్త్రియః

అని అనువదించాడు. సృష్టికి వన్నెలు తేల్చే లావణ్యసామగ్రిని కళాముఖంగా అమరించే సంధాతలు ముక్కా-కలదీర్చి, ప్రజాపతి నిర్మాణానికి ఒచ్చెములురానీకుండా, మానవునికి ... వరప్రదానంగా అనుగ్రహించారని, పూజ్యానురాగాన్ని అనుశాసించే స్మృతికారుడు, 'యత్రనార్యాస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః' అని హెచ్చరిక తెలుపుతున్నాడు...ఎంతటిదోషమైనా, తామరపాకు మీద తొణికిసలాడే నీటి ముత్తెమంతగానన్నా అంటి పట్టుకోలేదని నిర్దేశించు తున్నాడు, వివరణగా. 2

ఉపదేశమేమంటే 'జయేధరిత్ర్యాః పురమేవసారం, పురే గృహం, సద్మని చైకదేశః, తత్రాపి శయ్యా, శయనే వరాస్త్రీ, రత్నోజ్జ్వలా రాజ్యసుఖస్య సారః' ఇలా అంగీకరించవలసింది. 3. ధర్మావిరుద్ధమైన మార్గమున తృతీయ పురుషార్థాన్ని భజించడానికి, ఆ వ్యాపారప్రవర్తకుడుగా భగవానుడే గీతా వాక్యంగా సంసారాన్ని ఆవహించుతున్నాడు. 4

కాని, పూర్వపక్షగర్జనలున్నా లేకపోలేదు, 'నవాస్త్రైణాని సఖ్యాని సంతి సాలావృకాణాం హృదయాన్యేతా...' అనురాగామృతప్రదానం...అర్హాం - అధికారులకు చేయడానికి... కట్టుబాటులను అతిక్రమించే స్వచ్ఛందవదాన్యత రూపమోహినులకు ప్రతికృతిగా, పద్మసంభవుడు ప్రసాదించడమే పురుషర్షభుడి స్వార్థమర్యాదకు లాఘవం. చంచలదృష్టుల చాంచల్యానికి ... వాగురాబద్ధుడుగా లొంగిపోయే గృహస్థు ... ఆచాంచల్యము ... తన విలాసవల్లరికే దోహదసేవ చేయవలెననే... అనౌదార్యఅనుశాసన విధులలో...అనేకంగా అరికట్టడానికి పూనుకునే ప్రయత్నాలను తిరగద్రోసి ..పరాజయ ముద్ర చరికించడమే... విధాతకు ... స్వధర్మనిర్వహణంలో చేదోడుగా అమ్ములపదనుతో తరితీపులూరించే రమాకుమారుడి ..ధర్మవిజయలాంఛన: కల్లుతేడిసల పోలికగా తొణికే కామినుల వాలు చూపుల చలువనీడల్లో కామాగమ-వాలభ్యసిద్ధికి గురుకులవాసపు కాకలదీరే...శాస్త్రవేత్త ఋషుల సూత్రప్రాబల్యంతో...స్వదారరక్షణోపాయాలు వెదుకుతున్నాడు. గుహ్యం ...గుహ్యతమ...మనేప్రస్తావనతో శంకరుడు వామార్థానికి అర్థవాదప్రశస్తితో ఉపదేశించే పాతివ్రత్యపుణ్యఫలం...లాభాలూ ఒకమూల ఉంటూనేఉండగా...అవి ఏమీ పనిచేయనందువల్ల...పాతిత్యాన్ని...స్వయం వరించే కులపాలికల మనసు పోకడలను ... అన్వర్థహేతు - యోజనతో ... కూలంకష విభాగ పరిగణనముచేసి...ఎందుకు చెడిపోవడం కలుగుతుంది ..ఎవరు, చెడిపోయేవాళ్లకు, ఆసలా

---

2 ఆపస్తంబుడు (2—3) పరాశరుడు (7—2,35) మనువు (9—26, 28).

3 'నగృహం గృహమిత్యాహుర్గృహిణీ గృహముచ్యతే' (మహాభారతం (12-144-6) 'జాయాదేస్తమ్' )ఋగ్వేదం 3—53—4)

4 ధర్మావిరుద్ధో భూతేషు కామో అస్మి భరతర్షభ !

అవుతారు...అనేవి, లోకంలో తపోదృష్టిని ...సంగ్రహించుకున్నవి...దోసగుల- వల్లిగా ... అధ్యాయరూపం యిచ్చి ... అభిజ్ఞానం కలిగించుతున్నాడు:

సవ్యాధిర్వ్యాళు కువ్యక్త ధనహీన ప్రవాసినామ్
స్త్రియో యాత్రాది సంరక్తాస్త్వశ్చసాధ్యాః
పరికీర్తితాః
రజకీ మాలినీ ధాత్రీ యోగినీ ప్రతివేశినీ
సఖీ గోపాలికా చేటీ నాపితీ దూతికా మతాః
ప్రతిపద మదనప్రదీపకైస్తైః మృదువచనైః
యువతీ తయాభిధేయా కుసుమశరరుజావికీర్ణ
ధైర్యా దుత్రితమనుయాస్యతి యైః సుతేవ
దూతీమ్ః—

వాత్స్యాయనుడి అడుగుజాడలలో నడచిన భిక్షు పద్మశ్రీ నిబంధన భాగంలో...లోపాలను... సర్ది చెప్పుకుని ... కామారోగ్యం ... కామినీలోల విలోకనాలలో తనవైపునకు మరలించుకోదలచే .. మానవుడి అస్థికహృదయాకోశం ప్రతిస్పందిస్తూన్నది. విక్రమార్కుడి సోదరునిలాగు అనుభవంపారం చూచి .. ఆమీద దాన్ని గర్హించడానికి తలకొనే యోగులు ... అందరూ అయితే ... లోకవ్యాపారం చట్టుబడిపోతుందికాబట్టి ... అందనీయని గికురింతలతో... స్త్రీ ...పురుషుడికి ...ఎప్పుడూ అందుబాటౌతూనే ఉంటుంది. కాపటికలని...ఉత్క్రోశంతో యీసడించు ...మానవహృదయమే,

కామినీం ప్రథమయౌవనాన్వితాం
మందవల్గు మృదుపీడిత స్వనామ్
ఉత్తనీం సమవలంబ్య యారతిః
సా నధాతృభవనేస్తి మేమతిః—అని అఱ్ఱులు చాచుతుంది.

౨

స్త్రీ హృదయదౌర్బల్య ప్రచారకంగా... స్వీయకవితాప్రాగల్భ్యాన్ని దుర్వినియోగం చేయడం, పుణ్యానికా...పురుషార్థానికా?

మోక్షప్రాప్తికి సాధనపరంపరను నిర్మించుకుంటూ, ఐహికంగా గీతాలాపాలు సేకరించే యశోవైభవ-సముపార్జనము, విశ్వశ్రేయోరూపిగా హితవైనది కాని, ఏపుణ్యగాథాప్రవచనమున్నూ వినబడనీయని ... ఈ అపమార్గ గమనంవల్ల...కవి బావుకునేది ఏమిటి? అనే నీరసఛాందస ఆశంకకు సమాధానవాక్యాలు - గాధేయుడికి అప్పచెల్లెలైన కావ్యకన్య...స్వీయమనోనుకూల జగతిలో ..ఆత్మగతంగా శబలించే...చిత్రవర్ణ సందోహం... భావుకుల భావనలో ... కైవల్యచంద్రికల విరిపూతలునించి ... మోక్షవాసంతీ ఘుమఘుమలకు...నందనవనీ రామణీయక - కోరకామరత్వం సంఘటించుతుంది. కవి అయినవానిసాధనకు అదీసిద్ధి. లోకం అనుమతించే మెరమెచ్చుల మేరల్లోనే ఉండి...పురాణ-పుణ్యాన్నిమాత్రమే గణించుకునే నియమానికి లోగి ... కావ్యకన్య ముక్తి ప్రాంగణాల్లో విహారవారసత్వం కాదని నిరసించుకునే ... అలసగతి...ఆతనిలో రగులుకోదు. కావ్యవధువు కట్టుబడిఉండే నీతివేరు ... ఆబాల నోచినవానికి అందిచ్చేఫలమువేరు: ఈ సంప్రదాయాన్ని గుర్తించుకోగల ప్రాజ్ఞుడే కావ్యరసికుడౌతాడు: యుగాలనాటి ముదుసలి అయిన ముక్తికాంతా స్వయంగూహనంలో ఉన్న నీరసబంధన-గారవం కన్న ...స్వైరచారిణిగా...నోరూరించే కావ్యకన్యకే క్రీతదాసుడౌతాడు.

3

చిలుక ... మానవులు దిద్దిన ఒరవడిలో పలుకుల తీయందము మెలిపి ... నిలువరించి నంతమాత్రాన...పరకీయ కాబోతూ, స్వీయ నాగరత్వాన్ని ... కలలలో పులకరించనేర్చిన సరసురాలు ... కార్యాచరణాన్ని ఉజ్జగించి నిలిచిపోవడం...అది ఏటి ప్రౌఢతనం? మాట లోకట్టివైచి...యౌవనం ధన్యం కానీయకుండా తెల్లవారించడానికి పూనుకున్నదనే సంగతి... ప్రభావతికి తెలియదా? .. హంసకూడా, ఆచాయల్లోనే...ధర్మానుష్ఠానం చేస్తూన్నదని ...హేమావతి గమనించలేకపోయిందా? — తెలియక కాదు, కాని,

—హేమావతి...ఇరువది కథలలో నాయికలలాగా పాపాచరణానికి అందెవేసుకొని గడిదేరిన దిటవరి కాదు. అనుకూలుడై ... సకల సంపదలతో తులదూగించే నాయకునికి అనుకూలగా...మచ్చలేని మనసుతో మెలగుతూ అత్తమామల కట్టడిలో ... గృహకార్యనిర్వహణంలో తీరికలేక...అడుగు తప్పిపడటానికి అవకాశంలేని పాతివ్రత్యం పాలించుకుంటూ వస్తూంది. అదివరకు ఎన్నిసార్లు విప్రలంభం అనుభవించలేదు? అప్పుడల్లా, నాయకుని పునరాగమనాన్ని నిరీక్షించుతూ సజావైన విరహంతో చిక్కిసగమై పోవడానికి అలవాటుపడ్డ ప్రాణి... చతురిక అయిన హేల సంధానచాతుర్య ఫణతుల్లో, క్రొత్త ధోరణిలోకి తెప్పరిలి, నూతనానుబంధం కుదిరించుకునేందుకు తహతహలాడిపోయింది. ప్రోషితభర్తృక, కామచైతన్యంతో అభిసారికారీతు లలవరించుకున్నది. కాని దుర్యోగమువల్ల, కమనసమాగమము. ప్రాప్తించక నవరసికునిమీద మమత చెల్లించుకోలేని నలత, ఆ ఇరువది రాత్రిలూ కలచివైచి ... దరిద్రుల మనోరథంవలె— క్రొత్తగా సాగిన తీగె, మరల తొలుతటి తరుకాండాన్నే ఆశ్రయించి- అంతటితో సరిపుచ్చుకుని, ఊరక ...ఎక్కిళ్లను... గుక్కిళ్లుగా మార్చుకోవలసి వచ్చింది.

'కోమటికోడలు కొమ్మ' అయిన ప్రభావతి, సామాన్య లౌక్యధర్మవిరుద్ధమైన రూపసంపద కలిగి ..రసికరాజుల తలమానికమైన, ప్రభువును మోహపెట్టగలిగిన భాగ్యశాలి... ఆమెతో ఫలానుభవంలో తుల్యయోగితగా 'సాత్తాని బిసప్రసూనదళ ధాళధళీతర ళాక్షి' హేమావతి, కావడం...విధి ప్రాబల్యము కాక మరేమి? సామాన్యముగా అడ్డంకులుగా తగిలి ...సామాన్య గృహిణులను సామాన్యవైఖరులలోకి ఈడ్వకుండాఉండే ... అత్తమామల కోరంటికం ..ఆరడిపెట్టే వదినె మరదులు... నిమిషమేమారని మగడూ ... ఇవి అన్నీ... సమయానికి, చురచురలాడే ఎండకు కరగిపోయే మంచు తెరలై రసికునివద్దకు రహదారిని తీర్చినా...హేమావతి మనసు తీర్చుకోలేకపోవడానికి కారణము...ఆమె ఎన్నడూ అంతకుముందు ఆలాటి ఆలోచనలకన్నా అలవడినది కాకపోవడం...అప్పుడు హేల ఉపదేశంవల్ల ఆతలపుకు మళ్లినా...అందులో సాధకబాధకాలు స్వయంగా నిర్ణయించుకోలేని అప్రౌఢ కావడం...తనంత తావలచి పోయేది కాక... అంపిన దూతికవెంట అననుభూతమైన అనుభవంకోసం అడుగుపెకలించి ముందుకువేయడంలో ఉండే అటమట... వెరపుడిపి తగిన సమాధానం చెప్పవలసిన నాయకుడు ఎదుటలేకపోవడం...కథలంటే చెవికోసుకునే పసితనం,

అందులో తిరుగుళ్లు చెప్పలేని అమాయికత్వం.. ఇలా కర్ణుడిపాటుకు కమ్ముకున్నన్ని కారణాలు హేమావతిని చౌర్యరతంపాల పడనీయకుండా చేసినవి: అలా ఆకునందక పోకను పొందక ఆసందర్భం అప్పటికి విచ్చిపోయినా...ఆతరువాత జీవితంలో తీరికగా ఉన్నప్పుడు...భావనలో తళుకుమనడానికి...కొన్ని మెళుకువలు ఒంటపట్టినవని—భావుకు లూహించుకోవచ్చును.

విధిరేవ బలీయసీ అనుకునేందుకు...కోరికలకు నేరుగా చెల్లిపోగల నేర్పులేని యీాయుగంలో...ఇంతకుమించిన నిదర్శనము ఏమికావాలి? కథలుచెప్పి బుద్ధిమళ్లించిందా, హంస? అదిచేసింది అసలు ఆప్రయత్నంకాదు. ఏలాగో చిలవలు పలవలుచేసి ఏవో కథలల్లి...ఆదుర్దాను ముంచివేసే ఆలస్యంచేసి...అందుకులగించిన చిక్కుకు ఆశ్చర్యపడేటట్టు ఉక్కిరిబిక్కిరిచేసి...కోడికూసేవేళకాదా...హేమావతి అడుగుగడపఅవతల పడనీయకుండా కాచుకోవడంమాత్రం. పోనీ ఒకరాత్రి ఆమాదిరిగా రక్షించుకున్నదనుకున్నా...మనసుమారని హేమావతి మళ్లామామూలువేళకు మునుపటికన్నా ఎక్కువగా సింగారించుకుని...ముందుకుదూకే కోరికలతో...ఏమైనాసరే ఆనాడు వెళ్లితీరాలనే దీక్షతో...కదలివచ్చి..పంజరందగ్గర బందీ అయిపోవడం ..వెంటనున్నబుడుత అయినా శుభముహూర్తం మించుతూందని తొందరించకపోవడం, ఈకలాపం తెలుసుకుని అవతల నాయకుడైనా...ఏదో ఏర్పాటుచేయక నోటిలో వ్రేలువేసుకుని...దానంతట అదే రాక ఏమవుతుందనే ధీమాతో ఉండటం...ఈలా వ్యర్థంగా పుణ్యకాలం గడచిపోవడం...చివరకు, ఓడబేరానికి వెళ్లిన మగడు మళ్లీ వాడకు వచ్చినకబురువిని...అంతటితో, ఇక సాగేకలాపం కాదుకనుక...వాంఛలను మనసులో మారుమూలలకుత్రోసివేసి...ఏమిఎరుగని దానిలాగా స్వామిని ఎదుర్కొనడం...ఆకబురువిని మహారాజు శ్రృంగారచందనచర్చలకు...నిర్వేద—వైరాగ్య విభూతి ఇప్పించి...మనసు సంబాళించుకోవడం...పసలేని ఈఅల్లికలలో తేల్చుకున్న పరమార్థం ఏమిటి? నీతిబోధన అనవలెనా...ఇరవై జారవ్రితల కథలలో అందుకు చీమవాసి అయినా సందులేదు...పాపాచరణానికి తగినబాధ పడకపోగా...చెక్కుచెదరకుండా ఆవ్యవసాయం అవిచ్ఛిన్నంగా ఆజన్మాంతం సాగించినట్టు ద్యోతకమౌతూంది. ఇక హేమావతికథా...పాలుత్రాగనేర్చిన బంగారుతల్లికి మీగడ మ్రింగుడుపడలేదనే సామెత స్ఫురణకు తెచ్చుకుని ..ఆలాపగమకాన రమణీయఅర్థప్రతిపాదనమే అక్కడక్కడ కావ్యవాణి మేళవించే లయలని ... భావించుకుని ... కావ్యకన్యకు సోదరులయే నీరసయోగాన్నుంచి రసికులు తప్పించుకోవలసి ఉంటుంది.

౪

చైనా జాతిలో మొలకెత్తి...జపానుసాహితీలతను లతాంతాలు విరియించిన ఒక కథ—ఆకాశరాజుకు తంబతా సుమే అనేఒకచక్కని చుక్క, ఒక్కతేకూతురు: ఆపిల్లకు బట్టలు నేయడం అంటే ఇంతంత అనరాని సరదా. తండ్రికి కావలసినపంచలన్నీ, ఆ అమ్మాయే నేసిపెడుతూండేది. ఒకనాడు మగ్గంముందు

కూర్చుని పోగులు సారించుతూ, దోవ వెంట మాంచిఏపైనకోడెను తోలుకుపోతూన్న, ఓ కోడెకానిమీద, కన్ను వేసింది. తండ్రికి ఆమె మనను తెలిసి, ఆతడి పొత్తుకు అనుమతించాడు.. అల్లుడినిచేసుకుంటానన్నాడు. కాని పెళ్లైనప్ప టినుంచీ...వాళ్లిద్దరూ, ఒకరి నొకరు ఎడబా యకపోగా...చేయవలసినపనులు వెనుకబడి... ఆకాశరాజుకు, పంచలు...ఎద్దుకు, మేతా... కరవై...ఆయన, చూస్తూ ఊరకుండలేక ఆజంటను విడదీశాడు. ఆకాశగంగకు అద్దరి నొకరు ఇద్దరినొకరూ ఉండవలసిందిగా కట్టడ చేశాడు. కాని ఏడాది కోరోజు, ఆశ్వయుజ శుద్ధ సప్తమినాడుమాత్రం...ఇద్దరూ సంసారం తీర్చుకోవచ్చునని వరం అనుగ్రహించాడు. ఆరాత్రి...ఆకాశం నిర్మలంగాఉంటే...విహంగాలు రెక్కలతో వంతెన అమర్చి...ఆ యూవనుణ్ణిఆవలఒడ్డుపట్టిస్తాయి: ముసురుపట్టినా గంగ ఉరవడివచ్చి కట్టలుదూసుకుంటుంది... రెక్కలు ఎన్నిసాచినా ఒడ్డులందవు. కనుక... గుడ్డిలో మెల్ల అయి నిలిచిన ఆ వరలేశమైనా ఎప్పుడూ వినియోగానికిరాదు...దుర్దినాలు ప్రబలడమే సంభవించితే ఏళ్ల తరబడి వాళ్లొకరి నొకరు ఎడబాసే ఉండటమౌతుంది కాని, ఏదిఎటులైనా...ఏటా ఏరువెల్లువలైనా... వారిప్రేమ వసివాడదు, సహనస్థితిపాయదు. ఎవరి పనివారు ఏమరకుండా నిర్వహించుకుంటూ...ఏడాదికోనాడైనా కలుసుకుంటా ముగదా అనే ఆశతో కలకలలాడుతూ ఉంటారు.

ఈకథకు జపానుదేశం పౌరాణికసంచయంలో, అనేకరూపాలు పారంపరిలో కలిగినవి... అన్వయంలో చాలా విచిత్రములు తలచూపినవి...అవి అన్నీ వివరించడానికి ప్రత్యేకగ్రంథం కావాలి. ముఖ్యంగా గమనించవలసింది... ఆ ప్రేమదంపతుల సమాగమం పండుగచేసుకోవడం ఆబాలగోపాలం ఆదేశంలో అలవాటైపోయింది. పసిపాపలుకూడా, ఆనాడు చిలుకపలుకులుగా ఆకాశరాజకన్యకు...వరుని అనుసంధానించే మంగళగానంచేస్తారు: అందని వాడై పోయి... అందనివాడుకాని... ఆగోపాలకునిమీద ..అమర తంతువాయని అరమరికలెరుగని కూరిమి ..అచ్చటి మహాకవులనేకుల చేత...స్వగత—ఛందము లందగించ పురికొల్పింది...

ఆమెనో గో వా
అయి ముకీ తాషితే
వాగా కోయీ షీ—
కిమి కిమాసు నారీ
హిమో తోకీ మాకేనా...

(ఆకాశగంగకు ఈదరిని...ఇంతకాలం నుంచీ కన్నులుకాయలు కాచి కనిపెట్టుకొని... వెంపరలాడుతూ ఉన్నానో...నానాథుడీరేయి నాకు దక్కబోతున్నాడు. నానీవి సడలించే తరుణం ఆసన్నమైనది. )

హిసా కతా నో
ఆమె నో కావాశె నీ
ఫూనే ఊకతె
కోయోయ్ కా—కీమీ గా
ఆగరి కిమా స...

( నురగలై పరవళ్లుపోయే అమరాకాశ వాహినిని తరించి...తేలియాడుతూ నాస్వామి యీరాత్రివచ్చి పరవశింపచేయగలడు. )

కాజే కూమో వా
ఫూతా—త్సూనో కిషీ నీ
　కాయోంయ్ దోమో
వాగా తోహో త్సూమా నో
కోతో జో కాయో వానూ...

సుబూతే నీ మో
నాగే కోషీసు బేకీ
　ఆమెనో గోవా
హేదా తేరేబా కా మో
ఆమత సుబే నాకీ...

(వాయుదేవుడూ పర్జన్యుడూ, ఈవలావల రాకపోకలు సలుపుతూన్నా మాయిరువురికీ... ఒకపలుకైనా నడవదుగదా...అధ్ధరి కూత వేటుదూరంలో ఉన్నా...హతవిధి...ఆశ్వయుజం వచ్చేదాకా, ఒకరికొకరం కాకుండా చేసింది.)

ఆమెనో గోవా
ఉతో కావా నామీ వా
　తాతేనే దోమో
సమోరె గాతాషీ
చికాకీ కోనో సే వో...

(ఆకాశగంగ పొంగకపోయినా..అంతగా గడవరాని అడ్డంకులు లేకపోయినా..ఆ రవంత ప్రవాహాన్నీ అతిక్రమించి ఆతనిసరస చేరనీయని..దురుల్లంఘ్య— అనుశాసనం...అప్రతిహత ప్రతిబంధకమౌతూ ఉన్నది.)

—(జాపాను పద్యావళీ, అనువాదమూ, The Romance of the Milky way and other Studies- అనే లె. హరన్ సంగ్రహాన్ని అనుసరించి.)

పద్యమాలిక వివిధవర్ణ చమత్కృతులతో అవిరళంగా గ్రథితమై ఉన్నప్పటికిన్నీ...ప్రస్తుతమునకు ఉపయోగించే అంతవరకే సమకూర్చుకోవలసివచ్చింది. సాదృశ్యముతో... ఫలశ్రుతిని ఒరసేటందుకు,ఆకాశరాజకన్య... అలౌకికప్రేమగాథను, హేమావతి చిడిముడిపాటుతో జారవిడిచిన.. ప్రణయ-చిలిపితనము సరసను నిలిపి...లాఘవమేమో నిర్ణయించుకొననౌను. హేమావతి, అంతవరకున్నూ కట్టుకొన్న మగనితో...మనసుతో పనిలేకుండా, కన్నులు మూసికొని కాపురముచేస్తూ వచ్చింది, పాతివ్రత్యం విలువఎరుగని అకారణ పతివ్రతా ప్రాంతరములు హేల విప్పి చెప్పగానే కన్నులు విప్పారినవే కాని... కదనుతొక్కే—మనసును దాటులకు తీర్చే నేర్పరితనానికిలోపించినందువల్ల . ఆరాటం తెప్పించిన అలసటకు తాళుకోలేక...మూసిన కన్నులతోనే ముక్తికి వెదుకులాడి రాసిక్యవ్రతానికి భంగం కలిగించుకుని...మానసికపతి-వ్రతగా వ్రతం నిలుపుకోలేకపోయింది. ఆకాశరాజ పుత్రి...ఆవాగును దాటలేని-తనమే హేమావతిని ..అడుగు మెసలనీయకుండాచేసింది. అదే...విధి-అని ఒప్పుకుని... కేవలం అన్యాయం అని మొరలుపెట్టే...అలసమానవప్రకృతి... అంతకు మించి ఎదురించగలసత్తాచాలక... ఉన్నంతలో ఉత్తమ ఫలోన్ముఖమైన ఉద్యాపనకు...ఆశించుతుంది. పాపమూ పుణ్యమూ.. చదురునేతగా అల్లుకుని ఉన్నలోకంలో... పుణ్యాపు గడులు లెక్కపెట్టుకోమని నేర్పిన పురాణగాథలు చక్కదిద్దే...నీతుల నియమాలీచాయలకు రావు. విలియం మారిస్ ప్రవచించినట్టు...'కల్లకాదు...నిజమున్నూ, లేదు.. కాని మనోహరంమాత్రమౌను' అనుకోవడం, హేమావతీ భగ్నప్రణయ జీవితగాథా—తత్త్వ

దార్శనికులకు ఉచితం. అలా జరగడంలో ఉన్న అసందర్భములు పరిగణించవద్దు...ఆవిధంగా కథముగియడమే కావ్యనికుడుద్దేశించిన ధర్మ రక్షక—విజయనాద—వాదమని యెన్నూతూ ఊరకుండవలసిందే.

కావ్యభారతికి అనువైన అలంకరణము లుగా మహామహులు లందగించిన నియమావళి లాక్షణిక పరీక్షలతో వన్నెనిలుపుకుంటూవచ్చి నందువలన పాఠకలోకం విధివతుగా అంగీక రించవలసిన ప్రాతిపదిక సంకేతరూపములలో... ఒకటి...పశువృత్తికి...సానుకూలపు రాయబా రాలునడపటం...పశుపక్ష్యాదిగణమే పూను కోవలసింది అని. హంసలూ చిలుకలూ మొయిళ్లూ...నాయికానాయకుల మనసులలో కోరికలను, రెక్కలమీదనో...రెక్కలుకట్టు కున్నట్టుగానో మోసుకొనివచ్చి ఏకంచేయడ మనే మర్యాద కావ్యజగతిని తరాలుగా నిలిచి పోయిందానా? మరి,సకలజారజారిణీక థాకుశల అయిన కలహంస హేమావతికి...స్వీయనా యకసమాగమనసిద్ధికి అంతరాయంకలిగించి... స్వీయాధర్మానికి కట్టుబడి ఉండేలాగు దిద్దడా నికి...రాయబారపు పలుకులుకాక...మగడు తిరిగివచ్చేలోపుగ ఆమెతల పెట్టిన నూతన బేర సారము లేలాగో ఉడిగించింది:

విష్ణుదాసుడు పయనమైపోబోతూ, యింటి వారందరిచేతా ఔననిపించుకుని, 'హంస రాజంబు గదియంగ నరిగి, తినదుపయన మెరిగించి యింటిలోభద్రమనుచు, చెప్పంగ దగినమాటలుచెప్పి' ఇల్లుకదిలాడు. అంతకు పూర్వమే, హేల ఆతని యింటికి రాకపోకలు నడుపుతూ వచ్చినపని చక్కబెట్టుకునిపోయినా, ఆసంగతి ప్రయాణంగొడవలో మునిగితేలే ఆతడు గమనించకపోవచ్చునేమో కాని... అంతనేర్చిన హంసకు, ఆ ఆచోకీ ఏమాత్రమూ తెలిసి ఉండలేదా? తెలిసినా, అడ్డుపడేందుకు తానులేనా అని కిమ్మనకుండా ఊరుకున్నదా? విష్ణుదాసుడు...సహజమైన అతిజాగ్రతకు నిదర్శనంగా 'యింటిలోభద్రం' అని మాట నరుసకు హెచ్చరించాడా? లేక, మనసులో చెప్పరాని కళుకు ఏదో బాధించడంవల్ల నోట అలాపలికిందా?...హంస ..విష్ణుదాసు పెంప కంలోనిదికాని, హేమావతి క్రీడా విహంగం కాదు. అది అనుమతిస్తుందని...ఆశీర్వదించి ఆపనికి అతిశీఘ్రంగాపోయి రమ్మనిపంపుతుం దనా...దానితో, తనమానాన తానుపోతూ న్నది పోక...చేయబోయే ఘనకార్యపు ఉబుసుఎత్తడం?...చెప్పినా ఏం చెయ్యలేని పంజరబద్ధప్రాణిముందర తన ప్రతాపంచూపిం చడంకోసం చెప్పిందనుకున్నా...చివరకు దాని చెప్పచేతులలోనే...యించుమించు నిలిచిపో యినట్లయిపోవడం...మొదటి గాంభీర్యముద్రకు ఎంతవిరుపు? ప్రభావతి, చిలుక నిలువరింతలకు తలఒగ్గిందంటే...అది ఆమెకు ప్రాణపద మైనది...కలసిమెలసి...అక్కా యని పలుక రించే చనవుతో...మనసందిబుచ్చుకున్నది.

హేమావతి...'పంజర మొక్కింతగదిసి నిలిచి...దరస్మితంబైన నెమ్మొగ మించుక వంచి యాత్మందాఁ దలఁచిన కార్య మెల్లఁబ్రమ దంబునఁ దిన్నని కల్కిపల్కులం దెలుపఁగ' హంస అదే మొదటిసార ఆకబురువినడంవల్ల.. రెక్కలు ముడుచుకుని, ఇప్పుడేది త్రోవ అనే ఆలోచనలతో కొంత కలవరపడి...లోకంలో నలుగురూ ఆడేమాటలనే ఏకరువుపెట్టింది...

హితబోధగా ... ఇలా అయితే కొంప మునుగుతుంది సుమా అని: ఏది అపథ్యమో, దాన్నే కనులకు కట్టించడం ఉత్తమ భేషజమేనా? మనసును, తాను ఉపదేశించబోయే దానిమీదకు హితవుచేసి, అంతరాయములకు అరుచి పూతపూయాలి. పగచూపించి పాలుద్రాగించు దామనుకుని తంటాలుపడే హంసకూ, నేస్తంతో విషం మ్రింగించగలిగిన హేలకూ, చాకచక్యంలో ఎంత తేడా ఉన్నది?– కన్న కూతురికిసారెపెట్టుకునివచ్చినట్లుగా.. మహారాజు తలచిన మర్యాదలన్నీ ...జరిగించింది...ఎవరికి తగినమాట వారికిచెప్పి అందరినీ మంచిచేసుకుని... కోటలో పాగావేశాననే నమ్మకం చిక్కినతరువాత... అప్పుడు హేమావతిని ఏకాంతానకు జేర్చింది. నూరిపోసే విధానంలో ఎంత నేరుపుందో? ..ముందు, ఆమె చక్కదనం రాసిక్యం ..వీనికి, ఆమె కలలోనైనా తలచని విలువలు కట్టడం... ఆవల బేరగాని తాహతెటువంటిదో...సందర్భంలో కలిపి అభివర్ణించడం...మగనిమీది అనుమానపాతివ్రిత్యాన్ని పొల్లులాగా చెరిగివేసి...తాను చెప్పినబేరమే లాభసాటిదని...ఆమెకు నచ్చేటట్టుచేయడం... ప్రభావతి ... కోమటితనానికి ... హేమావతి నీమాటి తనానికి...జతతూగే పద్ధతే, ఇది...

హంస ..తాను చెప్పిన పెడసరం మాటలకు హేమావతి కళ్లెర్రచేయడం తప్ప... చలించక పోవడం చూసి...అప్పుడు మరో యెత్తు ఊహించింది: ఇకనుంచి...ఇరవై కథలలోనూ దాని గడుసుతనం, తెరచాటుగా మెరమెరలాడుతూ నేడుంటుంది.

ఏకథలోచూసినా, ఏకులం దైనా, నాయిక తిండిపోతరాన వేరు పనిపాటలు లేక, జార వాంఛలకు మరగినదని ఎత్తుకోవడం, 'హేమావతీ! నీవిషయం అంతే' అని ఎత్తి పొడవటం: 'ఎవతెచూసినా, మనసుకు నచ్చినవాడు కంటపడగానే ముందూవెనుకా చూడకుండా, లేని పీలుకల్పించుకుని, హుటాహుటి మారసంగ్రామానికి బారుతీరగా, తీరికగా పిలువనంపినా– ఎంతతీరిఉన్నా– నీ వలాటి హఠాంతకారితనము నేరువవైతివిగా!' అని ఈసడింపు: పాపముపండినట్లుగా ఎక్కడనున్నవాడైనా పానుపుమీద విటునితో చేరేవేళకు పతి ఊడిపడకమానడని– నిక్కచ్చిమాట– 'కామశాస్త్రవేత్తలాదేశించి నటుల మహారాజులు పరదారల కొరకు తామైపోరాదనే నీతిని, నీవంటి లావణ్యనిధానంపొందునకు అంగలార్చుతూనైనా యేమరని నియమవంతుని, కాళ్లకడకు పోవడానికి నీవే మంత తేరకుపడిఉన్న చులకనగత్తెవా?' అనే పౌరుష వాక్యం: 'అప్పుడు అదిఏలాబొంకితప్పించుకుంటుంది, నీవైతే ఏంచేసేదానవు?' అని శరపరంపరగా కురిపించే ప్రశ్నల తాకుడుతో వినిపించిన జవాబులలో 'నిజమే అది ఎంతటికైనాతగినది, నేనే ఎందులకూ కొరమాలిన దాన'నని- గుండెబొప్పికట్టించడం. ఇలా పురిపురి మెలివిప్పి సాగలాగితేనేకాని హేమావతి మనసు, బంధాన్ని, చివరకు త్రెంచలేక పోయింది: అనుగుణ్యకథాప్రసంగంతో ఊదర ఎత్తించితేకాని, ఆఖరున తలపెట్టినవ్రేటుతగిలి, హృదయం అసలు కుదురులోకి కుప్రింగిపోయి పదిలపడదని, హంస యోజనలతో వేసిన పన్నాగం; ఈకలాపం మూలకంగా– ఈరహస్యమే–విష్ణుదాసు డిల్లుచేరేవరకు, హంసను హేమావతికి ఆతనికన్న ఎక్కువగా ప్రాణానికి ప్రాణ మయేటట్టుచేసింది. ఏమీ ఎరుగని

ఆ అమాయకునకు, ఎన్నటికీ తరగని ప్రణయ భాగ్యలాభం... ప్రేమించడంలో ఉండే బాధ, వేదనలతో, హేమావతి ఇతఃపరసంసార లక్ష్మికి తొలికానుకగా దోయిలించి, అతనికి ఎదురేగి కై దండయిచ్చి తీసుకువచ్చింది. తీరిక అయిన సమయాల్లో, మళ్లా నాథుడు ప్రవాస గతుడైనప్పుడు ఎన్నడైనా, ఒంటరితనం, వెనుక తేలిపోయిన గాథను కలకబారించి ఉంటుందా? ఏమో, అది ప్రబంధప్రసక్తికి ప్రస్తుతంకాని విషయం, కాని అనుబంధంగా ఆధునికులెవరైనా పెంచదగిన, పోషించ దగిన కల్పన.

౫

ఫలితాంశము పరమాదరణీయమై పరిణమించేట్టుగా చేసుకోనేదృష్టిలో, సాధనకు ఏరికూర్చుకున్న ఉపాయాలు శబలించే పరమార్థాన్నే ఎన్నికకు తీసుకోవలసి ఉంటుంది అనే శాక్యనిబంధనాన్ని అనుసరించి, హంస, నీతి- పంచకల్యాణిచేత తొక్కించిన బూతు-కదను, మనసు నేమాత్రమున్నూ, అదరనీయ కూడదు. చాతుర్యమేలాంటిదంటే, సాక్షి హితోక్తులు మనసుకు ఎక్కవు, ఎక్కినా ఆ ఒళ్లూయిల్లూ మరచిపోయిన పారవశ్య-సంభ్రమంలో ఏమాత్రమూ పని చేయవు కనుక, జరగడానికి సర్వమూ సిద్ధమైఉన్న కలాపానికి తూగివచ్చే ప్రసంగంతోనే హరిః ఓం అని ప్రారంభముచేస్తే హేమావతి, హంసచెప్పేది చెవులు దోరబెట్టుకుని వింటుంది, మనసులోకి ఎక్కేవరకేతప్ప ఆ తరువాత మాటలు తప్పకపనిచేసి తీరుతవి, కాళ్లకు బంధాలుగా తగులుకుంటవి అనే ధైర్యం చాలిందిగనుకనే, హంస తూచినట్టుగా ఎత్తు వేసిచూసింది, అదిసరిగా ఆలా గేపారింది.

పశుపక్షిగణం, మానుష భాషణలను... ప్రజ్ఞనూ... అలవాటు చేసుకోవడానికి వీలున్నదా?* లేకపోతే, మానవుల ప్రతిబంధకాలను తొలగించడానికి, అమానుషశక్తి నావహింపచేయడానికి, సాంకేతికమూర్తులను కావ్యవాణి వీణాకల్పన స్పందించిందా? రెండు సంశయాలనూ సదుత్తరాలతో నివారించుకోవచ్చును. అభిజ్ఞాన చైతన్యము ప్రకృతి పరివర్తన క్రమంలో, ప్రాణికోటిలో వివిధముగా విభాసించినా, మూలాధారమైన అంతరఉద్దీపన స్థానము ఏకకూటప్రచాలితమే కనుక, అవరణానుగుణ్యముగా పరివర్ధితములైన మర్యాదలు, మహత్తరావకాశాల్లో అతిక్రమించే సుఘువులు సృష్టిలో గుప్తంగా భద్రపరుపబడే

---

*** On miraculously gifted Birds:-** an arab historian would make it to appear that intelligence and talent ascribed to this parrot are not nearly so wonderful as those which some birds have been known to display ··· ...... He affirms that a parrot in Cairo recited the Kuran from begining to end. The Bashah, he says, desiring to try its talent caused a man to recite a chapter of the Kuran in its presence and to pass irregularly from one chapter to another with the view of leading the bird into error. But instead of this being the result, the parrot corrected him!

Edward william Lane

( P 1004, chap II, Note 22.
ARABIAN NIGHTS. BIBLIOPHILIST SOCIETY EDITION. )

ఉన్నాయి. అవి అవసరాన్నిబట్టి వినియోగం
లోకి తెచ్చుకోవడం కావ్య—చంద్రశాలల్లో
స్వైరవిహారం చేయనేర్చిన విన్నాణులకు
ఎప్పుడూ తేలికగా చేతనయేపని. ఆశ్రమవా
సుల సాహచర్యంవల్ల కాదంబరిలో చిలుకకూ,
సాహసంలో రూపం మారినా విక్రమార్కుడు
గానే ఉన్న చిలుకకూ, ప్రభావతిని ప్రద్యుమ్ను
డికికూర్చే చిలుకకూ, మాటలు నేర్వనిదే
పనులు చక్కబడవు, ఆభిజాత్యమూ అనుభవ
ములూ అక్కరకురావు: నలుని చేతికి విధివశ
మున చిక్కిన రాయంచ, మాటలాడనిదే
ప్రాణములు నిలువవు: హేమావతిని చక్క
దిద్దడానికి, రాజహంస, ముక్కుకొనతో పక్ష
ములుగీరుకుంటూ మూగనోముపట్టి తెల్లబో
యి ఊరుకుంటేనో, శకుంతసహజంగా, గీపెడి
తేనో, తలచినది కొనసాగించుకోగలిగేదా ?
—అవసరమైనప్పుడు మాటలు రావాలి,
అలాకావడం భౌతికంగానైనా అసాధ్యపరి
ణామంకాదు: అందుకనే అస్వాభావికం అని
పించనీయకుండా, అటు యీసప్ కథాసంగ్ర
హంలోనూ, లాఫాంటేన్, గ్రిమ్ము సోదరుల
రచనల్లోనూ, పంచతంత్రాది గ్రంథా
ల్లోనూ, జంతువుల కోలాహలాల్లోనే హితో
పదేశలాభంకలగడం సంభవిస్తూంది.

—'ఆర్యులు చేయుపనులన్నియు, స్వార్థరహి
తములు, నిహపరసాధకములును; వారు రచి
యించిన భారతాద్యుద్గ్రంథములు మొదలు
కవిచౌడప్ప శతకమువరకు నీతిబోధకములును,
ధర్మోపదేశకములును, దన్మార్గమున మోక్ష
సాధకములు నగుచున్నవి. ఆయాగ్రంథముల
యందలి విషయ మేదైనను తుదకూహించి
నచో నది యేదో ధర్మమునో నీతినో బోధిం
చునదై తీరవలయును. అందు గొన్నింట ధర్మా
దులు స్ఫుటముగా నగపడును, గొన్నింట
నూహించినందోప గర్భితములై యుండును...
హంసవింశతి మున్నగునవియెల్ల నీతిబోధక
ములే. హంసవింశతి... కేవల స్త్రీలకొఱకే
యని యూహింపవచ్చును. ఇందు, అన్నియుం
బంచతంత్రమువంటి కట్టుకథలే: వీనికి
మూలము భారతములో భీష్ముడుచెప్పిన
జంతుజాల విశేషములకథలే కావచ్చును.
మఱియు హంసచెప్పుటచే పిట్టకథలై యున్నవి..
అరబ్బీభాషలో 'అలఫ్ లైలా' కథలీరీతివియే*
హిందూస్థానీలో 'తోతామైనా' కథలు
గలవు ..మన కథలన్నింటికీ సంస్కృతములో
మూలములు గలవు...'
(శుకసప్తతి పీఠికలో కొత్తపల్లి సూర్యారావు.)

---

*'యవనయామినీ వినోదకథ'ల్లో, చిలుక
ప్రాణాలమీదుగా నడచిన వృత్తాంతం ఇది
ఒకటి మాత్రమేఉన్నది. ఇందులో చిలుక,
మాటాడే తెలివితేటలూ జ్ఞాపకశక్తి మినహా,
వేళాకోళ చాకచక్యము ఏమీలేనందువల్ల, అమా
యికంగా, ఆ శెట్టికోడలు జాణతనపు— కసికి
ఆహుతి అయిపోవలసివచ్చింది. శుకసప్తతి,
హంసవింశతిలో కల్పనలు, ఈ కల్పనకు
సాకల్యమైనమెరుగులు.

—చచ్చేటంత అనుమానం మనిషి ఆవర్త
కుడు; అతనికి అతిలోకమోహిని అయిన
భార్య. కాలు కదిపితే, యింటిదగ్గర ఏం పుట్టి
మునుగుతుందో అని ఎప్పుడూ ఏమరకుండా
అంటిపెట్టుకుని, బేరసారాలు ఉడిగికూర్చునే
వాడు. ఇలా ఉంటూండగా ఓసారి తప్పని
సరిగా ప్రయాణం తగిలింది. వెళ్ళితీరవలసిందే

౬

**తెలుగు సారస్వతంలో ఈ 'పిట్టకథలు'** వచనంలో, పద్యాల్లో, అనేకులు రచియించినవి లభించుతూన్నవి. వాటిల్లో ముఖ్యంగా

---

అని తేలిన తరువాత, పంచేశాడా, పక్షుల బేరం జరిగే సంతకువెళ్ళి చిలుక నోదాన్ని కొనుక్కువచ్చి, తాను యింటిపట్టున లేనన్నాళ్లూ పంజరిగేదీ బీరుపోకుండా కనిపెట్టి చెప్పేందుకు కాపలాపెట్టి మరీ గడపకదిలాడు. ఆచిలుక, తగని తెలివితేటలు కలది, అమితమైన జ్ఞాపకశక్తి. ఏంవిన్నా, విన్నదివిన్నట్లుగా ఒప్పగించగలదు.

సరే, వెళ్లినపని కాజేసుకుని, మళ్లాయింటికి వచ్చినతరువాత, పంజరాన్ని దాసీదానిచేత దగ్గిరకు తెప్పించుకుని, తనభార్యా ప్రవర్తన ఏలాఉందో చెప్పమని చిలుకను అడిగాడు. అది అన్నదికదా, 'మీ ఆవిడెకు ఓప్రియుడున్నాడు, నీవు ఊళ్లో లేనన్నాళ్లూ రోజూ రాత్రిళ్లు వచ్చిపోతూండేవాడు.' ఇది వినీ వినడంతోనే శెట్టికి ఒళ్లుమండిపోయి, లోపలకువెళ్లి భార్యనుపట్టుకు చావాచితుకా కొట్టేశాడు.

దానికి అనుమానం దాసీవాళ్లమీద పోయింది. మగవాడు లేనప్పుడు తానాడిన నాటకం పనిచేసేది ఎవతోచూచి పనిమిటితో రాగానే చెప్పిఉండాలి, లేకపోతే ఎలా తెలియవచ్చింది? అని నిశ్చయించుకుని, అందరిని పిలిచి ఒట్లూ సత్యాలు వేయించింది. మాకేం తెలియదంటే తెలియదన్నారు. అనీ, అంతటితో ఊరుకోక, మెహర్బానీ కోసం. చిలుక, సంగతులన్నీ యింటి ఆయనతో చెపుతూండగా విన్నామని అసలు రహస్యం కాస్తా బయట పెట్టారు. అప్పుడా కోమటికోడలు కసితీర్చుకునేందుకు పంచేసిందంటే మర్నాడు రాత్రి చిలుక పంజరం దగ్గర ఓపన్నాగం పన్నింది. ఒక దాసీది క్రిందకూచుని రయ్ మని తిరుగలి విసురుతూంది, ఇంకొకతె పైనుంచి, ధారలుగా విడవకుండా పంజరంమీద నీళ్లు కుమ్మరిస్తూంది, మూడోది, అద్దం మీదనుంచి దీపం వెలుతురు చిలుక కళ్లల్లోకి కొడుతూంది. ఇలా ఝామునేపు వేధించారు, ఒకరూ దాని కంట బడకుండా... కీలకం తెలియనీకుండా.

శెట్టి, ఆరాత్రి ఎక్కడికో కాలక్షేపానికి వెళ్లి, తిరిగివస్తూనే 'సంగతులేమిట'ని అడిగేదేతడవుగా చిలుక, చిరాకుతో 'ఏంసంగతులో ఏమిటో, నేనట్లాచూసేది? ఉరుములు మెరుపులతో బ్రహ్మాండంగా ఉప్పెన ముంచుకు వచ్చినట్టుగా ముసురు అయితే...' అనేటప్పటికి 'వేసంగిలో ముసురేమిటి, నీవు అన్నీ ఇల్లాగే అబద్ధాలు చెపుతున్నావా, నాభార్య మీదకూడా లేనివీ పోనివీ కల్పించి చెప్పావన్నమాట!' అని ఒళ్లూపై తెలియని ఆగ్రహంతో, పిట్ట, 'నేనుచెప్పేది నిజమే'నని కొట్టుకుంటూన్నా పెడచెవినిపెట్టి, పుచ్చుకు నేలను వేసికొట్టి హతమార్చాడు.

కొన్నాళ్లకు, పనిచేసేదొకతె, అమ్మగారి మీద అలుక సాధించడానికి, ఆ అయ్యతో అసలుసంగతి చెప్పివేసింది. కాని, ఆతడు ఓపట్టున దానిమాటలు నమ్ముతాడా? చివరకు, పాపంపండి, జారుడు, పడకటింటిలోనుంచి రావడం కళ్లబడి, అప్పటికి కళ్లుతెరిపినిపడి, ఆ యిద్దరినీ, అంతంచేసేసి, 'అయ్యో నిష్కారణంగా నిజంచెప్పిన చిలుకను నేరక చేతులారా చంపుకుంటినిగదా' అని బ్రతికినన్నాళ్లూ వలవల ఏడ్చేవాడు.

ఎన్నికకువచ్చేవి, కదిరీపతినాయకుడి శుకసప్తతి, ప్రస్తుతగ్రంథమైన హంసవింశతిన్నీ. బ్రౌను పండితుడు, జూలూరు అప్పయ్యచేత, శుకసప్తతిని, దొరకినభాగాన్నే సంస్కరింప చేశాడు. హంసవింశతి, ఎప్పటినుంచో అనేక సార్లు ముద్రిణములందినా ఇంతవరకున్నూ చక్కగా పరిష్కరింపబడి ఉండలేదు.

శుకసప్తతిని కదిరీపతి రచియించిన తరువాతనే, దాన్నిచూసి నారాయణామాత్యుడు హంసవింశతిని సంకల్పించాడని అనుకునేందుకు ఆధారంగా, ఒకవరవడిలోనేఉన్న పద్యాలు, పాకంలోపడీ పడకుండానూ రెండుపుస్తకాలల్లో కనిపించుతూన్నవి. సర్వప్రౌఢంగా గ్రంథాన్ని నడిపించుకురాగల సరిసమానమైన సత్తాలో వాడు కాకపోయినా, మహాకవి లక్షణాలు చాలావరకు ఉన్నందువల్ల, లక్ష్మీకటాక్షం కూడా పూర్ణంగా కలిగినవాడవడంవల్ల నారాయణామాత్యుడు, అనుకరణానికికూడా స్వతంత్ర- హోదాను తీసుకురాగలిగినాడు. ధారను కుంటించక పోయినందువల్ల లాక్షణిక సమ్మతములుకాని కొన్ని నెరసులు ఆ ద్రాక్షా వాహినిలో దొర్లి ఉండటం సహజమే. కాని, ఆలాటి దోషములను తలమున్కలు చేసే అఖండమైన కృషి గ్రంథమంతటా గోచరమాతూండలేదూ? కవి, పండితప్రభువు, ప్రభువులకు తుల్యమైన ఛాయాలోవాడు కనుక, అంతతీరికగా, తనవలుకుబడిని వినియోగించి, ఆలా సమగ్ర పారిభాషికావళిని సమకూర్చుకుని ఆంధ్రసారస్వతానికి మహోపకారం చేయకలిగాడు, సామాన్యునికి అది అంతుమాలిన పని అని అనుకోవాలి. హంసవింశతి విలువ దివ్యప్రబంధముగా ఒకఎత్తూ... ఆనాటి సాంఘిక వ్యవస్థను నిరూపించగల భాషాకోశంగా మరోయెత్తూను. తెలుగులో ఈ పనికి ఎన్నడూ ఎవరూ పూనుకోగలిగినట్లు తోచదు.

౭

నారాయణామాత్యుడు ఆరువేలనియోగి బ్రాహ్మణుడు, కౌండిన్యసగోత్రుడు, తండ్రి సూరన్న, తల్లికొండమాంబ 'నిస్సహాయకవితా నిర్మాణచాతుర్య నిస్తంద్రు'డనని చెప్పికొన్నది, మహాప్రతిభాశాలి అయిన ఆతని విషయంలో యదార్థమేకావచ్చును. సిరిసంపదలతో దుల దూగుతూ, శ్రీరామనామధ్యానమేమారని ఆస్తికునికి అందని లాభమేమున్నది. అదీ గాకుండా ఆ యింట పుట్టినవారందరూ కవులే! అయ్యలరాజువారికి ఆదికాలంనుంచీ ఆఖ్యాతి వస్తూనేఉన్నది. కర్నూలు మండలం ఇలాటి మహనీయులకు తావరం కావడానికి ఎంతో పుణ్యం చేసుకుని ఉండాలి. నారాయణకవి, ఎప్పటివాడో, ఏ గ్రామంలో ఉండేవాడో సరిగా తెలియదు. కాని, తిక్కన్న తరువాత ఇందాకా, కందంచెప్పడంలో ఈతన్ని మించే ఘనుడు మరొకడు కానరాదు.

౮

ముఖ్యంగా గమనించవలసిన కొన్ని విషయాలు ఏమంటే:-

ఉజ్జయినీ పురంలో ఉన్న విష్ణుదాసుడికి 'దైవ యోగంబున' దూరప్రయాణం సంభవించి అతని భార్య అయిన హేమావతికి, ఇరవై రోజులు రాజుపొందుకోసం ఉవ్విళ్లూరే కథనడిచింది. ఆతను విశేషంగా పర్యటనం చేయవలసింది ఆంధ్రమండలంలోనని, హేమావతి నాథుని పోయిరమ్మని చెప్పే వాక్యాలలో కనిపి

స్తుంది. అనాచార-రత అని కామాగమ వేదులు గర్హించిన ఆంధ్ర సాహచర్యమే ముప్పాతిక మూడుపాళ్లు కలగబోయేది అని హేమావతి నగనిశ్శోసస మాడటం ఆమె తెలిసిచేసిన పనేనా? లేక కపటంలేని మనసుదే అయితే,

వాచిశ్రీ ర్మాత్రధురీణాం గురుజనకపద
 స్థాయినీనాం కటాక్షే
వంశే గౌడాంగనానాం సులలిత జఘనే
 చోత్కల ప్రేయసీనాం
తైలింగీనాం నితంబే సఘన ఘనరుచా
 కేరళీ కేశపాశే
కర్ణాటీనాం కటౌచ స్ఫురతి రతిపతిః
 గుర్జరీణాం కుచేషు.
సౌరాష్ట్రీ సురతోపచార చతురా
 ముగ్ధా మహారాష్ట్రికా
రామా మాలవదేశజా మనసిజా-
 వేశోల్లసన్మానసా
గౌరాంగీ గుణగర్వగౌరవవతీ
 గానప్రియా గుర్జరీ
కాశ్మీరీ కలభాషిణీ యవనజా
 చేతోహరా ..

—ఇలా ప్రసిద్ధిలో ఉన్న సంప్రదాయాన్ని విశదీకరించి ఆ అనాయకుణ్ణి బులబాటం అంతకన్న ఎక్కువగా పడేటట్టు చేయవచ్చునే. 'నీయురస్థలి మించు-చో యఖిలక్షమాకోమలాంగుల కుచకుంకుమంబు' అని ముక్తసరిగా సరిపెట్టి ఊరుకోవడం, అన్ని దేశాల కన్నెలను తలదన్నే అందగత్తె అయిన హేమావతి రాసిక్యానికి లోటు. లేక, ఉచితజ్ఞుడైన మహాకవి, 'అఖిలక్షమా కోమలాంగుల' లావణ్యప్రతినిధ్యం ఆంధ్రవిలాసినులకు కట్టబెట్టి పనిగా గౌరవించాడా?

పదునాల్గవరాత్రి కథలో సరసుడనేవాడు శెట్టికోడలైన హస్తినిని తనవశం చేసుకునేందుకు మోహినీ మంత్రాన్ని జపించి ప్రత్యక్షమైన దేవిచేత ఆపిల్లను ఆవహింపజేసి తన దగ్గరకు నడిపించుకు తెప్పించుకుంటాడు- మంత్రాక్షరబద్ధ ప్రగమనం కలిగి క్షుద్రమూర్తులయ్యున్నా కాత్యాయని కళావతారాలుగా అప్పటికప్పటికి ఫలాన్ని యివ్వడానికి సిద్ధంగా కాచుకునే ఉండే దేవతల మాహాత్మ్యం తంత్రగ్రంథాలలో విశేషించి ఉన్నది. మోహినీ దేవత విషయమూ...

-అన్యాం వక్ష్యే మహావిద్యాం
 మోహినీం వశ్యకారిణీమ్
యస్యాః ప్రభావమాత్రేణ
 వశీకుర్యాజ్జనం నరః
తారాం ప్రథమ ముద్ధృత్య
 మాయాబీజ మనంతరమ్
మోహిని పదమాదాయ
 శ్లేషే పావక వల్లభామ్
జ్ఞాత్వా మంత్రమిమం మంత్రీ
 మంత్రం పఠతి సిద్ధిదమ్
అనేన మంత్రరాజేన
 సంస్పృశ్య ... జాపితం యథా
దీయతే చ జలం పుష్పం
 దుకూలమ్ ఉత్తమం ఫలమ్
అష్టోత్తరశతం జప్త్వా
 పాణౌ యేషాం ప్రదీయతే

తే సర్వే వశ్యమాయాంతి ... అని 'షట్కర్మదీపిక'లో భైరవ తంత్రోక్తంగా విధాన వినియోగ ఫలములు, మరోమాదిరిగా నిర్దేశింపబడి ఉన్నవి. కాని, దత్తాత్రేయ తంత్రములో...

కుంకుమేన సమాలిఖ్య భూర్జపత్రే సులక్షణే
ప్రతిపత్తః సమారభ్య పూజాంకృత్వా జపేత్తతః
త్రిసంధ్యం త్రిసహస్రంతు మాసాంతే పూజయేన్నిశి
సంజపే దగ్ధరాత్రేతు సమాగత్య ప్రయచ్ఛతి...

(ఓం అనురాగిణి, మైథునప్రియే! స్వాహా. అయుతం-జపం)- అని చెప్పబడిన పద్ధతిని ఆ సరసుడనుసరించాడు, నాయిక అందుబాటు

లోనిది కానందువల్ల: తంత్రగ్రంథాల నిండా కుప్పలుగా ఈ విధానాలు 'నాన్యథా శంకరోదితమ్' అనే హామీలతో వెల్లివిరిసి ఉన్నవి.

పదునెనిమిదవ రాత్రి కథలో వల్లవుడు, రతిసేనను 'మరులుకొల్ప నూహించి వైద్య సహవాసం బొనరించి ... నిజరచితవితరణ జనితామోదమున వైద్యజనములు దెలుపన్, విని యట్లొనరించి', యింతిని వలపించి, యంతకు ఏడాకలెక్కువ చదివిన ఆజగజంత చేతిమాత్రతో సర్వమూ మరచి దానింట కుక్క అయిపోయినటులుగా వర్ణితమైన సందర్భం వాత్స్యాయనాది ఋషిపరంపరలో సిద్ధియోగములు జతకూడి సంకలితములై నాగరనుండలికి పరమోపకారకంగా పరిణమించిన ఔపనిషదధికరణాదులలో ఉన్న విచిత్ర వశీకరణౌషధములు స్ఫురణకు, నరసులు తెచ్చుకుని సరిచూసుకొనవచ్చును.

కృష్ణాపరాజితామూలమ్ తాంబూలేన సమాయుతమ్
అవశ్యాయై స్త్రియై దద్యాత్ వశ్యాభవతి...
విశాఖాయాంతు వందాకం మంగల్యస్య సమాహరేత్
హస్తేబద్ధ్వాతు కురుతే వశతాం వారయోషితామ్
(–కామరత్నం)

జిహ్వామలం సలవణం ఖానే పానే ప్రదాపయేత్
పతివశ్యకరం సత్యం దాసదాసస్తు జాయతే.
(దత్తాత్రేయతంత్రం)

పారావతశ్చ హృచ్ఛక్షుః స్వగక్తం రోచనం తథా
జిహ్వామల సమాయుక్త మంజనే స్త్రీవశీభవేత్
త్రింశత్ చణకబీజాని షోడశేంద్రియవాస్తథా
గోదంతం నరదంతంచ పిష్ట్వా తైలేన లేపయేత్
లలాటే తిలకం కృత్వా వశీకుర్యా త్త్రిలోత్తమామ్.
(సిద్ధనాగార్జునః).

ఈలాగు సుళువుగా ఎవరికి మట్టుకువారు గుట్టుచప్పుడు- కాకుండా అనుష్ఠించతగిన యోగాలు, ఇంకా అన్నివిధాలా పుష్టినీ తుష్టినీ యిచ్చి, దంపతులను చివరకు పోలయలుకలోనైనా విడిపోకుండా హత్తించేవి, రసార్ణవాన్ని మథించిన వైజ్ఞానికులైన భిషుకులు, దుర్బలులైన మానవులను అనుగ్రహించ గోరి ఉపదేశించి ఉన్నారు. విశేషము లిత్తోధికంగా తెలుసుకోదలచేవారు, నారాయణామాత్యుని స్థలాభావసంకోచమువలన ప్రవర్తిల్లిన లఘువర్ణనలతో దనియక, తృతీయ పురుషార్థ సదనుష్ఠానమునకు సాంగముగా, ఆ రహస్యములన్నీ యెఱిగి, అనుభవమునకు పూర్ణమైన అహంకారానందముతో వన్నెలు తెచ్చుకోవచ్చును.

౯

మహాకవి అయిన నారాయణామాత్యుని కావ్యామృతము తహతహలుగా, ఇప్పటి కప్పుడే చవులూరించుతూ ఉద్వేగానికి పట్టపగ్గాలు లేకుండా పరవశమైపోతూన్న సహృదయులకు, గ్రంథారంభమునకు మంగళాచరణముగానూ, ప్రస్తావనకు కావ్యవాణీ మంగళ శ్రీకరణముగాను, హెచ్చరిక లుగ్గడించడమేమనా—

పరమభాగవతుడైన పోతన్న చిన్నతనాన రాజు మన్ననలకు ఆశించి, భోగినీదండకం రచియించి అప్పటికి అర్హసత్కారములు పొందినా, కావ్యనిష్ఠతో గడిదేరి భాగవతం తెలుగున వెలయించుకునే నాటికి వెనుకటి ముచ్చటలు తలపెట్టడం తగని చిన్నతనమని అనుకున్న అక్కసుతో, మానుషానందలాలసుడైన సహజ- పాపాన అప్పటి నరపతిని, ఆధునికులవరకూ జతగూర్చి 'అధమ' సంభావనతో, ...అంతటితో వదలివేసి, ఉత్తమగతులకు వెంపరలాటలో నందాంగనాడింభకుని మంచి

చేసుకున్నాడు. ......నారాయణామాత్యుడు, తన వారి శ్రోత్రివల్లో ఏ ఒక్క శతకమో శాయశక్తులా కాలికగా అల్లి, ముక్తి కాంతా మణికి మూజువాణి హాస్య దారుణ్యై తృప్తిపడి ఊరకుండక, వయసూ మనసూ, జ్ఞాన కమలాలు కిక్కిరిసి విరిసే దివ్యసరోవరమైన తరువాత, పూర్ణమైన ప్రజ్ఞతో, కళంకి అయిన చందమామవని వెన్నెలల నీసహించని చకోరకుమారునిలాగా, సామాన్య పుణ్యముతో తనిసి పోవక, పురుషార్థ ప్రయోజనాన్ని కావ్యరూపాన దిద్దుకున్న ఘనుడు. సంస్కృతములో వెనుకటికవులు 'వినోదానికి' గాను భాణాలు రచియించినామనే వంకతో, శాస్త్రభోక్తలైనందువల్ల అబ్బిన అరుచిని మాపుకున్నారు...సందులేకుండా శృంగారాన్ని అమర్చి. నారాయణామాత్యుడు ఉత్పాద్యమైన ఇతివృత్తాన్ని ఆధారంగా తీసుకొని... వెలుగును ముందుకు దుమికించడానికని అండగా వెనుకనిలిచే నీలినీడవంటి...రవంత మచ్చను, ప్రాకృతులకు ఆవరణంగా అడ్డం చేసి... తేల్చిన నీతిలో ... తనకావ్యవాణిని పునీతనుగా గుర్తించగల తెరువు లెరిగి, మరీ యింతకు తలపెట్టినాడు. అంతేకాని, మహాకవి క్షేత్రియలాగా, జన్మ. అంతటా కావ్యకన్నెకు వరమిచ్చిన...వింతవింతనేపథ్యములు తుడిచివేసి... నిర్వేదంతో నీలిచీరె కట్టించలేదు. సారంగపాణిలాగా, కార్వేటినగర వేణుగోపాలుని దివ్య-తగులాటములకు పనిలో పనిగా తనసొంత తగవులు అంటగట్టి ... అంతటితోనూ ఊరకుండక వేలవంగా వచ్చి వైరాగ్యాన పడిపోనూలేదు. ముఖ్యముగా ఎంచుకోవలసిన విషయం కవి, శృంగారికాడు. నీతులపూతల నెపాన శృంగార మక్కువలు చెల్లించుకుందామనుకున్న నీరసుడూ కాడు. ఆతడు మహాకవి... అదే ఆతనికి... నీతీ... మతము.

అవునా—

కావ్యాన్ని విమర్శించవలసి వచ్చినప్పుడూ ...కవిని ప్రశంసించవలసి వచ్చినప్పుడూ ... గుణపరిగణనంతో వదలి ఊరుకుంటే కావ్యాత్మ కల్లోలమై పోతుందని, దోషాకరంగా... వ్యాకరణపాఠాలు నేర్పడం వెనుకటివారికి ఆచారమైపోయింది కనుక ఇకనుంచి అయినా ఆ ప్రసక్తులు అరికట్టి...కృతకమైన నిబంధనం సజీవ వాణీవిలాసాలకి వేల అవునేమోకాని ...కూలంకషము ఎన్నటికీ కాలేదని నేరిచిన పర్యస్వతంత్రుని ప్రయోగాలు లక్ష్యంచేసే భావ - అనుభవ - స్వచ్ఛంద విధానములకే కావ్యరసికులు మురియడం.

ఉత్తమమానా — కాదా.

రామకృష్ణశాస్త్రి.

శ్రీ ర స్తు.



# హంసవింశతి.






## ప్రథమాశ్వాసము.



శ్రీరామాంశజ యైనజానకి యుర•స్సీమాంతరాత్యంతవి
స్తారప్రోజ్జ్వలహారనాయకమణీ • 1సందర్శితంబౌ నిజా
కారం బారసి యన్యకాంత 2యను శం•కం జెందు నం చెంచి త
3న్నారీ రత్నము నంకపీఠి నిడు సీ•తాభర్త నన్ బ్రోవుతన్.

చ. తన కిది 4కేళిసద్మమయి • తద్దయుఁ బద్దు వహించి తొల్లి లో
చనముఖహస్తపాదయుగ • సామ్యముఁ జెంది సుగంధసంపదన్
దనరఁ దొడంగె నివ్వ డని • తా దయ మీఱఁగ జేతఁ బట్టెనో
యన వనజాతపాణి యగు•నట్టి మహీసుత మమ్ముఁ బ్రోవుతన్. 2

కం. యమునాగంగాఘురసం, గమవిభ్రమ మాత్మసేవ•కప్రివితతికిన్
దమరుచు లిడ నెడయక లో,కము లేలు భవానిశివుఁడు • గడు మముఁబ్రోచున్. 3

ఉ. మేరునగప్రపాతమున • మించి రహించు కనన్మణిప్రభాం
కూరకదంబకం బనఁగఁ • కుంకుమగంధరసంబు భారతీ

---

పా 1. సందృశ్యమానస్వకా పా. 2. యని నిక్కంబెన్నునంచున్ సదా పా. 3. తా రమ్యంబుగ
పా. 4. కేళీ సద్మమని.

కూర్మిరకుచద్వయానిహితి ◆ గొప్పయురంబున డంబు జూపఁ బొ
ల్పారు సరోజపీఠిఁ గొలు ◆ వయ్యెడు దేవుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 4

తే. గీ. వాణి నజురాణి ఘనసీల◆వేణి మధుర, వాణిఁ బల్లవసంకాశ◆పాణిఁ బృథుల
సైకతశ్రోణి నాత్మలో ◆ సన్నుతింతు, సుమధుమధురసుధావచ◆స్ఫూర్తికొఱకు. 5

శా. లీలాకేళికృతస్వకందుకము లై ◆ లెక్కింపఁగారాని యు
ద్వేలాత్మశ్రవణద్వయపరిచలనా◆విర్భూతవాతోత్థగో
త్రాఘ లుర్భూమి నభోంతరాళమున నృ◆త్యం బాడ నర్తించు గా
రీలీలావతిపట్టి మత్కృతికి ని◆ర్విఘ్నత్వ మిచ్చుం గృపన్. 6

ఉ. తావకపాదపద్మముల ◆ తాడన మొక్కటిదక్క నేపనుల్
గావు మదీయపాణులకుఁ ◆ గావునఁ జూడుము వీని నంచు నీ
తావిభుమోళ్ల నిల్చి పరిమ◆దంబునఁ జూపెడురీతి మోడ్పు కే
ల్పావనభక్తిఁ బూనెడు1కృ◆పావని పావని నెంతు నామదిన్. 7

చ. తనతనుకాంతి కాంచనకృ◆తంబులరీతి 2రహించ మారుతా
శనవర3భూషణౌఘముల◆సారెఁ గనుంగొని చేయి సాఁచి కై
కొనఁ బటుపుత్రకృతుల్ నిగుడ ◆ ఘోరఫణావళు లెత్త భీతిచా
లనము వహించు నైజనతు◆లం గని నవ్వు సుపర్ణు వేఁడెదన్. 8

తే. గీ. ఆత్మఁ బ్రహ్లాదరుక్మాంగ◆దాంబరీష, శౌనకవ్యాసశుకపరా◆శరవిభీష
ణార్జునవసిష్ఠపుండరీ◆కాఖ్యభీష్మ, దాల్భ్యనారదముఖ్యులఁ ◆ దలఁతు భక్తి. 9

సీ. వాక్యనిర్జితశేష ◆ వాల్మీకి వాల్మీకి హరిభక్తియుక్తిధీ◆వ్యాసు వ్యాసు
ఘనభావకాళిదా◆సును గాళిదాసును జారుమాఘుర్యవా◆చోరుఁ జోరు
దివిజేంద్రధనదవై◆భవభూతి భవభూతి ధర్మబుద్ధి నవీన◆దండి దండిఁ
గవితాభ్రహ్మాష్ట4మా◆ధవమయూరు మయూరు భాసురాకృతిఁబుష్ప◆బాణు బాణు

తే. గీ. మానితాచారమథితాస◆మాఘు మాఘు, ధ్యానబద్ధమురారి ము◆రారి 5గాత్ర
పటువిభారవి భారవిఁ ◆ బ్రస్తుతింతు, సర్వశబ్దార్థవిజ్ఞాన◆సరణికొఱకు. 10

ఉ. నన్నయభట్టు భీమకవి◆నాథుని దిక్కనసోమయాజిఁ బె
ద్దన్నను ముక్కుతిమ్మసచి◆వాగ్రణి బమ్మెరపోతరాజు గా
రన్నను రంగనాథుని మ◆హామహుఁ బిల్లలమఱ్ఱివీరభ
ద్రున్నుతియింతు నాంధ్రకవి◆రుద్రుల సత్కరుణాసముద్రిలన్. 11

పా. 1. కృపాలుని ◆ శ్రీహనుమంతు నెన్నెదన్. పా. 2. రహించు పా. 3. భూషణావళులు
పా. 4. భూధవమయూరు పా. 5. గోత్ర

ఉ. అయ్యలరాజుఁ దిప్పసచి♦వాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్ర♦ధానవరుం డగుకొండధీరునిం
జయ్యనఁ దిమ్మయప్రభుని ♦ సత్కవితారచనాఢ్యులైన మా
యయ్యలరాజవంశజుల ♦ నాదికవీంద్రుల సన్నుతించెదన్. 12

చ. సరసులు గద్యపద్యముల♦చాతురిఁ దల లూఁచి మెచ్చఁగా
విరసు లసూయచేత 1మఱి♦వేడ్క వహింపరు తేఁటిమొత్తముల్
శరదరవిందబృందఘన♦సారసుగంధమరందసంగ్రహ
స్ఫురణవహించుఁ గాని పుర♦సూకరపంక్తులు చెంద నేర్చునే? 13

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిసంస్మరణంబును గుకవితిరస్కారణంబునుం గావించి తదనంతరంబ. 14

సీ. ఎవని కీర్తి కుభృ♦ద్భవ కుభృద్ధరబుధ 2కరిసైంధవసమిద్ధ♦హారిణరుచిర
మెవని మేధంబు రు♦ద్భవక భుగ్ధవవిధూ ద్భవమరుద్ధవగురు ♦ ప్రతివిఘాతి
యెవనియీవహిమరు♦గ్భవసరిద్ధవలసద్భవనభృత్త్రిపురభి♦ద్భూరిమహిమ
యెవనిరూ పమృతభు♦గ్భవసుతోడ్వీడ్రీతి డుద్వీభ్భృదాప్తపు♦త్రోల్లసనము
తే. గీ. మంత్రిమాత్రుండె యతఁడుదు♦ర్మంత్రిమంత్ర,తంత్రసంత్రాసకరణస్వ♦తంత్రుఁడయల
రాజవంశసుధావార్ధి ♦ రాజసూర, యార్యనారాయణామాత్య♦వర్యుఁ డలరు. 15

వ. వెండియు నఖండతేజఃకాండమార్తాండమండలప్రచండుండును, నిజవితరణాకర్ణనకృశీభూతపారావార పునరభ్యుదయకారణానూన దానధారాప్రవాహ సంజాత మహావాహినీవ్యూహుండును, నిస్తులప్రశస్తసమస్తసద్గుణరత్నరత్నాకరుండును, గౌండిన్యసగోత్రపవిత్రుండును, గొండమాంబాగర్భవారాశిచంద్రుండును నగు నయ్యలరాజు నారాయణామాత్యదేవేంద్రుండు, గొండొకశుభవాసరంబున నత్యంత సంతోషితాంతఃకరణుండై. 16

షష్ఠ్యంతంబులు.

కం. వారణభయ వారణజయ, కారణ చక్రాహతారి♦కర వారునకున్
నీరాకర ధారాధర, భారాజీ భాసురప్ర♦భాపూరునకున్. 17

కం. భీషణ ఖరదూషణ హరి, శోషణ సురపోషణోగ్ర♦శోభనమతికిన్
శేషాహిప భాషాధిప, యోషాహిపరాస్యకీర్తి♦యోగోన్నతికిన్. 18

కం. సింధుసుపుత్రీకుచధర, కంధరశుభవిగ్రహునకుఁ ♦ గమలజసురరా
ట్సింధురముఖ సింధురముఖ, బంధురజాతస్తవార్హ ♦ పదనివహునకున్. 19

పా. 1. మది♦వేడ్క పా. 2. హయసద్ధవసమిద్ధ

కం. తక్షక కులశిక్షక చల, పక్షకళాత్యరుణహేమ♦పటసంభృతికిన్
దక్షాధ్వర శిక్షాకర, రక్షాచరణప్రవీణ♦రాజద్గతికిన్. 20

కం. వక్రత్రయచక్రకుచా, వక్రతనూరూపవైభ♦వదచారునకున్
శక్రాహిత చక్రాహిత, చక్రమహాపక్రమోప♦సంహారునకున్. 21

కం. భామాయుత కామాయిత, కోమలసుందరశరీర♦గురుధామునకున్
భీమరిపుస్తోమవపు, స్స్థేమతమస్సోమునకును ♦ శ్రీరామునకున్. 22

వ. అంకితంబుగా రచియింపం బూనిన హంసవింశతి యను మహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టి దనిన. 23

సీ. నానాగమస్ఫూర్తిఁ♦బూనిహంసాశ్వసన్మహిమంబుఁగను ధరా♦మరులు హరులు
తేజోమదంబుల ♦ దిక్కుంభిసీశుల నురుమాడ నోపు భూ♦వరులు గరులు
మణిచక్రములు భూరి♦గుణకోటికేతువు లలరఁగా నొప్పువై♦శ్యులు రథములుఁ
1బరజీవజీవనో♦ద్ధరణధర్మఖ్యాతి విలసిల్లు శూద్రులు ♦ వీరభటులు
తే. గీ. విమలసుమనఃప్రమోదరా♦గములఁ దనరి, పల్లవప్రాప్తిచే మించు ♦ ప్రౌఢవార
వనిత లారామములుఁ గల్గి ♦ వినుతికెక్కు, భూమిరత్నంబు నైషధ♦పురవరంబు. 24

కం. కలితమహాబలసఖ్యో, జ్జ్వలవిక్రమనిహతవిమత♦సాలోరుయశో
నలరాజభరిత మప్పుర, తిలకము సమ మనఁగ వచ్చుఁ ♦ దేజోవతికిన్. 25

కం. ఆపురము ధరాలలనా, నూపురమై రత్నసౌధ♦నూతనరుచికిన్
దాపురమై యభ్రంకష, గోపురమై పొగడ నెగడుఁ ♦ గుంభినిలోనన్. 26

వ. మఱియు నప్పట్టణంబు దివ్యసాలోచ్ఛ్రయకలితంబు గావున నాకలోకంబును, మహాశుద్ధాంతరంగంబు గావున యోగిజనంబును, నీలగవాక్షప్రబలంబు గావునఁ గిష్కింధానగరంబును, గుంభీనసరభసంబు గావున రసాతలంబును, గంధర్వప్రచురంబు గావున దేవలోకంబును, గురుకవిబుధద్విజభాసమానంబు గావున గ్రహమండలంబును ననుకరించి, మత్స్యకూర్మాదిమహిమంబులు వహించి, కమలాలంకృతంబులై శ్రీమహావిష్ణువుం బురుడించు
సరోవరంబులు గలిగి యొప్పు నెప్పుడు. 27

ఉ. ఆపుర మేలు మేలు భళి ♦ యంచు నుతింప జను ల్నవద్వయ
ద్వీపవసుంధరాస్థలి ను♦దీర్ణజయాంకలిపు 2ల్లిఖించి బా
హాపటుశక్తి నిల్పినమ♦హారజతద్యుతు లొల్కుకంబముల్
ప్రాపితశౌర్యరేఖ లయి ♦ భాసిలఁగా నలనాముఁ డున్నతిన్. 28

పా. 1. బురజనజీవనో పా. 2. ల్లిఖింప బా

తే. గీ. ప్రబలరాజాధిరాజవీ♦రప్రతాప, రాజపరమేశ్వరాష్ట ది♦గ్రాజకుల మ
నోభయంకరబిరుదైక♦వైభవా య, టంచు మాగధు లెంచంగ ♦ మించు నతఁడు. 29

వ. ఇట్లు మహీశాసనంబు సేయుచు నొక్కనాఁడు. 30

ఉ. ఆతరణిప్రభుండు గొలు♦వై చెలువై బలవైరి భోగసం
ప్రీతి దలిర్పఁగా నృపవ♦రేణ్యులు మాన్యు లగణ్యపుణ్యసం
ఘాతు లమాత్యు లార్యు లధి♦కారులు వీరులు చారు లష్టది
గ్జాతవిచిత్రవస్తువులు ♦ గానుక దెచ్చినవారు గొల్వఁగన్. 31

కం. ఉన్నయెడ నాల్గువేదము, లెన్నఁగఁ దగుశాస్త్రచయము ♦ లితిహాసాదుల్
పన్నుగఁ దెలిసిన ప్రత్యు, త్పన్నమతి యనెడుపురోహి♦తద్విజుఁ డెలమిన్. 32

ఉ. వచ్చి ఫలోపవీతములు ♦ స్వస్తిచతేస్స్వతిసూక్తి మున్నుగా
నిచ్చిన నాదరించి వసి♦యింపఁగఁ జేసి నృపాలుఁ డెంతయున్
ముచ్చటలుం బ్రసంగములు ♦ మున్నటిరాజులచర్యలుం గథల్
చెచ్చెర నానతి మ్మనినఁ ♦ జిత్తము [1]రంజిల నాతఁ డత్తఱిన్. 33

ఉ. చెప్పఁ దొడంగెఁ దేనియలు ♦ చిల్కఁగ, ద్రాక్షలు రాలఁ, గప్రపుం
దిప్పలు చిమ్మిరేఁగఁ, గడుఁ ♦ దీయనియిక్షురసప్రపూరముల్
చిప్పిలిపర్వఁగా, నమృత♦శీకరము ల్వడిఁ గ్రుమ్మరింప, న
ప్పప్ప యిదార యంచు జను ♦ లందఱు నొఁదల లూఁచి [2]మెచ్చఁగన్. 34

తే. గీ. చెప్పుచుండంగ భామల ♦ చిత్తవృత్తి, తెలియ బ్రహ్మకు నైనను ♦ గొలఁది గాదు
ధాత్రిఁ జిత్రవిచిత్రంబు ♦ దలఁచిచూడ, దానినెఱిఁగింపు బ్రాహ్మణో♦త్తమమృగాంక. 35

వ. అని యడిగిన నతనికిఁ బురోహితుం డి ట్లనియె. 36

కం. మంకులు మాయోపాయలు, బొంకులపుట్ట లతిపాప♦పుం జగజంతల్
జంకెనలు సేయు యువతులు; శంకరుఁడుం దగఁడు వారి ♦ చర్యలు దెలియన్. 37

తే. గీ. అయిన నొకకథ గలదు రా♦జాగ్రగణ్య, తొల్లి పరమేశ్వరుండు సం♦తోషమొదవఁ
బార్వతీదేవి కెఱిఁగించె ♦ బాగుమీఱ, నది యెఱింగింతు వినుము నీ ♦ వవధరించి. 38

వ. అని యి ట్లనియె. 39

సీ. మంజులమాణిక్య♦పుంజరంజితఘన ప్రాకారచుంబితా♦భ్రస్థలంబు
చంద్రకాంతోపల♦సౌధపాండురకళా మ్రేడితప్రాలేయ♦ఘృణికరంబు
రత్నకుడ్యావళీ♦రమ్యాంశుసందోహ బహుళీకృతార్కప్ర♦భాచయంబు
గంభీరపరిఘాసి♦తాంభశ్ఛటాతమో లోకీకృతాధర♦లోకవితతి

పా. 1. రంజిలియాతఁ డత్తఱిన్ పా. 2. ఊఁచఁగన్.

తే. గీ. యామికాహతిజాతది♦శాధినాథ, పురభయంకర భేరికా♦భూరిదంధ
ణంధణధణధ్వనిప్రతి♦నాదదాయి, గోపురం బొప్పు నజ్జయ♦నీపురంబు. 40

కం. ఆపుటభేదనమునకు ది, శాపుటభేదనకఠోర♦సంగరజయభే
రీపటలధణంధణుఁ డొక, భూపాలుఁడు గలఁడు చిత్ర♦భోగుం డనఁగన్. 41

సీ. వెలయ హరిశ్చంద్రు♦విధమున, నలునివేఁకను, బురుకుత్సుచొ♦ప్పునఁ, బురూర
వునిలీల, సగరులా♦గునఁ, గార్తవీర్యుమర్యాదను, గయుక్రియ, ♦ నంబరీషు
మతమున, శశిబిందు ♦ మహిమ నంగుని తేవఁ, బృథునిమాడ్కి, మరుత్తు♦వృత్తి, భరతు
నీతి, సుహోత్రుని♦భాతి, భార్గవుబలె, రాముపోలిక, భగీ♦రథునిపోలుపు

తే. గీ. న, శిబిసంగతి, మాంధాత♦నయమునను, య,యాతికరణి దిలీపుని♦యట్ల, రంతి
రీతి నాచక్రవాళప♦రీతభూత, ధాత్రిఁ బాలించు సవిభుండు ♦ దద్విభుండు. 42

తే. గీ. ఆతఁ డంతిపురంబులో ♦ హావభావ, విభ్రమ విలాసవైఖరు ♦ ల్విస్తరిల్లు
మరునిసామ్రాజ్యలక్ష్ముల♦హరువుఁ జెంపుఁ, జెలులు గొలువంగఁ గొలువుండెఁ♦జెలువుమీఱ.

వ. ఉన్న సమయంబున. 44

సీ. పొడవైన జడలుగుఁ గెం♦జడలకీల్గంటును 1నిండారెడువిభూతి ♦ పెండెకట్లు
వీనులపటికంపు ♦ వింతకామాక్షులు గనుబొమల్సందునఁ ♦ గావిబొట్టు
కుచములపైఁ గావి ♦ కుబుసంబు గళమున నలరారు రుద్రాక్ష♦హారతతులు
చే నాగబెత్తంబు ♦ 2చీనికృష్ణాజిన మక్షిగోళంబుల ♦ నంజనంబు

తే. గీ. కావివస్త్రంబు పావాలు ♦ కక్షపాల, తామ్రకటకంబు సింగినా♦దంబు క్రొవ్వి
పొందుసిద్ధక్రియలు చిదా♦నందభూతి, యొనరఁ 3బూనుక నొకమహా♦యోగురాలు. 45

తే. గీ. చెట్టు దిగి వచ్చినట్టులఁ ♦ జెంత నిలువఁ, జూచి లేచి 4నృపుండు సం♦స్తుతులమ్రొక్కి
పీఁట వేయించి కూర్చుండఁ♦బెట్టి తా సు,ఖాసనాసీనుఁడై యున్న ♦ యవసరమున. 46

సీ. శ్రీరస్తు శుభమస్తు ♦ ధీరస్తు విజయోస్తు పుత్రరంజన మస్తు ♦ పుణ్య మస్తు
ధన మస్తు ధాన్య మ♦స్త్వనవద్య సుఖ మస్తు చిరతరసంకల్ప ♦ సిద్ధి రస్తు
సత్య మస్తు మహోస్తు ♦ శౌర్యమస్తు యశోస్తు స్వస్త్యస్తు సుగుణోస్తు ♦ శక్తి రస్తు
సామ్రాజ్య మస్తు శా♦శ్వతధర్మఫల మస్తు వృద్ధి రస్తు మహాప్ర♦సిద్ధి రస్తు

తే. గీ. జ్ఞానమస్తు శ్రియఃపతి♦ధ్యానమస్తు, గురుచరణభక్తి రస్తు స♦త్కుశలమస్తు
శాంతిరస్తు నిరంతరై♦శ్వర్య మస్తు, భాగ్యమస్తు మహాసార్వ♦భౌమ నీకు. 47

పా. 1. నిండారువిభూతి. పా. 2. చిన్నికృష్ణాజిన. పా. 3. బూనినయొక, (బి) బూనికనొక.
పా. 4. నృపాలుండు ♦ స్తుతులమ్రొక్కి.

కం. అని దీవించి చతుతపు, ష్పనిచయము విభూతిపండ్లు ♦ ఫలములు దివ్యాం
జనములు సిద్ధక్రియలును, దనరఁగ శివసత్తి భూమి♦ధవున కొసంగెన్. 48

వ. ఇట్లొసంగిన వినయంబున లేచి కైకొని స్వాగతంబడిగిన సంతోషించి మనోరంజనార్థంబు ధర్మార్థకామమోక్షంబులు రాజ్యలక్షణంబులుఁ బురాణేతిహాసంబులు లోకాభిరామంబులు ననాగతవర్తమానంబులు నుచితానుచితకథాసారస్యంబులుఁ దెలిపిన విని, మహాత్మురాలా! మీరు వినని కనని కార్యంబులు ముల్లోకంబుల నెవ్వియు 1లేనైన నొక్కటి యడిగెద నానతిమ్మని యిట్లనియె. 49

కం. ఏయేభూములఁ జూచితి, వేయేరాజ్యములఁ గలరు ♦ శృంగారకళా
ప్రియ లగురూపరేఖా. శ్రీయుతి గలకన్నె లనిన ♦ శివసత్తియనెన్. 50

మ. మది రంజిల్లఁగఁ జెప్పెద న్వినుము పే♦ర్మన్ సచ్చిదానందసం
పదచేతం గరజం ఫలంబుగతిఁ గ♦న్పట్టున్ ధరాధీశ యీ
యుదాయాస్తాచలసేతుశీతనగమ♦ధ్యోద్యద్ధరాచక్రమిం
పొదవన్ దేశములందు నుండుదురు వి♦ద్యుద్వల్లికాభాంగనల్. 51

ఉ. డెబ్బదిరెండుపాళెములు ♦ కీవిఁ దలిర్చు నమస్తదుర్గముల్
జొబ్బిలు కల్మిఁ బట్నములుఁ ♦ జొక్కపుఁ బేటలుఁ బాతకంబు పో
ద్రొబ్బుకులీలఁ జాల్తిరుప♦తు ల్గనుగొంటిని నుండు రందులన్
సిబ్బెపునిబ్బరంపుజిగిఁ ♦ జిక్కని చక్కనిగబ్బిగుబ్బెతల్. 52

కం. వెలనాడు వేగినాడును, బులగులనాడ్వాకనాడు ♦ పొత్తపినాడున్
అలమురికినాడు రేనా, డలయక గనుఁగొంటి నచటి ♦ యబలలఁ గంటిన్. 53

సీ. లాట కర్ణాట మ♦రాట వధూటులఁ బాండ్య పౌండ్ర విదర్భ ♦ పద్మముఖుల
బంగాళ వంగ క♦ళింగ లతాంగులఁ గుకురు కేరళ కురు ♦ కోకకుచల
మళయాళ నేపాళ ♦ మాళవ యువతుల మత్స్యవత్స కరూశ ♦ మానవతులఁ
గోసలాంధ్ర వరాట ♦ కుంతల స్త్రీలను బాంచాల బర్బర ♦ భామినులను
తే. గీ. ద్రవిళ గాంధార కాశ్మీర ♦ ధరణిసతుల, మగధ కొంకణ టెంకణ ♦ మానినులను
మఱియుఁ దక్కినధారుణీ♦మండలములఁ, దనరు చెలువలఁ జూచితి ♦ ధరణినాథ. 54

తే. గీ. రాజవశ్యౌషధాకృతుల్ ♦ రమ్యతర ర, తిస్వరూపలు 2మోహన♦దివ్యమూర్తు
లతులతర 3కామమంత్రదే♦వతలు వీర, లనఁగ నుందురు సుందరు ♦ లచట నచట. 55

ఉ. ఈనవఖండమండలమ♦హీస్థలినెల్లఁ 4గనంగ దేవ నే
నీనగరీలలామమున ♦ నెంతయు రేఖఁ జెలంగు సున్మథా

---

పా. 1. లేవు గావున పా. 2. మోహినీ పా. 3. కామతంత్ర పా. 4. గనంగ నేల.

ధీనసుమోహనాకృతి ర♦తి న్నగుమి న్నగుసొరుగల్గు సా
తానిబిసప్రసూనదళ♦ధాళధళీతరళాక్షిఁ జూచితిన్. 56

తే. గీ. దానిప్రియనాయకుఁడు విష్ణు♦దాసుఁడనెడు, పేరుగలవాఁడు కలవాఁడు♦పెద్దవాఁడు
హేమవతి యనఁ దనరు న♦య్యింతిఁ బొగడఁ, దరమె బ్రహ్మకునైన శం♦కరున కైన. 57

ఉ. ఆమధురాధరాధరక♦చాళి కనద్ఘననై గనిగ్యమా
యామృదుగోరుసారరుచి♦గాంబురుహాక్షులధాళధళ్యమా
యామెఱుఁగారుబోఁడి జిగి♦యబ్బెడుగుబ్బల చాకచక్యమా
యేమని చెప్పవచ్చు జగ♦తీశ్వర! శాశ్వతరూపసంపదల్. 58

కం. దానిజిగి దానితులుకును, దానితనుద్యుతులసొంపు ♦ దానివిధంబున్
దానివగ దానియందము, మానవవర! మరుఁడు గన్న ♦ మగ్నుఁడు గాఁడే! 59

కం. వగ లొలుకు ధాగధగ్యపు, జిగి గుల్కెడు నుబ్బుగబ్బి ♦ సిబ్బెపుగుబ్బల్
నిగనిగలు గులుకు కొప్పును, సొగసుం దెలికనులు దాని ♦ సొమ్మో పరఁగున్. 60

ఉ. విండ్లకు మేల్తరంబు ఘన♦వేణి కనుంబొమదోయి, బంగరుం
గిండ్లకు మేటి సాటి తుల♦కించు చనుంగవ, లేఁతతమ్మిపూఁ
దూండ్లకు మిన్న యన్న జిగిఁ ♦ దొల్కెడుచేతులు లోకమందుఁ బూ
బోండ్లను గానమో వినమొ ♦ పోలరు తత్సతికాలిగోరునన్. 61

సీ. కబరీభరమునకుఁ ♦ గందంబు సెల్లు, నుత్పలమాలికలు నేత్ర♦ములకుఁ జెల్లుఁ
గర్ణంబులకును మం♦గళమహశ్రీ సెల్లు, గాత్రంబునకుఁ జంప♦కంబు జెల్లు
మధురవాగ్వృత్తికి ♦ మత్తకోకిల సెల్లుఁ జనుగుబ్బగవకు మం♦జరియుఁ జెల్లు
బిరుదైన పిఱుఁదుకుఁ ♦ బృథ్వీవృత్తము చెల్లు, మధ్యంబునకుఁ దను♦మధ్య చెల్లు
తే. గీ. బాదముల కంబుజము చెల్లుఁ, ♦ బరఁగు నడకుఁ, దనరు మత్తేభవిక్రీడి♦తంబు సెల్లుఁ
గృతులవర్ణింపఁదగుతదా♦కృతులెకృతులు, వాంఛచేదానిఁబొందిన♦వాఁడె సుకృతి. 62

తే. గీ. చండదోర్దండమండిత♦మండలాగ్ర, ఖండితోద్దండరిపుకాండ♦భండనమునఁ
బండితుం డగురాజవే♦దండమునకుఁ, గాక యొకపాటివాని కా♦కన్నెతగునె. 63

ఉ. సౌరభ మొందుకాంచనపు♦జంత్రపుఁబుత్రిక వాగ్విలాసము
ల్వారక నేర్చు రత్నపుస♦లాక తిరం బగురూపుఁ జెందు తొ
ల్కారుమెఱుంగు జీవకళఁ ♦ గాంచిన చిత్తరుబొమ్మ యాన శృం
గారిణి యా సుధాసరసిఁ♦గా నుతిసేయఁగ వచ్చు నచ్చెలిన్. 64

కం. అని సిద్ధురాలు సెప్పినఁ, బొనపొనఁగాభ్రమలు చెందఁ ♦ బులకలు వొడమన్
మనసిజశిఖి యెనసినచోఁ, గనఁబడు ధూమాంకురముల♦గతి నృపుమేనన్. 65

కం. అంతట సిద్ధాంగన యా, ద్యంతంబును జెప్పి తన మ♦హాశ్రమమహిమన్
సంతోషంబునఁ [1]జనె భూ,కాంతుఁడు హేమవతిమీఁద ♦ కాంక్ష జనింపన్. 66

మ. కరుణాదృష్టులు [2]నాగవాసముల సో♦కం జూచి వేడ్కన్ మనో
హరము ల్కోకలు రూకలు న్మణులు హా♦రాలంకృతిస్తోమము
ల్సరసత్వంబున నిచ్చి పంచి కొలువున్ ♦ జాలించి తాఁబోయి భూ
పరతీశుండు మనంబు హేమవతిపై ♦ బాళిన్ దువాళింపఁగన్. 67

కం. మిన్నందు సౌధవీథి స, మున్నత మగుమేలు మచ్చు ♦ లొప్పెడుచోట
న్మిన్నగుచిత్తరువులచేఁ, బన్నుగఁ దగు నొకరహస్య ♦ భవనము పజ్జన్. 68

చ. అకలుషదివ్యరత్నమయ♦మా నొకకేళిగృహంబులోపలం
జికిలికిరీటిపచ్చల ర♦చించినచిల్కలకోళ్ల ♦నందమౌ
సకినెలపట్టెమంచమున ♦ చాయనఖాసుతివాసిపైఁ దురం
గిక మొకమాలు లేపున నొ♦గిన్ శయనించి మనోభవవ్యథన్. 69

కం. [3]ప్రీతిని హేమావతిపయి, నాతీరున మనసు నిలిపి ♦ యతివిరహార్తిం
జేతోజాతధనుర్భవ, శాతశరవ్రాత[4]సార ♦ చకితాత్ముండై. 70

కం. [5]ఉలుకు న్వెన్నెలవేఁడిమి, కళుకు న్పికపికమిళింద ♦ హంసార్భటికిన్
బెళుకు న్మలయానిలునకుఁ, జెళుకుం బూపాన్పునందుఁ ♦ జిరవిరహార్తిన్. 71

ఉ. చెక్కిటఁ జేయి చేర్చుకొని ♦ చింతిలు నుస్సు రటంచుఁ [6]జూపులన్
వెక్కసమందు లేమ యెల♦విం బొడగట్టినయట్లు నుండఁగా
నక్కునఁ జేర్పఁ బోవు భ్రమ ♦ మంది వెసం దలయూఁచు నంతలోఁ
బక్కున నవ్వు నింతిపయి ♦ బాళి నృపాలకమౌళి ఖిన్నతన్. 72

వ. మఱియు నారాజు విరహంబు తాపాతిశయకరంబు గావున నిదాఘంబును, విరళీకృతాశ్వాసంబు గావున సత్ప్రబంధంబును, విచ్ఛిన్నాలంకారంబు గావున యవనవివాహంబును, నిమీలితతారకంబు గావున నహర్ముఖంబును, విప్రలాపముఖరంబుగావున సాయంకాలంబును ననుకరించె నప్పుడు. 73

కం. అటువలె నృపనిటలాక్షుఁడు, పటుతరవిరహంబుఁ జెంది ♦ బాధపడంగా
నటనమున హేల యనియెడు, కుటిలాలకవచ్చెఁ దెలివిఁ ♦ గొనఁజేయుటకున్. 74

శా. పన్నీట న్నయనంబు లొత్తెఁ దనువుం ♦ బాటీరపంకంబుతోఁ
జెన్నారం బద నిచ్చె గీరి సిగ వే♦సెన్ దాయెతు ల్సట్టె జీ

పా. 1. నేఁగె నృ,కాంతుఁడు పా. 2. రాణివాసముల పా. 3. ప్రీతిలి పా. 4. పాత
పా. 5. జళుకు పా. 6. నూర్పులన్

న్నొసన్నాపట్టెరుమాలుగట్టె జరతార్ ♦ చుట్టంచు డాల్మించుమే
ల్మినాన్న సన్నపుదుప్పటంబు దగ హొ♦ళిం గప్పె సొం పారఁగన్. 75

వ. ఇట్లుపచారంబులఁ గొంత దాపంబు శాంతం బొనరించి [1]నృపాలునకు హేల యిట్లనియె. 76

ఉ. స్వామి పరాకు నీమదికి ♦ సమ్మతి యౌనని యేమి చెప్పమా
ప్రేమ దలిర్ప నేర్పు దల♦పింప నదెంతటికార్యమైన నే
నే మఱి తీర్చి నీకుఁ గల ♦ నెంజిలిఁ బాపెదఁ జూడు మన్న నా
శ్రీమహనీయుఁడై భవుఁడు ♦ శీతకరాస్యకు హేల కిట్లనున్. 76

తే. గీ. సిద్ధురాలు హేమావతీ ♦ సితకరాస్య, వలపురేఖాతిశయమై భ♦వమును దెల్ప
వినఁగ నగుమోహమునసైన ♦ వెతను మాన్పు, కరుణ ననుఁజేర్చి యమ్మచ్చ♦కంటిఁగూర్చి.

కం. అని చీనీచీనాంబర, ఘనమణిహారములు మేలు ♦ కాల్కడియంబు
ల్గొనబున్ మెఱుఁగుంగరములు, చను వమరఁగ నిచ్చి పనుప ♦ సముచితరీతిన్. 79

ఉ. పూని ముదంబు లుప్పతిల ♦ భూవరముఖ్యునిచేత వీడుకో
లై నవరత్నకీలితమ♦హారజితోన్నతదివ్యదీధితి
శ్రీనిధులెల్ల దిక్కుల ది♦శించుచు మించినవిష్ణుదాసు స
న్మానితగేహసీమకు సు♦మాళముతోఁ జనె హేల హేలలన్. 80

సీ. కస్తూరివీణలుఁ ♦ గపురంపు లప్పలు నిండిన గృహములు ♦ నెరయదాఁటి
కుంకుమాగరుఖండ♦సంకుమదంబులు గలుగుబిడారులు ♦ గడచిపోయి
గాళము ల్పచ్చాకు ♦ కచ్చూరములు చాల నించిన కొట్టడీ ♦ ల్మించియేఁగి
పునుఁగుచట్టంబులు ♦ బుక్కారజంబులు పొంకమౌ మళిగల ♦ పొంతఁ దరలి

తే. గీ. చూచె నొకదివ్యరత్నని♦స్తులగృహంబు, నందు హేమావతీకన్య ♦ నలరు ధన్య
వరలుసొంపుల కెంకి జ♦వాదివంకి, జాతిరతిలీల నారాజ♦దూతి హేల. 81

వ. ఇట్లు తన్నుఁ జేరవచ్చినరాజదూతిం గనుంగొని మహారాజుమన్ననలమనియెడు పడంతుక యని రత్నంపుగద్దియపై వసియింపంజేసి, స్వాగతం బడిగిన నబ్బాలకు హేల యిట్లనియె. 82

కం. నీచాతుర్యము నీవా,చాచిత్రపటుత్వ రూప ♦ సంపద లెపుడు
న్నీ చుట్టంబులు సెప్పఁగఁ, జూచెద నని వచ్చినాను ♦ సుదతీ నిన్నున్. 83

ఉ. చక్కనివారిలో మిగులఁ ♦ జక్కనిదాన వటంచు వేడ్కతోఁ
జొక్కుచుఁ జెప్పి రందులకుఁ ♦ జూచినయందుకు నామనోరథం

పా. 1. నృపాలున కల హేల

1బక్కఁడ సిద్ధమయ్యె ఫల ♦ మబ్బెను హా యిటులుండవద్దె యో
చక్కెరబొమ్మయంచు సర ♦ సప్రతిభాషల నిచ్చగింపుచున్. 84

సీ. దీనచకోరాళి ♦ తృష్ణదీర్చుఁగదమ్మ భామ నీవదనచం ♦ ద్రామృతంబు
పేదబర్హిణముల ♦ నాదరించుఁగదమ్మ మెలఁత నీవేణికా ♦ మేఘపంక్తి
ఘనదరిద్రపికాళిఁ ♦ దనియఁ జేయుఁగదమ్మ చెలియ నీ వాతెఱ ♦ చివురుడంబు
బడుగుజక్కవలనిం ♦ పడరఁబ్రోచుఁగదమ్మ ముగుద నీచనుదమ్మి ♦ మొగ్గదోయి
తే. గీ. పేదహిందోళసందోహ ♦ మీఁదునమ్మ, నీవదోబృందమకరంద ♦ నిర్ఝరంబు
లిట్టిపస మిసి జిగిబిగి ♦ యీవిధంబు, పరిణతి సేయంగఁ దరమె యా ♦ బ్రహ్మకైన. 85

కం. ఇదిగాక యత్తమామల, ముద 2మొదవఁగ బంధుసంఘ ♦ ముల దాసీదా
సదళంబుల బహువిశ్వా, 3సదయల నీరీతి మనుచు ♦ సతులం గానన్. 86

వ. అని యిత్తెఱంగున. 87

ఆ. వె. దానియత్తతోడఁ ♦ దగు మామతో బంధు, దాసజనముతోడఁ ♦ దగినమైత్రిఁ
గూడి 4యాడుచుండి ♦ కొన్నిదినంబులు, చన్నపిదప నొంటి ♦ నున్నవేళ. 88

ఉ. ఒక్కసుధాంశురత్నరుచి ♦ రోన్నతవేదికమీఁద నిద్దురన్
మక్కువమీఱ నుండి యను ♦ మానముతో నొక5కొంతఁ గొంకికొం
చక్కట 6నీ కొకందులకు ♦ నచ్చికలేక మెలంగ విష్ణుదా
7సెక్కడిభర్తఁ గాఁగ సృజి ♦ యించె నజుం డని హేల నవ్వుచున్. 89

కం. ఈరూప మీపటుత్వం, బీరేఖా వైభవంబు ♦ లీనెఱప్రాయం
బీరసికత నీకును మఱి, 8మారాజున కగును నితర ♦ మనుజుల కగునే. 90

సీ. కలికి నీసిబ్బెంపు ♦ గబ్బిగుబ్బలు వాని గడుసుచేతులఁ బట్టి ♦ కలఁచఁ దగునె
కాంతరో నీతావి ♦ కావిమోవిటు వాని కొక్కిదంతంబుల ♦ నొక్కఁదగునె
చెలువ నీజిగిగోము ♦ గలమోము మఱివాని తొట్టినోరున ముద్దు ♦ వెట్టఁ దగునె
సుదతి నీకనకంపు ♦ సొంపుదేహము వాని కఱుకుమేనునఁ జేర్చి ♦ కలయఁ దగునె
తే. గీ. 9కులుకుశృంగారరసములు ♦ 10చిలుకఁ గీలు, బొమ్మవలె నీటు గలదాన ♦ వమ్మనీవు
మర్కటమువంటివాఁడు నీ ♦ మగఁడు చూడ, వానితోఁగూడిరతికేళిఁ ♦ బూనుటెట్లు? 91

కం. నీవంటిరూపవతికిని, నీవంటిప్రియుండు గలుగ ♦ నిర్మింప కహా
యీవిధిని దగులుచేసిన, యావిధి నిటు దూర నింక ♦ నగుఫల మేమీ? 92

---

పా. 1. బక్కట  పా. 2. మొనరఁగ  పా. 3. సదయామతిరీతి  పా. 4. యాడియుండి
పా. 5. కొంకుఁ  పా. 6. నీ కొకందులను  పా. 7. సెక్కటి  పా. 8. మారాజునఁ గాక నితర
పా. 9. కలికి  పా. 10. గులుకు కీలు

తే. గీ. అయిన మగఁ డెంతనీటుకాఁ ♦ డైననేమి, ప్రాణపద మైనచౌశీతి ♦ బంధగతుల
నింపు సొంపులుజూపి చొ ♦ క్కింపఁదగునె, రతికిఁ జొచ్చినతఱి మాన ♦ వతుల కెపుడు. 93

1ఉ. కేరఁగరాదు నవ్వి గిలి ♦ గింతలు వెట్టఁగరాదు చెక్కులం
జీరఁగరాదు గుబ్బలు క ♦ చిక్కునఁ గ్రుమ్మఁగరాదు కూటమిన్
మీఱి యథేష్టలీలల ర ♦ మింపఁగరాదు వెలందిమిన్న లే
పారఁగ నాథులం గలయు ♦ నప్పుడు గావున సాహసింత్రుగా
జారులఁ గూడఁ దత్సురత ♦ సౌఖ్యమె సౌఖ్య మటంచుఁ గామినీ. 94

వ. అదియునుంగాక. 95

కం. పదివేలమదను లొక్కట, నుదయించినలీల మెఱయు ♦ నురుగుణుఁడు సుమీ
మదిరాక్షి చిత్రభోగుఁడు, మదిఁ గోరెను నీటుభాగ్య ♦ మహిమ యెట్టిదియో. 96

సీ. కువలయానందంబు ♦ గూర్చి యేలు ఘనుండు విబుధులఁ బ్రోచు స ♦ ద్వితరణుండు
సర్వజ్ఞవతాళిభూ ♦ షణ మైనధన్యుండు లలితవిభ్రమరూప ♦ లక్షణుండు
సరవికళల్నించు ♦ శ్యామాభిరాముండు వఱలెడు సన్మార్గ ♦ వర్తనుండు
2విష్ణుపదార్చిత ♦ విహితశుభ్రకరుండు 3శమితతమోహారి ♦ 4యమితశీలుఁ

తే. గీ. డమ్మహారాజచంద్రు డా ♦ యననిజాంత, రంగ మంతయు నినుఁ జేర్చి ♦ రమణఁ గూడ
నేలఁగలఁ డమ్మ నీపుణ్య ♦ 5మెసఁగె నమ్మ, తమిని6నీడేర్చవమ్మ కుం ♦ దనపుబొమ్మ. 97

వ. అనిన విని సంభ్రమభయవిస్మయలజ్జాహాసకాంక్షలు మనంబునం బెనంగొన నమ్రముఖియై హేమావతి రాజదూతి కిట్లనియె. 98

ఉ. అమ్మకచెల్ల యిట్టిపలు ♦ కాడుదురే మఱియత్తమామలుం
గ్రిమ్మి తలార్పులై మెల్లఁగఁ ♦ గా మగఁడుం బులిరీతిఁ డెంపుగా
బమ్మెర 7రొప్పచుండఁగను ♦ బాంధవు లెల్లను గాంచి యుండఁగాఁ
గొమ్మరొ యిట్టికార్య మొనఁ ♦ గూడునె కూడిన హాని చెందదే. 99

తే. గీ. అనిన హేమావతికి నిట్లు ♦ లనియె హేళ, క్షేపటికి నేఁటి ప్రాయంపు ♦ ఱేపు గల్లదె
మోహ మొక్కొకఁ జక్కని ♦ ముద్దుజాణ, యొకనిబిగికౌఁగిటను జేర్చి ♦ యుండవలయు. 100

---

పా. 1. ఉ. కేరఁగరాదు నవ్వి గిలి ♦ గింతలు వెట్టఁగరాదు చెక్కులం
జీరఁగరాదు గుబ్బలు క ♦ చిక్కునఁ గ్రుమ్మఁగరాదు కేళిలో
మీఱఁగరాదు పైకొని ర ♦ మింపఁగరాదు గళారవంబు లిం
పారఁగ సల్పరాదు మది ♦ రాక్షులు భర్తలఁ గూడువేళలన్.

పా. 2. విష్ణుపదార్పిత పా. 3. నమితతమోహారి పా. 4. యగుసుశీలు పా. 5. మెసఁగు
పా. 6. నీడేర్చు మరుని కుం ♦ దనపుబొమ్మ పా. 7. రొజుచుండఁగను

కలిగి విక్కడిమగఁ డెక్కడిసఖు, లెక్కడి నీయత్తమామ ♦ లెక్కడిచుట్టా
లిక్కాలేది దొడ్డ కొంచెము, లెక్కింపకు మరునిహోవ ♦ లింబడువేళన్. 101

సీ. కోటగోడలనైన ♦ మీటుగా నెగఁబ్రాఁకి దాఁట నేరనిదేటి ♦ తలిరుబోణి
ఘుమఘుమార్భటితోడ ♦ ఘోషించునదులైన నీఁదిపోవనిదేటి ♦ యెమ్మెలాడి
తనమీఁదితప్పు నొ ♦ క్కనిమీఁద నిజముగాఁ బెట్టనేరనిదేటి ♦ బిసరుహాక్షి
ధవుఁడైనఁ దనజాడ ♦ తఱఁగనిపట్టిన నిర్వహింపనిదేటి ♦ నీటుకత్తె.

తే. గీ. తలవరులు గన్నచో లేని ♦ తాల్మిఁ బూని, బొంకు తథ్యంబు, తథ్యంబు ♦ బొంకుఁ గాఁగ
నెంచి యుపనాథుతోడఁ గ్రీ ♦ డించి మించి, చక్కటికిఁ దేని దదియేటి ♦ సరసురాలు. 102

వ. అని మఱియు మఱియునుం బోధింప నంగంబు పులకాంకురానుషంగంబునుగా నిజాంతరంగంబునం బొడము వ్రీడాభరం [1]బుడిపికొని దరస్మితాననముఖాంబుజయై యెట్టకేలకుఁ జెవి యొగ్గిన నగ్గజరాజగామినిం బాసి తనరాక కెదురుచూచుచున్న రాజుసన్నిధికిం జని తాఁ బోయివచ్చినకార్యం బెఱింగించె, నంతట దైవయోగంబున విష్ణుదాసునకుఁ బ్రయాణంబు సంభవించె నంత. 103

తే. గీ. పయనమునకై నయని యమ ♦ ర్పంగ నప్పుడు, పరిచరుల కానతిచ్చెనఁ ♦ బటకుటీర
పాత్రిసామగ్రిమొదలైన ♦ బరువులెల్ల, శకటవామ్యశ్వవృషమహో ♦ ష్ట్రిములకెత్తె. 104

వ. మఱియుం గలమాన్నంబులుం గలవంటకంబులుఁ బొంగలి పులియోగిరంబు దధ్యోదనంబు నానవాలు జున్నులు మీఁగడపెరుగులు నవనీతంపుఘుటికలు నొలుపుఁబప్పు నప్పడంబులు వఱుగులు వడియంబులుఁ బెరుఁగువడియంబులు మిరియంపుఁబొడి మెంతికూటువ సంబారంపుఁజింతపండులు బజ్జు లుసిరికలుఁ బచ్చ ఖూరుబిం డూరుఁగాయలు మామిడితొక్కులు నివి మొదలుగాఁగల పరికరంబులును, మఱియు వడపప్పు బేడలు వేపుళ్లు ననుపగుగ్గిళ్లు బొరుగులు [2]బొదులుఁ బాకపుఁజలిమిడిఁ గాయమ్ములుం జిమ్మిలుంతులు నటుకులు మూఁగలుఁ లాజలుఁ బేల్పాలుఁ [3]జటికాఖుకులుఁ నువ్వులు నానబియ్యంబులుఁ బేలపిండిఁ బేలసత్తు ద్రోసగింజలు వెల్లగిసెలు గోఁగులు గరింగరుము లుప్పిళ్లు సెనగపప్పు బొరుగుపప్పు సారపప్పు జీడిపప్పు బాదంపలుకులు గొబ్బెర గసగసాలు ఖర్జూరములు ద్రాక్షలాదియైనఫలాహారంబులును, మఱియు నుండ్రంబులు మండెఁగలుఁ గుడుములు దోసెలు వీసెలు రొట్టెలు నిప్పట్లప్పంబు లతిరసంబులు సుకియ లమృతకలశమ్ములు సోఁగులుఁ జక్కెర[4]బుగడలుఁ గరిజులుఁ బొరివిళంగాయలుఁ దేమనంబులు బొంకాయలుఁ జక్కిలమ్ములు మినుపచక్కిలమ్ములు మినుపపోకలు మనోహరంబులు గారెలుబూరెలు మోరుండ లంగర్లాలు మణుఁగుబువ్వాలుం బేణీలు నీరువత్తిగెలు మడతలుఁ బప్పుబూరెలు సజ్జబూరెలు వడలోవడ

పా. 1. బులాడలందడబడ పా. 2. బొడులు పా. 3. జటికొటుకులు పా. 4. బురడ లుక్కెరలు

లొబ్బట్లు సారసత్తులు సేవలుఁ జిరిమిళ్లు సరడాలుఁ బరిడగవ్వలుఁ జాపట్లు నిడ్డెన తేనెతొనలు బొరుగులు నేలఁకికాయలు వెన్నమెఱుంగులు నిడికుడకలు సడకుడకలు ముత్తెపుఁజిప్పలుఁ జంద్రకాంతలు ఖరిజీకాయలు బెడదలు లడ్వాలుఁ గోడబళ్లు గూడుపరిగెలుఁ దేలుపరిగెలుఁ బూరీలు గూళ్ళాపిడ లాదిగాఁ గలభక్ష్యంబులు గూడలనించి జాతిసాతానులు గావళ్లంబూని వెంట నంటిరా నప్పుడు. 105

తే. గీ. తనకు నిలువేల్పు లౌ తల్లి♦దండ్రులకును, భక్తితో మ్రొక్కి తనప్రాణ♦పదమునైన
భార్యతోఁ దెల్ప నక్కనఁ ♦ బట్టిచేర్చి, నావధూటియు నధికదీ♦నాస్య యగుచు. 106

ఉ. ఓమగరాజ నీవు చన ♦ నొంటిగ నేనిట నుండనేర్తునే
నామది చూడఁగోరి యిటు ♦ నన్నలయించెద వంచు బాష్పధా
రామిళితాక్షి యై ఘనత♦రం బగుశోకముఁ జెంద విష్ణుదా
సామధురోష్ఠి నూరడిలు ♦ మంచు ముదంబునఁ గుస్తరింపఁగన్. 107

సీ. నీతావికెమ్మోవి ♦ నిలుచుఁ బో కంచివాల్గంటులమొనపంటి ♦ గంటి గుఱుతు
నీవాలుఁగన్నుల ♦ నెఱయుఁ బో నెల్లూరికొమ్మలకపురంపుఁ ♦ దమ్మరసము
నీచెక్కుల రహించుఁ ♦ బో చెన్నపట్నంపు వారిజేక్షణల క్రొ♦వ్వాడిగోరు
నీయురస్థలిమించుఁ ♦ బో యఖిలకుమా కోమలాంగులకుచ♦కుంకుమంబు

తే. గీ. లింటనె మెలంగువారల ♦ కీసుఖంబు, లెటులఁ జేకూరు నని పల్కి ♦ [1]హితముఁ జిల్కి
పోయి రమ్మని మోము మో♦మున ఘటించి, చుంబన మొనర్చిపనిచె న♦య్యంబుజాక్షి.
వ. అంత. 109

తే. గీ. మణిఖచితహేమపంజర♦మధ్యమమునఁ, బ్రేమ నాబాల్యముగఁ దాను ♦ బెంచినట్టి
హంసరాజంబుఁ గదియంగ ♦ నరిగి తనదు, పయన మెఱిఁగించి యింటిలో ♦ భద్రమనుచు.

కం. చెప్పంగఁ దగినమాటలు, సెప్పి మరాళంబు వనుపఁ ♦ జిత్తంబున సొం
పుప్పతిల నిల్లు వెలువడి, యప్పగిదిన్ విష్ణుదాసుఁ ♦ డరిగెడువేళన్. 111

తే. గీ. ఈడమువళందబందర ♦ యింగిలీషు, కళముమొదలైనపేటల ♦ గొరలెల్ల
సారభద్రవ్యములు బేర♦సార మాడఁ, బిలువ నంపిరి తమతమ ♦ పేటలకును. 112

చ. అటువలె విష్ణుదాసుఁడు హి♦తావళి గొల్వఁగ నోడబేర మం
దుటకుఁ జనంగ హేమవతి ♦ తోడనె శంబరవైరి శాతవి
స్ఫుటచటులోగ్రపంకరుహ♦సూననవీనశరవ్రజంబు హృ
త్పుటమున గాఁడనేయ నృప♦పుంగవుఁ జేరఁగఁ గోరి యున్నెడన్. 113

---

పా. 1. హితముగుల్కి.

చ. విలసితమోహదాహపరి♦వేదన పొమ్మనియెత్తిపెట్టఁగా
వలపులవింటివాఁడు నెఱ♦వాదితనంబునఁ ద్రోవఁజూపఁగా
నలమినభీతి లజ్జ వల♦దం చరికట్టఁగ నింతి నంతలో
జలజహితుండు గ్రుంకె నల ♦ చావవెత ల్గనలేనికైవడిన్. 114

వ. అయ్యవసరంబున. 115

తే. గీ. తరణితురగఖురోద్ధూత♦చరమశైల, గైరికస్థలపాంసువుల్ ♦ గప్పె ననఁగఁ
బశ్చిమంబునఁ గుంకుమ♦పంకమటుల, 1సాంధ్యరాగంబు మించె ని♦స్తంద్ర మగుచు. 116

ఉ. కాలకళాదమాళి 2దిన♦కాంతిహసంతికలోన యామినీ
బాలకు సొమ్ము సేయుటకు ♦ భాస్కరుఁడర్క కనకంబు గ్రాఁచి క
ల్లోలవతీవరాంతరము♦లో నిడఁ ద్రోఁచిన ధూమమర్కదమో
జాలము పర్వె నా రవల♦చాడ్పునఁ దారలు వొల్చె నెంతయున్. 117

కం. అప్పుడు హేమావతి తమి, ముప్పిరిగొన చిత్రభోగ ♦ భూపాలునితో
నప్పుష్పబాణకదనము, చొప్పడ నొనరించువాంఛ ♦ సొరఁ దమకమునన్. 118

చ. పరఁగెడు3వస్తుకొట్టడులు ♦ భద్రముగా నొగి బీగముద్రలున్
గరిమ నొనర్చి తొత్తులకు ♦ గ్రాస మొసంగి నికాయ్యకృత్యముల్
దరలిచి యత్తమామలప♦దంబుల నొత్తుచు నిద్రపుచ్చి మై
మెఱుపుగ శీతలాంబువుల ♦ మిన్నగ మజ్జన మాడి వేడుకన్. 119

సీ. మెఱుఁగుఁగుచ్చెలమీఁద ♦ జరతాబు పనిమీఱు చెంగావిరంగారు ♦ చీరఁ గట్టి
4గుజరాతి జిగిసిస్తు ♦ గోట్లుదాఁపినడాలు రహిమించు పైఠిణీ♦రవికఁ దొడిగి
ఘుమ్ముఘుమ్మనితావి♦గ్రమ్ముచొకాటంపుఁ గలపంబు సొగసుగాఁ ♦ గలయ నలఁది
తళ్కుతళ్కునఁ గాంతి ♦ గుల్కుఁజిల్కెడు జాతి మణిభూషణంబులు ♦ మనుతఁదాల్చి

తే. గీ. తిలక మొగిఁ దీర్చి మితభుక్తి ♦ సలిపి వెంట, బూమె లెఱుఁగని యొకపాటి♦బుడుత యాకు
మడుపు లందీయ మోహంబు ♦ మరులు గొల్ప, వెడలె నలభామ నిజకేళి♦వేశ్మసీమ. 120

వ. అటుల వెలువడి. 121

## మొదటిరాత్రికథ.

తే. గీ. తనదుప్రాణంబు దైవంబు ♦ తల్లిదండ్రి, యనుఁగు చెలి యైనయలరాజ♦హంస మున్న
దివ్యనవరత్నఖచితదే♦దీప్యమాన, కనకపంజర మొక్కింత ♦ గదిసి నిలిచె. 122

---

పా. 1. సాంద్రరాగంబు పా. 2. దినకాంత పా. 3. రస్తుకొట్టడులు
పా. 4. గుజరాతి పనిసిస్తు♦గొట్లుదాఁపిన

చ. నిలిచి దరస్మితం[1]బయిన ♦ నెమ్మొగ మించుక వంచి యాత్మఁ దాఁ
దలఁచినకార్యమెల్లఁ బ్రియ♦దంబునఁ దిన్ననికల్కి పల్కులం
దెలిపిన రాజహంస సుద♦తీమణిఁ గన్గొని పక్షయుగ్మముం
దలఁ గదిలించి యంచుకు మ♦నంబునఁ జింతిలి యప్పు డిట్లనున్. 123

ఉ. ఆక్కట భర్త కాఁపురము ♦ నాఱడి పుచ్చి నృపాలమౌళితోఁ
జొక్కి రమించునందులకుఁ ♦ జొచ్చినఁ దావకబంధువర్గముల్
దక్కువ చేతురమ్మ చరి♦తవ్రతముల్ చెఱునమ్మ [2]జాతికిం
బక్కన నిందఁ జెంది తల♦వంపులు దెత్తురఁటమ్మ మానినీ. 124

సీ. అత్తమామలు గన్న ♦ నారడిపుత్తురు బావ పరీక్షింప ♦ నేవగించు
మఱఁదులు గాంచిన ♦ గఱకఱిసెంతురు వదినె లెఱింగిన ♦ వాసి చెడును
బంధువుల్ గనినచోఁ ♦ బరఁగ నిందింతురు తోడికోడలు చూడ ♦ నాడికొనును
బతి గనుఁగొన్నచోఁ ♦ బ్రాణహాని యొనర్చు వాడవా రెఱిఁగిన ♦ వన్నె దఱుగు
తే. గీ. నరయ నిడిగాక యన్నిట ♦ నాఁడుపుట్టు, పుట్టఁబాపంబు పుట్టినఁ ♦ బుట్టినింటి
కేని మఱి చొచ్చినింటికిఁ ♦ గీర్తిఘనత, దేక యపకీర్తి దెత్తురే ♦ తెఱవ లెచట. 125

కం. అగుఁ బ్రాణహాని యపసిరి, యగణిత మగుమానభంగ ♦ మహహా తెలిసెన్
దెగువయె యింద్రపదవి యనఁ, దగు బుద్ధి జనింపఁబోలుఁ ♦ దరుణీ నీకున్. 126

సీ. పంక్తికంఠునిమోహ♦పరితాప మెంచెనే భువనమాత జగత్ప్ర♦పూత సీత
యలపుళిందుని [3]బొంద ♦ నాసక్తిఁ జెందెనే ప్రియహితామితనయ ♦ భీమతనయ
నహుషునివిరహంపుఁ ♦ దహతహ ల్బాచెనే సాంద్రసద్గుణచర్య ♦ యింద్రుభార్య
మఱిసింహబలునిపె♦న్మాయలఁ జిక్కెనే యారడిపనిఁ బూని ♦ యాజ్ఞసేని
తే. గీ. మునుపటి పతివ్రతలు మహా♦మూర్ఖచిత్తు, లైనదుర్జను లతిఘోర♦సూనసాయ
కాస్త్రజర్జరితాంగులై ♦ యాసపడిన, మాన ముడివుచ్చుకొనిరఁటే ♦ మచ్చకంటి. 127

చ. పతిహితభక్తిచే వెలయు ♦ పద్మదళప్రతిమాననేత్రికిన్
వ్రతములసోదు లేటికి ధ్రు♦వంబుగఁ బుణ్యము లబ్బు నెప్పుడుం
బతిని దిరస్కరించి పర♦భర్తలఁ జెందినభామ పుణ్యము
ల్గతజలసేతుబంధములు ♦ గావె వచింపఁగ నెంతనోచినన్. 12

కం. లలిజాగ్రత్స్వప్నసుషు, ప్తులను మనోవాక్శరీర♦ములచే నేవే
ళలనైన సతులు పరపురు, షులఁగోరిన వన్నెలేదు ♦ చూవె ధరిత్రిన్ 12

---

పా. 1. బెగయ పా. 2. జాతిలో పా. 3. పొందు ♦ కాసక్తి

కం. పతిసేవయె భూషణములు, పతిసేవయె జీవనంబు ♦ భామామణికిం
బతిసేవయె సువ్రతములు, పతిసేవయె యిహముఁ బరము ♦ భాగ్యములనుచున్. 130

కం. ఈరీతి హంసపలికిన, నారీమణిచెవుల నవియె ♦ నారాచములై
దూఱి చుఱుక్కన నాఁటినఁ, గ్రూరకటాక్షములఁ గీటు♦కొని తనుజూడన్. 131

వ. అత్తెఱవచిత్తం బెఱింగి మరాళం బక్కటా యిత్తరుణి [1]దుష్కర్మాయత్త చిత్తవృత్తి యయ్యె నిట్లగుట మదీరితసునీతివాక్యంబులు దీనికిం బరుషంబులై తోఁచుచున్నవి. సముదమదనప్రదర వేదనాదోదూయమానం బైన దీనిమానసంబు సామంబునఁగాని చక్కంబడదని కొంతదడ వంతరంగంబునఁ జింతించి వెండియు నారాజహంసంబు హంసగమన కిట్లనియె. 132

తే. గీ. మానవతి నీవు పరసంగ♦మమున కాస, పడఁ దలంచితివేనిఁ జే♦పట్టు కొంచె
మైనచక్కనియొకయంద♦గానితోడఁ, గూడియాడక రాజులఁ ♦ గోరఁదగునె. 133

మ. అధిపు ల్వ్యాఘ్రఫణిస్వరూపు లధరం ♦ బాసించు టేరీతి భూ
మిధవు ల్కాలకరాళకీలిసదృశు ♦ ల్మేన్మేనఁ బొందించు టె
ట్ల ధరాధీశులు మత్తదంతిసము [2]లే♦లా నీకుఁ జెల్లాటమా
డ ధరాభృత్కుచ యిత్తెఱం గెఱిఁగి వే♦డ్కం గోర్కు లీడేర్చుకో. 134

కం. ఇలఁబతుల చిత్తవృత్తులు, గలయికలం దెలిసి మెలఁగు ♦ కాంతల కెలమిం
జెలు వొనరు జయము చేకురు, నలఘుశ్రీసౌఖ్య మబ్బు ♦ నంబుజగంధీ! 135

వ. అట్లు గావున నిత్తెఱంగునఁ దత్తరంబులేక నృపవరోత్తముల చిత్తవృత్తిం దెలిసి హత్తుకొని వర్తిల్లు మని హంసంబు ప్రత్యుత్తరం బిచ్చు నవసరంబున. 136

సీ. పిసవెట్టి కసరెత్తి ♦ యసరేఁగు నసగూఁటి పూఁబోండ్లుశమ[3]యుండ్ల♦పొంత కరుగఁ
బరుసొమ్ములకు నిమ్మ ♦ వడఁగ్రమ్మ నెఱహమ్మ దస్కరుల్ దిగులొంది ♦ తావుఁ జేరఁ
దనరారు సిరిసౌరు ♦ తనివారఁ గలవారు కనుగూర్కుమదిఁ గోరి ♦ కన్ను మూయ
రతిరూపు పసమాపు ♦ [4]గతిచూపు గల కాఁపు గుబ్బెత లెసటికై ♦ కుండ లరయ

తే. గీ. దూరదేశసమాగత♦ధూర్త పాంథ, జనసమూహంబు పయనంబు ♦ సాఁగ [5]లేవ
ఱెక్క లలరించి కుత్తుక ♦ ల్నిక్కి మించి, కొక్కరోకోయటంచును ♦ గోళ్లుగూసె. 137

కం. తెలతెల నయ్యెను దిక్కులు, పలపల నుడుగణము మాయఁ ♦ బాఱెను బక్షుల్
కలకలనఁ గూయఁ జొచ్చెను, దులదులఁ దుమ్మెదలు దమ్మి♦తుటుముల వెడలెన్. 138

తే. గీ. అపుడు హేమావతీకన్య ♦ హంసనుడువు, నీతిచాతురి వినురీతి ♦ నేర్పు మాని
పడకయిలు సేరి కళవళ♦పడుచు నిమిష, మొక్కయేఁడుగఁ బవలెల్ల ♦ నొనరఁగడపె. 139

---

పా. 1. దుష్కర్మాయత్తతం బరాయత్తచిత్తవృత్తి  పా. 2. లే♦లా గాను  పా. 3. యుండ్లపొక్క
పా. 4. గతిచూపఁగల  పా. 5. వేడ్క.

కం. ఉదయోపరి రవిసింహము, మది మీఱఁగ నస్తశైల • మత్తద్విపముం
బొదువ గమకించి దుమికిన, యదనున దినకరుఁడు 1పశ్చి • మాశకుఁ జేరెన్. 140

తే. గీ. రసికుఁ డైనట్టికాలంపు • రక్తవాను, తనర బ్రహ్మాండ మను పెద్ద • దవతిలోన
శాయి నిండారఁ బోసిన • 2చందమునను, గారుతిమిరంపుగుంపు నిం • డారఁ బర్వె. 141

చ. అనువున మిన్ననుం గడిత • పాళెతమంబునఁ గట్టిపెట్టి శో
భనతరచంద్రదీధితుల • పంక్తి జమాఖరుచు ల్గణించి యిం
తనుకొని కాలమర్త్య గణకుఁ • డప్పుడు తీర్చి లిఖించినట్టి యా
దినవహితెఖ్ఖవ్రాలనఁగఁ • దెల్విగఁ జుక్కలు పర్వెనత్తఱిన్. 142

చ. జలకము లాడి చీనిబురు • సావనివస్త్రము గట్టి మోమునన్
దిలకముఁ దీర్చి క్రొవ్విరులు • నించి కచాళిని గబ్బిగుబ్బలం
గలప మలంది గందవడి • గమ్మనఁ బూసి నృపాలు నింటికిం
జెలియ చనం దలంచె రతి • శిక్షకు రెండవనాటిమాపునన్. 143

తే. గీ. పోవుచో నమ్మరాళంబు • పొంత నిల్వఁ, జెలియ పూనిన జిగినీటు • కులుకుఁ జూచి
రాజహంసంబు వలికె నో • రాజవదన, పోయెదవుగాని యుపమతోఁ • బొసఁగి మనుము. 144

కం. ఉపమ యెఱుంగనివారల, కపరిమితావస్థ లొందు • నది యెట్లన న
య్యుపమ యెఱుంగక కాదే, చపలత మున్నొక్కనక్క • సమసెం బెలుచన్. 145

వ. అనిన విని హేమావతి యిట్లనియె. 146

రెండవ రాత్రి కథ.

కం. ఆకథ వినియెద నుడువు సు, ధాకరకలు రాలఁ దేనె • ధారలు చిలుకన్
లోకేశతురంగమ యన, నాకలికికి రాజహంస • మపు డిట్లనియెన్. 147

కం. వినవమ్మా హేమావతి, కనవమ్మా స్థూలసూక్ష్మ • కార్యములు దగన్
మనవమ్మా నన్నొచ,క్కనికొమ్మా మెచ్చుకొమ్మ • కథ విని పొమ్మా. 148

కం. విభ్రమమణిమండన మన, నభ్రంకషసౌధకేత • నాంశుకజనితా
దభ్రానిలహతగతిజా, తాభ్రమణిహయశ్రమోద • మప్పుర మమరున్. 149

కం ఆపురవరమణిలో గుణ, దీపకనామమున భూమి • దేవుం డలరుం
జూపట్టు వేదశాస్త్ర, వ్యాపారముచేత రెండ • వవిధాత యనన్. 150

సీ. అరఁగులుసున్నంపు • టెఱుమంటివట్టెలు దీర్చినగోడలు • తేజరిల్ల
నిండుసున్నపుఁబూఁత • నెఱచాదు బోదెలు దిద్దినదేవర • మిద్దె దనర

పా. 1. పశ్చిమాశనుజేరెన్ పా. 2. చందమనఁగఁ

నారికేళపుమట్ట • తీరుగా నలికిన ముంగిలి¹మలసాలె • ముద్దుగులుకఁ
బంచవన్నియముగ్గు • పద్మముల్ దీర్చిన బృందావనము లోఁగి • లందు వెలయ
తే. గీ. ²నుదికివేసిన దోవతు • లుంచినట్టి, దండె మాపాసనము సేయు • కుండ మమరఁ
బడలిక లడంచు పసపాకు • పంది రలర, నుండు నా బ్రాహ్మణునిగృహం • బుత్పలాక్షి. 151

చ. అతనికిఁ జారుశీల యను • నంబుజగంధసుగంధి యొప్పఁ ద
త్సతి తనయుండు లేమిఁ బరి • తాపముతోఁ గడుపుణ్యభూము లా
యతమతిఁ ద్రొక్కఁ బూర్వసుకృ • తాంశముచే నొకఁ డుద్భవించె నం
తత శుభధాముఁ డప్రతిమ • ధాముఁడుగా సుగుణాభిరాముఁడై. 152

వ. అంత గర్భాధాన పుంసవన సీమంత జాతకర్మ నామకరణాన్నప్రాశనచౌలోపనయన వివాహ ప్రాజాపత్య సౌమ్యాగ్నేయ వైశ్వదేవ గోదాన స్నాతక పితృమేధంబులను షోడశకర్మంబు లెఱుంగం జేసి. 153

తే. గీ. వానితలిదండ్రు లత్యంత • వత్సలతను, బూఁటపూఁటకు గోము పెం • పొసఁగఁ బెంచి
ప్రాభవం బొప్ప నసమాన • వైభవమున, ఘనతషోడశకర్మాధి • కారిఁ జేయ. 154

వ. అంత నత్యంతకుశలస్వాంతంబున నవ్వటుశిఖామణి వేదవేదాంగాది బ్రహ్మవిద్యాభ్యాసానంతరంబున, గానంబును గవిత్వంబును గౌతుకంబును జూదంబును దేశభాషల విజ్ఞానంబును లిపిలేఖనంబును జరాచరాన్యథాకరణంబును విలువిద్యయును సర్పశాస్త్రపరిజ్ఞానంబును శాకునంబును సాముద్రికంబును రత్నపరీక్షయు నరథంబుఁ బటుపుటయుఁ దురగారోహణంబును మల్లశాస్త్రంబును బాకచమత్కారంబును దోహదప్రకారంబును ధాతుగంధరసవాదంబులును గుట్టుపన్నులవినోదంబును మహేంద్రజాలంబును జలాగ్నిస్తంభనంబులును మొనకట్టును వాకట్టును వయస్స్తంభనంబును వశ్యాకర్షణమోహనంబులును విద్వేషణోచ్చాటనసంహరణంబులును గాలవంచనంబును బక్షిగతిభేదంబులును యోగవాదంబులును వచనసిద్ధులును ఘుటికాసిద్ధులును నింద్రజాలంబును నంజనభేదంబులును ధ్వనివిశేషజ్ఞానంబును వంచనంబును స్వరవంచనంబును మణిమంత్రక్రియలును జోరత్వంబును జిత్రరుపవ్రాయుటయు లోహకారకత్వంబును శిలాభేదకర్మంబును గులాలకర్మంబును రథకారకర్మంబును శూర్పకారకర్మంబును జోళ్లునిర్మించుటయుఁ బటకారకర్మంబును నదృశ్యకరణియు దార్త్యకర్మంబును వేఁటసన్నాహంబును బేరంబును బాశుపాల్యంబును గృషియు మైరేయంబుఁ గూర్చువగయు లావుక కూర్మ కుక్కుట మేషాదులపోరు హత్తించుటయు నని మొదు చౌషష్టి విద్యల మర్మంబు లెఱింగి యొప్పుచుండు. 155

కం. ఈరీతి సకలవిద్యల, సారూఢిగ నారి తేరి • యవ్వటుఁడు సదా
చారస్థితి గంగాయా, తారంభవిజృంభమాణ • హార్షోదయుఁడై. 156

పా. 1. మలెసాల పా. 2. నుదికిన మడుఁగుదోవతు

సీ. సకలాతికుళ్లాయి ♦ యొకయింత గాన్పింపఁ జుట్టియుండినపంచె ♦ సొంపు దనరఁ
బడిఁడుబియ్యము వండఁ ♦ బ్రాఁకైనతపెల యుంచిన చిన్నియసిమి దో ♦ స్సిసువ్రేల
ముంజిపైఁ గనుపట్ట ♦ ముద్దుగాఁ గట్టిన యంగవస్త్రపుగుడ్డ ♦ చెంగు లలర
మాంజిష్ఠిగలిపిన ♦ మంత్రాక్షతంబులు పోసినమూరెడు ♦ బుట్ట 1యమర
తే. గీ. ధౌతశాటియుఁ బరిపాటి ♦ ధావళియును, వఱల వేదాంతశాస్త్రంబు ♦ వ్రాసినట్టి
తాళదళపుస్తకము చంకఁ ♦ దనరఁ బూని, చనియె గడిదేరి యాబ్రహ్మ ♦ చారి మీఱి. 157

కం. ఈలీల సకలపురములు శైలంబులు నదులు నిధులు. ♦ శాఖిచయంబుల్
గాలువలుఁ బల్లె 2పట్టము, లాలోకింపుచును బోయి ♦ యవ్వలు వెదుటన్. 158

సీ. ప్రాలేయశైలాధి ♦ పాలక సంజాత కర్పూరధౌతలో ♦ కప్రపూత
జలధినాయకుఁ డేలు ♦ సరసంపుటిల్లాలు బటుభగీరథతపః ♦ ఫలముప్రోలు
తారాధ్వఘట్టనో ♦ ద్ధతవేగకల్లోల యఘమహారణ్యదా ♦ వాగ్నికీల
చంద్రశేఖరశిర ♦ స్థలశుభ్ర3సుమదామ చందనకుందేదు ♦ సదృశధామ
తే. గీ. రంగదుత్తుంగదీర్ఘత ♦ రంగసంగ, ఘుమఘుమధ్వానమేఘని ♦ ర్ఘోషనృత్య
దహిభుగుద్వేలపాలాంశు ♦ యామునోర్మి, సంగతభ్రాంతిదాభంగ ♦ గంగఁ గనియె. 159

మ. కని యభ్యంచితదివ్యతీర్థములలోఁ ♦ గౌతూహలం బొప్పఁగా
ఘననిష్ఠారతి మీఱ భైరవున క ♦ ర్ఘ్యం బిచ్చి సంకల్పముల్
వినతుల్ స్నాన మొనర్చి తత్తటమహా ♦ ర్హావాసవిద్యాతివృ
ద్ధనికాయంబులు దెల్ప జాహ్నవిమహా ♦ త్త్వంబుల్ వినెఁ భక్తితోన్. 160

వ. అంత నాబ్రాహ్మణకుమారుండును దత్తీరవాసులకు నిజార్జితద్రవ్యంబులు వ్యయంబు చేసి గోభూతిలహిరణ్యాజ్యవాసోధాన్యగుడరౌప్యలవణంబు లనుదశదానంబులను దులాపురుష హిరణ్యగర్భ బ్రహ్మాండకల్పవృక్ష సహస్రధేను హిరణ్యకామధేను హిరణ్యాశ్వ హిరణ్యరథ హేమహస్తి హేమలాంగూల పంచలాంగూల విశ్వచక్ర కల్పలతా సప్తసాగర రత్నధేనుభూత పంఘట్టనంబులను షోడశమహాదానంబులు చేసి కాశికాపురంబున కరిగె నప్పుడు.

సీ. చిత్రకూటసమాన ♦ చిత్రకూటవిమానభాసురంబు విశిష్ట ♦ భూసురంబు
వైజయంతవితాన ♦ వైజయంతవితానభూషణంబు నృపాల ♦ భీషణంబు
భాసమానశశిప్ర ♦ భాసమానక్షౌమసుందరంబు కిరాట ♦ మందిరంబు
సుమనస్తుతోద్దామ ♦ సుమనస్తుతారామబంధురం బురు శూద్ర ♦ సింధురంబు
తే. గీ. సతతబహువైభవానదృ ♦ శప్రభావ, కీర్తిరాజితకుండలీ ♦ కృతసుధీర
వజ్రమణిదీప్రవప్రాంశు ♦ వలయవలిత, గోపురంబై రహించుఁ గా ♦ శీపురంబు. 162

పా. 1. యొప్ప పా. 2. పడుసర పా. 3. కౌముది

ఉ. ఆవుటభేదనేంద్ర దృష♦దావళికల్పితగోపురాళిపై
నేపున మాపు రేపుఁ జను ♦ నిందుదినేంద్రులపర్వతద్యుతు
ల్బాపురె వీరికిన్ గ్రహణ♦బాధయ పర్వములందు నేక్రియన్
బ్రాపిత మయ్యె నంచు మది ♦ భ్రాంతి వహింతురు తాంత్రికోత్తముల్. 163

తే. గీ. అట్టిపుణ్యస్థలంబున ♦ కరిగి వేడ్క, గడలుకొన మణికర్ణికా♦ఘట్టమునను
నిలిచి జలకచ్ఛమున స్నాన♦నిష్ఠఁ బూని, వెడలి మాధ్యాహ్నికక్రియ ♦ ల్వేగ దీర్చి. 164

కం. మణికర్ణిక మణికర్ణిక, మణికర్ణిక యనుచు నుడువు ♦ మనుజులకెల్లన్
గణనాతీతపుహోమము, లణఁగి శతక్రతుఫలంబు ♦ లగునని తలఁచెన్. 165

వ. అంతట నవ్వటుశిఖామణి నమకచమకంబుల రుద్రన్యాసయుక్తంబుగా విశ్వేశ్వరు నభిషిక్తుంజేసి పూజించి ప్రదక్షిణనమస్కారంబులు గావించి యిట్లని స్తుతియించె. 166

సీ. జయభక్తమందార ♦ జయదుష్టజనదూర జయజగదాధార ♦ శరణుశరణు
జయనిత్యకల్యాణ ♦ జయభృత్యసంత్రాణ జయరమాధిపబాణ ♦ శరణుశరణు
జయగోత్రపుత్రీశ ♦ జయరక్షితసురేశ జయపంచశరనాశ ♦ శరణుశరణు
జయశరద్ఘనగాత్ర ♦ జయపావనచరిత్ర జయకేందుశిఖినేత్ర ♦ శరణుశరణు

తే. గీ. జయనిశితశూలసాధన ♦ శరణుశరణు, జయమహాఘోరాఘనాశన ♦ శరణుశరణు
జయహుంకృతనందీశ ♦ శరణుశరణు, జయమహాదేవవిశ్వేశ ♦ శరణుశరణు. 167




సీ. శ్రీపార్వతీకుచ♦శిఖరిస్థలవిహార హారాయమాణమ♦హాభుజంగ
జంగమస్థావర♦సంచారసమభావ భావజరూపప్ర♦భావహరణ
రణరంగనిర్జిత♦రౌద్రమహాసుర సురయక్షసేవిత♦చరణయుగళ
గళవరస్థాపిత ♦ కాలకూటక్షీర క్షీరాబ్ధిపుత్రీశ ♦ ఘోరబాణ

తే. గీ. బాణరాక్షసనాయక ♦ త్రాణదక్ష, దక్షకల్పిత యాగవి♦దారణోగ్ర
యుగ్రభీమాదినామధే♦యోత్ప్రసిద్ధ, సిద్ధభయభంగ కాశివి♦శ్వేశలింగ. 168

కం. అని సన్నుతించి వేడ్కలు, గొన లొత్తఁగ బ్రహ్మచారి♦కుంజరుఁడు గ్రామం
బున దేవతాధివాసము, లనువొందఁగఁ గాంచి భక్తి ♦ నలమినమదితోన్. 169

కం. ఢుంఢిగణాధ్యక్షుని శితి, కంఠుని భైరవునిఁ జండి♦కం బటువిద్వ
త్కంఠీరవ ముపుడు మహా, కుంఠితతాత్పర్యములను ♦ గొలిచి భజించెన్. 170

వ. తదవసరంబునఁ బంచక్రోశంబునం గల మహాదివ్యలింగంబుల సేవించి యచ్చోటు వాసి తైర్థికజనహితసమ్యగ్గయ యగుగయకుఁ జని గదాధరుంగొనియాడి ప్రయాగకరిగి త్రివేణీ సంగమంబునం గృతస్నానదానాద్యనుష్ఠానుండై మాధవునారాధించి సప్తపర్ణవటంబుంగనుంగొని

త్రివేణీతీర్థంబులు నించినకావడి గైకొని పంచక్రోశంబున నొక్కమరకతలింగంబు సంగ్రహించి నిజస్థానగమనోన్ముఖుండై. 171

సీ. కావడిపై నంటఁ◆గట్టిన యొకకావి శాటి కంబలి యాత్ర◆సంచి యలర
నేతిలడ్డిగ నీళ్లు ◆ నించినసొరకాయ బుఱ్ఱ లిర్వంకలఁ ◆ బొసఁగియుండ
నెగనెత్తి కుఱుచగా ◆ బిగియఁ గట్టినపంచె పై బిగించిన పాఁత ◆ బట్ట యొప్ప
ముఖఘర్మములటోపి ◆ మునుఁగఁ జుట్టినవస్త్ర కొనలు మరుల్గొల్య◆మున హరింప

తే. గీ. గమనజవమున నఱ్ఱాడు ◆ కావ డదరి, కిఱ్ఱుకిఱ్ఱని భుజమునఁ ◆ గేళిసల్ప
గాడరుద్రాక్షమాలిక ◆ లక్కంఠసీమఁ, దనరవచ్చెను వేడ్క న◆త్తైర్థికుండు. 172

కం. ఈరీతిఁ దనగృహంబున, కారయఁ జనుదెంచి కావ ◆ డటుడించి మహా
ధీరుఁడు జననీజనకుల, కారూఢిగ సంఘటించె ◆ సాష్టాంగంబుల్. 173

కం. తత్సమయంబున వారలు, వత్సా మఱి యాత్రసలిపి ◆ వచ్చితె యని యు
ద్యత్సంతోషంబునఁ దమ, వత్సస్థలిఁ జేర్చి ప్రేమ ◆ వర్ధిలి చెలఁగన్. 174

తే. గీ. శిరము మూర్కొని వదనంబు ◆ చెమటఁదుడిచి, యాయురారోగ్యపుత్రపౌ◆త్రాభివృద్ధి
గాను దీవించి యత్యంత◆కరుణ మెఱయఁ, గొడుకుతోడుత నిట్లని ◆ నుడివి రపుడు. 175

కం. ఏయేపుణ్యస్థానము, లేయేతీర్థస్థలంబు ◆ లేయేద్వీపా
లేయేభూములు సూచితి, వాయామహిమలు వచింపు ◆ మర్భక మాకున్. 176

కం. అని యడిగిన తలిదండ్రుల, కనునయమునఁ గాశి గయ ప్ర◆యాగలు మొదలా
ఘనపుణ్యక్షేత్రంబులు, గని తెచ్చితి లింగ మిదిగొ ◆ కౌతుక మమరన్. 177

కం. ఈపురవరమణిచెంగట, నీపరమేశ్వరుఁ బ్రతిష్ఠ ◆ నెంతయుఁ జేయన్
దాపురము మోక్షలక్ష్మికిఁ, గాఁపుర మభివృద్ధిఁ బొందు◆గద మన కనియెన్. 178

తే. గీ. పుత్రకునివాక్యవిస్ఫుర◆ద్బోధమునకుఁ, దల్లిదండ్రులు సంతోష ◆ ముల్లసిల్ల
నపుడు పాషాణభేదుల ◆ కర్థమిచ్చి, శివి నొకదేవళంబు గ◆ట్టించి రపుడు. 179

సీ. డంబైన గర్భగృ◆హం బంతరాళికంబును 1ముఖమంటపం◆బును జెలంగ
గాలిమంటపము ప్రా◆కారంబు 2లోలీలు బోదెలు చుట్టలు ◆ పొందుపడఁగఁ
గప్పటచట్టము◆ ల్ఘనగోపురంబులు జగతియుఁ జప్పట ◆ ల్సొగసుగులుక
గచ్చుగోడలు జాతి◆కంబము ల్పాలసున్నము సువర్ణద్వార◆సమితి వెలయ

తే. గీ. దృష్టిపాత్రపుబొమ్మలు ◆ దేజరిల్ల, నుఱుకుసింగంబు లరగూళ్లు ◆ మెఱుఁగుఁదోర
ణములు చిత్రవ్రాక్రొంబనుల్ ◆ రమణకెక్క, దేవళము మించె నత్యంత◆దివ్య మగుచు. 180

పా. 1. సుగనాసికం◆బును పా. 2. లోవలు.

కం. ఆదేవళంబులోన మహాదేవుని నొక్కదివ్య ♦ మగు శుభవేళం
బాదుగఁ బ్రతిష్ఠ చేసిరి, వేదాగమశాస్త్రరీతి ♦ వేడ్కదలిర్పన్. 181

సీ. చెఱఁగు1దోవతిపైనిఁ ♦ జేరాడఁగా బోడి తలచుట్టు ధౌతవ ♦ స్త్రంబు మెఱయఁ
జెక్కులకును డిగ్గి ♦ పిక్కటిల్లు విభూతి పెండెకట్లు లలాట ♦ భిత్తి నమర
గళమున నులిగొన్న ♦ కావిదారముతోడి రుద్రాక్షమాలికల్ ♦ రూఢిఁ దనర
మారేడుబుఱ్ఱలో ♦ మక్కళించుక సందిఁ గట్టిన చంద్రశే ♦ ఖరుఁడు వెలయఁ

తే. గీ. బెట్టె మూఁకుడులో మొగ ♦ బీరపత్రి, పెట్టి ధూపార్తి దీపముఁ ♦ బెట్టు చమురుఁ
బొందుపఱచుక మునిమాపు ♦ పూజసేయఁ, గ్రొత్తకాణాచితంబళి ♦ హత్తుకొనియె. 182

కం. ఈతీరున నలతంబళి, భూతేశునిపూజసేయఁ ♦ బుష్పంబుల సం
ఘాతము గొని తేలే మని, యాతట్టున నొక్కతోఁట ♦ నమరఁగఁ జేసెన్. 183

సీ. సంపెగల్ మొల్లలు ♦ జాజులు గన్నేర్లు విరజాజులును మంచి ♦ కురువకములు
ప్రొద్దుదిరుగుడుపూలు ♦ పొన్నలు మల్లెలు పారిజాతములు సే ♦ వంతి విరులు
తామర లుస్సర్యకాం ♦ తమ్ములు కల్వలు బొండుమల్లెలపొద ♦ ల్పొగడతరువు
లల్లిపువ్వులును నం ♦ ద్యావర్తములు వాడగన్నేరులు తురాయి ♦ కట్టుపూలు

తే. గీ. మాచిపత్త్రి రి గగ్గెర ♦ మరువము కురు,వేరు దవనమ్ములును వట్టి ♦ వేళ్ల గుములు
బిల్వవృక్షములాదిగాఁ ♦ బేర్లుగలవి, ప్రబల నొకతోఁట వేయించి ♦ బావిద్రవ్వె. 184

మ. అమితానర్ఘ్యనిబద్ధశుద్ధశశికాం ♦ తాయామసోపానసం
గమ మంబుగ్రహణాగతోరుపథికా ♦ క్రాంతస్ఫురత్కుట్టిమం
బమలాంభోరుహషండపాండుకుముదా ♦ చ్ఛామోద2సంవాసితం
బమృతప్రాయజలాభిపూర్ణ మగుచు ♦ న్నా బావి యొప్పెంగడున్. 185

కం. అబ్బావికిఁ జేయేతం, బుబ్బుచుఁ దంబళి యొనర్చి ♦ యుత్సాహంబున్
గుబ్బతిలఁ గొన్నిచెట్లకు, నిబ్బరమున జలములెత్తి ♦ నిస్త్రాణుండై. 186

తే. గీ. ఎలమినొకకొన్ని చెట్టుల ♦ కెత్తియెత్తి, యలసి ముంగిసమ్రానుదో ♦ నానియుండ
గుండ నిండారఁగా ముంచి ♦ కూడుదినఁగ, నింటి కేగెను బడలిక ♦ లంటి పెనఁగ. 187

వ. అంత నొక్కబక్కనక్క గుక్కుమిక్కనుచు డొక్కంబిక్కటిల్లిన క్షుధానలంబున దందహ్యమానంబై డస్సి. 188

తే. గీ. పుట్టలను దిట్టలను జెట్లఁ ♦ బొట్లఁ గట్ల, వంకలను డొంకలను బీళ్లఁ ♦ బాళ్ల ఊళ్ల
గుప్పలను దిప్పలను మళ్ల ♦ గుళ్ల నూళ్లఁ, దిరిగి యాహారమందక ♦ సొరిగి యరిగి. 189

పా. 1. దోయవటుపై   పా. 2. సంకాశితం

సీ. వాణికై పోరాడ ♦ వచ్చి యెందఱు బ్రహ్మదేవుల మనువారు ♦ దీరి చనిరి
పార్వతీరతులకై ♦ బహుపోరి యెందఱు రుద్రుల మనువారు ♦ రోసి చనిరి
సిరినిఁ జేపట్టఁగాఁ ♦ జేరి యెన్ని దశావతారము ల్గలహించి ♦ తీరిపోయె
శచిమారుమనువు రంభ్చలఁ బెట్టి యెందఱే నిందుర్లమనువార ♦ లేగిరహహ
తే. గీ. చూడనవి యెల్ల యుగచర్య ♦ సుద్దులయ్యెఁ, బోయెఁ గాలంబు పూర్వవిస్ఫురణదప్పె
దార్ఢ్య మాలోచనము తెల్వి ♦ దగ్గుపడియె, నౌరవిధి నేటి కిట్లాయె ♦ ననుచు నడరి. 190
తే. గీ. ప్రాణముజఠరాగ్నిచేఁ గింక♦రోమి యనుచు, నడరువేదనచేఁ గ్వయాం♦స్వామి యనుచు
విస్మయపుమూర్ఛచే హాహ♦తోస్మి యనుచుఁ, బలువరింపంగ సాగె న♦బ్బక్కనక్క. 191

వ. ఇట్లు క్షుధాతురత్వంబునఁ గంఠగతప్రాణంబై నోరం దడిలేక మాటిమాటికిఁ బొడము మూర్ఛల నలసి సొలయుచు మెత్తమెత్తగావచ్చి తత్కూపతటస్థిత ద్రోణికాగ్రంబున నున్న యల్పజలంబులం గంఠంబు దడిపికొని యయ్యోతంబుముంగిసమ్రానికి వెదురునకు నంటఁ గట్టిన వారు పరిమళం బాఘ్రాణించి దోసిం బడి చని నేఁడీ పశుకృత్తిరజ్జువున క్షుధాభారంబు వారించెద ననితలంచి యుబ్బుచు నెక్కొనుతమకంబున ముంగిసమ్రానిపైకిఁ జివుక్కున నెక్కి యబ్బక్కనక్క దారువేణుబంధనంబగు చర్మరజ్జువుఁ దెగం గొఱికిన. 192

తే. గీ. మ్రానుమీఁటుగ నెగయ గో♦మాయు వప్పు, డేకతాళప్రమాణమ♦ల్లెగసి కూన
గుంతలోఁబడి గుర్లువె♦ల్కుఱక నాల్క,నడుముగఱచుక నఱచుచు ♦ బెడిసిమడిసె.

వ. ఇట్లు క్షుధాతురత్వంబున నాహారంబు చూచెఁగాని తనచేటు దెలియదయ్యె; నీవా నక్కతెఱంగున రాజసంయోగంబె చూచెదవుగాని యితరోపద్రవంబులువిచారింప వయిన నిత్తెఱంగునఁ జిత్తంబునఁ దత్తరంబు లేక తెలిసి మెలంగుమని హంసంబు నయోక్తులు వలుకు సమయంబున. 194

చ. అలమినవేడ్క ఘోషకన♦కాంగులు మజ్జిగఁ జిల్కఁ గాఁపుఁగూఁ
తులు తెలియావనాళములు ♦ దొక్కఁగ జేయగ జారనాయిక
ల్నిలయముఁ జేరఁ దస్కరులు ♦ నెక్కొనుభీతిని దావుకెక్కఁగాఁ
జెలఁగుచు వేగుఁజుక్క పొడి♦చెన్ బలసూదనదిక్తటంబునన్. 195

కం. అంతట హేమావతి గే, హాంతరమున కేగి పార్థి♦వాయత్తమతిం
గంతుసుమకుంతదళిత, స్వాంతంబున నా దినాంత♦నంతమసమునన్. 196

చ. కలపము గబ్బిగుబ్బలను ♦ గమ్మనుపూలసరాలు గొప్పునం
గులికెడిచంద్రకావి నెఱి ♦ కుచ్చెలఁ దీర్చినకోక శ్రోణినిం
దిలకము మోమునన్ మణులఁ ♦ దీరినసొమ్ములు మేన వేడుకన్
1వెలయ నమర్చి మేల్ముసుగు వేసి ♦ నృపాలుని కేళిఁ దేలఁగన్. 197

---

పా. 1. వెలుఁగ

## మూఁ డ వ రా త్రి క థ .

కం. కలహంసోజ్జ్వలరత్నశ, కలహంసక యుగము ఘల్లుఘల్లని మ్రోయన్
గలహంసగమన చనఁగాఁ, గలహంసము హేమవతిని గని యిట్లనియెన్. 198

ఉ. ఇంకొకగాథకద్దు విను మింతటిలోఁ బతి పాఱిపోవఁ డో
పంకరుహాయతాక్షి యుపభర్తల హత్తుక తత్తరాన మీ
నాంకునికేళిఁ దేలఁగఁ జనంగ నొకానొకమాట వచ్చినన్
బొంకఁగలేవు బంతి యని బొంకవలెం గులటావధూటికిన్. 199.

కం. అని రాజహంసమణి ప,ల్కిన హేమావతి వినోదకేళిగతి గిరు
క్కున మరలివచ్చి యాకథ, వినియెద ననువొందఁ దెల్పు విహగోత్తంసా. 200

వ. అని యడిగిన హేమావతికి హంసం బిట్లనియె. 201

కం. విను మనఁగా ననఁగా వర, కనకోజ్జ్వలకూటఝూట ఘనగోపురశో
భనకృతకధరీకృతనా, కనగరి మణిభద్రపురము గల దొకభూమిన్. 202

కం. ఆనగరము భోగపత్రి, భానగరిపుఁ డైనమాణిభద్రుఁడు భద్రా
నూనచరితుఁడు కాంతిసు,ధానిధి నృపు లెంచ శాశ్వతమ్ముగ నేలున్. 203

తే. గీ. అతనిచెంగట నసహాయుఁ డనెడువాఁడు, చండదోర్దండమండిత మండలాగ్ర
దండితారాతిరిపుతల గుండుగండఁ,డనెడి బిరుదొంది తిరుగు నాయకులలోన. 204

సీ. భిండివాలాసికోదండభల్లాతక నారాచరోహణనఖరవజ్ర
ముష్టిముద్గరశూలముసలభుసుండిక పాశపత్రికూర్మ [1]కర్పటకటారి
కా గదాయోద్దండకణయకుంతాతళ పరశుతోమరచక్ర పరిఘ పట్టి
సములుంకిణీలోడిసబళంబు చిప్పోఁటె సెలకట్టె యాదిగా నిల నుతింపఁ

తే. గీ. దనరు నుప్పదిరెండాయుధములు మఱియుఁ, జిఱుత చెయ్యమ్ము గండగత్తెర తుపాకి
గొరకనును గాలమును గ్రద్దగోళ్లు బుట్టె ,చూరిబాణాధరించు నవ్వీరుఁ డెపుడు. 205

వ. వెండియు నవ్వీరుండు సమడండ గజదండ భృంగిదండ మొదమవరభృంగి కుడివర భృంగి భృంగిపటలము పయివరపుదండ సింగంపుదండ పొదలికదండ యడుగడుగుపొదలికదండ మద్దెలసంచుదండ కుక్కుటపుదండ మొదలుగాఁగల పదిరెండుదండల యఖండపాండిత్యంబు దెలిసి, మొదమడుగుపరువడి కుడియడుగుపరువడి కదలుపరువడి దాఁటడుగుపరువడి కోపుపరువడి ధారుధాణుఖోడ ఉరుఖోడ అంత్రిటీకనాట్యము ఝూటుధారు ధాణుధాణు కపాలు ధారుక డారుకధాకు ధాణుధాకు ఝూటు నీ పదునాలుగువిసరులమర్మంబులుం జూచి, కక్కి కొక్కిన

పా. 1. కంకన కటారికా b కర్పణ కటారికా

డొక్కెర ముత్తెర డొక్కెరము కుమ్మరింపు జోడింపు సందుసీసంబును గొంతుమారును సమసీసంబును సురాటంబును జేవయు గందనంబును గల్లంబును దొట్టును గిర్లయుం బరిబొందుటయు రొండివేటును ఘణంబును గన్నాతును భారంబును చొంగిణియు బెట్లాగును తూణింపును సరిబిత్తరంబును లాగును విట్టాలంబును దిణింగియు బాదనివారణంబును బాదగళాప్తియు గళకత్తెరయు గాళనిల్కడయు నృసింహంబును నను ముప్పదిరెండువిన్నాణంబులనాణెంబు పరీక్షించి, వంటియడుగుకత్తెర సర్వబంధకత్తెర జాగిసకత్తెర పొదలికకత్తెర చిట్టడుగుకత్తెర పావుపావులు జాగిసపావు మొదలుగాఁగల పదిరెండుపరువళ్ల యగణ్యప్రావీణ్యం బెఱింగి, హరిగతి గజగతి వ్యాఘ్రగతి మహిషగతి జంబుకగతి మర్కటగతి మార్జాలగతి హరిణగతి చటకగతి పక్షిగతి తాండవగతి నరగతి మొదలైన పదిరెండుగతుల యవార్యచాతుర్యంబు నేర్చి, విష్ణుచక్రంబును రామబాణంబును నాగబంధంబును దొలకరిమెఱుపును అల్లిమత్తును విస్సందును హస్తాభరణంబును బదఖండనంబును బరిత్రాకును లోబిత్తరి వెలిబిత్తరి సర్పాంకుశంబు మొదలుగాఁగల పదిరెండుకాయమానంబుల భేదంబులువిచారించి, లోమొన వెలిమొన యుసిమొన ముమ్మొన చతురమొన పుణ్యమొన పాపమొన చాటడుగుమొన దాటడుగుమొన కదలుమొన ఆరమీటుమొన నెఱమీటుమొన సరితాళంపుమొన యాదిగాఁగల పదిరెండు మొనల నారితేరి, లోవెలి గజ్జదుముకు చూఁరణనరకు మొదలగునఱుకుల వగలు, దండనిల్కడకదలు తుటుము కలయిక మెలకువకింగళింపు దిశాపదిశలు పాదపుపారువ హస్తపుపారువ దేహపుపారువ నయనపుపారువ లివరాకడ ఎకసర పైసర భృంగిపటలము ఝంపు టెక్కు కరలాఘవంబు లాదియగు షోడశోపవీతంబులరీతులు నేర్చి, భ్రాంతంబు నుద్భ్రాంతంబును ఆప్లుతంబును ఆవిష్కృతంబును 1అష్టికంబును అవిదంబును ఆకరంబును అవికరంబును విశ్రుతంబును మానుషంబును నిర్మర్యాదయు విచిత్రంబును భిన్నంబును సవ్యజానువు అపసవ్యజానువు 2క్షిప్తంబును ధృతంబును గుడంబును లంబనంబును సవ్యబాహువు వినీతబాహువు త్రిబాహువు సవ్యోత్తరంబును ఉత్తరంబును తుంగబాహువు సవ్యకరంబును బ్రథితంబును యాధికంబును ఆపృష్ఠప్రహారంబును వల్గితంబును కుంచితంబును స్వస్తికంబు ననియెడి ద్వాత్రింశత్ప్రచారంబులు విచారించి, యవక్రపరాక్రమంబున సాటిలేక మెలంగు మఱియును. 206

ఉ. సాదన మేలు చెంపపయి ♦ జగ్గుగ వ్రేలు రుమాలు మీసము
ల్మీఁదను జీరుకేలు జిగి♦మించఁగఁ గప్పినశాలు వైరులన్
వాదులగెల్చువాలు చెలు♦వంబుగఁ దాల్చినపూలు నొప్పఁగా
నాదొరయొద్ద సంబళికె ♦ లందుచు నుండు నతండు ధీరతన్. 207

తే. గీ. అతనికులభామ గుణభూమ ♦ యలఘుకామ, యతులితారామ యసమరూ♦పాభిరామ
వదనజితసోమ యధికలా♦వణ్యసీమ, హేమరేఖాసనామ మై ♦ యింతి వెలయు. 208

---

పా. 1. ఆహికంబును    పా. 2. క్షేత్రంబును

ఉ. కన్నులచందము న్నగుమొ♦గంబు విధంబును గల్కి పల్కులుం
జన్నులపొంకము న్నడుము♦చక్కఁదనంబును 1బాహువులందముం
2బెన్నెఱిగొప్పసోయగము ♦ 3బిత్తర మాచెలియందకాక యే
కన్నియలందుఁ గన్గొన మొ♦గాదిగఁ జూడవె మూఁడులోకముల్. 209

√సీ. జల్లిమాటలుగాక ♦ సరిసేయవచ్చునే నవరంబు లీ శిరో♦జాతములకుఁ
బూఁతసుద్దులుగాక ♦ పోల్పంగ వచ్చునే చందనం బీమేని♦గంధమునకు
మాటమాత్రముగాక ♦ 4మఱిదీటువచ్చునే గగన మీనాఢము సో♦యగమునకును
వదరుపల్కులుగాక ♦ తుదిసాటివచ్చునే కిన్నెరకాయ లీ♦చన్నుఁగవకుఁ

తే. గీ. చక్కఁదనమెల్ల ముల్లెగా ♦ సంతరించి, బ్రహ్మదేవుండు తననేర్పు ♦ ప్రౌఢిచేతఁ
దీర్చి సృజియించెఁ గాఁబోలు ♦ దీనిననఁగ, వీఁటఁ జరియించునొక్కొ‌క♦వేళ నదియు.

తే. గీ. దానిఁ దనివారఁ జూడని♦మానవుండు,చూచి తలయూఁచి మెచ్చని♦సుజనవరుఁడు
మెచ్చి విరహార్తి నొందని ♦ మేటిఘనుఁడు,కలుగఁ డెందైన మూఁడులో♦కములయందు.

కం. మద మొదవు కోడెవిటులకు, హృదయపుటాంతరములోన ♦ 5హేమాహేమీల్
6బదివేల మన్మథులు పుట్టుదు రా సీమాటి కుచప♦టుత్వము గన్నన్. 212

వ. అది మఱియును. 213

తే. గీ. బిడ్డపాపలఁ గని పెంచు ♦ జడ్డులేక, తిండిచేఁగండమెండైన ♦ దండికతన
నెనఁగు ననగూటెపిసవెఱ్ఱి ♦ కసరురేఁగి, జారవాంఛావిహారంబు ♦ సలుపసాఁగె. 214

చ. విటులకుఁ గొంగుబంగరము ♦ వేడుకకాండ్రకుఁ బట్టుగొమ్మ యు
త్కటతరమన్మథార్తులకుఁ ♦ గల్పకుజంబు భుజంగకోటికిన్
ఘటితనిధానసీమ యువ♦కాంతులచేరువపంట జార స
త్పటలికిఁ 7బంచదారయును ♦ దానివిలాస మయారె యారయన్. 215

సీ. కురిమాపుమై 8సమ్మ♦కరలచీరటువిప్పి చెలువైన సరిగంచు♦చీరఁ గట్టు
మెరుఁగంచుకమ్మలు ♦ దొరయవంచటుడించి మణులరంజిల్లుక♦మ్మలు ధరించు
జిటిపోటిసామ్ము దీ♦సి మెఱుంగుకట్టాణి పూసలహారము ♦ లొప్పెసఁగఁ దాల్చు
గుత్తంపురవికెదా ♦ హత్తకుండఁగఁజేసి కలపంబు కులుకుగు♦బ్బలను బూయు

తే. గీ. నడర బెడగైననిడువాలు♦జడ సడల్చి,కుప్పె గన్పడ నవరంపుఁ♦గొప్పుఁబెట్టు
మురియు ముంగిట నిలుచుండి ♦ మొలకనగవు,లెసఁగ విటభాగ్యరేఖ యా ♦ హేమరేఖ.

---

పా. 1. వీనులందమున్ పా. 2. బెన్నెఱిగుంపు పా. 3 బిత్తరి యాచెలి పా. 4 దీటుకావచ్చునే
పా. 5. హేమాహేమిన్ పా. 6. బదివేలుకానుకలువట్టుదు పా. 7. సంపదాకరము పా. 8. సందుకరల

చ. 1కలకలనవ్వుమోవి పలు ♦ గంటుల దీటుఁగుచంబు లోరగా
వెలువడఁ బైఁటవేయు నెఱ ♦ వింతగఁ గేరు మరుల్కొనంగ బె
ళ్కులు గొనఁజూచు లేనివగ♦లుంగొని మాటికిఁ గుల్కు గోటిచి
మ్ములు నొనరించు నవ్వోలఁది ♦ మోహపుఁ బ్రాయమువానిఁ జూచినన్. 217

సీ. ఏటినీటికటంచుఁ ♦ బాటిపంబెత్తుక పలుమాఱు దిరుగు ని♦బ్బరముతోడ
రోలు రోఁకలి కని ♦ రూఢిగా నిల్లిల్లుఁ దిరుగు నేపార్పిద్దుఁ ద♦త్తరముతోడఁ
గూరగాయల కంచుఁ ♦ గోరి తా బాజారుకును మఱిమఱినేగుఁ ♦ గోమరుతోడఁ
బనిలేనిపనిజోలి ♦ గొని వాడవాడలఁ జరియించు 2సారె క♦చ్చెరువుతోడఁ

తే. గీ. బోలికలనెంచు వలరాచ♦పోగరు నిగుడఁ,గులుకుఁబ్రాయంపునెఱనీటు ♦ కోడెకాండ్ర
గమికిఁ దనజగ్గుజిగి సంచ♦కార మొసఁగ,వలపు రెట్టింప మెలఁగు న♦వ్వనజగంధి. 218

కం. తనకంటికిఁ బ్రియమయ్యెడు, 3ఘనునొక్కనివెంట నంటి ♦ కౌతుక మొప్పన్
మనసంటఁగౌఁగిలింపక, చన దింటికి దానిబల్వ్య♦సన మే మందున్. 219

సీ. ఆసువోసెడుదాని ♦ హస్తంబురీతిని గుంచె దీసెడుదాని ♦ కోమరుమిగుల
జడచిక్కుదయ్యంబు ♦ చందంబునను జెట్టు విడిచినభూతంబు ♦ 4కడఁకతోడ
మద్దెలలో నెల్క ♦ మర్యాద నెఱగలెత్తినబిల్లుసన్యాసి ♦ యనువుమీఱ
వల్లంబుపోనాడు ♦ 5వైశ్యునిదెసను ముంగాలుగాలినపిల్లి ♦ క్రమముదోఁప

తే. గీ. 6గంతుమాయల నుమ్మెత్త♦కాయఁ దినిన, వెట్టితెఱఁగున వ్యసనంపు ♦ వెఱపువోడమి
చికిలినెఱవన్నెకాండ్రకు ♦ శివములెత్త, నెనసి చరియించు వీఁట నా ♦ హేమరేఖ. 220.

కం. ఈలీలఁ బురములోపల, మేలౌ ప్రాయంపురూపు ♦ మీఱ టగువారిం
జాలి భయ లజ్జ లన్నియుఁ, దూలి చనన్ వెన్నుఁ జఱచి ♦ తోలఁగక కలయున్. 221

వ. ఇత్తెఱంగున. 222

చ. చవిగొని జార వీరరతి♦సౌఖ్యము దెప్పలఁ దేల నెప్పుడున్
దివురుచు మోహవార్ధిని ము♦నింగి యొకానొకకాలమందునన్
శివశివకాఁపురంబువయిఁ ♦ జింత యొకింతయు లేక చిత్తసం
భవు నిజమాయఁ గప్పి కలఁ♦వం దలవాకిట నుండు నెప్పుడున్. 223

శా. ఈమర్యాదను గొన్నినాళ్లు సనఁగా ♦ హెచ్చైన కార్యానకై
భూమీశుం 7డొకనాఁడు పొమ్మనినచోఁ ♦ బూత్కారుఁడై యాగతిన్

పా. 1. కిలకిలనవ్వుమోవి పలు♦కెంపులుదీడు పా. 2. నూరవచ్చెరువుతోడ పా. 3. ఘనుఁడంటన్ వెంట
పా. 4. నడకతోడ పా. 5. వైశ్యునిశేవను గాలుగాలిన పా. 6. గళముమోయఁగ నుమ్మెత్త
పా. 7. డొకదిక్కుకంపిన మహా♦పూత్కారుడై

స్వామీ కట్టడఁ జేసితే యనుచు చీ ♦ జన్మం బిదే లంచుఁ జిం
తామగ్నత్వముఁ జెంది మందిరములో♦నం జేరి పెండ్లాముతోన్. 224

వ. అసహాయుం డిట్లనియె. 225

తే. గీ. భూవరుం డొక్కపయనంబు ♦ పొమ్మటన్న, మంచి దని వచ్చితిని సమ్మ♦తించి నేను
సంబళము కంబళము కత్తి ♦ చద్ది చల్లడంబు కేడెంబు ధట్టి తె♦మ్మంబుజాక్షి. 226

కం. అని పల్కరించినప్పుడె, ఘనకుంతల తొడుసు వాసెఁ ♦ గదరా యని యిం
పొనర నవి యిచ్చి పనిచినఁ, జనె నాతఁడు పయనమై వి♦చారముతోడన్. 227

వ. అట్లసహాయుం డరిగినపిమ్మట. 228

కం. ఆహేమరేఖ మదిఁ గల, మోహావేశమునఁ దోడి♦ముద్దియతోడన్
బాహాబాహిఁ బెనంగెను, సాహో యని కంతుపాద♦శహ రహిఁ గేరన్. 229

వ. అట్లు గేరి. 230

చ. పొలుపగు మావిలేఁజిగురు♦పొందిక పోఁతపిరంగిలోన నె
క్కొలిపిన పుష్పగుచ్ఛ మను♦గుండు పరాగపుమందు నించి వె
గ్గలపుఁబరాక్రమాగ్నిఁ గొని♦కంతుఁ డవేటిపిరంగి భామగు
బ్బలనెడుదుర్గము ల్పగిలి♦పార గుభల్లున నేసి యార్చినన్. 231

కం. అళుకుచు మూర్ఛిలి తెలుసుక, కళవళపడి లేచి మనసు ♦ గాసిల్లంగా
భళిరా యని వెలువడి తన, నెళవరులను జూచికొనుచు ♦ నిలుచున్నంతన్. 232

చ. మెలివడు తీఁగచుట్ల జిగి ♦ మించినపాగ జినుంగువచ్చడం
బలవడు చల్వదోవతి యొ♦యారపు గందపుఁబూఁత డొల్లుపో
గులు మణిముద్రిక ల్వలపు♦గుల్కెడుపీడ్యము చంకవట్రి మం
ఘ్రిలతుద ముచ్చెలుల్ వెలయు ♦ గుప్తగుణుం డనువైద్యుఁ డొప్పగున్ 233

తే. గీ. వైద్యమాత్రంబునన కాదు ♦ వఱలునట్టి, నిరుపమాకార సౌష్ఠవ♦స్ఫురణచేత
నాశ్వినేయులతోనైన ♦ నతఁడు వాదు, కెదిరి 1యోజింపకయె జబా♦బీయఁగలఁడు. 234

వ. మఱియు నశ్వగంధాదిఘృతంబును నైలేయకఘృతంబును షట్ఫలఘృతంబును దూర్వాదిఘృతంబును బంచగవ్యఘృతంబును నార్ద్రకఘృతంబును గదళీకందఘృతంబును గళ్యాణఘృతంబును దంతులీయకఘృతంబును గూశ్మాండఘృతంబును మొదలయిన ఘృతంబులు సేయునేర్పును, బంచాగ్ని చూర్ణంబును జిత్రకాదిచూర్ణంబును బడబానలచూర్ణంబును

పా. 1. కొంచింపకయె జబా ♦ బీయగలఁడు.

మాణిమంథచూర్ణంబును మరీచ్యాదిచూర్ణంబును తాళీసచూర్ణంబును నేలాదిచూర్ణంబును దుంబురుచూర్ణంబును గర్పూరాదిచూర్ణంబును బంచబాణచూర్ణంబును భృగ్వాదిచూర్ణంబును నాదియైనచూర్ణంబు లొనరించు నుపమయు, 1జించిల్యాదిలేహ్యంబును క్షుద్రాభయారిలేహ్యంబును జతుష్షష్టిమరీచ్యాదిలేహ్యంబును 2గుసుమార్ద్రాదిలేహ్యంబును బిప్పల్యాదిలేహ్యంబును బిల్వాదిలేహ్యంబును గుండల్యాదిలేహ్యంబును మొదలుగాఁగలలేహ్యంబు లొనరించునైపుణ్యంబును, నారికేళాదిరసాయనంబును గుడనాగరాదిరసాయనంబును శిగ్రుపుష్పరసాయనంబును జాతఫలరసాయనంబును సుకుమారరసాయనంబును భల్లాతకీరసాయనంబును సుదర్శనరసాయనంబును వారాహీరసాయనంబును విళంగాదిరసాయనంబును నమృతరసాయనంబును నాదిగాఁగలరసాయనంబుల పొందికలెఱుంగువిధంబును, శరపుంఖాదితైలంబును లక్ష్మీనారాయణతైలంబును లాక్షాదితైలంబును ధన్వంతరితైలంబును బంచార్కతైలంబును బాశ్చాత్యనింబతైలంబును విషముష్టితైలంబును కేతకీతైలంబును స్నేహార్కతైలంబును వాతాంతకతైలంబును బూతికాతైలంబును భూనాగతైలంబును భృంగామలకతైలంబును మొదలగుతైలంబుల పరిజ్ఞానంబును, నారికేళాంజనంబును సౌవీరాంజనంబును వీరభద్రాంజనంబును నీలాంజనంబును గరుడాంజనంబును గపోతాంజనంబును గర్పూరాంజనంబును మొదలుగాఁగలయంజనభేదంబులఁగూర్చుచమత్కారంబును, నగ్నికుమారకము రాజమృగాంకము బూర్ణచంద్రోదయము వసంతకుసుమాకరము వాతరాక్షసము చంద్రహాసము చంద్రప్రభావతిరసము కందర్పాంకుశరసము షణ్ముఖరసము కాలాగ్నిరుద్రరసము తాళకేశ్వరరసము ప్రతాపలంకేశ్వరము చాతుర్థికరామబాణము విష్ణుచక్రరసము విశ్వంభరరసము బడబానలరసము నారాయణరసము మదనభైరవరసము భార్గవీరసము జ్వరాంకుశము స్వచ్ఛందభైరవముసంజీవరసము రసభూపతి చింతామణి మొదలైన దివ్యరసౌషధంబులు, గంధకవసనాభులలక్షణంబులెఱింగి విఱుచుప్రావీణ్యంబును, లోహభస్మ తామ్రభస్మ వంగభస్మ సీసభస్మ నాగభస్మ శంఖభస్మ సువర్ణభస్మంబులు సేయుమర్మాదయు, శీతభంజి అరళ్యాది మాణిభద్ర తాళీసమాత్రలుగట్టు నవధానంబును, క్షారద్రావకగుగ్గులు పిష్ట కషాయంబులు మూలికలు కైకర్ణికలుసేయు నౌచిత్యంబును, సూత్రస్థాన శారీర నిదాన శాస్త్రంబుల పరిచితియును, డెబ్బదిరెండు నాడీభేదంబులును వాతపైత్యశ్లేష్మంబుల నుల్బణంబులైనతిశతషష్టి రోగంబులకుఁ దత్తచ్చికిత్సలు చేయుచాతుర్యంబును గలిగి రెండవధన్వంతరి యనంబరగు నతఁడు. 235

తే. గీ. వీథివెంటను రాఁ జూచి ♦ వెలఁదియనియె, నౌర యిట్టుండవలదె యొ ♦ య్యార మహహ
వీనిఁ జిక్కించుకొని మార ♦ విగ్రహమున, భంగపడఁజేయనిది యేటి ♦ 3ప్రౌఢతనము.

కం. అని తనమనమున ననుకొను, చును నిలుచున్నంత దాని ♦ సొగసు నొయారం
బును గని మనసిజసమ్మో,హనవిద్యను జొక్కి యాతఁ ♦ డంచుకు రాగన్. 237

పా. 1. జించార్ద్రికలేహ్యంబును పా. 2. గాసమర్ద్రాదిలేహ్యంబును పా. 3. ప్రౌఢవనిత.

ఉ. ఎక్కడనుండి యెక్కడికి♦నేమిప్రయోజన ముండి వోయె దీ
వక్కట నామ మే మనిన♦నన్నియుఁ జెప్పి పరోపకారిరా
యిక్కలకంఠకంఠి యని♦యెంతయు డగ్గఱఁ జేర మాఱుఁడుం
బ్రక్కలు నెక్కొనం బొడువఁ♦బైకొనుమోహముచేత లేమయున్. 238

తే. గీ. అమలశశికాంతకాంత శు♦ద్ధాంతకేళి, కానిశాంతాంతరంబున♦ఘుమ్మరనెడు
పచ్చబచ్చెన చిత్తర్వు♦పనులమించు, ప్రతిమసంఘట్టనల మంట♦పంబులోన. 239

చ. నకినెలకీలుకంఠమున♦జాయ మెఱుంగులసొంపు కెంపు ము
క్కుకొనల పచ్చరాచిలుక♦కోళ్లఁ దనర్చిన మేలుపట్టెయు
ల్లికపయి జాఫరాజినుఁగు♦లేపునఁ జెందుపలంగుపోషు త
క్కికగల జాళువాగొలుసు♦గీల్కొనుమంచముపై మహోన్నతిన్. 240

తే. గీ. అపుడు గుప్తగుణాహ్వయుఁ♦డైనవైద్యు, నెలమిఁ గూర్చుండఁ బెట్టి యా♦హేమరేఖ
పండుటాకులు కప్రంపు♦బాగములను, వేడ్కతోడుత నిద్దఱు♦వేసికొనుచు. 241

మ. సరసాలుం జిఱునవ్వులు న్మురిపెము♦ల్సయ్యాటము ల్వింతలుం
గరగింత ల్వలపించుట ల్చతురత♦ల్కాంక్ష ల్వినోదంబులుం
దరితీపు ల్వలపు ల్మిటారితనము♦ల్దాటింపులుం దచ్చన
ల్నెఱచిన్నెల్మఱపించుట ల్సొగసులు♦న్నీటు ల్పచారింపుచున్. 242

సీ. ఆసక్తిదీఱని♦యాలింగనంబులు నురువాంఛ దరగని♦ఛురితవితతు
లనురక్తివాయని♦యట్టి చుంబనములు తమి వెలిగానిదం♦తక్షతంబు
లభిలాష లుడుగని♦యతిచపేటంబులు తాత్పర్య మెడలని♦తాడనమ్ము
లాసలు మానని♦చౌశీతిబంధము ల్భావ మూనని కళా♦స్పర్శనములు

తే. గీ. కలితకలకంఠకలహంస♦కలరవములు, పలుకు కివకివ కవకవ♦ప్రకట టకుట
కకుట కహకహ హాసనము♦ల్గళరవములు, చెలఁగ నిద్దఱు రతికేళి♦సలుపునపుడు. 243

చ. తెమలను నిన్నుఁ బాసి సుద♦తీ యని తీయనినీదుమోవి కా
యమృతరసోర్మియేని సమ♦మా యని మాయనిమోహదాహసం
భ్రమ మెదలోన నెంతదల♦పా యని పాయనికూర్మితోడి నా
తమిపరభామలందుఁ గల♦దా యని దా యనికౌఁగిలింపుచున్. 244

వ. ఇట్లన్యోన్యసరససల్లాపంబుల గుప్తగుణుండు సురతకేళికాలోలుఁడై హేమరేఖతో బెనంగుసమయంబున. 245

సీ. కొప్పెరపెట్టుగాఁ♦గొమరొప్పనొనరించి పైరుమాలు బిగించు♦పచ్చడంబు
నాగవల్లీదళ♦పూగపూరితమైన వడిలోన నిడికొన్న♦యడప మొకటి

చాయలఁ దనరారు♦సకలాతియొరతోడి పృథుభుజస్థలినొప్పు♦పెద్దకత్తి
చీర్ణంపుఁబనిచేత♦జిగిమించుకరమున సొంపైన సత్తుసు♦న్నంపుఁగాయ

తే. గీ. పాదముల మెట్లు మొలఁ దాల్పఁ♦బడిన బాఁకు, చల్ది గట్టినవస్త్రంబు♦చంకదుడ్డు
నమర గమనజవోద్భవ ♦ శ్రమముఁ జెంది, యప్పు డసహాయుఁ డింటికి♦నరుగుదెంచె.

కం. అరుదెంచి పురుషుఁ డుండెడి, యరువెంచి నిజప్రసిద్ధి♦కందఱు నళికే
బిరుదెంచి రోషవశుఁడై, సరిదంచితఘోషభాషఁ♦జానను బిలిచెన్. 247

కం. జడియక యప్పు డాసతి యే, వడువున బొంకంగవలయు♦వనరుహగంధీ
యడుగుం దప్పినయప్పుడె, పిడుగుం దప్పెనుమాట♦పేర్కొన వినవే. 248

వ. అని. 249

ఉ. ఈవిధి హంసలోకవిభు♦ధేంద్రుఁడు ప్రశ్న మొనర్చి పల్క హే
మావతి కొంతకొంత యను♦మానముతో బొటవ్రేల నేలరే
ఖావిధమొప్ప వ్రాయఁ గుతు♦కంబున నీ కిది తోఁచెనేని ను
ర్వీవరుఁ జేర నేగుమని♦వేఁడిన నప్పువుఁబోడి యిట్లనున్. 250

కం. నినువంటికతలకారిని, గనివినియెఱువారి నడుగఁ♦గావలెఁ గానీ
ననువంటిదాని నడిగిన, వినుపింతునె యెట్లు బొంకె♦వివరింపఁగదే. 251

కం. అని యడిగిన హేమావతి, కనురాగం బొప్ప రాజ♦హంసకలాపం
బనియె నసహాయుఁ డటువలె, ఘనరోషం బుట్టిపడఁగ♦గర్జించుటయున్. 252

తే. గీ. వైద్యుఁ డప్పుడు గడగడ♦వడఁకి నాకు, బుద్ధియేమనిపల్క న♦ప్పువ్వుఁబోడి
వెఱవకు మటంచు దిట్టయై♦వెన్నుఁజరచి, సంచివిడిపించి యపుడు స్వ♦స్వామి కనియె.

చ. కడుపున శూలయెత్తి వడి ♦ గాసిలి ప్రాణము లేగునట్లయై
తొడిఁబడ నీవులేమి ఘన ♦ దుఃఖముచే వెతఁ బొంది యీమహా
త్ముఁడు స్మృతినేగఁ గావు మని♦తోడ్కొనివచ్చితి నీతఁ డౌషధం
బిడుటను నేను జీవముఁ వ♦హించితిఁ గ్రమ్మఱ నేమి చెప్పుదున్. 254

కం. అని యుస్సు రస్సు రనుచున్, నన్నృతోదర రోగమునఁ బ్రి♦యాంగన పొరలన్
గని కుస్తరించి వైద్యుని, మనమును రంజిల్లఁ జేసి♦మమత దలిర్పన్. 255

తే. గీ. నీఋణము దీర్పఁ గలవాఁడనే♦యటంచుఁ, బచ్చడం బిచ్చి బహుమాన♦మెచ్చ వైద్యుఁ
బంపి సందేహమందక♦భార్యతాను, నిండువేడుకనుండిరో ♦ నీరజాక్షి. 256

వ. అని మరాళశేఖరంబు చెప్పిన నరాళకచ యగుహేమావతి తనమనంబున. 257

కం. సురుచిరమణితాటంక, స్ఫురితప్రభ చెక్కులందుఁ♦బొలయ శిరంబున్
మఱి త్రిప్పి పొగడె నహహా, గరితలమిన్నదియె కాక ♦ కలదే పుడమిన్. 258

వ. ఆసమయంబున. 259

తే. గీ. మైవియల్లక్ష్మి కస్తూరి♦మళ్లచీర, రేయిఁ గట్టుక సడలించి ♦ రేపటికడ
నుదయరాగంబు దాల్చిన ♦ యొఱపుదోఁప,దమముజాఱంగ సాంధ్యరా♦గము జనించె.

చ. వలవల నయ్యెఁ దారకలు ♦ పక్షులు గూయఁ దొడంగె దీపముల్
వెలవెలఁ బాఱె దిక్కులను ♦ దెల్విజనించె బిసప్రసూనముల్
దులదుల విచ్చెఁ దావులకు ♦ దొండడిఁ జేరిరి జారచోరు లా
మలయసమీరణంబు కడు♦మందగతిన్ విహరించె నత్తఱిన్. 261

తే. గీ. తఱి యనుకళాదుఁ డుదయభూ♦ధరహసంతి, వరుణహేమంబునకు వహ్ని♦యలను నింపఁ
గాఁచి నీరార్చునెత్తివ ♦ కరఁడు నాఁగ, సూర్యబింబంబు పొడిచె న♦పార్యగతిని. 262

కం. మణిఘంటలమొలనూలుల్, ఝణఝణయని మ్రోయఁ గేళి♦శాలకుఁజని య
య్యణుమధ్య నృపార్పితగుణ, గణమై వసియించె దివము ♦ కల్పముగాఁగన్. 263

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పినవిని సంతోషించి నలుండు తరువాతి వృత్తాంతం
బానతిమ్మని పలికిన. 264

మ. హరకోదండ విఖండనప్రచురబా♦హాదండ దండాయుధా
ద్యురుదిక్పాలసురానివార్యతరబా♦ణోద్దండ దండాంకభి
ద్ధరిణాక్షీమణిజీవనాకృతి నిజా♦ఖ్యాఖండఖండాబ్జభృ
ద్భరసాభ్రద్రిపువాహసన్నిభయశో♦భాకాండకాండోదరా. 265

కం. ధారాధరఘృణివారా, వారణ రాజన్యవైరి♦వారణ ధీరా
ధీరాజిత శుభకారా, కారణపురుషావతార ♦ కరుణోదారా. 266

కలహంసోత్సాహవృత్తము.

కలుషదూర భవవిదార ♦ కమలసారలోచనా, కలితహార వరవిచార ♦ ఖరవిహార మోచనా
లలితనీరనిధిగభీర ♦ లసదుదారకీర్తిని,ర్దళితహార శరపటీర ♦ దరసుధారసోత్కరా. 267

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధిపూర్ణిమాచంద్ర
నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్యనిస్తంద్ర శ్రీరామనామపారాయణ
నారాయణామాత్యప్రణీతంబయిన హంసవింశతి యను
మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.



# హంసవింశతి.

## ద్వితీయాశ్వాసము.



శ్రీశాంకరీశచాపవి
నాశ ధరాధీశ వంశ♦నలినదినేశా
క్లేశహరాకాశ భరా
కాశ రఘురాడ్బాభిరామ ♦ కాంతియశోమా.

వ. అవధరింపుము నలరాజన్యునకుఁ బ్రీత్యుత్పన్నమతి యిట్లనియె, నట్లు హేమావతి కేళీనిశాంతంబుఁ జేరి రాజవిరహంబున నొంచశోకరీతిఁ బ్రొద్దు గడుపుచున్నంత దినాంతంబు గావచ్చిన. 2

శా. ఆహేమావతి మానసాటవి 1సము♦ద్యద్దీప్తిమైఁ బేర్చు మా
రాహంకారిపరాక్రమానలము బా♦హ్యస్థాన కేళ్యర్థమై
యోహో వెల్వడి పెక్కురూపములచే♦నొప్పారి కన్పట్టెనా
గేహాంతంబుల దీపపంక్తులు చెలం♦గెన్ రంగు పొంగారఁగన్. 3

వ. అప్పుడు. 4

సీ. నునుపెక్కు జిగిచెక్కు♦లను మిక్కుటపుఁ డెక్కు గ్రమ్మెడు పంజుల♦కమ్మ లలర
నిడువాలు గలకీలు ♦ జడమేలు వగఁ గ్రాలు గొప్పైన సవరంపుఁ♦గుప్పె దనరఁ
దెలిపువ్వు కళక్రొవ్వు♦వెలిరువ్వు చిఱునవ్వు గలుగు నెమ్మోమునఁ ♦ దిలక మమర
రహి గుబ్బలుల నిబ్బ♦రము ద్రొబ్బఁగల గుబ్బకవమీఁద పైఠణీ♦యవిక మెఱయ

తే. గీ. బళుకుబళుకున గతులయం♦ దళికి బెళుకు, కులుకుఁగౌనున జాళువా♦తళుకులొలుకు
మేటియొడ్డాణ మలరార ♦ నీటుఁబూని, వచ్చి రాయంచకడనిల్చె ♦ వనరుహాక్షి. 5

వ. ఇత్తెఱంగున నిరుపమశృంగారతరంగితాంగయై రాజపుంగవసంగమార్థం బరుగుచుఁ దనచెంగట నిల్చిన యారాజాననావతంసంబునకు రాజహంసం బిట్లనియె. 6

---

పా. 1. సము♦ద్యద్దీప్తియై యేచు

## నాల్గవరాత్రికథ.

క౦. గమ్మత్తుఁజిమ్మ నొకకథఁ, గ్రిమ్మఱఁ దెల్పెదను వేణిఁ ♦ గ్రిమ్ము విరులపైఁ
దుమ్మెదలు జుమ్మ జుమ్మనఁ, గొమ్మా తలయూఁచి మెచ్చ♦కొమ్మా నన్నున్. 7

వ. అని యిట్లు చెప్పఁదొడంగె. 8

క౦. కలదభ్రంకషకేతన, చలదభ్రం బైన చైత్ర♦శక మనుపుర ము
జ్జ్వలదభ్రకచాదర్శన, వలదభ్రపురీసుపర్వ ♦ వారోదయమై. 9

సీ. వేదశాస్త్రపురాణ ♦ [1]విద్యాగరిష్ఠులై విలసిల్లుచుండెడి ♦ విప్రవరులు
గరిడిలో నెఱహొంత♦కారులై సాముల మీఱిన రాజకు♦మారమణులుఁ
గోటికిఁ బడగెత్తు♦కొనియున్నటెక్కెము లెక్కులై వర్ధిల్లు ♦ బేరిజనులుఁ
గడుధాన్యరాసులు ♦ గగనంబుతో [2]రాయు కలిమిచే మించిన ♦ కాఁపుప్రజలు

తే. గీ. భూరిమదధార లూరెడు ♦ వారణములు, ధాటిపాటవమున నొప్పు ♦ ఘోటకములు
ఘోరరణరంగపటులైన ♦ వీరభటులుఁ, బ్రబలియుండఁగ వెలయు న♦ప్పట్టణంబు. 10

క౦. ఆపట్టణంబులోపలఁ, జూపట్టును దంతువాయ♦చూడామణి రే
ఖాపట్టభద్రుఁడై సిరి, నేపట్టున నోరపార ♦ లింతయులేకన్. 11

సీ. కుంచె మగ్గపుగుంత ♦ గూటంబు పగ్గంబు పరిటె దోక్కుడుపట్టె ♦ పలక దోనె
పరిపరియచ్చులు ♦ చరికుండ యూడిత చీడు దబ్బలు దండె ♦ నాడె కోవి
కోఁతిపుల్లలు నాల్క ♦ కుడుతరికొయ్యలుఁ జొప్ప యూఁచలుఁ గోఁత♦చూఱుకత్తి
కారంపుఁ బడుగులు ♦ గండెలకప్పెర గోలము లాకలు ♦ నీలికడవ

తే. గీ. గంప డొల్ల కళాసంబు ♦ కదురు చెమికె, నూలు రాట్నంబు జాలంబు ♦ గ్రాలుగోడ
వఱల నాశుభభద్రు ని♦వాసభూమి, యప్పురంబున సంతతం ♦ బొప్పుచుండు. 12

తే. గీ. గొప్పకన్నులు చిఱునవ్వు♦గులుకుమోము, బవరిగడ్డము చక్కనై ♦ పరఁగు ముక్కు
నెగుభుజంబులు విపులత్వ♦మెసఁగుఱొమ్ము, జిగిమిగులులీల [3]గనుపట్టుఁ ♦ దొగట సెట్టి. 13

ఉ. ఆఁటది నేర్పుతోవగల ♦ యందముఁ జందము జూపఁబూని కో
లాటము వేయుకై వడిని ♦ లాలితదృక్తరళప్రభావళుల్
పాటిగఁ బోఁగు వెంబడిని ♦ బార్శ్వములం జరియింప వస్త్రముల్
ధాటిగ నేయు నప్పలుక♦తట్టున బెట్టు ఖణి ల్ఖణి ల్లనన్. 14

తే. గీ. అరవిరుల తేనియలచాలు ♦ మరునివాలు, మిసమిసలప్రోలు వలరాజు ♦ మేఁటిడాలు
మురిపెముల మెచ్చుతేఁజాలు ♦ ముద్దరాలు, వానియిల్లాలు దొమ్మర♦వానిడోలు. 15

---

పా. 1. విజ్ఞాననిపుణులై  పా. 2. రాయఁ గలిమిచే  పా. 3. సిరిపట్టి♦తొగట సెట్టి.

ఉ. దానిముఖప్రభాగరిమ ♦ దాకనిపోలక ళావిశేషముల్
దానిబెడంగుచూపులును ♦ దానికుచంబుల నిగ్గుచందమున్
దానివచోవిలాసములు ♦ దానికచాళిరుచు ల్గణింపఁగా
మానవతీలలామ విను ♦ మర్త్యు లమర్త్యులు నైన నేర్తురే. 16

కం. జిగిఁజిలుకు కులుకుగుబ్బలు, నిగనిగలు చెలంగు నెఱులు ♦ నిద్దపుఁగన్నుల్
నగవుదళుకొత్తుమోమును, మగువా యాబిడకె కాక ♦ మఱికలదటవే. 17

కం. తొడలందము నడుమందము, నడుగుందమ్ముల బెడంగు ♦ లాస్యము రంగుల్
జడతళుకున్ మెడకులుకు, న్నడబెళుకుం జూడ నాఘు♦నస్త్రిని కమరున్. 18

తే. గీ. చిన్నిచీమల నునుబారు ♦ చెలువయూరు, గదళికాకాండములమీఱు ♦ కాంతయూరు
లందముల మీఱు రతిఁగేరు ♦ నతివసౌరు, దాని కెనయైననారు లి♦ద్ధరణి లేరు. 19

కం. కందరమాచెలి పొక్కిలి, కందర మావిలసనములు ♦ కచములు రదముల్
కుందరమానసములు నా,కుం దరమా పొగడ నల కు♦కుందరసుకటిన్. 20

సీ. మిళదంబుజలదంబు ♦ బలుషంబుచెలువంబుఁ దులకించు నమ్ముద్దు♦కలికివేణి
సిరిపట్టు గలగట్టు ♦ జిగిగుట్టు వెలిఁబెట్టు చెన్నారు నక్కన్నె ♦ చన్నుదోయి
నునుకందుపై జెందు ♦ నని యిందురుచి గ్రిందుపఱవఁగాఁ జాలు న♦బ్బాలమోము
తెలిదమ్ములను గ్రిమ్మ ♦ కళజిమ్మ ననయమ్ము మిన్నయా నబ్బోటి ♦ కన్నుఁగవయుఁ

తే. గీ. దావి తేనియబావి యం♦దములదీవి, మావిచిగురాకుచెంగావి ♦ మారుకేవి
కప్పురంబులక్రోవి య♦క్కాంతమోవి, యనుచు వినుతింప నానేఁత♦వనిత యలరు. 21

తే. గీ. పరిమళ మెసంగు బంగారు ♦ ప్రతిమవంటి, తొగటవాల్గంటి జిగినీటు ♦ తొలకరింప
సొగసుకాండ్రకు మోహరా♦సులుజనింప, నూరయొకయోరఁ జెలువార ♦ బారసాచి. 22

సీ. పోఁగువెంబడిఁ బర్వి ♦ పొల్చు వాల్జూపుల ధళధళ లుప్పొదండ♦కళలనీనఁ
బుంజంపుకట్లు దెం♦పుటకుఁ బర్వెత్తువో మట్టెల ఖణఖణ ♦ ల్బెట్టుమ్రోయఁ
గేలెత్తుచో బాహు♦మూలజాతప్రభాచకచకల్ పైఁడి వ♦సంతమాడఁ
బరిటఁ ద్రిప్పఁగ జాఱు♦పైఁటలోఁ గన్పట్టు గుబ్బలమిసమిస ♦ ల్ద్రొబ్బులాడ

తే. గీ. వింతవగకప్పు నెఱిఁగొప్పు ♦ వీడ నెఱయు, నిగనిగ ల్జాతినీలాల ♦ నింగి నింపఁ
గుచభరంబున నడుము కొం♦కుచు వడంక, నూలుదోఁడును వేడ్క న♦వ్వాలుఁగంటి. 23

చ. కరములఁ గంకణాలు ఘలు ♦ ఘల్లన రాట్నము ద్రిప్పువేళఁ బైఁ
టర దిగజాఱి వెల్కుఱుకు ♦ నబ్బురపున్ వెలిగబ్బిగుబ్బపై
సరు లిసుమంత చిందుగొనఁ ♦ జక్కని చూడ్కులఁ జూచువారి పే
రురమున. గాడ నవ్వెలఁది ♦ యోర్పునఁ గండెలు చుట్టు నేర్పునన్. 24

ఆ. వె. పడుగుఁ జేయువేళఁ ♦ బటము లల్లెడువేళఁ, గూడు దినెడువేళఁ ♦ గూర్కువేళ
మగని కన్మొఱంగి ♦ మార్మగలను గూడు, నింటిపొరుగుసఖుల ♦ యిండ్లలోన. 25

కం. గడిదేఱి జారవిద్యకు, వడిగట్టి దురంతకంతు ♦ వనజశరాళిన్
బడఁజాలనికతమున నా, వడువున నత్తొగటబోటి ♦ వర్తిలఁ దొడఁగెన్. 26

వ. ఇత్తెఱంగున నత్తెఱవ చిత్తజాయత్తచిత్తయై వర్తింపుచున్నసమయంబున. 27

సీ. నొసలిపైఁ జుక్కల ♦ మిసిమి నామపురేఖ లనువొంద భుజముపై ♦ నసిమి సంచి
వాలువీనులగాజు ♦ నీలాలపోఁగులు పైనొప్ప పొప్పళి ♦ పచ్చడంబు
మెలిగొనఁ జుట్టిన ♦ తలపాగ చెఱఁ గుంచి పైలపేటాచుట్టు ♦ పట్టుశాలు
కడిమిమీఱఁగఁ జంక ♦ నిడినబొట్టియకోల డాకమోగ్రెడు డుబు♦డక్కకేల
తే. గీ. వఱల దిక్కుల నెంచి దు♦ర్వారమైన, కీడు మేలును దెల్పుచుఁ ♦ గేక లిడుచుఁ
గెర్లికొనుచును దనపేరు ♦ కేరికొనుచు, వచ్చె నచటికి డుబుడక్కి♦వాఁ డొకండు. 28

ఉ. ఆడుబుడక్కివానికి ర♦యంబున భిక్ష యొసంగ నేఁతపూఁ
బోఁడి పక్రోష్ఠకస్థలినిఁ ♦ బూని తనుం గొనియాడువాని యా
మ్రేడితసూక్తిపైఁ బెదవి♦మీఁదను లేనగ వంకురించి చిం
దాడఁగ ముష్టిఁ బెట్టి బహి♦రంగణభూమిని నిల్చియుండఁగన్. 29

సీ. మెలిఁబెట్టి చుట్టిన ♦ తెలిపైఁడిజీపాగ చెవిసందిపాగలోఁ ♦ జెక్కుకలముఁ
దొడిగిన నెఱచల్వ ♦ నడరు నంగీజోడు జీరాడునడికట్టు ♦ చెఱఁగుకొనలుఁ
బదతలంబుల నెట్ట♦పాఱుపాపోసులు టెక్కుగాఁ జంకఁ జీ♦టీఖలీతి
నడికట్టులో మొల ♦ నిడినకలందాను హస్తాగ్రమున వ్రేలు♦దస్తరంబు
తే. గీ. మించుబాహువుమీఁదఁ గా♦శ్మీరశాలుఁ, జెవుల ముత్యాలపోఁగులు ♦ చెలువుదనర
నలఁతి నీర్కావిదోవతి ♦ యమర నటకుఁ, బారుపత్యంబు సేయు వ్యా♦పారి వచ్చె. 30

తే. గీ. వచ్చుచుండెడి వ్యాపారి ♦ పెచ్చువగలు, మెచ్చి యచ్చెలి తమి హెచ్చి ♦ రచ్చసేయఁ
బగటువగమీఱఁ గోర్కులు ♦ బారుదీరఁ, బొగరుఁజూపులతోఁ బడా♦పగలఁ జూచె. 31

ఉ. చూచినయంతలో మరుఁడు ♦ చొక్కపుఁ గప్రపురాలయంటలన్
లేఁజివురాకుఁ గ్రొవ్వి నల ♦ లేమ పయోధరచక్రవాకముల్
వే చలియింప వ్రాత్పుటము ♦ బీటలువారఁగఁ దెప్పతెప్పనన్
గోచునదాఁక నూఁది మది ♦ గోలుపడన్ వడి నార్చి [1]వ్రేసినన్. 32

కం. ఊహాలు కుతుకబంధై, మోహము తలమునుఁకలగుచు ♦ ముద్దియ మదిలో
బాహాబాహి కచాకచి, కూహకమతి పట్టి పెనఁగి ♦ కో యనుచు వడిన్. 33

---

పా. 1. పేర్చినన్.

తే. గీ. అంత నయ్యింతి యింతంత ♦ యనఁగరాని, వంత మదిఁ గొంత చింతించి ♦ కంతునిశిత
కుంతహతి కోర్వలేక ది♦నాంతవేళ, మంతనంబున వెడలి గే♦హాంతరంబు. 34

చ. ఉరిసినపల్లవెండ్రుకలు ♦ నూడినదంతము లంబకంబులం
గురిసెడు బాష్పజాలములు ♦ గూను వడంకెడుమస్తకంబుఁ గం
ధరఁ దగు తోలి పాదములు ♦ దర్శనము ల్వాడి చీరపోఁగునూ
ల్మెరసెడు మంత్రిసానిఁ గని ♦ మించెడువేడ్క నుతించి మ్రొక్కినన్. 35

ఆ. వె. 1ఆలకించి లేచి ♦ యది యెవ్వ రని చీరి, యమ్మ నీవఁటే య♦టంచుఁ బొదలి
యేమిపనికి వచ్చి ♦ తీసందెవేళల, ననుచు నడుగఁ దొగట♦వనిత పలికె. 36

ఉ. ఆరయ నిమ్మహాపురికి ♦ హాసము మీసముమీఁదఁ జిల్క వ్యా
పారి యొకండు నిండు రతి♦భర్తను బోలినవాఁడు వచ్చె నే
నారసికాగ్రణిం2గదియు ♦ నాస వహించితినమ్మ వానితోఁ
గోరినపొందు నాకు నొనఁ♦గూర్చిన నీ కొనరింతు సంపదల్. 37

సీ. సవరైన రతనాల ♦ బవిరెకమ్మల నిత్తు నవి నీకు మనసురా ♦ వంటివేని
యాణిముత్యమ్ముల ♦ హారమ్ము లొసఁగుదు వానిపై నీ కిచ్చ ♦ పూనదేని
గరుడపచ్చల కీలు♦కడియంబు లర్పింతు నందుకు నీయాస ♦ చెందదేని
తళుకుఁగెంపులసంది♦దండలు చెల్లింతు 3వానిపై నీబుద్ధి ♦ యానదేని
తే. గీ. సూసకము తీఁగ మెడనూలు ♦ సొబగునాను, గుండ్లపేరును గైకాన్క ♦ కోరి సేతు
నమ్మ నావిన్నపంబు నీ ♦ వాలకించి, వాని ననుఁగూర్చు నీనేర్పు ♦ పూని మెఱసి. 38

మ. అనుచున్ వేఁడిన మంత్రిసాని విని నె♦య్యం బారఁగాఁ బల్కె నో
ననబోఁడీ నినుఁ జూడ మన్మథునకై ♦నన్ మోహముల్ బుట్టుఁగా
మనుజుం డీతఁడు భీష్ముఁడో సనకుఁడో ♦ మానీంద్రుఁడో వ్యాసనం
దనుఁడో యెంతటివాఁడు 4వీఁ డయిన బం♦దాకోరుఁగాఁ జేసెదన్. 39

కం. సొనమందు పసరు రసమును, ఘనమణిమంత్రౌషధములుఁ ♦ గైకర్ణికకా
వును క్రియ మొగసిరి బంతిబ,దనిక గుళిక మూలెక బూతిఁ ♦ దవిలిచి తెత్తున్. 40

వ. అని చెప్పి వీడ్కొల్పిన. 41

కం. తనయింటికి హేమంతిని, చనె నానిశిఁ గడపి మంత్రి♦సాని రహస్యం
బునఁ బారుపత్తెగాఁ డుం,డిన చక్కికిఁ బోయి మ్రొక్కి ♦ నిపుణత మెఱయన్. 42

పా. 1. ఆవలించి లేచి పా. 2. గలయ ♦ నాస వహించితి పా. 3. వాటిపై నీబుద్ధి ♦ నాటదేని
పా. 4. వీఁ డనఁగ బం♦దాకోరుఁగాఁ

సీ. దాక్షిణ్య మనురక్తి ♦ దయయు విశ్వాసంబు బాంధవ్యము హితంబు ♦ భయము భక్తి
యంతఃకరణము స♦ఖ్యంబుఁ బోరామియు నేస్తంబుఁ జెలిమియు ♦ నెనరుఁ బ్రేమఁ
జల్లఁదనంబు వా♦త్సల్యంబుఁ గలుపుఁగోల్తనముఁ బ్రీతియు మంచి♦తనము మైత్రి
ప్రాణపదంబుఁ దా♦త్పర్యంబు గారాబ మనుగుణ్య మనుబంధ ♦ మనుసరింపు

తే. గీ. మచ్చికయు జుట్టరిక మైక్య ♦ మిచ్చకంబు, స్నేహ మనురాగ మాసక్తి ♦ మోహనియతి
సలిపి కడుఁ దక్కె ననిపించి ♦ సొలయఁ జేసి, వేగపడ కప్పు డాత్మప్ర♦వీణమహిమ. 43

చ. స్తుతులు ప్రసంగము ల్కథలు ♦ సుద్దులు వార్తలు రాచకార్యముల్
చతురత రేతిహాసములు ♦ శాస్త్రములుం దగుజాతిగాథలున్
సతకడము ల్పురాణములు ♦ సామెతలుం బరిహాసకంబు లిం
గితములు జారజారిణుల ♦ కేళిచరిత్రముల న్వదించుచున్. 44

ఉ. దేవపరాకు హాసుకళ ♦ దేజెడు నీదగురూపవై భవం
బేవిధినో కనుంగొని ర♦తీచ్ఛనుఁ బొల్పడి చిక్కి సొక్కి నీ
సేవయ చేయఁ గోరి నిను ♦ శీఘ్రమె రమ్మని పిల్వఁబంపె నో
భావజరూప యా తొగట♦భామిని కామవికారచిత్తయై. 45

తే. గీ. హత్తుకోవచ్చు నీవంటి ♦ యందగాని, కట్టిముద్దులగుమ్మను ♦ గుట్టుతోడ
ననిన మన సిచ్చి మదిలోన ♦ హర్ష మెచ్చి, మంత్రసానికి విడె మిచ్చి ♦ మమతతోడ. 46

కం. ఆపనుల కె య్యేఁకారెడు, తాపము గలవాఁడు గనుకఁ ♦ దగ నాతఁడు ని
క్షేపముఁ గనిన దరిద్రుని, యేపున ముద మంది తాపె ♦ కిట్లని పలికెన్. 47

ఉ. అచ్చటి కేను వచ్చి సమ♦యం బగువేళ యెఱుంగఁ దెల్పినన్
ముచ్చట దీర్తు నంచు ముది♦ముద్దియతో వివరించి పంపఁగా
నచ్చెలి తంతువాయకుల♦టాంగన చెంగట నీప్రసంగముల్
చెచ్చెరఁ విన్నవించుతఱి ♦ చెట్టి దుకూలము లమ్మువేడుకన్. 48

సీ. కలసమీపపుటూళ్ళ ♦ కాఁపుగుబ్బేతల నిమ్మకికి నాకర్షింప ♦ మంత్రవిద్య
బచ్చుఁ బ్రాయపువృష♦భవ్యూహములనెల్ల వఱలఁగ గుమిగూర్ప ♦ వల్లెత్రాడు
చిల్లరసరకుల ♦ సెట్లబేరాల కింపుగ లాభ మొందింపఁ ♦ బూఁటకాఁపు
పెనుకోలుకాండ్రకు ♦ జనసమూహంబుల గణిలిచూపెడు నాయ♦కప్రభుండు

తే. గీ. ముదరిగరిటియ భుజముపై ♦ మొనయఁ బెట్టి, ఘంట ఖం గని మ్రోయ నం♦గళ్ళఁ బడిని
మరిగి తిరుగు సళాదికి ♦ మణియకాండ్రు, కవనిబడికాఁపు నా వింత ♦ నలరు సంత. 49

కం. అంతట నాసంతకుఁ దన, కాంతుఁడు వస్త్రమ్ము లమ్మఁ♦గా నేఁగిన హే
మంతిని వ్యాపారివిటో, పాంతమునకు మంత్రసాని ♦ ననిపిన నదియున్. 50

తే. గీ. పోయి సమయంబుఁ దెల్ప న♦బ్బోజుఁగు వేఁక, వింత నెఱపూఁత గందంబు ♦ విరులసరులు
కప్రఁపువిడెంబు జిగిచల్వ ♦ గలుగు సొగసు, దనర హేమంతి యిలు సేరెఁ ♦ దక్షణమున.

ఉ. చేరినఁ దంతువాయసతి ♦ సిస్తుగ నిస్తులరత్నవస్తువి
స్తారసువర్ణవర్ణముల ♦ సంపద లిం పొనరించు కేళికా
గారములోన దివ్య మగు ♦ కమ్మనితావుల హంసతూలికం
జేరిచి మేరమీఱుతమిఁ ♦ జీరగ మారునిపోరి కయ్యెడన్. 52

చ. త్వరపడి గబ్బిగుబ్బకవ ♦ వాఁడినఖంబులఁ జీఱి చీఱి పై
సిరితళుకొత్తు తేటనునుఁ♦జెక్కుల ముద్దులు పెట్టి పెట్టి వా
తెఱ మొనపంటికొద్ది కసి♦దీఱఁ జుఱుక్కున నొక్కి నొక్కి యీ
కరణిఁ బరస్పరంబు జయ♦కాంక్షఁ బెనంగఁగ నింతి పైకొనెన్. 53

సీ. చిటిలెడుగందంబుఁ ♦ బెటిలెడుకస్తూరి చలియించురత్నకుం♦డలయుగంబుఁ
గదలెడునెఱివేణి ♦ విదలెడుపువ్వులుఁ జెమటఁ గరంగు కుం♦కుమపుఁబొట్టు
వికసించుకన్నులుఁ ♦ బ్రికటించుమణితముల్ గంకణఝణఝణ♦త్కారరవముఁ
బొదలెడుచనుదోయి ♦ కదలెడుహారముల్ ఘననితంబాఘాత♦నినద మడర

తే. గీ. నిటలసంచలదలక ము♦త్కట నఖాంక, మమితనిశ్వాసమారుతం ♦ బతనుగేహ
దర్శనోత్సాహిపతిచపే♦టప్రదాయి, యైనపుంభావసురత మ♦య్యతివ సలిపె. 54

వ. మఱియు నయ్యుపరిసురతంబుతమి యెక్కువయై దృఢకుచాశ్లేషంబు విడువఁ జేయం జాలక శీతకాలంబును, బ్రికటీకృతతారకంబును సంశ్లిష్టప్రియతమంబుఁ గావున నిశాసమయంబును, సంచలితపయోధరంబును నిర్గళితకృష్ణవేణ్యాదికమలంబుఁ గావున శరత్కాలంబును, బల్లవరాగసంపాదకంబును గలకంఠకూజితంబునుం గావున వసంతకాలంబును, ధ్వనిప్రధానంబును గలితవిశ్రమంబుఁగావున సత్ప్రబంధంబును, గళితవసనంబును బహుబంధబంధురంబును గావునఁ బ్రబుద్ధసిద్ధమార్గంబునుఁబోలి వెలయుచుండె. 55

ఉ. ఆసమయంబునం జెమట ♦ లాస్యముఁ గప్పఁగ నిండుబల్మిక
ల్గాసిలఁ జేయఁగాఁ గబళ♦కాంక్షకు జీవము వేగురింప ని
శ్వాసము బారుదీర నిజ♦వల్లభుఁ డౌ శుభభద్రుఁ డట్ల సం
వాసముఁ జేరవచ్చి తల♦వాకిలిఁ దీయని పిల్చె వల్లభన్. 56

తే. గీ. అప్పు డేరీతి నుపనాథు ♦ నవలఁబనుప, సుందరీ యేయుపాయంబుఁ ♦ జూడవలయు
జాణవౌదువు జారవాం♦ఛలకు నైతె, తెలుపుమనిపల్కెఁ గలహంస♦దేవవిభుఁడు. 57

కం. అని యడిగిన హేమావతి, విని దీర్ఘోచ్ఛ్వాస మొనర ♦ విడిచి నిజాంఘ్రిం
గనుదృష్టి నిలిపి మెల్లన, మునివ్రేల న్నేల గీచి ♦ మునుకొని పలికెన్. 58

కం. తెలియ దెటుపనుపవలెనో, పలుమఱు నే బ్రహ్మలోక♦పర్యంతంబుం
గలయ వివరించి చూచితి, నలవడ దది నీవె తెలుపు ♦ హంసబిడౌజా. 59

కం. అని యడిగిన హేమావతి, కనురాగం బొప్ప రాజ♦హంసం బనియెన్
వినుము నిజాధిపుఁ డటువలెఁ, దనుఁ బిలిచిన యువతి లేచి ♦ తరలఁగ బ్రీతిన్. 60

కం. మలచిన గుండె లొట్టుక్కని, కలఁచిన వ్యాపారి వెడలఁ♦గా నెటు లనుచున్
దలఁచినచో వెఱవకు మని, నిలిచినదార్ఢ్యమున మాని♦నీమణి వేడ్కన్. 61

ఉ. అత్తఱి బిత్తరై ఘనము♦దాత్తసుచిత్తపు మత్తుతోనన
బ్బిత్తరి తత్తరింపకయ ♦ పేర్కొని వాకిలి దీసి వేగమే
చిత్తజువంటినాయకుని♦ చెంతను నిల్చి తదీయనేత్రముల్
మెత్తనిచేత మూసి దయ ♦ మించఁగఁ దోడ్కొనివచ్చెఁ జెచ్చెరన్. 62

ఉ. ఆవగఁ జూచి యవ్విటము♦హామకరాంకుఁడు చిత్తవీథిలో
నౌ వగమాని మానిని న♦యం బొదవం గనుసైగచేసినం
దా వగు చోటి కేఁగెఁ దద♦నంతర మక్కులివేల మూసితే
పోవఁగరా దటంచుఁ 1బతి ♦ ముద్దియ నిట్లడిగెం బ్రియంబునన్. 63

తే. గీ. అటుల నడిగినప్రియభర్త ♦ యంబకముల, మూఁత చాలించి యా మించు♦ముద్దుగుమ్మ
సిగ్గు కడ్డంబుగాఁ బతి♦చేల మలమి,కొనుచుఁ బలికెను జిన్నెలు ♦ కొసరు చూప. 64

చ. జలకము లాడఁ గోరి బురు♦సాపని చీర సడల్చి సందులో
పలికిఁ జనంగ నీదు నునుఁ♦బల్కు వినంబడఁ దల్పుఁ దీయఁగా
వెలువడి వచ్చితిన్ వలపు ♦ వెల్లువ దొట్టఁగ నంచు నాయకుం
గులుకుమిటారి గబ్బిచను♦గుబ్బలఁగౌఁగిటఁ జేర్చి పల్కినన్. 65

తే. గీ. భామ తనమీఁద నెనరైన ♦ బాగుఁ జూచి, చిత్తము గరంగి శుభభద్ర♦శేఖరుండు
గుణవతి వటంచుఁ బ్రియురాలిఁ ♦ గుస్తరించి, నిండుమోదంబున సుఖాన ♦ నుండె నపుడు.

కం. ఇంతయుపాయముఁ గలిగిన, నింతీ చనవచ్చు జారు ♦ నెనయఁగ, లేదా
కాంతుఁ డెఱింగిన నృపమణి,చెంతకు నేమొగముతోడఁ ♦ జేరెదొ చెపుమా. 67

తే. గీ. అనుచు రాయంచ నుడివిన ♦ విని శిరంబుఁ, ద్రిప్పి హేమావతి ప్రమోద ♦ మొప్పఁ బలికె
నౌనె మజ్ఝారె యదిగాక ♦ యాడుఁవారి,తల్లి యనుచును జిఱునవ్వు ♦ దలకొనంగ. 68

కం. తెలవారె నపుడు దీపపుఁ,గళికలతో వెల్లఁ బాఱఁ♦గాఁ దనమోమున్
భళిర కథాలాపం బని, జలజేక్షణ చనియె కేళి♦సదనంబునకున్. 69

---

పా. 1. బనిఁ♦బూని విభుం డడిగెం బ్రియంబునన్.

చ. చని జలజాప్తుఁ డస్తగిరి ♦ చాటున కేఁగినయంత మజ్జనం
బొనరిచి వ్రాఁతపుంబనుల♦నొప్పు దుకూలము గట్టి రత్నకాం
చనమయభూషణంబులును ♦ సారపుమేల్తిలకం బమర్చి ఘు
మ్మనువిరు లూని యచ్చెలి నృ♦పాగ్రిణి చెంగటి కేఁగుచున్నెడన్. 70

మ. కని చక్రాంగవిభోజుఁ డిట్లనియె శృం♦గారంబు లెస్సాయె మే
ల్దనరారెన్ భళి హాంతకారివిగదే ♦ తన్వంగి రాజాంతికం
బునకుం బోయెద వేమొ యొక్కకథ యొ♦ప్పం దచ్చమత్కారము
ల్విని పోనిల్పిన నంటిపండ్లనె ననున్ ♦ వేఁయించు మంత న్వెసన్. 71

కం. అన విని హేమావతి మో,మున నవ్వు జనింపఁ గతల♦మునిపుట్ట సుమీ
కన నీదుకడుపు బ్రహ్మకు, వినఁ దరమా యనుచుఁ బలికి ♦ వినుపింపు మనన్. 72

కం. కప్పురపుఁదునుక లలవడ, విప్పుగ విరితేనె వాన ♦ విడివడి కురియం
జొప్పడర హంససురపతి, చెప్పెను హేమావతీకు♦శేశయముఖికిన్. 73

---

## అయిదవరాత్రి కథ.

కం. ఆలింపు మహాభ్రంకష, కేళీప్రాసాదనీల♦ఘృణిగాఢతమః
పాళీ సతతవిహారిసు,చాళీ పురజారకులట♦మై సర మనఁగన్. 74

తే. గీ. పుర మొకటి యుల్లసిల్లు సం♦పూర్ణపూర్ణి, మానిశాకరధిక్కారి♦మంజులాస్య
యందు నొకగొల్ల సంపల్ల♦తాంగిపిల్ల, విజయుఁ డనుపేర సిరులచే ♦ వెలయుచుండు. 75

సీ. కంబళి తలదుడ్డు ♦ కవ్వము మజ్జిగ బాన గొడ్డలి నుచ్చు ♦ పాఁతలగుది
కావడి యుట్లు చి♦క్కము సంది కడియంబు నూకలతోఁప పొ♦గాకుతిత్తి
బొప్పి మజ్జిగముంత ♦ బొటమంచి పిల్లలగూడు దామెనత్రాడు ♦ కోఁతకత్తి
తొర్లుగట్టెయు జల్ల♦దుబ్బ [1]చిల్కడమంజ బూజబిందెలు వెన్న♦పూసచట్టి
తే. గీ. పాలబుడిగలు వడిసెల ♦ ప్రాఁతమెట్లు, మలుపుమందులపొడిబుఱ్ఱ ♦ మన్నెముల్లు
తోలుకుల్లాయి కొడుపును ♦ దొడ్డికంప, చుట్టు చవిరెయుఁ కుదురొప్ప ♦ సొలయు నతఁడు.

చ. కుఱుబవి దోరచార నర♦గొం డ్లెఱగొండ్లివి మూలబొల్లివిఁ
నఱిగివి నెట్టు జోడుపులి ♦ నల్లని వెఱ్ఱవి పుల్ల చిల్లవిఁ
బఱిగివి మొఱ్ఱవిఁ గరక♦పల్లవి నాఁ దగుపేళ్ల నొప్పెడుఁ
గొఱియలు వేనవేలుఁ గల ♦ గుంపు లసంఖ్యము లుండు వానికిన్. 77

---

పా. 1. చిల్కుడుగుంజ

తే. గీ. బోడ పోడ మట్టినా మంపు ♦ బొల్లి పోరి, జాలనల పుల్లవెరబట్ట ♦ చార బరగి
కఱుకుగడ్డము తెలి మొఱ్ఱి ♦ గౌర దోర, వనెను పేరుల మేఁకగుం ♦ పతనికుండు. 78

తే. గీ. మట్టె చేమట్టె కరపస్సె ♦ మైలబట్ట, కోరతల పూజ వెఱ్ఱని ♦ చార బోడ
పోడ కపిలకన్నె బొలిచుక్క ♦ పుల్లవి యను, పేళ్ల నొప్పారి మందలోఁ ♦ బెక్కుగలవు. 79

కం. పల్లవి నల్లవి యెనుములు, బిల్లల నిడుగోడిగలునుఁ ♦ బెంపుడు పెదపొ
ట్టెళ్లును దుక్కెడ్లును విల, సిల్లఁగ నావిజయుఁ డచట ♦ సిస్తుగ నుండున్. 80

కం. అతనికి మంజుల యనఁగా, సతియొక్కతె గలదు దాని ♦ సరి యెన్నుటకుం
గొతుకుపడు రతికిఁ జతురత, యితరుల నిఁక నెన్న నేల ♦ యిందునిభాస్యా. 81

కం. ఆకుల్కు లాయొయ్యారము, లాకనుదమ్ముల మెఱుంగు ♦ లాకౌను బెడం
గాకుచయుగ్మము బింకం, బాకోయిలముద్దుఁబల్కు ♦ లతివకె చెల్లున్. 82

కం. ఆబిడ గర్భోత్పత్తికి, నై బగిసియుమాలి పతిర ♦ తాదృతిమీఁదన్
లోఁ బొడమిన 1రుచిమించినఁ, బ్రాబల్యము గలుగు విటుల ♦ పాలిది యయ్యెన్. 83

సీ. వేశ్యాపతి చకోర ♦ విసరంబులకు నురి విట మృగావళికి ల ♦ విత్రికంబు
యువరాజికరులకు ♦ నొనరారు నోదంబు కాముక వ్యాఘ్రింపు ♦ గమికి బోను
పాంథమానసమత్స్య ♦ పటలికి గాలంబు పల్లవోక్షములకు ♦ నల్లెత్రాడు
షిద్గకపోతరా ♦ జికిఁ జేరు దీమంబు లలిభుజంగవిహంగ ♦ ములకు జిగురు

తే. గీ. జారకీరిపంక్తులకు మోటు ♦ సరసశశక, ములకు గట్టువ యుపకాంత ♦ ముఖ్య చటక
సంఘములకును గుబ్బిక ♦ శంబరారి, ఘోరరణహారి జయభేరి ♦ ఘోషనారి. 84

తే. గీ. ఇత్తెఱంగునఁ జిత్తజా ♦ యత్తచిత్త, వృత్తిఁ గైకొని జారుల ♦ పొత్తు సలిపె
నలసటయు వేసటయు లేక ♦ యటుల నయ్యుఁ, జూలు గాంచఁగ లేక యా ♦ సుదతి గుంది.

చ. తిరుమలకంచిపుష్పగిరి ♦ తీర్థములుం జని కొంగుముళ్లతో
వరములు దంపతుల్వేడియ ♦ వారిగఁ గాన్కలు వైచి యంతటన్
బరికలు దృష్టిదీపములుఁ ♦ బన్నినగద్దెలు పెట్టి యేమిటన్
గర మగు పుత్రివాంఛ కడఁ ♦ గానఁగలేక విచారఖిన్నులై. 86

వ. ఉన్నసమయంబున. 87

ఉ. కొమ్ములు వీరణాలు జిగి ♦ గుల్కెడు వ్రేఁతల కృష్ణలీలలం
గ్రిమ్ముగుడార్లు వీరుఁ డగు ♦ కాటమరాజుకథానులాపముల్

పా. 1 ధృతిమించినఁ,

బమ్మెన పుస్తకాలు ముఖ♦పట్టెడి కట్టురుమాలలు స్నానా
సొమ్ములు నామము ల్వెలయు ♦ సుద్దుల గొల్లలు వచ్చి రెంతయున్. 88

వ. ఇట్లు వచ్చి. 89

సీ. ఘళఘళవీరణాల్ ♦ ఖళిఖళివాయించి పోటుబో కొమ్ములు ♦ నాట నూఁది
దొనకొండగంగను ♦ దొలుత సన్నుతిచేసి కృష్ణున కతిభక్తిఁ ♦ గేలుమోడ్చి
యాదికాలపుగొండ్రి ♦ నందఱఁ గొనియాడి తాతతండ్రులపేళ్లు ♦ దలఁచి పొగడి
బిరుదుల నరుదుగాఁ ♦ బేర్కొని మొఱయించి దీవించి వీరుల ♦ త్రోవలెన్ని

తే. గీ. కులముపెద్దల కథ లామి♦కొనఁగఁ జెప్పి, సివము పుట్టించి పుత్రులఁ ♦ జెందఁగలరు
వీరులను గొల్వుఁ డని చెప్పి ♦ వీడుకొల్పఁ, జనిరి సుద్దులగొల్లలు ♦ సంతసిల్లి. 90

వ. ఇట్లు వారలు సెప్పిపోయిన నత్యంతభక్తిప్రియపూర్వకంబుగా నంతట. 91

మ. కొలిచెం గాటమరాజులన్ నతులు చే♦కూర్చెన్ మహావీర్లకుం
బొలముల్ రాజుల నెంతొభక్తిపరతం ♦ బూజించె నాగంగకున్
వెలయన్ వేటలు బోనముల్ సిదులు గా♦వించెన్ సుతోత్పత్తికై
చెలి యాలాగున నల్ప దైవముకృపన్ ♦ సిద్ధించెఁ దద్వాంఛయున్. 92

వ. అంత. 93

ఉ. మోము వహించెఁ [1]దెల్పు, మఱి ♦ మోవిరుచు ల్దగ సందడించె, మృ
త్స్నమతి మించెఁ, జన్మొనలు ♦ శ్యామలకాంతి వహించె, యానముల్
వేమఱు మందగించెఁ, గడు♦వృద్ధి భజించెను గౌను, చిట్టుముల్
రామకు సంభవించె నభి♦రామతరంబుగఁ జీర చిక్కన్. 94

తే. గీ. అంత నొకనాఁడు శుభముహూ♦ర్తాంతరమున, మంజులాంగన రంగైన ♦ మంచిమణుల
నొఱపుగాఁ దీర్చి కట్టిన ♦ యొక్కదివ్య, మందిరములోనఁ జిన్నికు♦మార్తెఁ గనియె. 95

చ. వడఁకెడుకౌను, రంగుతల♦వాసెనగట్టినకొంగు, పుక్కిటన్
విడియపుఁజొంగు, మైలఁగొని ♦ వ్రేలెడుచేలచెఱంగు, పాలచే
పుడు చనుదోయిపొంగు, వజ♦పూసలవింతబెడంగు, నూనెక్రొ
మ్ముడిరుచి, చుక్కబొట్టమర ♦ ముద్దియ బొల్చెను బిడ్డకాన్పునన్. 96

వ. అంత. 97

కం. అది ప్రతిపచ్ఛశిరేఖా, భ్యుదయమువలె [2]దినముదినము ♦ పొడవున కళలం
బొదువంబడి లేఁబ్రాయపు, మద మెక్కఁగ ముద్దుగులికె ♦ మనమలరారన్. 98

---

పా. 1. జల్వ జగి ♦ మోవిరుచు  పా. 2. దినదినమ్ముఁ ♦ బొదలెడుకళలం

కం. చన్నులపస, యటుమీఁదటఁ, గన్నులపస, ముద్దుగులుకఁ♦గలముఖమున మే
లొన్నిన్నెలమిస, జిగిబిగివగ, చిన్నెలమస చూచి వలచుఁ ♦ జిత్తజుఁడయినన్. 99

తే. గీ. తమకమున కొగ్గ దనెడునే♦రము ఘటించి, తరుణతను వెళ్లఁ గొట్టింపఁ ♦ దలఁచి మదనుఁ
డీర్ష్యఁగుండలు వెళ్ల వే♦యించె ననఁగ, బాల్యము చనంగఁ గుచము లే♦ర్పడియె సతికి.

తే. గీ. కొమెరపొక్కిలి బంగారు♦కుందె యందు, రతియు శృంగార మనుధాన్య♦రాశి నించి
దంచ నిడినట్టి రోఁకలి♦సంచుమీఁఱి, రోమరాజి దనర్చె నా♦రూఢిగాఁగ. 101

కం. చెందిర మామెయిసిరి సిరి, మందిర మామోము గోము ♦ మదనారిలస
న్మందిర మాకుచయుగ మిం,దిందిర మావేణి యవఁగ ♦ నెలఁత రహించున్. 102

సీ. రాణించు నెఱికురు♦ల్వేణి కందకమున్న కనుబొమ ల్వక్రిమఁ ♦ గనకమున్న
జిగిగుబ్బలు మొగాన ♦ కెగయ నిక్కకమున్న నునుఁబల్కు నేర్పుగ♦కొనకమున్న
చూపులుచుఱచుఱఁ ♦ జూడ నేరకమున్న వీనులు మరుకథ ♦ ల్వినకమున్న
లలితయానము మదా♦లసతఁ బూనకమున్న 1బెడగారు త్రివళులే♦ర్పడకమున్న

తే. గీ. చిత్తజుఁడు తమ్మిపూఁదూఁపు ♦ చెఱకువింటఁ, గూర్చి గుఱిచేసి తనునేయ ♦ గొల్లవనిత
మమతఁ గని చోరసురతసా♦మ్రాజ్యమునకు, దిట్టతనమునఁ బట్టంబుఁ ♦ గట్టుకొనియె. 103

వ. అవ్విధంబున ఘోషకన్యారత్నంబు శైశవయౌవనసంధిసమయంబున మన్మథప్రేరితయై విజృంభించి వర్తించునప్పుడు. 104

సీ. చిన్నిచన్నులు గోళ్ళఁ ♦ జీరిచెక్కులుగొట్టి కౌఁగిలించు మటంచుఁ ♦ గదియఁదివురు
గిలిగింత లొకకొన్ని ♦ కలయంగ నెనయించి మోవి నొక్కుమటంచు ♦ మొనసి నిలుచు
నిచ్చకం బిగుకొత్తఁ ♦ బచ్చిదేరఁగఁ బల్కి ముద్దిడరా యని ♦ 2మురియునచట
బకదారి కివకివ ♦ లొకదారిమైఁ జూపి తమిఁ గూడరా యంచు ♦ దాపుకేఁగు

తే. గీ. 3నుపరతికి సొచ్చుఁ బరిహాస♦కోక్తులాడుఁ, జేష్టలెనయించుఁ బాలయల్క♦చేతఁ గుందు
వెతల నేఁకారు మది నిట్లు ♦ విటులఁ జూచి, చిత్తజోన్మత్తయై గొల్ల♦చిన్నెలాడి. 105

చ. జిగినెరవన్నెకాఁ డెదుటఁ ♦ జేరినవేళల ముద్దుగుల్క మె
ల్లఁగ నడవం దొడంగు ఘన♦లౌల్యము చూపులఁ జూచు మోహపుం
బిగువునఁ బల్కరింపఁ జను ♦ బెక్కుచుఁ బయ్యెదకొంగు దీటుఁ డె
క్కఁగఁ జిఱునవ్వు నవ్వు 4నొడఁ♦గూడిన సిగ్గున నేఁగు నవ్వలన్. 106

తే. గీ. ఇట్లు చరియించు నయ్యింతి♦యెమ్మె లెఱిఁగి, పొరుగునని యుండెడు నియోగి♦పుత్త్రుఁడొకఁడు
జారశేఖరుఁ డనుబ్రహ్మ ♦ చారి మీఱి, యొంటిపాటైనఁ దెరువుల ♦ నొడిసిపట్టి. 107

---

పా. 1. కటిసీమ విస్తృతిఁ ♦ గనకమున్న   పా. 2. యొద్దికరుగు   పా. 3. నుపరతికి నెంచుఁ
పా. 4. రతి కూడిన

మ. అనవూలాప మచుంబితాధర మశ♦య్యాన్యోన్యవిక్రీడితం
బనమాలింగన మస్థిరోత్సవ మధై♦ర్యస్తంబతాంబూలితం
బనుదంతాంక మనిర్భయం బమణితం ♦ బనస్రస్తనీవ్యాదికం
బసిధారావ్రత మైన చోరరతికా♦ర్యం బప్డు సంధించినన్. 108

సీ: చిఱుచెమ్మటలతోడఁ ♦ బెరసినఫాలంబు కసవంటివీడిన ♦ కప్పుఁగొప్పు
కడురక్తమము గల్గు ♦ గండస్థలంబులు వెనుకకు దిగజాఱి♦వ్రేలు సరులు
పులకలు నిండారఁ ♦ బొడమినదేహంబు ధూళిధూసరితమై ♦ దొరయువీఁపు
1మందస్మితంబైన ♦ మధురతరోష్ఠంబు మందవీక్షణనమ్ర♦మస్తకంబు

తే. గీ. తడఁబడ వడంకుచుండెడు ♦ తలిరుఁదొడలు, వదలిన బిగించి సవరించు ♦ వలువ దనరఁ
దిరిగి చూచుచుఁ దనయింటి ♦ తెరువుఁ బట్టి, గొల్లప్రాయంపుఁ జిల్కలకొల్కి చనియె.

కం. అది మొదలు జారశేఖరుఁ, డాదవినయపుడెల్ల గొల్ల♦యుగ్మలి నెంతే
మదనాహవమునఁ దేల్చుచు, మది మీఱఁగ మరుని లంకె♦మానిసిఁ జేసెన్. 110

కం. చలి విడిచి జారశేఖరు, కలయిక చవిమరిగి తెరువు ♦ కాపెట్టుక ని
చ్చలు లేనిపనుల నెన్నే, నలవఱచుక యుండు విరహ ♦ మగ్గల మైనన్. 111

ఉ. కమ్మనిజున్ను మంచినెయి ♦ గట్టిది మీఁగడతోఁ బెరుంగు చొ
క్కమ్మగు జున్నుపాలు చిలు♦క న్మిసిదీసినవెన్నముద్ద వె
చ్చమ్ముల కైదునాల్గు దివ♦సాలకు 2మాడలముల్లె లిమ్మెయిం
గిమ్మనఁ దెచ్చియిచ్చి రతి♦కిం బ్రతిమాలుచుఁ బిల్చు నిచ్చలున్. 112

తే. గీ. ఇటుల నజ్జారశేఖరుఁ ♦ డేలఁబట్టి, యింటిలో నున్నవస్తువు ♦ లెదురువెట్టి
వలపులకుఁ జిక్కి 3సొక్కి కే ♦ వలముదక్కి, సంతసంబునఁ గొన్నాళ్లు ♦ జరిపెఁ గన్నె. 113

ఉ. అంతటఁ బెండ్లిచేసెద మ♦టంచును దత్సతితల్లిదండ్రు ల
త్యంతమహోత్సవంబునఁ గు♦లావళిలోఁ దగురూపురేఖలం
గంతునిఁ బోలునట్టి మృదు♦కాయము గల్గినవాని నొక్క శ్రీ
మంతుని జూచి తెచ్చుటఁ గు♦మార్తెవివాహముఁ జేసి రెంతయున్. 114

తే. గీ. వేగఁ 4దలఁబ్రాలుఁ దోమడి ♦ నాగవల్లి, యైనపిమ్మట నత్తింటి ♦ కనుపఁ దలఁచి
పయన మొనరించి నెమ్మదిఁ ♦ బ్రియముదనర, ననుఁగుఁగూఁతును నల్లుని ♦ ననిపిరపుడు. 115

ఉ. 5అవ్విధినంపఁ దా బసపు♦న న్నలరించినబొట్టు నున్నఁగా
దువ్విన కొప్పు వన్నెగల ♦ దుప్పట మొప్పు విడెంబు పుక్కిటం

పా. 1. మందస్మితంబగు ♦ మధురాధరంబును పా. 2. రూకలముల్లె పా. 3. కేరడ♦ములకుఁ జొక్కి
పా. 4. దలఁబ్రాలుఁ గాఁ జేసి పా. 5. దువ్వెనతీరుగాఁ బసపు♦తో నలరించిన

1మవ్వపు కొంగునూల్ రవల♦మట్టెలు పట్టెలపూలగాజులున్
నివ్వటిలంగ గోపహరి♦ణీతరళేక్షణ పోవ ముందటన్. 116

సీ. సద్విజరాజనం♦శ్రీయమహాస్పదలీల శాఖలు కకుబంత♦చయముఁ బ్రాఁక
సాంద్రపర్ణక్రమ♦స్థాయిత్వమున మించు జట లనంతావాప్తి ♦ పటిమ మెఱయ
విష్ణుపదార్పిత♦విహితవృత్తిఁ దనర్చు నగ్రిము ల్సప్తాశ్వ ♦ ననుకరింప
నహిలోకరాడ్భూష♦ణాధారమై యొప్పు మూలంబు కుండలి♦ముఖ్య దొరయఁ
తే. గీ. దనమహాగమవిఖ్యాతి ♦ ధరణిలోన, నఖిలజనులకు నద్భుతం ♦ బావహిల్లఁ
దేటపడఁగాను జూపెడు ♦ తెఱఁగు దోఁప, మలసి చూపట్టెస్మృతి నొక్క ♦ మఱ్ఱిచెట్టు. 117

కం. ఆవటభూజము చెంగట, త్రోవను ముందట విభుండుఁ ♦ దొయ్యలి వెనుకం
బోవంగ జారశేఖరుఁ, డావెలఁదికి నెదురుపడియె ♦ నంతన్ వేడ్కన్. 118

చ. తమకముఁ బట్టఁజాలక, ప♦థంబున ముందరఁ బోవు భర్తవి
క్రమము దలంపఁబోక యధి♦కం బగుమోహము నిల్పలేక, వే
గమె యెదురించి వచ్చు నుప♦కాంతుని వల్లవకాంత తెప్పనం
గమకముఁ జేసి గుబ్బకవ♦కౌఁగిట దార్చి సుఖించె వేడుకన్. 119

తే. గీ. బ్రామికలు దీర, నన్యోన్య♦భాష లూరఁ, గలయికలు జాఱ, దాపాగ్ని♦కణము లాఱ
సౌఖ్యములు మీఱఁ జేష్టలు ♦ సరణి దేఱఁ, జెలఁగె నయ్యిద్దఱకు దృఢా♦శ్లేషణములు. 120

కం. ఆయెడ నిజపతి సతి రా,దాయె నని తలంచి మరలి ♦ తనుఁ జూచినచో
నాయింతి పతికి హితముగ, నేయనువున బొంకవలయు ♦ నెఱిఁగింపఁగదే. 121

కం. ఆమాడ్కి హంస మడిగిన, హేమావతి యనియె నెవ్వ ♦ రికు నిక్షేపం
బేమో వారే కనవలె, నేమనుచుం దప్పఁ దార్చె ♦ నెఱిఁగింపుమనన్. 122

ఉ. హంసహిమాంశుఁ డిట్లనియె ♦ నయ్యలివేణిని భర్త జూడ జా
రాంసమునందు వ్రేలు కుల♦టాంగన దేహము కంప మొంద సా
యంసమయాదిఁ గోకివలె ♦ నారట మందుచు పీఁపుదట్టు మో
2పుంసవరా యటంచు విట♦పుంగవు కర్ణము నాటఁ జెప్పినన్. 123

తే. గీ. జారశేఖరుఁ డాగొల్ల♦సకియ నపుడు, పీఁపుదట్టుచు వెఱవకు♦వే యటంచు
పలుకరించెడునంతలోఁ ♦ బఱువుబాఱి, దానిప్రియనాయకుఁడు భీతి ♦ డాయ వచ్చె. 124

కం. వచ్చి యిది యేమెచెలి యని, విచ్చలవిడి పీఁపుజఱచి ♦ వెఱవకు మని లోఁ
జొచ్చిన భయమున నదరిన, గచ్చున నిట్లనియె గోప♦కన్యక పతికిన్. 125

పా. 1. మవ్వపుఁబోఁగునూల్ పా. 2. పుంసవరాజ యంచు

ఉ. ముందర నీవుపోవ భయ♦మున్ వెదచల్లెడు నీవటద్రుసం
క్రిందనుఁ జూచి గుండెలు వ♦కావకలై వెతఁ బొంది యీదయా
తుందిలు పొందునం బ్రతుకు♦త్రోవకు వచ్చితి లేకయున్న నా
కుం దరిలేక యొంటి నిటఁ ♦ గుందుదుఁ గాదె యనుంగువల్లభా. 126

కం. అని చెప్పి నిశేశ్వరుచే,తను దన మోహంపువిటునిఁ ♦ దద్దయుఁ బొగడిం
చి నలినలోచన వేడుక, దనరారఁగఁ జనియెఁ బతియుఁ ♦ దానును సరణిన్. 127

కం. అట్టియుపాయము నీకుం, దట్టిన నృపుపొందుమాటఁ ♦ దలఁపుము లేదా
గట్టిగ నీమగఁ డెఱిఁగె,నట్టయితే సిగ్గుపాటు♦తో గాదె చెలీ. 128

ఉ. నావిని హంసపల్కు వద♦నంబున హాసము దోఁపఁ బల్కె హే
మావతి యద్దిరా మగల♦మార్చు నెలంతదిగాక యింక క
ద్రా వివరించి చూడ వసు♦ధాస్థలిలో ననునంతలోపలన్
వేవినఁ గేళికాగృహము ♦ వే గదిసెన్ నృపమోహమగ్నయై. 129

వ. మఱియు నయ్యహర్ముఖం బప్రకాశమానకావ్యలక్షణంబయ్యును బ్రకాశమానకావ్యలక్షణంబై, యనిద్రాళువనాంతరాళపుండరీకసముదయంబయ్యును నిద్రాళువనాంతరాళపుండరీకసముదయంబై, యప్రస్ఫుటీకృతకువలయంబయ్యును బ్రస్ఫుటీకృతకువలయంబై, యభాసమానద్విజరాజమానం బయ్యును భాసమానద్విజరాజమానంబై, యవిభాసితారాళిగణంబయ్యును విభాసితారాళిగణంబై యొప్పె నప్పుడు. 130

కం. ఒకనిమిషం బొకమాసం, బొకఘటికయ యొక్కయయన ♦ మొకజా మొకయేఁ
డొకదిన మొకకల్పముగా, సకి గడపెం బవలు విరహ♦సంతాపమునన్. 131

కం. రవి యనెడు కాలచక్రము, దివసాంతప్రళయవేళ ♦ దీప్తాగ్నులచే
దివిఁ గాల్చి యడఁగ నమ్మషి, నివహం బన ఘోరతమము ♦ నిండెం బెలుచన్. 132

వ. అప్పుడు. 133

చ. చందురుకావిపావడప♦స ల్వెలిఁ జిమ్మఁగఁ జల్వఁగట్టి కా
లందెలు సందిదండలును ♦ హారములు న్మణికుండలమ్ములుం
బొందుగఁ దాల్చి వాసిలెడు ♦ పూలసరు ల్కచసీమఁ జుట్టి పొ
ల్పొందఁ గళాన గందవొడిఁ ♦ బూసి మృగేక్షణ 1వెళ్లవచ్చినన్. 134

కం. చూచి కలహంస మిట్లను, వాచాపై చిత్రి మెఱయ ♦ వనితా చోద్యం
బై చెలువొందిన దొకకథ, యాచించి నృపాలుకేళి ♦ కరుగు మటన్నన్. 135

పా. 1 వచ్చినిల్చినన్.

కం. ఆమధురతరసుధారస, సీమాసామోక్తి ధార ♦ చెవులకు నత్యం
తామోదము చేసిన విని, హేమావతి యడుగ హంస ♦ మిట్లని పలికెన్. 136

ఆ ఱ వ రా త్రి క థ.

శా. జంబూద్వీపధరారవిందముఖ కం♦చద్భూషణప్రాయమై
సాంబప్రస్థ మనంగ నొక్కటి మహా♦స్థానీయ మొప్పారు ర
మ్యంబై యప్పురిలోన నుండు హరిశ♦ర్మాఖ్యుండు విప్రాన్వవా
యంబున్ శోభలఁ జేయుకర్మఠుఁడు క♦ల్యాణాంగి యాలింపుమా. 137

సీ. బలు కంచుగుబ్బబో♦ల్తలుపులు తీనెలు వాకిలి నడవ చా♦వడియు మగులు
[1]నఖిలవస్తువుల ధా♦న్యముల కణంజలు దేవతార్చన మిద్దె♦తావి పడక
యిలు వంటకొట్టంబు ♦ పలగడి పసిదొడ్డి పసపాకుపందిరి ♦ బావి తోఁట
మడిసంచి దోవతి♦మడతవేత్రుండెంబు ధమనికుండంబు బృం♦దావనంబు

తే. గీ. నక్షతలచిప్ప సాన చి♦త్రాసనమును, గిండి చిటిచాప పళ్లెంబు ♦ గిన్నె పెట్టె
కుశసమిత్పత్రములు పెట్టు ♦ గొప్పయటుక, యమరఁ గాపుర ముండు న♦య్యగ్రజుండు.

చ. అతనికి హేమచిత్ర యను♦నంగన గ్రుంగినవెన్కఁ జారుభా
స్వతి యను ముద్దుగుమ్మను వి♦వాహ మొనర్చిన నింతి యొప్పె న
య్యతనునిచేతికత్తిచివు ♦ కంతయుఁ బోయినఁ జేవఁజిక్కు స
మ్మతి నెలజవ్వనంబు పొడ♦మన్ జిగిదేఱెను దేహసంపదన్. 139

కం. ఆపటుకుచములచందం, బాపెద్దపిఱుందుమంద ♦ మామో మందం
[2]బాపాంకం బాబింకం, బాపంకజముఖికె కాక ♦ యన్యకుఁ గలదే. 140

ఉ. ఆమధురోష్ఠి గుబ్బకవ ♦ నబ్బినసిబ్బెపుఁదళ్కు లందమా
యామృదులోరుకన్నుఁగవ ♦ నన్నువ వెన్నెలలొల్కుచందమా
యామితమధ్య సోముకళ ♦ లామినమోము మెఱుంగులందమా
యేమని చెప్పవచ్చు నలి♦నేక్షణ లక్షణరూపసంపదల్. 141

తే. గీ. వక్రయానంబుతో నాగ♦చక్రకుచలు, నిలువుఁగన్నులతో దేవ♦నీలకచలు
నాతిమృదుగతి చపలేక్ష♦ణాముల కలికి, క్రిందుమీఁదై రి కాదె పూ♦ర్ణేందువదన. 142

సీ. నెఱిగొప్ప మేషసం♦దేశంబు కనుదోయి యందమా కువలయా♦నంద మఱయఁ
బొంకపుమోము ప్ర♦బోధచంద్రోదయం బధరంబు మణిసార ♦ మారఁ జూడఁ

---

పా. 1. సకలధాన్యముల సం♦చయమొప్పకొట్టిడీల్ పా. 2. బాపెన్నెటి జిగి బింకం

జెలువంపుఁ జిఱునవ్వు ♦ 1శృంగారకౌముది స్తనయుగంబు రసమం♦జరి నుతింపఁ
గరరుహంబులకాంతి ♦ కావ్యప్రకాశిక ఘననితంబము రసా♦యనము దలఁపఁ

తే. గీ. దను వలంకార మతనుశా♦స్త్రములు చూపు, లహహ మధ్యంబు నాటకం ♦ బవనిలోన
విద్యలకునెల్ల మూల మీ♦వెలఁదిఁ గనిన, విద్యలు పఠింపఁగా నేల ♦ వేఱె బుధులు. 143

వ. అది మఱియును. 144

చ. బుగడలు నానుతీఁగె మెఱు♦పుల్గొనుకమ్మలు గుండ్లపేరు బ
ల్పగడపుఁ జేకటుల్ రవల♦పల్లెరుపువ్వులు కుప్పెసౌరమున్
జిగికడియంబు లాణిమణి♦చెక్కినముక్కర గిల్కుమెట్టెలున్
సొగసు దలిర్ప నచ్చెలియ ♦ సొమ్ముల నెమ్మెల నొప్పు నెంతయున్. 145

సీ. కప్పుఁగొప్పుఁ బడాబ♦గలఁ జూడనిఘనుండు వదనంబునకు వింత♦పడనిజనుఁడుఁ
గన్నుల కాశ్చర్య♦గరిమఁజెందనివాఁడు సరసభాషలకు మె♦చ్చనినరుండు
2గబ్బిగుబ్బలను గ్రే♦గంటఁ జూడనివాఁడు గౌను నుతింపని♦కాముకుండుఁ
గటికి శిరఃకంప♦పటిమఁబూనని మర్త్యుఁ డంఘ్రులు బాపురే ♦ యననివిటుఁడు

తే. గీ. నాస్తి యనృతంబు దబ్బర ♦ నహి హుళిక్కి, కల్ల మఱియిల్ల లేదు భూ♦గతులలోనఁ
గ్రమ్మజిగిఁ జిమ్ము నమ్ముద్దు♦గుమ్మ హొయలు, చెలువ మెటువంటిదో కాని ♦ చిగురుబోణి.

సీ. పాపట యిడి నూనె ♦ పంకెనతో నున్నఁగా దువ్వి నెఱులు కీ♦ల్గంటు వైచు
నెఱ యొయారముతోడ ♦ నీటికాఁగులనీడఁ జూచి కుంకుమబొట్టు ♦ సున్నదీర్చు
గంధంబు పూసిన♦గతి గబ్బిజిగిగుబ్బకవమీఁద గుత్తంపు♦రవికెఁ దొడుఁగు
నుమ్మెత్తపూరీతిఁ ♦ గ్రిమ్ముకుచ్చెలు నేలఁ జీరాడఁగాఁ జల్వ♦చీరగట్టు

తే. గీ. నీటుబెళుకున దిగజాఱ ♦ పైఁటచెఱఁగు, జగ్గు తోఁద్రోపుఁ గాటుక♦సిగ్గు కనుల
మిక్కుటపుఁ జూపు మెఱుఁగు త♦ళుక్కు రనఁగ, వెడలు నొకవేళ గృహము న♦వ్విప్రవనిత.

కం. పతిరతిని దృప్తిఁ బొందక, మతిఁ జపలత పుట్టి యన్య♦మానవురతికిన్
హితవుపడి మోహదశలన్, బతిమాలి కృశించుఁ జారు♦భాస్వతి యెపుడున్. 148

తే. గీ. పురములోఁ గల్గు మోహంపుఁ ♦ బొగరు చిగురు, కోడె నెఱజాణవిటులకుఁ ♦ గొంతకొంత
వింతరతితంత్రములు నేర్పి ♦ విడిఁబడున్న, కంతుమదదంతి పంతంబు ♦ గదియఁ దిరుగు. 149

కం. ఈలీలఁ గొంతకాలము, బాలామణి సంచరించు ♦ ప్రాయమునాఁడే
కాలూఁదియున్న యిందిర, తాలిమిచెడి నిలువ కచటు ♦ తలఁగినయంతన్. 150

సీ. కులమహీరుహమహో♦క్రూరకుఠారంబు కోపాగ్నివృద్ధి కృ♦ద్ఘోరనాడి
సంసారసుఖశైల♦శతకోటిపతనంబు దేహవ్యథాలతా♦దోహదంబు

పా. 1. సిద్ధాంతకౌముది పా. 2. గబ్బిగుబ్బలతీరుఁ ♦ గాంక్షింపని విటుండు

శశిముఖీదృక్ప్రాంత♦సంరోధిజంబీరఫలరసం బతిధైర్య♦భర్మకషము
ప్రీతిభాంబుహృద్గ్రీష్మ♦పవనంబు నిజవధూరచితనిందాపార♦నిచయఘనము
తే. గీ. సంతతాహార సంపాది♦సంభ్రమప్ర,యత్నవిఘ్నద మతనుక్షు♦ధార్తిదాయి
యమితలఘుతాశ్రయస్థాన♦మై కడంగు, భూరిదారిద్ర్యదోషంబు ♦ పొదివె నపుడు. 151

కం. అట్టిమహాదారిద్ర్యము, దొట్టిన హరిశర్మ ధృతియుఁ ♦ దూలక తృష్ణం
దొట్టుపడకుండఁగాఁ దన, పట్టపుటిల్లాలిఁ గష్ట♦పడి పోషించెన్. 152

సీ. పంచాంగములు సెప్పి ♦ బాజారులోపల రంజిల్ల యాయవా♦రంబు లెత్తి
తలమీఁద మంత్రాక్ష♦తము లుంచి కలకాఁపుటిండ్ల నుపాదాన♦మెత్తి రొత్తి
గ్రహణసంక్రమణాది♦కాలంబులను రాచనగ రాశ్రయించి దా♦నములుపట్టి
తిలలు దర్భలు పూని ♦ తీర్థసన్నిధి మంత్రములు సెప్పి నీరుకా♦సులు గడించి
తే. గీ. జన్నిదము లమ్మి గ్రహశాంతి♦జపముఁ జేసి, శవములనుమోసి దుర్దాన♦సమితి కొగ్గి
వచ్చునాదాయములు గ్రాస♦వాసములకుఁ, గాఁగ దినములు గడపె న♦క్కాలమునను. 153

శా. అంభోజప్రియతిగ్మదీధితిచయ♦వ్యాఘాతనిర్భగ్నభూ
గంభీరోరుబిలోద్గతాధరజగ♦త్కద్రూజరాడ్భోగస
చ్ఛుంభద్రత్నఘృణీభ్రమప్రదకన♦త్సూర్యోపలజ్వాలికా
జృంభత్పావక మొక్క వేసవి జనిం♦చెం గాలకూటాభమై. 154

చ. శరచరసాధ్వసప్రదము ♦ సర్వబకౌఘమదప్రదాయకం
బురుజలహైన్యకారము స♦ముజ్జ్వలసాంద్రమరీచికా సము
త్కరవనరూపకారకము ♦ గాఢపయోధివియోగకార్శ్యభీ
కరతటినీతనుప్రదము ♦ కాసరభీష్మము గ్రీష్మ మెచ్చినన్. 155

చ. పవలను వర్తకాగ్రణి న♦భశ్చల సాగరమధ్యమంబులో
రవి యనెడోడమీఁద నప♦రక్షితిభృత్పురిఁ జేర రా మరు
జ్జవగతి సుళ్లఁ బెట్ట నది♦సాగక చిక్కినమాడ్కి సూర్యుఁ డ
య్యవసరమందు మందగతు♦లానిన దీర్ఘము లయ్యె ఘస్రముల్ 156

తే. గీ. మల్లికాకుంజపుంజాబ్ధి♦మధ్యమున మ,రీచికా స్వాతివృష్టి గు♦రియ జనించి
పత్రిపుటశుక్తు లెండలఁ ♦ బగుల బయలు, పడిన ముత్తెము లన మొగ్గ ♦ లడరఁదొడఁగె.

సీ. దేహంబు బలువెట్ట♦దీసి సిస్తుగ నుంచఁ జలువగాఁ బన్నీట ♦ జలక మాడి
ఘనసారయుక్తమై ♦ తనరారు పాటీరపంకంబు తనువున ♦ నింకఁ బూసి
విమలనాగరచూర్ణ♦విహితమా మాహిషదధ్యోదనము ప్రొద్దు♦తఱి భుజించి
బహుళలామజ్జక♦ప్రసభసౌరభమిశ్ర శీతలజలముల ♦ సేవఁ గలిగి

తే. గీ. కప్పురపుఁదిన్నె లమర బూఁ♦జప్పరములఁ, జిగురుఁ బాన్పుల వసియించి ♦ శీతవాత
జాతకరతాళవృంతము ♦ ల్సతులు వీవఁ, బ్రొద్దు పుచ్చిరి కొందఱు ♦ భోగు లపుడు.

తే. గీ. అట్టివేసవివేళ ధ♦నాఢ్యుఁ డైన, యచ్చటినియోగి చలిపంది ♦ లాది యందుఁ
బెట్టఁ గట్టడిఁ జేసినఁ ♦ బేద లగుటఁ, జారుభాస్వతి హారిశర్మ ♦ చేరి రటకు. 159

సీ. లవణశుంఠీజంఘ♦లరసానుయుక్తముల్ నీరుమజ్జిగకుండ ♦ బారు లలర
లఘులమైలానూన♦లలితసౌరభమిశ్ర శీతలజలకుంభ♦జాత మమర
జీరకకైడర్య♦చారుగంధములొల్కు పలుచనియంబళ్ల♦పంట్లు దనర
రవయుప్పు నీరుల్లి♦రసము నించినకొల్లుగంజికాఁగులగుంపు♦కడురహింప

తే. గీ. గంధబర్హిష్ఠలామజ్జ♦కప్రశస్త, కాయమానముహుర్ముహు♦ర్జాయమాన
మందపవమానఘనసార♦బృందవేది, కాలయ వితాన పానీయ♦శాల యొప్పె. 160

వ. మఱియు నచ్చలిపందిరి గవాక్షాదిసమాకలితవాయుజాతసంచారంబు గావున రఘురామమనోరంజనంబును, బాంధజనసంతాపహారణంబు గావున సత్కృతాసంగమంబును, గబంధప్రచురంబు గావున దండకావనంబును, సితాభ్రసంచయకలితంబు గావున శరత్కాలంబును, నమృతసంపూర్ణకుంభంబు గావున సురేంద్రనివాసంబును, ఛాయాసమేతంబు గావునఁ దపననిలయంబును, వివిధకుసుమసుగంధబంధురంబు గావున నారామంబును బురడించు నప్పుడు. 161

కం. అచ్చలిపందిరిలోపల, వచ్చుచుఁ బాయ్యేటి పరస♦వారికి జల మం
దిచ్చుచును జారుభాస్వతి, యచ్చట హారిశర్మయుండు ♦ నాసమయమునన్. 162

చ. ఉపమరి బుద్ధిశాలి విన♦యోత్తముఁ డప్రతిమప్రభావళీ
తపనుఁ డవార్యధైర్యుఁడు సు♦దారచరిత్రుఁడు సర్వసత్కళా
నిపుణుఁడు రూపనిర్జితవ♦నేరుహసాయకుఁ డొకవిప్రుఁ డా
తపపరితప్తుఁడై జలముఁ ♦ ద్రావఁ బ్రపాస్థలిఁ జేరి వేఁడినన్. 163

తే. గీ. చారుభాస్వతి శీతల♦జలము లపుడు, గిండితోఁ దెచ్చి యిచ్చి వీ♦క్షించి వాని
చక్కఁదనమున కలరారి ♦ సరస కేఁగి, యలఘుసాహసమునఁ దమి ♦ నిలుపలేక. 164

కం. ప్రక్క లెగఁబొడువ మన్మథుఁ, డక్కోమలి పతికి వెఱవ ♦ కానందముతో
నక్కునఁ జేర్చుక పాంథునిఁ, జొక్కుచు నుండంగ మగఁడు ♦ చూచె లతాంగిన్. 165

తే. గీ. ఎట్లు బొంకంగవలె నప్పు ♦ డిందువదన, నేర్పు గలిగినదానవు ♦ నృపతిమౌళి
కేళికైతేను నీకిది ♦ కేవలంబు, దొడ్డగాదు విచారించి ♦ తోనె చెపుమ. 166

కం. అనిన కలహంసపలుకులు, విని హేమావతి విచార♦విపులాబ్ధి మునిం
గినమది నాః కిది తెలియదు, వినిపింపుము నీవె యనిన ♦ విధిహరి యనియెన్. 167

చ. అటువలెఁ జారుభాస్వతి ధ♦రామరుఁ గౌఁగిటఁ జేర్పఁ జూచి తాఁ
జటులతరోగ్రభాష హరి♦శర్మ యదల్చినఁ దొట్రుపాటునం
బెటలక యాతనిన్ వినుము ♦ పిన్నతనంబున దేశచారియై
పటుగతిఁ బోయె మాతులుని♦పట్టి సుమీ యని లేనిదీనతన్. 168

తే. గీ. కాంతునకుఁ దెల్పి మఱిమఱి ♦ కౌఁగిలించి, చెమటకణములఁ దనపైఁట ♦ చెఱఁగుచేతఁ
దుడిచి యాతని కేల్వట్టి ♦ తోడితెచ్చి, మేల మాడుచుఁ బానీయ♦శాల కపుడు. 169

సీ. గొనబు నెన్నాళ్ళకు ♦ క్రొత్తలుగా నేటి కైన నిన్నెనయ నా ♦ కబ్బెననుచు
నీకు నామీఁద దాన ♦ నిజముగాఁ జెప్పుమా నాయందుఁ బ్రేమ క♦ద్దా యటంచుఁ
బదిదినా లుండక ♦ పారిపోయెద నన్నుఁ బోనిచ్చునా వెఱ్ఱి♦దైన ననుచు
నీశ్రాద్ధ సుదివసం ♦ బేనోము 1ఫలమొ నా మనసులో నెంజిలి ♦ మానె ననుచుఁ

తే. గీ. జేరిక లొనర్చి తేనియల్♦జిలుకఁ బలికి, మోహ మూరించి తరితీపు ♦ మోపుకొల్పి
యతనిమీఁదను బఱికిని ♦ హితవుఁ బోడమ, మున్నె యొనరించి వానితో♦మురియఁ దొడఁగె

కం. ఈకరణిఁ జారుభాస్వతి, యాకాంక్షలు దీఱ నాఁడ♦హర్నిశ మతనిన్
దీకొల్పి రతులఁ జివురుం, జేకత్తివజీరు నష్ట♦సేయక యుండెన్. 171

కం. అటువలెఁ గాలోచితసం,ఘటితోక్తిస్ఫూర్తి నీకుఁ ♦ గలిగిన భూభృ
న్నిటలాక్షుఁ గదియఁ జిటిపొటి, నటనలఁ బోవమ్మ కుంద♦నపుజిగిబొమ్మా. 172

చ. అన విని మందహాసము ము♦ఖాబ్జమునం జిగురొత్తఁ గర్ణవే
ష్టనమణికాంతి చెక్కుల హు♦టాహుటినాట్యము సల్ప నారయం
చును దలయూఁచి వేఁకు వగ♦చోఁ జెలి కేళిగృహాంతరంబునం
దెనసి నృపార్పితేచ్ఛఁ బవ♦లెల్లను ద్రొబ్బుచు నుండె నంతటన్. 173

చ. సమయము మహేంద్రజాలకుఁడు ♦ సారసమిత్రుఁ డనేటి పద్మరా
గము వెస మాయఁ జేసి కుతు♦కంబున హా యని నీలపంక్తులన్
భ్రమపడఁ జూపి ఝా యనుచుఁ ♦ బల్కి సుపాణులఁ జేసి చూపెఁ జి
త్ర మనఁగఁ బ్రొద్దుగ్రుంకెఁ దిమి♦రం బెసఁగెన్ దివి నొప్పెఁ దారకల్. 174

కం. ఆవేళను గృహకృత్యము, తావేగమె తీర్చి పేర్చు♦తమకంబున రా
జ్ఞేవేంద్రునిఁ జేరఁగ హే,మావతి నెమ్మదిఁ దలంచి ♦ మహితోత్సుకతన్. 175

ఉ. దిద్దిన నాభినామము, క♦దించిన మేల్మడిచాఱచీర, మై
నిద్దపుఁబూఁత, పుష్పములు ♦ నించి ముడించినకొప్పు, రత్నము

పా. 1. ఫలితమొ మనసులో

లద్దయుఁ గల్గుసొమ్ములు, గ♦ళమ్మునఁ జొక్కపుఁజుక్క యొప్పఁగా
ముద్దియ వచ్చి హంసమణి♦ముందర నిల్చె నృపాభిలాషయై. 176

కం. నిలచిన యాహేమావతి, పొలిచిన కరుణామృతంపు♦భూరితరోక్తుల్
మొలచిన దృష్టిఁ గనుంగొని, దలఁచినపని కపుడు హంస♦ధరణిపుఁ డనియెన్. 177

## ఏడవ రాత్రి కథ.

కం. మున్నొక్కపట్టణంబున, సొన్నారి మిటారి నేర్పు ♦ శూరత్వము గై
కొన్నదియై నడచినకథ, చెన్నుగ విని పొమ్ము కడువి♦చిత్రము కొమ్మా. 178

తే. గీ. అనినఁ జిఱునవ్వు నవ్వి య♦య్యంబుజాక్షి, యేమి చిత్రంబు గల్పించి ♦ తింతలోన
శీఘ్రముగఁ జెప్పి దయచేసి ♦ సెల వొసంగు, మరిగెదను రాజుపొందున ♦ కనిన నపుడు.

కం. కాదంబవంశవల్లభుఁ, డాదృతిని బరాకు మాని ♦ యక్కా వినవే
మోదమున ననుచుఁ జెప్పెను, మేదురమాధుర్యసాధు♦మేధాభణితిన్. 180

కం. విను మనఁగా ననఁగా నిల, ఘన మణివర మనెడుపురము ♦ గలదొకటి వినూ
తనకేతన పటజాత ప్రవన హతసురసురతఘర్మ♦వనవారం బై. 181

చ. కమటము కల్సంచి యొర♦గల్లును గత్తెర సుత్తె చీర్ణముల్
ధమనియు శ్రావణంబు మొల♦త్రాసును బట్టెడ నీరుకావి శా
ణము పటకారు మూస బలు♦నాణెపరీక్షలమచ్చు లాదిగా
నమరఁగ భద్రకారకస♦మాహ్వయుఁ డొకఁ డుండు నప్పురిన్. 182

చ. కరఁగను బోతఁ బోయఁగను ♦ గ్రాఁచి కుదించను గమ్మిదీయఁగా
నొరయఁగ వన్నియల్మిగుల ♦ నుడఁగఁ జూపఁగఁ బూదెగట్ట రే
కరయఁగ దీరఁ జెక్కఁబడి ♦ యచ్చునవ్రేయఁగ సుద్దగించఁగా
సొరిది విచిత్ర చిత్రముల ♦ సొమ్ములు సేయ నతండు నేర్చెలన్. 183

కం. కంతువసంతజయంతుల, నంతసమున గెలువఁజాలు ♦ సౌందర్యమునన్
సంతతసంపద్గరిమఁ గృ, తాంతజిదాప్తుని జయించు ♦ నతఁడు శుభాంగి. 184

వ. మఱియు నాభద్రకారకునిదుకాణంబు నాడీప్రచయంబు గావున శరీరంబును, శుక్రాంగారకప్రశస్తంబు గావున నక్షత్రమండలంబును, గుంభతులాదిసహితంబు గావున రాశికూటంబును, గాంగేయశిక్షకంబు గావున శిఖండిభండనంబును, మధూచ్ఛిష్టసంయోగంబు గావున యవననివాసంబును, వప్రోన్నతంబు గావున మహేంద్రపురంబును, మూషికావృతంబు గావున శూన్యాలయంబును, దీక్ష్ణసాధనయుక్తంబు గావున యుద్ధరంగంబును, శ్రావణయోగంబు గావున వర్షాకాలంబును ననుకరించు. 185

తే. గీ. ఆతనివధూటి శుకఘోటి ♦ నలరు మేటి, యొడయఁ డేలేటి సీమాటి ♦ యొఱపు గోటి
కొన నెగయమిాటి యిదియేటి ♦ కులుకనేటి, పోటి కెదిరేటి శుభవాటి ♦ నీటుమెఱయు. 186

తే. గీ. దానికచకుచగళలక్ష్మిఁ ♦ బూనఁ దలఁచి, నీలశైలాబ్జములు 1నీడు ♦ జాలమి గన
కసవు కట్టెలు నీళ్లునుఁ ♦ గడఁగి మోయఁ, జేసె నే మనవచ్చు న ♦ చ్చెలువ చెలువు. 187

కం. కుందంపురవలు గుప్పెడు, తుందిలపుం జన్నుఁగవయుఁ ♦ దొలతేనెలకున్
విందు లొనరించుపలుకులుఁ, జందురునింబోలు మోము ♦ సకియకె యమరున్. 188

కం. కువలయ మాఁకనుఁగవజిగి, కువలయ మావలుదపిఱుఁదు ♦ కుచకాఠిన్యం
బవలయ మామోహన తా, రవలయ మానఖము లనఁగ ♦ రమణి రహించున్. 189

మ. కచశోభాగరిమంబు నెన్నడుము సైఁ ♦ కంబుగ్రీ మధుప్రాయమా
వచనవ్యూహము లోచనాబ్జములధా ♦ వళ్యంబు శృంగారవ
త్కుచకుంభమ్ములపొంకముగ్ర ముఖశోభాం ♦ కూర ప్రభావంబు న
2య్యచలశ్రోణికిఁగాక నేసకియలం ♦ దైనం బ్రవర్తిల్లునే. 190

సీ. కుప్పె రాగడిబిళ్ల ♦ కుంకుమరేఖ పాపటబొట్టు కమ్మలు ♦ బావిలీలు
లలిసూర్యచంద్రవం ♦ కలు సూసకము కెంపురవలపల్లెరుఁబూవు ♦ రావిరేక
3బుగడలు నాగరిదీగె ♦ సొగసైన మెడనూలు కుతికంట్లు సరపణ ♦ గుండ్లపేరు
సరిగె ముక్కర బన్న ♦ సరము లుత్తుండాలు కంకణంబులు తట్లు ♦ కడియములును
తే. గీ. సందిదండలు నొడ్డాణ ♦ మందమైన, ముద్రికలు హంసకంబులు ♦ మ్రోయు4గజ్జె
లలరు బొబ్బిలికాయలు ♦ గిలుకు మట్టె, లాది యగుసొమ్ము దాల్చి య ♦ య్యబల మెఱయు.

కం. దానినెగాదిగఁ జూడని, మానవులుం దానిపొందు ♦ మదిలో నెపుడుం
బూని తలంపని పురుషులఁ, గానము త్రిభువనములందుఁ ♦ గలవారలలోన్. 192

కం ఆశుభవాటి మనోహర, పేశలతర మృదులవాక్య ♦ పృథుమాధురిచే
నాశపడి మారభూతా, వేశమునఁ జరించు వీట ♦ విటయూథంబుల్. 193

శా. నీవీబంధము చక్కదిద్దు నెఱివే ♦ ణిగ్రీ 5లెస్సఁ గైసేయుఁ గె
మ్మోవిం జిల్కుదరస్మితంబు 6జిగిచూ ♦ పుల్పాఱఁగాఁ జూచుఁ జ
న్గోవ ల్గన్పడఁ జేయు నెచ్చెలియతోఁ ♦ గేల్కేల దట్టించి వా
చావైచిత్రిని ముచ్చటాడు సకి తగ్ర ♦ జారు ల్వీక్షింపఁగన్. 194

తే. గీ. ఇటుల తమిమీారి యానారి ♦ యేపురేఁగి, తిరుగు సవ్వీటఁ గల్గిన ♦ ధీరవిటుల
పొందునకు నాసపడి పోవ ♦ సందులేక, కుందుచుండును విరహార్తిఁ ♦ జెంది యెపుడు.

---

పా. 1. మ్రోల ♦ నిలిచినపుడె పా. 2. య్యచలాభృత్కుచఁగాక పా. 3. బుడగలు నానుఁగ్రో ♦ వులు తీఁగ
కుడనూలు పా. 4. గజ్జియలును కడియంబు లందెలు పా. 5 లెస్సఁగాదువ్వ పా. 6. జిగిచూపుల్ బారఁగాఁ

వ. అంత. 196

మ. చిగురుంగత్తి వజీరుమాఱుపఱుపం ♦ జెన్నొందు నొయ్యారపున్
1సొగసుం గుల్కెడునీటు కాఁడొకఁడు మే♦లొప్పన్నారి ధూర్తాఖ్యచేఁ
దగఁ బెం పొందినవాఁడు శిల్పఘనశా♦స్త్రప్రక్రియ ల్నేర్వఁగాఁ
దెగువ న్నిల్చెను భద్రికారునకు నం♦తేవాసియై వేడుకన్. 197

కం. వానికుశలత్వసంపద, వానిమనోహారిరూప♦వైభవముదగన్
వానిఘనబుద్ధిఁ జూచి య,హీనకరుణ నింట నిల్పి ♦ హిత మలరారన్. 198

తే. గీ. కీర్తికై భద్రికారుఁ డా♦ధూర్తునకుఁ ద, నింటనే యన్నవస్త్రాదు ♦ లిడుచుఁ గల్గు
పనులు నేర్పుచు నుండంగ ♦ భక్తి మీఱ, 2నందు వేడుకఁ గొన్నాళ్లు ♦ నాతఁడుండ. 199

కం. కందువమాటల బెళుకుల, మందస్మితరుచిరవచన♦మాధురిచేతన్
దుందుడుకుఁ జెంద ధూర్తుని, డెందము గరఁగించి చెలి ఘ♦టించెను రతికిన్. 200

తే. గీ. ఎడతెగనిమోహ 3మూరించి ♦ యేపు రేఁగి, 4వేశ్మమున నొంటిపాటైన ♦ వేళలందు
మదనకదనంబునకుఁ జాల ♦ మరులుకొనఁగఁ, జేసె శుభవాటి ధూర్తుని ♦ చిత్త మలర. 201

చ. అలయక భద్రికారుఁడు గృ♦హంబున నుండినయప్పుడెల్ల వే
డ్కలఁ బను లభ్యసించును ద♦డంబడ కాతఁడు లేనివేళలం
జెలఁగుచు వానిభార్యకడఁ ♦ జేరి మనోభవకేళికాక్రియల్
తొలఁగక యభ్యసించు శశి♦తుల్యుఁడు ధూర్తసమాఖ్యుఁ డున్నతిన్. 202

తే. గీ. స్నానపానాన్నవస్త్రాది♦సంగ్రహంబు, భద్రికారుఁడు సెలవిచ్చెఁ ♦ బనికి మెచ్చి
వానిచెలువంబునకు మెచ్చి ♦ వలసినపుడు, చాల శుభవాటి సెలవిచ్చె ♦ సంగమంబు. 203

కం. ఈతీరు సకలభోగము, లాతతగతి నడచుచుండ ♦ నాధూర్తాఖ్యుం
డాతలిరుఁగత్తిగలదొర, 5చేతికటారికిని సడ్డ ♦ సేయక యుండెన్. 204

వ. అయ్యవసరంబున. 205

ఉ. ఆదర మొప్ప నొక్కదివ♦సాంతమునందు దుకాణముం బహి
ర్వేదిని భద్రికారుఁ డమ♦రించుక ధూర్తునిఁ జూచి మిద్దెలో
బోదియమీఁదనున్న తుల ♦ పొందుగ దీసుక రమ్మటంచు స
మ్మోదముతోడ నంపఁగ స♦ముద్రగభీరుఁడు పోయి చూడఁగన్. 206

తే. గీ. వానియొయ్యార మొకవింత ♦ యైన నపుడు, చూచి వలరాచ రాజ్యంబుఁ ♦ జూరఁగొలువఁ
దలఁచి శుభవాటి ధూర్తుతోఁ ♦ దాల్మిలేక, తలుపుఁ గదియించి రతికేళి ♦ సలుపుచుండె.

పా. 1. సొగసుం బ్రాయము గల్గువాఁ డొకఁడు పా. 2. నలఘుశుశ్రూష సేయుచు ♦ నాతఁ డుండె.
పా. 3. మూహించి పా. 4. విమలగతి పా. 5. చేతినరాజికిని

కం. చెన్నారు చుంబనంబులుఁ, జిన్నారివఁగ ల్వినోద♦చేష్టలుఁ జిన్నెల్
గన్నారఁ జూపి యపు డా, సొన్నారి మిటారి ధూర్తు ♦ సురతుల గలఁచెన్. 208

కం. ఈలీల మదనకదనా, లోలత్వముఁ బూని యింటి♦లోపల ధూర్తుం
డాలస్యం బొనరించినఁ, దాలిమి చెడి భద్రకార♦ధన్యుఁడు చింతన్. 209

చ. తడసె నిదేమొ ధూర్తుఁ డల ♦ దర్పకు బోలినవాఁడు భార్యయుం
గడు రతిఁబోలు రూపుసిరి ♦ గల్గిన జవ్వని యేమివ్రోహముల్
గడిమి నొనర్చిరో యనుచుఁ ♦ గా లటునిల్వక వచ్చి గట్టిగా
గడెలిడుతల్పుఁ జూచి ఘన♦గర్జితభాషలఁ బిల్చె శిష్యునిన్. 210

తే. గీ. అప్పు డాజాయ యేచాయ ♦ నధిపుమదికి, హితముగా బొంకవలయు నో ♦ యింతి యనుచు
హంస మడిగిన దరహాస ♦ మలర మోము, వంచి హేమావతీసాధ్వి ♦ యంచ కనియె. 211

కం. ఒకరొకరి బుద్ధి యెట్లో, యకటా తెలియంగ బ్రహ్మ♦కైనను వశమా
1ఇఁకదాఁపక యిది నీవే, యకుటిలమతిఁ దెలుపు మనిన ♦ హంసం బనియెన్. 212

మ. విను హేమావతి భద్రకారుఁ డటుల ♦ న్వేగంబుగా వచ్చి శి
ష్యునిఁ బిల్వన్ భయ మంది వాఁడు జనితా♦స్తోకవ్యథం గుంద నా
తని భీతిల్లకు మంచుఁ జెప్పి తులసూ♦త్రంబు ల్వేసం దెగ్రించివే
సి నిరాఘాటత నేగి వాకిలి సడ♦ల్చెన్ నాయకున్ దూఱుచున్. 213

వ. అట్లు వాకిలి దీసి భర్తతో మఱియు నిట్లనియె. 214

చ. తులఁ గొనితేను మంచిగుణ♦ధుర్యునిఁ బంపితి రౌను మీరలుం
బిలిచినఁ జూడవత్తుఁ గద ♦ భీతిని దారము లన్ని దెంచి తాఁ
దలుపు గదించి సూత్రములు ♦ త్రాసునఁ గూర్చుచునున్నవాఁ డిసీ
పలువ మఱెంత నేర్పరని ♦ భర్తకుఁ జూపి దురుక్తు లాడినన్. 215

తే. గీ. ఎంతలే దింతెకద దీని ♦ కిట్టు లనకు, తానె పోయెను గొంత చేఁ ♦ దప్పిపోవ
నేమి సేయుదు మని ధూర్తు ♦ నితర మనక, డెందమున సందియ మొకింత ♦ చెంద కపుడు.

కం. ఎప్పటివలె నుండె విభుం, డప్పగిదిని సూక్ష్మబుద్ధి ♦ నారయవలె నో
యొప్పులకుప్పా నీ కని, చెప్పఁగ హాసంబు ముదముఁ ♦ జెలువము దోఁపన్. 217

కం. ఆవేళ శిరఃకంపము, గావించి యయారె యని చొ♦కాటం బగు కే
ళీవాసముఁ జేరెను హే,మావతి నృపమోహ మగ్న♦మానస యగుచున్. 218

---

పా. 1. కికురించక యిది నీవే,

మ. కనదృక్షాలయమౌ మహాబిలమునం ♦ గన్పట్టు భాస్వచ్ఛమం
తనవానర్ఘ్యమణిం దటిన్యధిపస♦త్రాజిత్తునిం జేర్చెనో
మును దాఁ గ్రైకొని కాలకృష్ణుఁ డన నం♦భోజాప్తుఁ డప్పశ్చిమాం
బునిధిం జేరెఁ దదబ్జనాభరుచి నాఁ ♦ బొల్పొందెఁ గ్రొంజీఁకటుల్. 219

వ. అయ్యవసరంబున. 220

సీ. విటమనోధృతిశిలా♦విచ్ఛిన్నతాటంక తాటంకమణికాంతి♦తతులు వెలుఁగఁ
బల్లవమానస♦పటుధైర్యహారకళాహారకస్తోమ ♦ మాఘుళింప
గమనహృద్దార్ఢ్యాబ్జ♦గణశీతకంకణ కంకణాంగద ఝణ♦త్కారమడర
జారాత్మదృఢతాన♦మీరాహిసంతాన సంతానకుసుమవా♦సనలు వొలయ

తే. గీ. యువజనస్వాంతకాఠిన్య♦దవసమీర,బంధు ఘనసారఘనసార♦గంధసార
సారభోదారకుంకుమ♦స్థాసకంబు, దనర రాయంచకడకు న♦త్తరుణివచ్చె. 221

ఉ. వచ్చినఁ గాంచి హంసకుల♦వల్లభుఁ డాతలిరాకుబోఁడి మై
లచ్చికి నిచ్చగించి యను♦లాపకలాపకళారసజ్ఞతన్
మెచ్చి నృపాలుపాలికిని ♦ మేకొనిపోయెద వేమొ పొమ్ము నా
ముచ్చట లాలకించి కడు♦ముద్దులుగుల్కెడు ముద్దియా యనన్. 222

కం. అనిపల్కు నంచవాచా, తనుమాధుర్యమున సొక్కి ♦ తత్కథయేమీ
వినియెద నన హేమావతి, కనురాగం బొప్ప రాజ♦హంసం బనియెన్. 223

ఎనిమిదవరాత్రికథ.

మ. కలదుద్యద్ధ్వజకోటికాపటలజా♦గ్రద్వాతసంఘూతసం
చలదభ్రస్థలినిల్వ నళ్కి తదవ♦స్థం బాపఁ దద్భూమిరా
ట్కులమాళిన్ శరణంబు వేఁడుటకుఁ దో♦డ్తోవచ్చెనో యంబుదం
బులనన్ మత్తకరులెలంగ నొకపో♦ల్పున్నాగపుంజం బనన్. 224

సీ. గోళ్లురిక్కలజోళ్లు ♦ వ్రేళ్లుమావిచిగుళ్లుఁ జెల్లుఁ బుక్కిళ్లల్లి♦సిల్లు సుళ్లు
దూండ్లు బాహులు గిండ్లు ♦ చెండ్లుబో ల్పాలిండ్లు కండ్లు మీ ల్సింగారి♦విండ్లు బొమలు
జూపు మారునితూపుఁ ♦ జూపు మోములయేపు బాపురే శశిరూపు ♦ మాపనోపుఁ
గప్పు పెన్నెఱికొప్పు ♦ లొప్పు చీఁకటిచొప్పుఁ గప్పు నవ్వులు విప్పు ♦ కప్పురములు

తే. గీ. బొంగు బంగారురంగు లం♦నం గడంగు, నంగలతల నెసంగు మెఱుంగు గుంపు
లనుచు నిజరూపవైభవం♦బఖిలజనము, లభినుతింపఁగ వెలయుదు♦రచటిసతులు. 225

వ. ఇండియు నప్పురంబు సర్వమంగళాభ్యుదయనివాసంబై హిమమహీధరంబు పోలికిని, సుధర్మాస్పదరూపరమ్యంబై మేరుశిఖరిభాతిని, బురుషోత్తమశోభితంబై శ్వేతద్వీపంబుకరణి,

బుణ్యజనానందసమృద్ధిదంబై యలకాపురంబులీలను, విబుధమనోరంజనకరంబై యమరావతీ
పట్టణంబుచాడ్పున, రాజహంసాభిశోభితంబై పద్మాకరంబువైఖరిఁ, 1జతురాస్యవాణీప్రచురంబై
సత్యలోకంబు విధంబున నొప్పు నెప్పుడు. 226

సీ. గొడియ బీగము లావు♦గొలుసు లోపలియడ్డమ్రాను బోల్తలుపులు ♦ మగులుగోడ
గాయధాన్యంబుల ♦ కణఁజము ల్బియ్యంపుగరిసెలు టిక్కీలు ♦ సరకులుండు
మిద్దె చిల్లరులు న♦మ్మెడుదుకాణము బచ్చుమళిగ బొక్కసపిల్లు ♦ మచ్చులుఁ దల
కపణంబు నాణెము♦ల్గలకట్లసంచి గోతము లెక్కకడితెంబు ♦ దడము భరణి

తే. గీ. తక్కటి సమస్తవస్తువు ♦ 2ల్దనరునటుక, బావి నుగ్గులకుచ్చెల ♦ పాడిపసుల
గాడి జాలారి దివెగూఁడు ♦ గాబుతొట్టి, యొప్ప ధనచిత్తుఁడనుబేరి ♦ యుండునచట. 227

సీ. జాజికాయలు రాస్న ♦ జాపత్రియు హరిద్ర నాగర గంధక ♦ నాభిరసము
3లతిమధురంబు దు♦ర్ధాభ్రి కైలా శిలాజిత్తులు మురుదారు♦సింగు హింగు
నన్నభేనియు వస ♦ యక్కలకర పంచలవణచవ్యములు బో♦ళము మణిశిల
పిప్పళ్లు కోష్టువు ♦ పిప్పలీ మూలంబు హరిదళ నాగకే♦సరము 4లింగి

తే. గీ. లీకము సదాపవేళ్లు ధా♦న్యాకములును, గటుకరోహిణి పటికి జం♦గాలపచ్చ
కర్పురియుఁ గారవియు రేణు♦క మతివసయుఁ, దాళకము మాంసి నఖము నే♦పాళములును.

తే. గీ. క్షారపాషాణములు నభ్ర♦కంబు 5లైదు, గ్రంథితగరంబును యవాని♦కద్వయంబు
కచ్ఛురములు మరాటిమొ♦గ్గలు కుళుత్థ,కుసుమములు కుందురుష్కము ♦ లెఁసగఁగలవు.

సీ. గంటుభారంగియుఁ ♦ గంకుష్టమును మెంతి మంజిష్టి జిలకఱ్ఱ ♦ 6మ్రానిపసపు
7విషకంట కాలాష్మ ♦ వేతసంబును నీరుచించలంబును బులి♦చించలంబు
జీవకంబును నల్ల♦జిలకఱ్ఱ పుష్కరమూలంబు కాంపిల్య♦మును సముద్ర
ఫేనంబు ధాతకీ♦సూనంబు 8సాసువుల్ గజపిప్పలై స్థౌణేయ♦కంబు చిత్ర

తే. గీ. మూలగోరోచనములు కా♦పోతతార్క్ష్యి, యష్టిమధుకంబు జీవంతి ♦ ముష్టిగాడ
శైల సౌవీర రసముఖాం♦జనములు వెలి,గారమును గల్గి యుండు న♦ బ్బేరియింట. 230

వ. మఱియును. 131

సీ. వింతగాఁ బుంజీభ♦వించి నానాధాన్యములరాసు లుండెడి ♦ నిలయములును
సకలరత్నాకర♦స్థలములై యేకీభవించి విస్మయ మిచ్చు ♦ వేశ్మతతులు

---

పా. 1. జతురాస్యవాసితంబై పా. 2. ల్దనరు చున్న, వాడపిడుకల కుచ్చెల పా. 8 లమరకర్పూర
కృ ♦ ష్ణాభ్రి కైలా పా. 4. శొంఠి, యలమిశర్కరలెల్ల పా. 5. జీల,కరయు బోళంబును పా. 6. మైలతుత్త
పా. 7. వెల్లుల్లి పా. 8. సాసువు, లుప్పళులును గజ♦పిప్పలియును, గాకమాచియు స్థౌణేయ♦కంబు చిత్ర,
మూల గోరోచనములుఁ గా♦పోతతార్క్ష్యి

నఖిలదేశంబుల ♦ నమరు నానాణెములపుంఖీభవించిన చిత్ర♦గేహములును
జీనిచీనాంబరా♦నూనబృందంబుల మందీభవించిన ♦ మందిరములు

తే. గీ. సర్వరసవర్గములు టంక♦సాల వ్రేయు, చావడి హామాదినుసుమేలు ♦ సరకుఁగలిగి
నాల్గుదిక్కులపేఁటల ♦ నగరజనుల, కలరు నమ్ముచు ధనచిత్తుఁ ♦ డచట వెలయు. 232

కం. వానికి వసుమతి యనఁగా, మానిని విలసిల్లు నొకతె ♦ మదనునిచే నా
నానవసుమపూజిత మగు, చీనీజము దాళి యనఁగఁ ♦ జెలువు దలిర్పన్. 233

ఉ. ఆబిడమోము గోముజిగి ♦ యాబిడముద్దులకావిమోవి ని
గ్గాబిడ కప్పుగొప్ప సొగ ♦ సాబిడ 1సూరెలకోపు చూపు జ
గ్గాబిడ గబ్బిగుబ్బసిరు ♦ లాబిడ లేయసదైనకౌను సొం
పాబిడ యారుతీరు చెలి♦యా వచియింపఁ దరంబె యేరికిన్. 234

కం. అలరుంబ్రాయపుఁ జిన్నెల, కలిమిన్ రంజిల్లి మెఱుఁగు ♦ కరుగునఁ బోయన్
విలసిల్లు 2నటనపుత్రిక, పొలుపున నవ్వీటిలోనఁ ♦ బొలఁతుక మెఱయున్. 235

చ. పొలఁతుకకొప్పు కృష్ణతను ♦ బూనినయంతనె, మోము సూడుచేఁ
దలకి విధుస్థితిం దనరెఁ, ♦ దాళక చన్నులు నచ్యుతాకృతిం
బొలిచె, సహింపలేక నడు♦మున్ హరిరూపు వహించె, నిట్టివా
ర్తలకు మధుద్విషత్వమును ♦ దాల్చెను జక్కరలొల్కు మోవియున్. 236

సీ. కులగోత్రములవారి ♦ నిలిపి కట్టెలు నీళ్లు మోయించుచుండెడు ♦ ములుచఁదనము
తనుగన్నవారలఁ ♦ 3దన్నిబంధనమున చెలఁగి పంకావాప్తిఁ ♦ జేర్చు సూడు
వినుతకళాఢ్యుఁడౌ ♦ ద్విజరాజు ననిశంబు దోషాకరునిఁజేయు ♦ దూషణంబు
4ఘనరసస్థితిఁ జెంది ♦ తనరు మానససీమ బహుభంగములఁ గూర్చు ♦ ప్రబలు నగడు

తే. గీ. బ్రహ్మ వాయంగఁజేసె న♦ప్పద్మనేత్రి, కలరు కుచశైలములును హ♦స్తాంబుజములు
నవ్యముఖచంద్రబింబంబు ♦ నాభిసరసి, మెఱసి కౌశల్యశక్తి ని♦ర్మించిమించి. 237

కం. అంబుజముల కంబుల బిం,కంబుల నగు నయనయుగము ♦ గళముఁ గుచంబు
ల్చెంబులఁ గొంబగడంబుల, డంబుల నిరసించు నప్ప♦డంతిబెడంగుల్. 238

కం. డాలా మెఱుఁగులు గొంబగ, డాలా నెత్తావిమోవి♦డంబులు కోదం
డాలా కనుబొమ లతనుని, డాలా వాల్చూపు 5లప్ప♦డంతికె యమరున్. 239

ఉ. గుబ్బలసీటు మోముపస ♦ కుంతలబృందమునిగ్గుఁ గౌనులో
జబ్బుదనంబు గన్నుఁగవ♦చందముఁ జెక్కులతేట మోవి నున్

---

పా. 1 మేల్ తెలిబెళుకుఁ జూపు పా. 2. నటసువర్ణము పా. 3 దన్నిత్రొక్కుక నిల్చి
పా. 4. ఘనతర స్థితిఁ జెందఁ♦దనరు సరస్సీమ పా. 5. లన మిటారి రహించున్.

గబ్బిచకచ్చకల్ రదన♦కాంతి కటిస్థలియుబ్బు గంధరం
బబ్బుర మారుతీరు దర♦హాసము లెన్నఁగశక్యమేతరగా. 240

తే. గీ. దానిసొగ సాత్మలో మెచ్చి ♦ తలఁగివచ్చి, కేరి మీనంబుపై ముద్దు♦కేలు వైచి
యడరి నిట్టూర్పువుచ్చి య♦య్యారె యనని, మానవుఁడు లేఁడు ధారుణి♦లోనఁ జాన. 241

కం. అటువంటిరూపరేఖా, పటిమం దనరారియుండు ♦ భామిని రతులన్
ఘటియింపక పరతరుణీ, విటుఁడై ధనచిత్తుఁ డెపుడు ♦ వెలయుం జెలియా. 242

తే. గీ. అటువలె నిజాధినాయకుఁ ♦ డన్యమృగదృ,గానుకూల్యాగ్రచిత్తుఁడై ♦ యహరహంబుఁ
1దిరుగఁ దనమీఁద వసలేని ♦ తెఱఁగుఁ జూచి, వసుమతియుఁ గాంచె జఠరాంక♦వాహనంబు.

✓కం. పతి నడచునట్లు నడచెను, సతియ పతివ్రత యటండ్రు ♦ సజ్జను లనుచుం
బతి పరదారలఁ గూడిన, సతి జారులఁ గూడఁ దొడఁగె ♦ సమ్మదలీలన్. 244

తే. గీ. ఇటుల నావైశ్యదంపతు ♦ లేపురేఁగి, మనసులెదొప్పేటఁ గల్గిన ♦ మరులు కొల్పి
నెరిమరునితూపు తమచూపు ♦ నిగ్గముంబు, వెట్టి మరుచివ్వకేగుదు ♦ రెట్టులైన. 245

కం. ఈతీరు కొంతకాలము, 2నాతియుఁ నాథుఁడును నిచ్చ ♦ నడచుచు నొకనాఁ
డాతతమదనశరాహత, చేతఃకంజాతుఁడై ని♦శీథిని వేడ్కన్. 246

కం. అత్తింటికోడలికిఁ గా, హత్తుక నతఁ డుండె నొకయు♦పాగ్రణికొఱకై
యత్తన్వి యటకె పోయినఁ, జిత్తజుఁ డెసకొల్పె రతుల ♦ చిన్వరుఁజేరన్. 247

తే. గీ. తాను గోరినకన్య యీ♦తరుణి యనుచుఁ, జేరె నాసక్తిచే ధన♦చిత్తుఁ డప్డు
డా యువాగ్రేసరుం డితఁ ♦ డౌ నటంచుఁ, గదిసె వసుమతి యత్యంత ♦ కాంక్షతోడ.

వ. అయ్యవసరంబున. 249

మ. 3సహసాసంఘటితస్తనగ్రహణసం♦జాతాంగరోమోద్గమం
బు హఠాచ్చుంబిత పాటలాధరముఖాం♦భోజాక్షిగండంబు ను
స్నహసీపీచ్యుతికంచుళీహృతినఖాం♦చద్దంతగాఢక్షతా
వహనం బిర్వుర కయ్యె సంగమము 4ది♦గ్వ్యాహార్పితంబయ్యెడన్. 250

కం. కలయికల నాఁడజంబులఁ, గులసతిఁగా నతఁ డెఱింగెఁ ♦ గోమలి మగఁ డీ
యలఘుఁ డని తెలిసినపు డెటు,వలె నచ్చెలి బొంకవలయు ♦ వనితా చెపుమా. 251

తే. గీ. అనిన హేమావతీభామ ♦ హంసదిక్కు, చూచి యది యెట్లుబొంకెనో ♦ చోద్యమహహ
తెలియఁగాఁ జాల నిది నీవె ♦ తేటపడఁగ, దెలుపు మనిపల్కె రాయంచ ♦ తెఱవ కనియె.252

పా. 1. దిరుగఁ దిరుగంగఁ దిరిగెడు పా. 2. నాతియుఁ దానును బరేచ్ఛ పా. 3. సహజాలింగనముల స్తనగ్రహణ పా. 4. ది♦గ్వ్యారార్పితేషాళియై.

కం. ఆవేళ నాయకుఁడు 1కో,పావిలహృదయాంబుజాతుఁడై యానిశిలో
నీవిటకు 2నేమిపనికిం, గా వచ్చితి వనుచుఁ గినియఁ గామిని యనియెన్. 253

తే. గీ. మగఁడ నామీఁద నీకింత మమతలేని, తెఱఁగుఁ గన్గొని కాళికాదేవి కేను
బడుచుఁదనమున మ్రొక్కి నాపతిని రతికిఁ, గూర్ప నీసేవ సేయింతుఁ గోర్కి మీఱ. 254

కం. అని వేఁడుకొనిన యప్పుడె, ఘనకరుణామృతకటాక్షగరిమను గాళీ
జనని ననుఁ జూచి పో వతి, నెనసెద వనునంతలోన నిట నెఱిఁగితి నిన్. 255

ఉ. వింతలు కాళికాజనని విశ్రుతసత్యములంచుఁ బల్కఁగా
3నంతటిలోన నచ్చెలియకై చను దెంచిన జారుఁ డొక్క కుం
జాంతరసీమ నుండి యిది యా నిజ మంచు వచింప వర్తకుం
డెంతయు విస్మయాకలితహృత్పుటుఁడై నిజభార్య నున్నతిన్. 256

తే. గీ. స్తుతులఁ గరఁగించి సామంబుతోడ వేఁడి, గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి నీకోర్కు లలరఁ
జేసెద నటంచు బాసలు చేసి సతిని, దోడరి ధవచిత్తుఁ డింటికిఁ దోడితెచ్చె. 257

కం. అది మొదలుగఁ బరభామలఁ, గదియక ధనచిత్తుఁ డెపుడు కాంతామణికిన్
4మది రంజిల్లఁగఁ జేయుచుఁ, బొదలెను నీ కట్టినేర్పు పొసఁగినఁ బొమ్మా. 258

కం. అనవిని నాసికఁ దర్జని, యునిచి కడుశిరంబు ద్రిప్పి యోహో చిత్రం
బని తెల్లవారిరాఁగాఁ, గని హేమావతి వియోగకలనం జనియెన్. 259

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పిన విని సంతోషించి నలుం డాతరువాతివృత్తాంతంబు
జెప్పు మని ప్రార్థించిన. 260

మ. స్మరవాత్సల్యవిశేషరక్షితవనీమాతంగమాతంగసం
హారయోషిన్నుతపాదపంకరుహశోభాభంగభ్రూభంగభా
స్వరసర్వామరమానిచిత్తజలరుట్సారంగసారంగరా
ణ్ణిరవద్యస్తుతిజాతముత్పులకవన్నీలాంగనీలాంగదా. 261

కం. నవనాశన జగదవనా, దవనామ విషాగ్నిహరణ దారుణ భువనా
భువనాధిపనుత నవనా, నవనాభద్యుతిజితార్కజానరసవనా. 262

పృథ్వీవృత్తము.

కులాచలకులాచలావలయకూటఘోణీఫణిట్, తలాతలతలాతలాది జగదభ్రదిగ్గార్ధ్యహృ
త్కళాధరకళాధర ప్రబలకార్ముకారోపకృ,త్కళాధరయిలాధర ప్రతిమధైర్యచర్యాకరా.

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవి త్రాయ్యలరాజాన్వయ సుధావార్ధిపూర్ణిమాచంద్ర
నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామపారాయణనారాయణామాత్య
ప్రణీతంబయిన హంసవింశతి యను మహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.

పా. 1. కో,పావేశహృదంబుజాతుఁడై పా. 2. నొంటి నేటికిఁ, పా. 3. నంతవమున్నె యచ్చెలియకై
పా. 4. ముద మలర వశ్యుఁడై తగఁ,

శ్రీరస్తు.



# హంసవింశతి.



## తృతీయాశ్వాసము.



శ్రీజానకీక్షణోత్పల
రాజా రాజాధిరాజ ♦ రాజన్నిజసే
వాజాతహర్ష మునిజన
తాజలరుహచండధామ ♦ దశరథరామా.

వ. అవధరింపుము, ప్రత్యుత్పన్నమతి నలరాజన్యున కిట్లనియె; నట్లు ప్రభాతసమయంబు గావచ్చినం గనుంగొని. 2

మ. చని పూఁజప్పర మొప్పచుండెడు మణీ♦సౌధంబులోఁ గెంపుటా
మొనముక్కుల్గల పచ్చటాచిలుకకో ♦ ళ్లొప్పొందు బంగారపుం
బని రంగారెడుతూఁగుటుయ్యెలపయిన్ ♦ బాగొప్ప మే న్సేర్చి యా
వనజాతాక్షి దినాంతవేళ మనుజ♦స్వామిస్పృహాధీన యై. 3

చ. మిడిగలవజ్రపున్ రవల ♦ మిన్కులకమ్మలు జాతికెంపుటా
కడియములున్ సుపాణులచో♦కాటపుహారములున్ మృగీమదం
బడరెడుపట్టుచీరసొగ ♦ సౌ ననఁ దాల్చి నృపాలుకేళికిన్
నడచె వధూలలామ తమి♦నాటినచిత్తము తత్తరింపఁగన్. 4

కం. ఆయెడ హంసకులాగ్రిణి, యాయోషామణిని గాంచి ♦ యనుపమవచన
శ్రీ యలరఁగ నొకచిత్రోపాయపుఁగథ విను మటంచుఁ ♦ బలికి వచించెన్. 5

### తొమ్మిదవరాత్రి కథ.

ఉ. సాలము మిన్నునంటి ఘన♦సంపదఁ గాంచె నగడ్త యూర్ధ్వచేఁ
దాళ కనంతభోగములు ♦ తద్దయుఁ బద్దునఁ దాను జెందె నా

మేలనఁ గోట యున్నతియు ♦ మిక్కిలి ఖేయము లోఁతు గల్గి శో
భాలలితం బనంగ నొక ♦ పట్టణ మొప్పు నితంబినీమణీ. 6

కం. ఆవీటిలోన రంగా, జీవకులాంభోధి పూర్ణ ♦ శీతమయూఖుం
డై వెలసి చిత్రఘనుఁ డనఁ, గా వార్తకు నెక్కు డెపుడు ♦ కాఁపుర ముండున్. 7

తే. గీ. హరితహారిద్రకృష్ణర ♦ క్తావదాత, శబలపాటలధూమల ♦ శ్యామకపిల
వర్ణములఁ గూర్చి చిప్పల ♦ వాగెలునిచి, చిత్తరువు వ్రాయు గుళ్లలోఁ ♦ జిత్రఘనుఁడు. 8

కం. సురవిద్యాధరకిన్నర, గరుడోరగసిద్ధసాధ్య ♦ గంధర్వాహరి
ద్వరయక్షాసురనలినజ, హరిహరమర్త్యర్షి వరుల ♦ నతఁడు లిఖించున్. 9

సీ. హరికరిమృగఖడ్గ ♦ కిరితరక్షుద్వీపి సైరిభగోకర్ణ ♦ శరభచమర
గంధర్వరోహిష ♦ గవయభల్లుకరామ శశజంబుకోష్ట్రాశ్వ ♦ శల్యలోక
చామీకరోరణ ♦ శ్వానోతుకపిబభ్రు సరటోర్ణ్యలూతాఖు ♦ సర్పమకరి
శతపదిబస్తమ ♦ త్స్యఘులీకుళీరాళి గాధేయరక్తపా ♦ కమఠనక్ర

తే. గీ. గోమహిషజలశుక్తిచి ♦ క్రోడములును, సింగిలీకాలురయుమిండ ♦ 1చెలిదిపురువు
కొక్కువెంట్రువనలికిరి ♦ కోణలాది, గాఁగలుగు జంతువులఁ జిత్ర ♦ ఘనుఁడు దీర్చు. 10

తే. గీ. గరిమి డిబ్బంది చోఅపంది ♦ గాఁడు రుంద, గరుడ బెగ్గోలు రేచు గ ♦ ర్గరము రాళ్ల
రాచి పెంకులజెట్టి పు ♦ న్నాచిపక్కి, పేచి చెక్కలచే రను ♦ పేళ్లఁ గలుగు. 11

సీసమాలిక. గరుడండు సంపాతి ♦ గండభేరుండంబు చీకురా యాడేలు ♦ చెవులపంత
వార్ణము భైరజా ♦ వళము సాళ్వము డేగ గూడ బా తుల్లంగి ♦ కుందటీల
పాలనారాయణ ♦ పక్షి పాములమ్రింగు డంచవేష్టము గ్రద్ద ♦ క్రౌంచ మాబ
లగు డోదె గొరకు తె ♦ ల్లనివంత జలకట్టె గూబ శంబరకాకి ♦ గుబిలిగాఁడు
నామాలకేతఁడు ♦ నల్లాన కప్పెర కాకి యంబటిదారి ♦ గాఁడు మూఁగ
చిందర లకుముకి ♦ చిఱుత తీతువకోడి కారుకో డేకుల ♦ నారిగాఁడు
ముడుఁగుకోడియు డాబ ♦ ముట్టెకోడియు బోద పొన్నంగి కళ్లేటి ♦ బొల్లికోడి
గొంగడి కక్కెర ♦ గోక్కెర గోరమంక పూరేడు కనుపెంటి ♦ నీరుకాకి
వెలిచె లావుకపిట్ట ♦ చిలుక జీనువకౌఁజు పెడిసకేడ్జము డబ్బు ♦ బెలవ నెమిలి
జిట్టువ మునుగపూ ♦ జిట్టువ గిజిగాఁడు వల్లడ పోడిపిట్ట ♦ వంగపండు
భరతము కోకిల ♦ పసిరికెతంగేడు గోరవంక జక్కువ ♦ చెఱువుకోడి
పట్టుజీనువు కొంగ ♦ పాటేరు పిచ్చుక పోలుక పిక్కిలి ♦ మీలముచ్చు
చిలుక చకోరంబు ♦ జిబ్బిటాయు జటాయు కొండపిచ్చుక వాన ♦ కోకిలయును
మ్రానుపొక్కటిగాఁడు ♦ మాలకాకి బెనాసి పాపెరగోరవంక ♦ పంది కైర

పా. 1. ముంగిసలును

గబ్బిలంబును జాత♦కము కంక చిటిచెల్వ పానుపెంటి యేట్రింత ♦ భూతపోతు
గున్నంగి కనకాక్షి ♦ గుడిసె బయ్యాకపుల్ల సీతువ బెగ్గురు ♦ జిక్కుతురుక

ఆ. వె. పికిలి నేలనెమిలి ♦ పెనుగువ్వ బకదారి, పావురాయి సివడు ♦ పలువరింత
చెదలుకోడి గువ్వ ♦ వదరు తోఁకలవేడి, యాది యైన పక్షు ♦ లతఁడు దీర్చు. 12

వ. అదియునుంగాక. 13

ఉ. వానిమనోహరాంగవిభ♦వంబును వానిముఖేందుకాంతియున్
వానిపటూక్తి విస్ఫురణ ♦ వానివిలోచనదైర్ఘ్యనంపదల్
వానియురస్స్థలోన్నతియు ♦ వానిభుజప్రతిభావిశేషముల్
మానిని యేమి చెప్ప నన♦మాన నవీన తదీయవైఖరుల్. 14

కం. ఆతనిగృహమున విద్యా, చాతురి కలరారి నృపు లో♦నంగ రహించున్
జాతిహయవస్త్రభూషణ, మాతంగద్రవ్యమణిస♦మాజము లెపుడున్. 15

కం. పౌరుషముఁ దారతమ్యముఁ, గారుణ్యము దానధర్మ♦గరిమయుఁ గులవి
ద్యారసికత్వము వినయము, గౌరవముం గలిగి చిత్ర♦ఘనుఁ డట్లలరున్. 16

కం. ఆచిత్రఘనున కల వల,రాచవజీరునిజిరాగు♦జానకు నెనయై
సూచింపఁదగినసొగసుది, వాచాలి యనంగ నొక్క♦వనిత చెలంగున్. 17

ఉ. ఆకమలాక్షి చంచలదృ♦గంచలసీమల బెళ్కుతళ్కులా
యాకలకంఠిపల్కు లల♦రార సుధారస మొల్కుతుల్కులా
యాకనకాంగియంగరుచి ♦ హాటకకోటులఁ జిల్కుకళ్కులా
యా కుటిలాలకన్ సరసి♦జాసనుఁడై నను నేరఁ డెంచఁగన్. 18

కం. హారు లాపల్కులు తుమ్మెద, గరు లాకచరుచులు నడలు ♦ కరులా కదళీ
తరు లాతొడ లిందునిబి,త్తరులా గోళ్లెంచఁ బ్రౌఢ♦తరు లానరసుల్. 19

సీ. మాటలా యమృతంపుఁ♦దేటలా కపురాల మూటలా యని జార♦కోటులెన్నఁ
గన్నులా వెలిదమ్మి♦చెన్నులా మగతేఁటియన్నులా యని పల్ల♦వాళులెన్నఁ
జేతులా సుమలతా♦ జాతులా కిసలయఖ్యాతులా యని యువ♦కాంతులెన్న
గుబ్బలా యపరంజి♦లిబ్బులా రుచిమించు దిబ్బలా యని పాంథ♦ధీరులెన్న

తే. గీ. గోరులా రిక్కసౌరులా ♦ కులుకుఁదళుకు, నవ్వులా జాజిపువ్వులా ♦ నాఁటునీటు
చూపులా వాఁడితూపులా ♦ సొలపుఁ దెలుపు, ననుచు విటు లెన్నఁదగు నింతి ♦ యతనుదంతి,

చ. వగ లిగుకొత్తఁ జిత్తరువు ♦ వ్రాయుము సారెకు దీనిఁ జూచుచుం
దగ నని పద్మనాభవుఁ డు♦దారదయామతిమీఱ మేలుబం

తిగ నొనరించి తత్ప్రతికిఁ ♦ దేవుడ నిచ్చిన మేటిజాళువా
జిగిబిగిఁ గ్రొమ్ము బొమ్మ యన ♦ సింధురగామిని యొప్పు నున్నతిన్. 21

తే. గీ. కురులు ఘనసంపదను జెంది ♦ కొమరుమిగుల, ముఖము రాజవిభూతిచే ♦ మురియఁ దొడఁగెఁ
గటి మహాచక్రవిభవము ♦ గ్గాంచె ననఁగఁ, జెలఁగు వాచాలి గమనని♦ర్జితమరాళి. 22

ఉ. ముద్దులుఁగారు నెమ్మొగము ♦ మోహరసంబులు చిందు గుబ్బలున్
దిద్దినయట్టులుండు జిగిఁ♦దేజెసుచెక్కులు కావిమోవియున్
నిద్దపుజాళువాపసిఁడి ♦ నిగ్గులు జిల్కు నయారె దేహమున్
దద్దయు నెన్నఁగా వశమె ♦ దానినవీనవిలాససంపదల్. 23

తే. గీ. దానివగలకు లోఁజిక్కి ♦ దర్పముడిగి, దర్పకాస్త్రాగ్నికీల దం♦దహ్యమాన
మానసుఁడు గానినరుఁడు భూ♦మండలమున, వెదకినను లేఁడు సుమ్ము సా♦ధ్వీలలామ. 24

చ. అది తనుయూరిదేవళము♦నందు దయ న్నెలకొన్న భక్తకా
మదుఁ డగురామచంద్రపెరు♦మా ళ్ళురం దిరునాళ్ళలోన నిం
పొదవఁగఁ దార్క్ష్యవాహనమ♦హోన్నతిఁ గోఁ దిరువీథు లేఁగఁగా
ముదమున నమ్మహోత్సవపు♦ముచ్చటఁ జూడఁ దలంచి రా నటన్. 25

తే. గీ. వరఁగఁ బదియాఱు[1]గుజ్జుల♦ప్రభ లమర్చి, గంటవేసియు బంగారు♦కలశ మెత్తి
కంచుగుబ్బలు రావిరే♦కలును [2]లోన, పక్షములు దీర్చ నొప్పు చ♦ప్పరము రాఁగ. 26

మ. జగతీజ్యోతులు కాగడాలు బలుబం♦జాయీలు మోంబత్తులుం
బగలొత్తు ల్దివిటీలుఁ దిర్వళిఘులుం ♦ బంజు ల్మహాజ్యోతులుం
దగ సూర్యప్రభ లాయిలాయిలు[3]చు జం♦ద్రజ్యోతులున్ మైనపుం
జిగటాల్నిచ్చెనఫంజు లారతులు న♦గ్నిజ్యోతులున్ వెల్గఁగన్. 27

వ. అప్పు డప్పద్మపత్త్రాయతాక్షుని తాదృశమహోత్సవం బేకశరీరంబున నిరీక్షించిన సంతుష్టి గా దని కాయవ్యూహయోగసామర్థ్యంబున ననేకదేహంబులుఁ దాల్చి భక్తి సంయుక్తి నిరుచక్కిం జేరి వీక్షించు సూర్యచంద్రబింబంబులడంబునం బొలుచు పట్టుగొడుగులు ధవళాతపత్రంబులు రాణింప గరుడధ్వజాదికేతనజాతవాతంబుల నంతరిక్షంబున నుండ నళికికకదలుచుండెడు నుడుగణంబుల వడువున నక్షత్రబాణపరంపరాపతితతారకల చెలువుమీఱఁ బౌత్తాళభూతలంబుల సంచరించు సంచున వియత్తలంబునఁ దారు విహరించుచందమున వహ్నిజ్వాలికలు గురియుచు గగనంబున కెగయు కాకోదరానీకంబులవిధంబున రివ్వురివ్వున నెగిరి చను నాకసపుఁజువ్వలు మింట నెఱయ ననంతకోటిబ్రహ్మాండనాయకుండైన పుండరీకనాభుం డేతేరం గనుంగొని. మహీవేదండ

పా. 1. మంటప♦ప్రభ లమర్చి, పా. 2. దనరి, సిరులఁజేకూర్చుగొప్పచ♦ప్పరము రాఁగ.
పా. 3. నిశా♦దర్పంబుబోఁదోలు నా

యానలు నేసలు సల్లిన నుల్లసిల్లు వెండిపసిండి కొ్రవ్విరితంషంబుల పాండిత్యంబునఁ బలుదెబ్బంగుల బిరుసులు వింజామరలు ఫెళఫెళారభటి నెఱయ రాలు సువర్ణవర్ణంబు లగుపూవుమొత్తంబులు భూనభోంతరాళంబులం గప్పి యొప్పుచుండఁ దదుత్సవవీక్షణకుతూహలసమాగత శుక్ర బృహస్పతి బుధాదులపగిదిం బగులొత్తులు వెలుఁగ వెండియుఁ జక్రబాణంబులు నాకాశచక్రంబులు జంట బాణంబులు శతముఖబాణంబులుఁ దాటబాణంబులు దేలుబాణంబులు గురుజులు కుండబిరుసులు సంపంగిపూలబిరుసులు నల్లకలువబిరుసులుఁ దురాయిబిరుసులు పెద్దబిరుసులు చెయిబిరుసులుఁ జక్రబిరుసులుఁ బంచవన్నెబిరుసులు గజబిరుసులుమొదలయిన బాణవిద్యలవైఖరులు చిత్రవిచిత్రముగాఁ జూపుచు బాణకారులు ముందరనడువ రుతహృద్దమరు పురభిద్దమరు సహచర చయఢక్కాహుడుక్కారవణానకలటహాపటహ తమ్మటావజనిస్సాణ ఝల్లరీమర్దళమురజఫణా తుత్తుంభికజర్ఝరీ పాశకొ్రశకొ్రలు [1]మోరిభేరులును డోలునారు గుమ్మెతతమ్మెట వీరణయురుమ యొంటికంటియురుమ పంబ జమిడికతప్పెట గిడిబిడితుడుము చక్కిచుయ్యంకియునుఁ దాళమహాత్తాళంబులును జేగంట చిటితాళంబులును జిటికెలు ముఖవీణ శంఖకాంస్యశృంగకాహళంబులును సన్నెగాళెనఫీరు కర్ణకొమ్ము నాగసరమును సుతిచెంగు సింగినాదము పిల్లఁగ్రోవి [2]తొర్లువీకలును వీణ రుద్రవీణ స్వాయంభువీణ మనోహరవీణ నారదవీణ బాణవీణ సరస్వతీవీణ స్వరమండలంబు తంబుర రావణహస్తంబు రవాలుఁ గిన్నర తిపిరికిన్నర సిద్ధకిన్నర కామాక్షి చారుతర దండె మొదలయిన హృద్యానవద్య వాద్యవిశేషంబులు దిక్కులు బిక్కటిల్ల నిర్ఘోషంబులు బోరుకొల్ప నడుగడుగునకు నీరాజనంబులు నేకారతి పంచారతి యళఘూరతి కుంభారతి శేషారతి గరుడారతి పురుషమృగారతిమంగళారతి యేకదళారతులు [3]కుమారస్వస్తిక సభామంటప రంగవల్లిక లింగస్వస్తిక సర్వతోభద్ర గిరిబంధ మయూరనాట్య నాగబంధవింజామరవ్యజనచ్ఛత్రసింహతలాట బృందావన కల్పవృక్ష పాలసముద్ర గంగాతరంగ శంఖచక్రపద్మంబు లనుపేరులు గల్గిన ముగ్గులు మాణిక్యమౌక్తిక ప్రవాళ మరకత పుష్యరాగ వజ్ర నీల గోమేధిక వైడూర్యంబు లను నవరత్నంబులం దీర్చి పుణ్యభామినులెత్తుచుండ దశాంగగుగ్గులు సామ్రాణిసర్జరసశ్రీవాససరళ యావనవృక్షధూపంబులు ఘుమ్ముమ్మరను వాసనలుఁ గ్రమ్ముకొనఁ బశ్చిమభాగంబునఁ బరమభాగవతోత్తములు శ్రీవైష్ణవులుఁ గులశేఖరులుఁ ద్రైవర్ణికులు యతిరాజవింశతి పూర్వదినచర్య యుత్తరదినచర్య క్షమాషోడశము శఠగోపస్తవము శ్రీగుణరత్నకోశము ముకుందమాల యష్టశ్లోకి చరమశ్లోకి యాళవందారుస్తోత్రముఁ దిరువాయిమొళ్షి తిరుమంత్రద్వయంబు మొదలయిన ద్రావిళప్రబంధములు ప్రపత్తిపూర్వకంబుగాఁ బ్రసంగింప స్థల పరస్థలంబులనుండి చూడవచ్చిన బ్రాహ్మణ క్షత్రజ వైశ్య శూద్రములునుఁ గోమటి కమ్మ వెలమ వెంకరి పట్ర గొల్ల బలిజ కుమ్మరవారును పలగండలుబెస్తలుచిప్పవారును కమ్మరి వడ్రంగి కాసె కంచర యగసాలవారును ఆణికారి వడసాలె సాలె సాతు సాతీన సాతాని కటికవారును ఘటియకారచిత్రకారనిమిత్తకారులును భట్లు జెట్లు జాండ్ర తొగట గాండ్లవారును వంది మాగధ వైతాళిక జైన ఘూర్జర కర్ణాజి ఖాయతిలహాడి

పా. 1. మోరి భేరులును పా. 2. మోరిలుఁ బీకలును పా. 3. కూర్మస్వస్తిక

గౌడమిశ్రులును బేహారి భణియ ఛటికి సృగాలక ఖత్రిజాతులును బోయలు ఎఱుకులు చెంచులు ఏనాదులు జలగరి వానె వన్నెగట్టు తంబళి యాడిగె మేదరవారును వీరముష్టులు మాష్టీలు ఒడ్డె యుప్పరులును నసిధారకరబ్బాటు మైలారిమన్నెరి తలారులును తురుక పింజారి విప్రవినోదులునుజాతి కర్త దొమ్మరి డొమ్మిణి బొమ్మలాటవారును నింద్రజాలిక మహేంద్రజాలిక హస్తలాఘవ సూత్ర నాటకక్షౌరకరజకకుందనాటకులును భోగమువారును దెరనాటకపుజంగాలును జంగాలు బిద్దెము వాండ్రు తెల్లకోకబత్తులు శివసత్తులు బత్తులు పలనాటివీరులు పరిహాసకులు సుద్దులకుమాళ్లు కొమ్మూర్మరిదాసళ్లు తవిరుదాసళ్లు తన్నీరువాళ్లు కోణంగులు సేవపరులు పనసలు పడిగెవారు కంచి కావళ్లవారు పరంగు లింగులీసులు పరాసులు 1పరంతీలు 2నానకపంథు లేకదండ త్రిదండు లేకాంగులు వానప్రస్థులు యోగు లవధూతలు పరమహంసలు బైరాగులు జటాధారులు దిగంబరులు గోముఖులు నియమస్థు లూర్ధ్వబాహులును రాడేశ్వరులు గొరడజోగులు కాటిపాపలు మందపిచ్చులు పిచ్చుగుంట్లు చర్మకర్మలు చండాలమాతంగులు తలక్రిందుజోగులు రామగోవిందు లానియగువారును బుక్కోభాగంబున నేల యీనెనచందంబున వెల్లివిరిసినచాడ్పున నిసుళ్లవిధంబున మిడుతగమిబాగున బేడిసెకదుపుభంగిని ఆకుంజిలుకలమొత్తంబువంతునం బెరయీగలపగిదిని స్వాతిబకంబుల వీఁకను గంగాతరంగంబులకైవడి జలబుద్బుదంబులవైఖరి వర్షధారలపోల్కిని రామరావణబాణపరంపరలరీతిని బుంఖానుపుంఖంబులు లక్షోపలక్షలు శాఖోపశాఖలుం గోటానకోటులు సంఖ్యాతిసంఖ్యలుగా నడుచు సమయంబున. 28

కం. నెఱికూకట మాళ్లిడు చిద్దలు మంచి కుమాళ్లుగలుగ ◆ దయచేసిన నో
పెరుమాళ్లని యావాచా, లిరుమాళ్ల నొసంగి మ్రొక్కి ◆ యేఁగుచు నుండన్. 29

కం. ఆయెడ వరదత్తుం డను, కాయజరేఖాసమాన ◆ కలితాకారుం
డా యింతియున్న చక్కటఁ, బాయక నిలుచుండి దాని ◆ పై మోహమునన్. 30

ఉ. కందువమాటలాడి వగ ◆ కాఁడితనంబులుసూపి సన్న లిం
పొందఁగనల్పి చేరికల ◆ నుల్లము రంజిలఁజేసి తమ్మలం
బందఁగనిచ్చి మెచ్చి భుజ ◆ మందుఁ గరంబిడి నవ్వ చేష్టఁ గే
ళిం దమిరేఁచి గుబ్బలు భ ◆ ళీయని నల్చి రతైకచిత్తుఁడై. 31

కం. ఆవాచాలిని సంకే, తావాసమ్మునకు ర మ్మ ◆ టని ప్రార్థింపం
గా వలచి మనసుమెత్తని, దై వానికు నోభిలాష ◆ మలరం దీర్చెన్. 32

కం. అదిమొదలు సుదతి మదములు, బొదలంగఁ దుదలేనిమోహ ◆ ముల కాస్పదమా
మదిని ముదంబులు గుదిఁగొన, మదన ప్రదర ప్రభగ్న ◆ మర్మస్థలయై. 33

1. పా. వరిందలు పా. 2. పన్యాసు

చ. చవిఁగొని జారవీరవర♦సంగమ సంగ్రహణక్రియా మహో
త్సవ పరిశుద్ధబద్ధఘన ♦ తద్గతబుద్ధిని సంచరింప న
య్యువిదకు నొక్కపుత్రిఁక స♦ముద్భవమొందె మఱింతనైనఁ బ
ల్లవసురతం బసహ్యతఁ ద♦లంపక యెప్పటియట్ల సల్పఁగన్. 34

ఉ. సొంపుల నింపు చిత్తరువుఁ ♦ జూడఁగ వచ్చితిమంచు వేడ్క మో
హంపువయస్యుఁ డిచ్చటికి♦నైన పఱతేఁడెయటంచు మీఁదె యీ
సంపదలుల్లసిల్లు ఘన♦సద్మమటంచును దానికోసమై
గుంపులు గూడి [1]పీటివిట♦కోటులు వత్తురు పోఁటియింటికిన్. 35

కం. ఈలాగు జారకోటికి, మేలా నభిమతముఁ దీర్చి ♦ మెలఁగుచు నుండే
కాలమున నొక్కనాఁ డొక, జాలుండను విటునిఁబిల్చి ♦ సంధ్యావేళన్. 36

తే. గీ. పురమువెల్వడి కాళికా♦పుణ్యభవన,సీమ సంకేత మటకీవు ♦ చేరు మనుచుఁ
జెప్పి వాచాలి పతిలేని♦చొప్పుఁ జూచి, పుత్రి నిద్దురఁబుచ్చి తాఁ ♦ బోయె నటకు. 37

తే. గీ. పోయి యాకాళికోవెల♦పొంత నిలిచి, కటికమబ్బున నలుదెస ♦ లలయఁ జూచి
జాలుఁ డాచాయ లేకున్న ♦ సంశయించి, మనసుదెలియంగ డాఁగెనో ♦ యని తలంచి. 38

ఉ. చీమచిటుక్కుమన్న వినుఁ ♦ జిమ్మట బిఱ్ఱున నేగునంతలో
నే ముదమంది చూచు సర♦ణిం బశుపక్షిమృగాదిజంతువుల్
వేమఱుఁ బోవుచప్పుడులు ♦ విస్మయమందఁగ నాలకించు నా
హా మఱిరాకతక్కెనె య♦టంచుఁ దలంచు వియోగవేదనన్. 39

కం. ఏరా తాళఁగలేరా, రారా నన్నేచనేల ♦ రారా రాపుల్
మేగా మోహనరూపశ,రీరా యెటొడాఁగి పల్క♦రింప వదేరా. 40

మ. అని వాచాలి ప్రియంపుఁబల్లవుని డా♦యం బిల్వఁగా మ్రోయు వా
గ్ధ్వను లాలించి నిజాంగనాగళరవ♦వ్రాతం బిడా నిశ్చయం
బనుచుం దద్విభుఁ డప్పు డొక్కపనికై ♦ యాదారిగాఁ బోవుచుం
గని యిల్లేటికిఁ జేరె దిందనుచుఁ దన్ ♦ ఘ్షింపఁ గాంతంతటన్. 41

కం. ఎటువలె బొంకఁగవలెనో, కుటిలాలక నీవు తెలిసి♦కొమ్మని యనఁగా
నిటునటుఁ [2]జూచిది తెలియదు, పటుసూక్తిని నీవె తెలుపు ♦ పత్రిప యనినన్. 42

కం. ఆ మానసౌక మప్పుడు, హేమావతి కనియెఁ దను ని♦జేశుఁడు గదుమన్
భామయు ధైర్యమువదలక, తా మగనికి ననియె వేడ్క ♦ దళుకొత్తంగన్. 43

పా. 1. పేటివిటకోటులు పా. 2. జూచితి తెలియదు

ఉ. అయ్యలు సందెవేళఁ జని ♦ యాడఁగ నింటికిరాక తక్కితే
నియ్యెడ నీదువెంటఁ జరి♦యించుచు వచ్చునొ యంచు నాశచే
నుయ్యాలలూఁగుప్రాణముల ♦ నోర్వక చీరెద వీటఁజూచితే
నెయ్యెడలేఁడు చెల్లనిఁక ♦ నేమియొనర్తు మనోహరాధిపా. 44

కం. అనివాచాలి సతి ప్రల్కినవిని యాచిత్రఘనుఁడు ♦ కినియక యంతః
తన మనసు వకావకలై, చనఁ జెడితి నెటేఁగెనంచు ♦ సతితో ననుచున్. 45

తే. గీ. నగరమున కేఁగి యిద్దఱు ♦ నాల్గువీథు, లరయుచుండంగ వాచాలి ♦ యంతలోన
భవనమున కేఁగి చనుదెంచి ♦ భర్తతోడ, వేశ్య లిడుకొత్తఁ జెప్పెను ♦ వింతగాఁగ. 46

కం. నే నింటికేఁగి చూతుఁ గ,దా నిద్రాసక్తిఁ బూని ♦ తనయుం డున్నాఁ
డో నవమదనా రమ్మని, మానిని దోడ్తెచ్చె మగని ♦ మందిరమునకున్. 47

తే. గీ. అట్లుతోడ్తెచ్చి నిద్రించు ♦ ననుఁగుసుతుని, లేపి ముద్దాడుకొనుచుఁ దొ♦ల్లింటియట్ల
చిత్రఘనుఁడును వాచాలి ♦ చిత్రమలర, నిండుమోదంబున సుఖాన ♦ నుండి రపుడు. 48

కం. ఆరీతి నేర్పుగలిగిన, భూరమణునిఁ జేరుమనుచుఁ ♦ బులుఁగులదొర తాఁ
జీరఁగ హేమావతి విని, యారా చెలియాఘుళం బ♦టంచు గణించెన్. 49

కం. ఈరీతి కథకుఁ జొక్కి ప,యోరుహముఖి మెచ్చ నప్పు ♦ డుత్ఫుల్లత్వం
కేరుహ గంధానిల మరు, దేరఁగఁ దెలవారవచ్చె ♦ దృఢమని యంతన్. 50

సీ. పట్టెమంచము [1]లేపు ♦ పయిఁదలగడబిల్ల లగరుధూపముదివ్వె ♦ లడపము చిటి
చాప జాబిల్లికె♦సాన పువ్వులచెండ్లు తళుకు దంతపుగద్దె ♦ తావి కుడుక
గొడుగు పావలు గంధ♦వడిపెట్టె గంధపుగిన్నె సున్నపుకాయ ♦ గిండి సురటి
తంబుర నిల్వుట♦ద్దము తమ్మపడిగెయు వీణె కస్తురి రుద్ర♦వీణె పునుఁగు
తే. గీ. కరవటం బాకునంబెల ♦ కప్పురంపుఁ,గ్రోవి బాగాలు బకదారి♦గూండ్లుఁదనరు
లోవతీనెలు చిత్తర్వు♦దివిఁ గలుగు, కేళినిలయంబుఁ జేరె న♦క్కీరవాణి. 51

కం. చేరి దినాంతంబైన వ,నేరుహముఖి కుసుమచాప♦నిర్ముక్తశరా
సార మొకయింతసైఁపక, భూరమణీరమణుఁ జేరఁ♦బోయెడు బుద్ధిన్. 52

సీ. జలదపాళిరహించు ♦ చంచలాలతలన వేణిఁ గైతకదళ♦శ్రేణి మెఱయ
నినవిభాంకురముమై♦త్రిని దమ్మిఁ జేరె నాఁ గాశ్మీరరేఖ వ♦క్త్రమునఁ దనర
జయశంఖమునకు ము♦త్తియపుఁజల్లులువ్రేసె మరుఁడు నా గళమున ♦ సరులుదూఁగఁ
బువ్వుగుత్తులఁ గప్పు ♦ పుప్పొడి యన గందవడిపూఁత గుబ్బలఁ ♦ బరిమళింప

పా. 1. మెత్త♦

తే. గీ. రమ్యమేఖలఘుళఘుళల్ ♦ రత్నహేమ, కలితనూపురఝుళఝుళల్ ♦ చలువవలువ
పళపళల్ గిల్కుమట్టెల ♦ గిలగిలల్ రహించ రాయంచకడనిల్చెఁ ♦ జంచలాక్షి. 53

తే. గీ. నిలిచి హేమావతీనామ♦జలరుహాక్షి, హంసకులపట్టభద్రి నేఁ ♦ డైన మాన
వేంద్రుకడ కేఁగుమని సెల ♦ విమ్మటన్న, శిరము గదలించి రాయంచ ♦ చెలియ కనియె. 54

శా. అక్కా రత్నపుబొళ్లసొమ్ము లివి లె♦స్సాయెన్ దుకూలంబహో
చొక్కంబై తగె బుక్కపూఁత సుమముల్ ♦ సొంపారె సేబాసు నా
దిక్కుం జూడు శిరోవిధూననము సం♦ధిల్లన్ వచోమాధురిం
జొక్కం జెప్పెద నొక్కగాథ విను మెం♦చ్చుల్ మెచ్చి పొమ్మంతటన్. 55

కం. అనుచున్నహంసపలుకులు, వినుచున్ నలినాక్షి పలుకు ♦ వినియెద నని తన్
గనుచున్నఁ దేనె ధారలు, పెనుచన్ నవఘటితి నపుడు ♦ బిసభోక్త యనున్. 56

పదియవరాత్రికథ.

కం. వినుము సుధానిధి యనుపే, రునఁ గృష్ణాతీరమందు ♦ రుచిరోన్నతకాం
చనగోపురాధరీకృత, ఘనగోపురమైనపురము ♦ గలదొకటి సతీ. 57

సీ. క్షౌమఖేల ద్వధూ♦జనదత్త ఖనదీబిసాహార తుందిల♦హంసచయము
హితవయస్యాసము♦ర్పితకల్పతరుసుమస్రగ్వ్రాతసౌధయో♦షాకచంబు
సాలశృంగగశారి♦కాళీపునఃపునః పఠిత నిర్జరసతీ♦భాషణంబు
జనకార్పితోగ్రాప్త♦వనభూజఫలవృద్ధభర్మగోపురశుకీ♦పైకగణము
తే. గీ. మందిరవిటంకకలరవా♦మందకలక,లారవప్రీతిరావకా♦ర్యమరనాథ
కేళికాగారమణికుడ్య♦పాళికంబు, దనరువస్తుసమృద్ధంబు ♦ తత్పురంబు. 58

వ. వెండియు నప్పురంబు విబుధరాజమనోరంజకంబై సుధర్మాస్థానంబువైఖరి, బురుషోత్తమాధిష్ఠానంబై మేరువుపోలికిని, రాజశేఖరకుమారాధీనంబై యమరసైన్యంబుతేవను, పుణ్యజనసమృద్ధంబై యలకాపురంబుచాడ్పున నొప్పుచుండు. 59

కం. కరితురగరథభటోర్వీ,సురభూవరవైశ్యశూద్ర ♦ సురుచిరసౌధా
వరణజయక్షేయతరుణీ, పురుషోపవనాదిగరిమఁ ♦ బుర మది వెలయున్. 60

ఉ. భూతియుఁ గావుబొట్టు మెయిఁ♦బూనినమూల్కెలు కన్నుకల్కముల్.
చేతికడెంబుఁదాయెత్తులఁ ♦ జేర్చినమందులు మంత్రి తంత్రికో
పేతపునాగబెత్త మర♦పెట్టెలు నొప్పఁగ రాద్రికర్మఁడన్
భూతచికిత్సకుండొకఁడు ♦ పొల్పుగ నచ్చటనుండు మానినీ. 61

సీ. పైగాలిబారినఁ ♦ బొఱుఁ బిశాచకతండంబు లెల్లను ♦ దల్లడిల్లి
పొలఁకువఁ గనుఁగొన్నఁ ♦ బోవు దయ్యంబుల విసరము ల్భీతిచే ♦ విస్తరిల్లి

పేరు విన్నప్పుడే ♦ దూరమై చను భూతచయములు దిగులున ♦ సరభసిల్లి
తొడరి నిల్చినయంతఁ ♦ దొలఁగు దుష్టగ్రహవ్రచయముల్ భయమునఁ ♦ బరిఢవిల్లి
తే. గీ. యక్షుకు నారాద్రికర్మని♦కరము సోఁకఁ, బ్రేతభేతాళమోహినీ ♦ పిశితభోక్తృ
కామినీ శాకినీ ఢాకి♦నీ మదాంధ, భయకరబ్రహ్మరాక్షసు ♦ ల్పల్లటిల్లి. 62
కం. క్రూరగ్రహ చోరగ్రహ, చారగ్రహ కూశ్మశాక ♦ చండగ్రహ శా
కేరి గ్రహాంతరగ్రహ, వారిగ్రహములును బోవు ♦ వానిఁ దలంపన్. 63
కం. వెలగల రావుల మజ్జుల, వెలుగులఁ బాడిండ్ల శూన్య♦విపినముల నుయిన్
గలుఁగుల నిలువక తొలఁగును, మలయక భూతములు వాని♦మంత్రోద్ధతికిన్. 64
కం. ఈలాగు మంత్రిమారుత, తూలకణీకృత సమస్త♦దుష్టగ్రహుఁడై
యాలోకాలోకాంచిత, భూలోకఖ్యాతి నతఁడు ♦ పొలుపొందు సఖీ. 65
తే. గీ. వానిప్రియురాలు విరివాలుఁ ♦ బూనఁజాలు, తేఁటు తమినేలు జవరాలు ♦ రేఖఁబోలు
మేలుగల జాళువాడాలుఁ ♦ గ్రాలు ముద్దు,రాలు ఘనురాలు పేరున ♦ వాలుఁగంటి. 66
కం. కుందనపుబొమ్మ తేనియ, చిందెడుక్రొవ్విరులకొమ్మ ♦ శృంగారము చె
ల్వొందెడుకొమ్మ శుభాకృతిఁ, గందర్పునికొమ్మ దాని♦కథ వినవమ్మా. 67
ఆ. వె. వాలుమీలఁబోలు ♦ వామాక్షి చూపులు, సోము గోము నోము ♦ భామమోము
మించు మించు సంచు ♦ నొంచు మై తళుకంచు, మిన్ను చెన్నుఁ దన్ను ♦ సన్ననడుము. 68

మ. భళిరా ముద్దుమొగంబు తేటలవురా ♦ పాలిండ్లసొం పద్దిరా
బళికుంగన్నులసోయగంబు కటిబ♦ల్బింకంబు సేబాసురా
కులుకుంజెక్కులనిక్కు మిక్కుటపుఁడె♦క్కు ల్చొక్కటంబాయె రా
తలరా దీనికి సాటిలేరని విటుల్ ♦ తన్ మెచ్చ [1]బోఁటింపగున్. 69

చ. ఘనకనకంపుసొంపుగల ♦ కాయము కాయజుతూఁపు తూఁపులన్
జెనకినచూపు కోపులు వి♦శేషము తోషముఁ జిల్కుపల్కులుం
దనరునవీనసూనముల ♦ నవ్వొదునవ్వులు తేనెసోనజా
ల్కొను పెనుతావిమోవి యల ♦ కోమలికే తగు నొప్పు చొప్పడన్. 70
కం. నెలరామొగమును నునువె,న్నెల రాజీవాక్షి నవ్వు ♦ నీలపురావ
న్నెల రాజిలు చెలికీల్జడ, నెలరాలజయించు మిగుల ♦ నెలఁతనఖంబుల్. 71
కం. నెఱికురులగుఁ గంధరములు, ధరములకన్నను గుచాలు ♦ తగ సుందరముల్
దరముల సిరి బిత్తరముల, దరము లతాతన్విగళము ♦ ధర వర్ణింపన్. 72

పా. 1 బోఁటొప్పగున్.

కం. ఇటులఁ దులలేనిరేఖా, పటిమయు జవ్వనముఁ దనరఁ ♦ బతిపై నరుచు
ల్పొటమరిలి యన్యపురుషుల, ఘటియింపం దొడఁగె రతికిఁ ♦ గామిని వేడ్కన్. 73

సీ. ఏనాఁటి కేపాప ♦ మెఱుఁగనికన్నుల కిడియెఁ గాటుకరేఖ ♦ లేపుమెఱయఁ
బుట్టి పున్నె మెఱుంగ♦నట్టినెమ్మొనికిఁ బసపునల్లు ఘటించె ♦ మిసిమి బెళుకఁ
గలనైనఁ బంకించి ♦ కలయుదువ్వని వెంట్రుకలు దువ్వి కొప్పిడెఁ ♦ జెలువమ్మొలుక
వెన్నఁడు సొగసనే♦దెఱుఁగనిగుబ్బల కలరించెఁ గంచుళ్లి ♦ వలపుఁజిలుకఁ

తే. గీ. బూర్వమెక్కాలమందైన ♦ ముడువఁగొనని, విరిసరులఁ జుట్టెఁ గ్రొమ్ముడి ♦ సిరులుదొలుక
నెదుట విటకోటి నెనసేటి ♦ మదమునాఁటి, యాఱజముమించి యాచంచ♦లాక్షి యపుడు. 74

ఉ. పాటలు మోముత్రిప్పటలు ♦ పైఁటమరించుట లోరచూపులున్
మాటలు ముద్దుజంకెనలు ♦ మవ్వపునవ్వులు గోఁటిచిమ్ములున్
నీటుదొలంకుచిన్నెలును ♦ నెవ్వగనన్నలు లేనియూరుపుల్
మేటిగ నల్పు వింత వగ ♦ మిండలఁ గాంచి వధూటి మాటికిన్. 75

సీ. పూటపూట మెఱుంగు ♦ నీటుగాఁ బెట్టించుఁ గమ్మలుగ్రొమ్మించు ♦ కాంతులీన
మాటిమాటికి నూనె ♦ పాటిగాఁ బదనిచ్చి తలదువ్వి కొప్పిడు ♦ వలపుఁదెలుప
గజెగజెకును బెట్టి ♦ నిడినసుగ్గడితంపుఁ జలువలుగట్టును ♦ జెలువు దనర
దినదినంబును వింత ♦ దెరలఁ జెక్కటపుసొమ్ములు దాల్చు నెమ్మెనఁ ♦ దళుకులొలుక

తే. గీ. గళమునను బూయు గంధంబు♦గంపవడియుఁ, గ్రొమ్ముడిని జెక్కునవరంబుఁ♦గ్రొవ్విరులును
సొగసు దనరార విటకోటి ♦ సొక్కి తిరుగఁ, జిత్తజాయత్తచిత్తయై ♦ చిగురు బోఁడి. 76

తే. గీ. మదనపీడితయై యయ్యె♦మానవాభి,లాష మెడఁబూని యిటుల న♦లంకరించి
తిరుగుచుండెడుపినాఁడె ♦ వెరవుపఱుచు,కొనియెఁ దమిదీఱ నమ్ముద్దు♦గుమ్మ విటుల. 77

కం. కరణమును నూరిరెడ్డిని, గరిమం దగుపారుపత్తె♦గానిఁ దలారిన్
దత్రియైనవేళ నీ నలు,గురితోఁ బొరిపోనిరతులఁ ♦ గూడిసుఖించున్. 78

సీ. పురిబాహ్యసంకేత♦పరగృహంబున కేగి యామికాభిప్రాయ ♦ మలరఁ దీర్చుఁ
దత్రియైనయెడఁ జేని♦దగ్గఱ కేపోయి ప్రియముగొల్పఁగ రెడ్డి ♦ ప్రేమఁదీర్చు
సంచారికాలయ♦స్థలికిఁ బిల్పించుక యధికారికోరిక ♦ లమరఁ దీర్చు
నెనయువేళ్లై యున్నఁ ♦ దనయింటికేపిల్చి గరిమతోఁ గరణంబు ♦ కాంక్షదీర్చుఁ

తే. గీ. బగలు రాత్రులు నెడఁబాయఁ ♦ బడకయున్న, మోహపరితాపవేదన ♦ ల్మదిరి బెదరి
చెదరఁ జేయంగ వేఱొక♦చింతలేక, చండమదమత్తభద్రవే♦దండగమన. 79

తే. గీ. సొగసి సొగయించి నెఱయోర♦చూడ్కిఁ జూచి, పలికి పలికించి చిన్నెలు ♦ బయలు నెరపి
భ్రమసి భ్రమయించి తనకు లోఁ♦బడఁగఁజేసి, వలచి వలపించు నది యెంత♦వాస్నైన. 80

కం. ఈస్థితిని గొంతకాలం, బాస్థలివిటకోటిఁ గూడి ♦ యలరుచు మోహా
వస్థల జరుపఁగఁ బతి కొక, ప్రస్థానము సంభవించెఁ ♦ బ్రమదం బెసఁగన్. 81

చ. పరపురభూమిభర్త కుల♦భామిని కుగ్రములైనభూతము
లిరముగఁ జట్టి బాధలిడు ♦ తెంపుననుండఁగ నానిమిత్తమ
న్నరపతి పిల్వనంపఁగ ఘ♦నం బగు వేడుక రౌద్రకర్ముఁడ
త్తఱి నెఱమాంత్రికుం డగుటఁ ♦ దద్దయు నేగెఁ జికిత్స సేయఁగన్. 82

తే. గీ. అటుల నిజనాయకుం డేగి ♦ యన్యరాజ, పురవరముఁ జేరె నంతటఁ ♦ బొలఁతి యలరి
తొడుసు మాలెఁ గదా యంచు ♦ దుడుకుచేసి, విటుల నలరించె నిచ్ఛాను♦వృత్తిమీఱ.

కం. ఆజ్ఞ యొకింతయు లేమి మ, నోజ్ఞవయోవిటులకున్ మ♦నోభవసమర
ప్రజ్ఞలఁ జూపుచు రతిపై, సుజ్ఞానము వీడమి పడఁతి ♦ సొంపున నుండెన్. 84

కం. ఈతీరు కొన్నిదినములు, చేతోజాతాహవముల♦చేఁ దనరారన్
శీతాంశువదన మెలఁగఁగ, నాతలవరి యొక్కనాఁటి ♦ యామిని వేళన్. 85

ఉ. 1పువ్వులదండఁజుట్టి సిగఁ ♦ బొందగుఁ జందురుకావిజాళువా
మవ్వపుటంచు పద్మపురు♦మాలు సుగంధపుఁబూఁత నేఁతచే
రవ్వగుచల్వదుప్పటిక♦రంబున నాకులుఁ జంక వట్రముగా
నివ్వటిలంగ దానికడ ♦ నిద్దురఁజెంద బిరానవచ్చినన్. 86

కం. చూచి ముదమంది యంతట, లేచినదై యెదురుగా ని♦లిచి కేల్ కేలం
డాచికొని పట్టి మెల్లనె, యాచెలి తనకేళిగృహము ♦ నతనిం జేర్చెన్. 87

ఉ. చేర్చి ఖురాళము ల్గలుగు ♦ చిల్కలకోళ్ళఁ దనర్చి పట్టెచేఁ
దీర్చిన తూఁగుపాన్పునఁ గ♦దించినకమ్మనిపువ్వుసెజ్జపై
దార్చి వినోదము ల్సలిపి ♦ దర్పకదర్పరణప్రవీణయై
పేర్చుచు నుండఁగా రతికిఁ ♦ బేర్కొన రెడ్డి ప్రియంబు సంధిలన్. 88

సీ. కమ్మిపచ్చడమును ♦ గంటీలపోఁగులు మొలఁజీటి కమ్మల♦ముదుగువల్లె
నిండుచల్వరుమాలు ♦ వెండొంకు లుంగరంబునుఁ జుక్కబొట్టు సొం♦పొనయు మెడను
గందంపునునుబూఁత ♦ కర్ణయుగంబున నేర్పుగాఁ జెక్కు గ♦న్నేరుపూలు
కత్తెరగడ్డంబు ♦ గజ్జెలు నందెలు నాదించు జిగిసక♦లాద్దితిత్తి

తే. గీ. పాదములఁ గిఱ్ఱుకిఱ్ఱని ♦ పలుకుమెట్లుఁ, గుచ్చుటుద్దాలుఁ జేపట్టు♦కోలయమర
రెడ్డి ప్రియురాలివాకిటఁ ♦ బ్రేమనిలిచి, వాకిలి సడల్పు మనుచుఁ బి♦ల్వంగ నపుడు. 89

పా. 1. పువ్వులతోడి కొరసిగ

కం. తలవరి గజగజవణఁకినఁ, గలఁగకుమని వీఁపుఁజఱచి ♦ ఘనురా లతనిన్
నిలిపియొకమూల నట్టువ, నెలమిన్ వాకిలి సడల్చి ♦ హితమలరారన్. 90

తే. గీ. రెడ్డి నింట్లోకిఁ బిలిచి నీ♦రేరుహాక్షి, వాకిలిగదించి యప్పుడు ♦ వానికేలు
పట్టుకొనివచ్చి శయ్యపై ♦ బవ్వళించి, ననవిలుతుకేళి నిద్దఱు ♦ పెనఁగుచుండ. 91

చ. తెలితలపాగ చొక్కమొల♦తిత్తి భుజంబునఁ జల్వపచ్చడం
బల చిటివేళ్ల ముద్రిక యొ♦య్యారముమీఱఁ బొగాకుచుట్ట సొం
పలరెడు కావిదోవతి ప♦దాబ్జయుగంబున ముచ్చెలొప్పగా
నలనిభుఁ డంత గ్రామకర♦ణం బటకై చనుదెంచె నంతటన్. 92

కం. పెనుతలుపుగడియఁ దీయ్యని, ఘనురాలి నతండు పిల్వఁ ♦ గాఁపుకొడుకు తా
విని దిగులొందిన వెఱవకు, మని రెండవమూల నటుక ♦ నాతని నుంచెన్. 93

తే. గీ. ఉంచి కదలకు మిచ్చోట ♦ నురగ మొకటి, కలదటంచును దెల్పి యా ♦ కాంత వేగ
కరణమును డాయఁగాఁబోయి ♦ గడియఁదీసి, లోపలికిఁ బిల్చి మఱలఁద♦లుపునుగదించి. 94

మ. దయ కద్దా యని పల్కరించి తమిఁ జెం♦దంజేసి లేనవ్వులం
బ్రియ మొందించి కదించి ముద్దు లిడుచుం ♦ [1]బృథ్వీధరోరుస్తన
ద్వయి బల్ ఱొమ్మున [2]గమ్మకుమ్మకొని మో♦దం బొప్పఁ గావించి యా
వియదాకారసుమధ్య సంగమసుఖో♦ద్వేలస్పృహాధీనయై. 95

కం. తనివారక సరికట్టక, యనివారకమోహదోహ♦ళామోదము హె
[3]చ్చినమీఱక నన్యోన్యము, చనవారఁ గళాదు లరసి ♦ సమరతిఁ బెనఁగెన్. 96

వ. ఆసమయంబున. 97

కం. నిలువంగి యోరమెలికల, తలపాగ ఖలీతి శాలు ♦ తావిమెయింబూఁ
తలు పోఁగు లంఘిరక్షలు, వెలయఁగ వేపారి వచ్చె ♦ వెలఁదుకకడకున్. 98

మ. వగకాఁడై చనుదెంచి తీవిని బహి♦ర్ద్వారంబునన్ నిల్చి త
ల్పు గడెం దీయు మటంచు నాప్రివిమలాం♦భోజేక్షణం బిల్వఁగా
దిగులుంబొంది నియోగి యెట్టులనుచున్ ♦ దేహంబు కంపింప నా
చిగురుంబోఁడి యమాత్యువీఁపడఁచి తాఁ ♦ జెన్నొంది శీఘ్రంబునన్. 99

కం. మూఁడవమూలను నట్టువ, పైఁ డించి నియోగి నయ్య♦బల యధికారిం
గూడఁ జని తలుపు సడలిచి, వేడుకఁ గ్రీడాలయమున ♦ వేగమె చేర్చెన్. 100

పా. 1. బృథ్వీసురుఁడ వే స్తన   పా. 2. గుప్పిమ్మకుప్పిమ్మయను మో♦దం బొప్పఁ
పా. 3. చ్చను వా రట్లన్యోన్యము,

తే. గీ. చెక్కుచెక్కిలిఁ గదియించి ♦ చెలిమి మించి, కాంక్ష లూరించి చిన్నెల ♦ కలిమిఁ గాంచి
మొలకనవ్వులఁ దేలించి ♦ మోహముంచి, కళలఁ గరఁగించి సంధించి ♦ కౌఁగిలించి. 101

చ. మునుకొనిమూఁడుమూలలను ♦ ముప్వురు గుప్రిక్కలుమిప్రింగఁ జెంగలిం
చిన తమిచాల హెచ్చి మరు ♦ జెట్లతెఱంగున డొంకిడొంకి పో
ర్లినగతిఁ బొర్లుకాడిచను ♦ లీలను నిద్దఱు నేకకాంక్షతో
ననవిలుకానిపోరునఁ బె ♦ నంగెడువేళ నిజేశ్వరుం డొగిన్. 102

తే. గీ. పరధరాధిపుభార్యను ♦ బట్టినట్టి, భూతముల వెళ్లఁగొట్ట భూ ♦ భుజుఁడు మెచ్చి
ధనపరిష్కారవస్త్రము ♦ ల్దన కొసంగి, యుంపకముసేయఁ దనయింటి ♦ కరుగుదెంచి. 103

కం. తలుపు నడలింపు మనుచుం, [1]గులభామను రాత్రికర్మ ♦ కుఁడు బిల్చినచోఁ
దలఁకెడివేపారి మన,శ్చలనముపో వీఁపుఁ జఱచి ♦ సంభ్రమ మొదవన్. 104

ఉ. నాలవమూలయందు నుప ♦ నాథునినుంచి కృశాంగనల్లిమై
యాలుపు భక్తియుక్తిఁ దమి ♦ హెచ్చు భయంబునఁ దల్పుఁదీసి యా
[2]నీలసరోజకన్నుగవ ♦ నీళ్లనె కాళులఁ గడ్గి కౌఁగిటం
దేలిచి యింటిలోపలికిఁ ♦ దిన్నఁగఁ దోడ్కొనివచ్చె మెచ్చుచున్. 105

తే. గీ. పరధరాధిపుభార్యకుఁ ♦ బట్టినట్టి, భూతముల వెళ్లఁగొట్ట భూ ♦ భుజుఁడుమెచ్చి
తనరఁగా నీకొసంగిన ♦ ద్రవ్యమేది, కనుఁగొనెదఁ జూపు మన రాద్ర ♦ కర్ముఁ డపుడు. 106

చ. తెమలని చిమ్మచీఁకటిని ♦ దీపములేకను జూపుమెట్లు దీ
పము గొనితెమ్ము చూపెదను ♦ భద్రముగా నివి నీవె దాఁచిపె
ట్టుము మును దాఁచుమూలనె క ♦ ఠోరకుచా యని పల్కరింపఁగా
నమితభయార్తచిత్తులయి ♦ యయ్యధికారిముఖుల్ చలింపుచున్. 107

కం. మునుపటిమూలనె దాఁచు మ,టని భార్యను బొడిచియాడె ♦ నది దీపము చూ
పినఁ జూచి వీఁడు మ మ్మె,మునునో యనుశంకచేత ♦ మదిఁ దహాపడుచున్. 108

చ. నలువురు గుప్పదెప్పమన ♦ నాలుగుమూలలనుండి దుంకి వి
చ్చలవిడిఁ బాఱసాగినను ♦ సాహస మొప్పఁగఁ దద్విభుండు గొం
దలపడి చూచి వీరెవరు ♦ దాపక చెప్పుము చెప్పకున్న న
గ్గలమున నిన్వధింతు నని ♦ కత్తి యహా యొరదూసి పల్కినన్. 109

కం. ఆవేళ నెట్లు బొంకం, గావలయునొ కొమ్మ తేట ♦ గాఁ జెప్పి ధరి
త్రీవిభుని నెనయఁ జను మనఁ,గా విని యోచించి వనిత ♦ కళవళపడుచున్. 110

పా. 1. గులభామను మాంత్రికుండు ♦ కూపెట్టినచోఁ  పా. 2. నీలశిరోజ నేత్రముల ♦ నీళ్లనె

ఉ. వింతకథారహస్యములు ♦ వీనులవిందుగవింటిఁ బార్వతీ
కాంతునకైన శక్య మిది♦గాదు వచింపను బ్రహ్మలోకప
ర్యంతము చూడఁ దోఁప దిది ♦ హంసవతంసమ నీవెచెప్పి భూ
కాంతునిఁ జేర నన్ననువు ♦ గాథలచేతన ప్రొద్దుఁద్రోయకన్. 111

కం. అనవిని మేల్నెఱజాణవు, గనిచెప్పఁగరాదె యెంత ♦ కథయిది నే నీ
కును దెలియకున్నఁ జెప్పెద, వినవే ఘనురాలి బొంకు ♦ విధమవలీలన్. 112

చ. వినుము నిజేశ నీవు చని ♦ వేఱొకయూరికిఁబోవ నాఁటిరా
త్రిని నొకతెం బరుండఁ గను♦దృష్టికిఁ గన్పడెఁ గొన్నిరూపముల్
కనుపడి మమ్ము నీమగఁడు ♦ కాలిడనీయఁడు మాస్థలంబులం
దునిమెద మేము నిన్ననుచుఁ ♦ దూరిన నం దొకభూత మయ్యెడన్. 113

తే. గీ. నాతి యీవేళకును గాచి♦నాము నిన్ను, నీదుమగఁ డింటి కరుదెంచి ♦ నిలిచినపుడు
మాతెరువు దాను రాకుండ ♦ మనివిచెప్ప, చెప్పకుండిన నీచావు ♦ సిద్ధమనుచు. 114

కం. బెదరించి నాఁటిరాత్రికిఁ, గదలెన్ భూతమ్ము లంతఁ ♦ గనుకూర్కెడువే
ళ దినము దినమును వడి నా, యెదుటం బొడకట్టి పయిప♦యింబడి యల్కన్. 115

కం. పది యైదు నాల్గు భూతము, లదయత ననుఁజూచి నీని♦జాధిపుఁడు మమున్
మొదలంగనీయఁ డియ్యెడ, విదళింతుము నిన్నుఁబట్టి ♦ వెలఁదీ యనుచున్. 116

కం. ఇంతకుమునుదనుకను న, న్నెంతయు బాధించె నింటి ♦ కీవిప్పుడు రాఁ
బంతముచెడి నీభయమునఁ, గాంతుఁడ యవి పాఱిపోయెఁ ♦ గనుపడఁ గంటే. 117

కం. ఈరీతి నీభయంబునఁ, బాఱెడుభూతములఁ జూచి ♦ భామా వారె
వ్వారని సంశయమున నను, మారింపఁదలంచి తహహా ♦ మది దయలేకన్. 118

కం. నీ వింటలేనితఱి భూ, తావళిచే [1]నొప్పియగుట ♦ కంటెను నీచేఁ
జావఁగనుట లెస్సగు నటుఁ,గావున నిదె చంపుమనుచుఁ ♦ గంఠము వంచెన్. 119

ఉ. వంచిన భామినీమణి న♦వార్యకృపం గని తద్విభుండు హా
స్తాంచిత మండలాగ్రము ర♦యంబున నవ్వలఁ బాఱవైచి రా
ణించినవేడ్కఁ గౌఁగిటను ♦ నిల్పి నెఱిల్కొనగోళ్లఁదీడి లో
నుంచవె ప్రేమ యంచు విన♦యోన్నతి నూఱటఁబుచ్చి యంతటన్. 120

తే. గీ. భూతకాపునుబెట్టి వి♦భూతిఁబట్టి, యంత్రములుగట్టి వెఱవకు ♦ మనుచుఁ దట్టి
పోయె లెమ్మన్న స్నానాన్న♦భుక్తిరతుల, మగనిఁ గరఁగించె ఘనురాలు ♦ మమత తోడ.

---

పా. 1. నొచ్చుకంటె ♦ నదయుఁడ నీచేఁ

కం. అని యంచ పలుకు నత్తఱి, నినుఁ డుదయాద్రిని వసింప ♦ నింటికిఁ జని యా
దిన మెల్లఁ గడిపి యామిని, చనుదెంచిన నృపతి నెనయు ♦ సంతోషమునన్. 122

ఉ. కొప్పున జాజిపూలు మణి♦కుండలము ల్చెవులందుఁ గంధరన్
గొప్పసుహాణిపేర్లుఁ జను♦గుబ్బలఁ గుంకుమపూఁత పుక్కిటం
గప్పురపున్విడెంబుఁ గన♦కంపుకడెంబులు చేతులం గటిం
జొప్పడు చల్వదువ్వలువ ♦ సొంపు ఘటింప లతాంగి వచ్చినన్. 123

కం. కనుఁగొని హంసము తరుణీ, విను మొండొక పిన్నకథ వి♦వేకముతో నే
వినియెద నని నీవనినన్, వినుపించెద ననిన విరహ ♦ విహ్వలబుద్ధిన్. 124

కం. దినములు నీ గాథలచేఁ, జనెఁగాని నృపాలుఁ జేర ♦ సాగకపోయెం
జనియెద నేఁడైనను నా, మనవిది విని వేగఁ జెప్పు♦మా పతగమణీ. 125

## పదునొకండవ రాత్రి కథ.

కం. అని పలికిన హేమావతిఁ, గని పల్కెఁ బతంగవిభుఁడు ♦ కనకంబను పే
రునఁ దగు పురి నొకవిప్రుం, డనవద్యుఁడు చండశర్ముఁ♦డన దనరారున్. 126

వ. అతఁ డక్షర లక్షణంబును, ఋగ్యజుస్సామాథర్వణంబులును, వేదాంతవైశేషిక భాట్ట ప్రభాకర పూర్వోత్తరమీమాంసాది శాస్త్రంబులును, బ్రహ్మాండ విష్ణు నారద మార్కండేయ వామ నాగ్నేయ గారుడ భవిష్య ద్భాగవత స్కాంద మాత్స్య లైంగ కూర్మ వాయు వరాహ పద్మ బ్రహ్మవైవర్త బ్రహ్మోత్తరఖండంబులను పదునెనిమిది పురాణంబులును, ఆది సభారణ్యోద్యోగ విరాట భీష్మ ద్రోణ కర్ణ శల్య సౌప్తిక స్త్రీ శాంత్యనుశాసని కాశ్రమవా సాశ్వమేధ మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణంబులను పదునెనిమిది పర్వంబులును, వాసిష్ఠ శౌనక గౌతమ గాలవ వారుణ మహేశ్వర బ్రాహ్మ్య బౌద్ధ భృగు గురు ఆత్రేయ నారద పారాశర భారద్వాజ విశ్వామిత్ర రురు మృకండు రైభ్యసంహితలనుస్మృతులు పదునెనిమిదియును, శిక్షా కల్ప జ్యోతి ర్వ్యాకరణ నిరుక్తులును, ఉక్తాత్యుక్త మధ్యప్రతిష్ఠ సుప్రతిష్ఠ గాయత్రీ ఉష్ణిక్ అనుష్టుప్ బృహతీ పఙ్క్తి త్రిష్టుప్ జగతీ అతిజగతి శక్వరి అతిశక్వరి అష్టి అత్యష్టి ధృతి అతిధృతి కృతి ప్రకృతి అకృతి వికృతి సంకృతి అభికృతి ఉత్కృతి యను నిరువదాఱు ఛందస్సులును, శైలజ రోమజ వాసిష్ఠ సోమసూర్యాది సిద్ధాంతంబులును, ఉపమా రూపక దీపకా వృత్త్యాక్షేపా ర్థాంతరన్యాస వ్యతిరేక సమాసో క్త్యతిశయో క్త్యుత్ప్రేక్షా హేతు సూక్ష్మ లేశ క్రమ రసవత్ ప్రే యోర్జస్వి పర్యాయోక్తి సమాహి తోదా త్తాపహ్నువ శ్లేష విశేషోక్తి తుల్యయోగి తాప్రస్తుతప్రశంసా వ్యాజస్తుతి నిదర్శనా సహోక్తి పరివృత్తి సంకీర్ణ విభావనాద్యలంకారంబులును, అమర రామర శేష విశ్వ శాశ్వత శబ్దార్ణవ యాదవ వైజయంతీ నానార్థరత్నమాల కాకార హలాయుధ వాగురి కేశవ తారపాల ధన్వంతరీ ధరణీ ధనంజయ రభస విశ్వప్రకాశ మాధవ చింతామణి జయప్రతాప

శుభాంగ జయపాల క్షీరస్వామ్యేకాక్షర ద్వ్యక్షరాది నిఘంటులును, సంస్కృత ప్రాకృత శౌర సేని మాగధి పైశాచి చూళికోక్త్యపభ్రంశాంధ్రములను నష్టభాషలును, స్వరనిత్యసమాస ప్లుత కాక్వాదేశ ప్రాదిప్రాస యోగవృద్ధ్యభేద దేశీ యాభయ శకంధ్వ ఖండవిభాగ వికల్ప ప్రభునామ భిన్నవర్గ సంయుక్త వికల్ప జక్కటియెక్కటిపోలికె సరస యనుస్వరఋజువులనం బరగుముప్పదియతుల విధంబులును, సమనామసంయుత సంధిగతోభయ ప్రాది వికల్ప బింద్వర్ధ బిందు ఋజుప్రాస త్రికారసమలఘుప్రాస మైత్ర్యంత్య దుష్కరద్వంద్వ త్రిప్రాస చతుఃప్రాసా ద్వష్టాదశ ప్రాసంబులును, మగణ యగణ రగణ సగణ తగణ జగణ భగణ నగణంబులును, ఇంద్రేంద్ర సూర్యగణంబులును నుపగణంబులును బ్రయోగించి తత్తద్దేవతాలక్షణంబు లెఱింగి శయ్యా ద్రాక్షా నారికేళపాకంబుల కవిత్వరచన లెఱింగి సకలవిద్యాపారంగతుండై యుండె నప్పుడు. 127

తే. గీ. అతఁడు తనసతు లిద్దఱు ♦ నహరహంబు, వా దొనర్చుట సైఁపక ♦ వలపుఁగులుకు
పిన్నపెండ్లాముపక్షమై ♦ పెద్దభార్య, భాషిణీనామఁ గడనుంచె ♦ దోష మనక. 128

వ. అంత. 129

*సీ. నెఱిగొప్ప నెఱరంగు ♦ నీలంపుసద్రుచుల్ నారదభావంబు ♦ జూఱఁగొనఁగఁ
గలికి కాటుకకంటి ♦ చెలువు భారద్వాజ గరిమంబునైనఁ జీ ♦ కాకుపఱుప
మించు సిబ్బెపుగుబ్బ ♦ మినుకులు కుంభజ సద్వృత్తమంతయు ♦ జడియఁజేయ
మందయానపుఁ బ్రౌఢి ♦ మము మతంగజధైర్య పర్యాయ మెంతయుఁ ♦ బగులఁజేయ

తే. గీ. నవసుధామయ మధురోక్తి ♦ నైపుణములు, శుకమనోవృత్తి నెంతయుఁ ♦ జులుకఁజేయ
మెఱుఁగు జిగినిచ్చువగజక్కు ♦ నెఱతనంబు, వెలయఁ జరియించునదియు న ♦ వ్వీటిలోన.

తే. గీ. మగఁడు పెఱవాడవైచిన ♦ మట్టుమీఱి, బిడ్డపాపలఁ గని యెత్తి ♦ పెంచుజోలి
లేదు గావునఁ దిండిచేఁ ♦ నూఁది పోఁత, బొమ్మగతి నుండు నక్కొమ్మ ♦ యెమ్మెచిమ్మ.

చ. కుడువ సమస్తభాగ్యములు ♦ కోరికమీఱఁగఁ గట్ట వస్త్రముల్
దొడుగ విశేషభూషణము ♦ లుం దనరార నలంద గంధముల్
ముడువను మంచిపువ్వులును ♦ మొత్తముగల్గిన భోగహీనలై
పడఁతుక లుండనేర్తు రటె ♦ ప్రాయమునం బెఱత్రోవ డాయకన్. 132

తే. గీ. పిఱుఁదుఁ బిక్కలుఁ జెక్కులు ♦ బెడఁగుఁదొడలు, వెడఁదయొడలును జన్నులు ♦ వెండ్రుకిడను
సందులేకుండ బలియుట ♦ సకియమనసు, జారసంభోగకేళికి ♦ స్వారివెడలె. 133

వ. అది మఱియును. 134

*ఈ పద్యము తాళపత్ర ప్రతులందు లేదు.

కం. జారుల మదిజేరఁగ నా, నారీమణి మోవి లేఁత ♦ నవ్వొసఁగించెన్
హారంబుల తారంబుల, హీరంబుల నగు రదాళి ♦ యించుక మెఱయున్. 135

తే. గీ. మనసు నిలువక తమి హెచ్చి ♦ మాఱుమగల, వెదకుచుండంగ నవ్వాడ ♦ వీధివెంట
వింతపరదేశి 1చెంతకు ♦ వేగమొకఁడు, వచ్చె భాషిణి కనువిచ్చి ♦ మెచ్చిచూడ. 136

*ఆ. వె. విప్రుఁ డివ్విధమున ♦ వీధి నేతెంచుచు, సొలసి కెలకు లరసి ♦ చూచికొనుచుఁ
దన్నుఁ జూచుచున్న ♦ ధరణీసురాగ్రిణి, తరుణిఁ గాంచి దాని ♦ దఱియవచ్చె. 137

తే. గీ. వచ్చి ధర్మాభివృద్ధి గా ♦ వలె నటంచుఁ, బరమభాగీరథివి మహా ♦ భాగ్యవతివి
యనుచు దీవించి నా కింత ♦ యన్న మనుచు, వేఁడ భాషిణి యా విప్ర ♦ విధువ కనియె. 138

కం. పేరెయ్యది యూ రెయ్యది, మీ రెయ్యెడ కేగఁదలఁచి ♦ మెట్టితి రిటకం
చారసి యడిగిన బావఁడు, సారసలోచనకు వేడ్కఁ ♦ జతురుం డనియెన్. 139

చ. మును పుప్రసిద్ధి మీఱఁ దమ ♦ మూఁడవ తాతతరాన నుండియుం
డిన యవని శాణయాచిగను ♦ డెంకణధారుణియందుఁ దండ్రి నన్
గని చదివించు బుద్ధి నయ ♦ గారికి నప్పనసేసి యక్షరా
స్యాపిస సౌన్దర్యంపు బడి ♦ కొయ్యనఁ దోడ్కొనిపోయె నచ్చటన్. 140

సీ. నన్నయ్యవారు లో ♦ నా మూలు దిద్దుకొమ్మనిన చోఁ గడుపునొ ♦ వ్వనుచు నేడ్చి
దండమ్మునను గుంజెం ♦ తమును పెట్ట రమ్మన్న నంగుళి వ్రణమాయె ♦ ననుచు జాఱి
శిష్యులచేఁ గాలు ♦ చేతులు బట్టించి తెచ్చి వద్యముఁ జెప్పఁ ♦ దెమలకుండి
పలక వ్రాయనటంచు ♦ బడి కెత్తుకొనిపోవ బలపంబు లేదని ♦ పలుకకుండి

తే. గీ. యలుక చే నుండ బుగ్గలు ♦ నులిచి తిట్టి, తొడలు వడిపెట్టి కోదండ ♦ మెడరఁ గట్టి
కొట్ట తెగఁబెట్టఁ బట్టించి ♦ తేపు మాపుఁ, గొట్టు బెట్టుగ పజ్జన ♦ కోల దెగను. 141

సీ. గద్దించి తిట్టిట ♦ దిద్దుమంచును వ్రేలు బట్టించినచట నేఁ ♦ బట్టకుందుఁ
బలుమాఱు లో యని ♦ పల్కుమంచును గొట్టి చెప్పిన శిలవృత్తి ♦ దప్పకుందు
నొకటికి సెలవియ్య ♦ నుఱికి చీఁకటిదాఁక బసులగాపరుల వెం ♦ బడిన పోదు
జననియడకుఁ గొని ♦ చదువుకోఁ బొమ్మన్న వినక వేములు వెక్కి ♦ వెక్కి యేడ్తు

తే. గీ. సారె పన్నఁపుఁబలుకపైఁ ♦ జమురుపూతు, నెవ్వఁడును బెద్దపలక పొ ♦ క్కొత్తఁ జేతు
బాలరామాయణము పుస్త ♦ కాలు దాతు, వేయుసజ్జనకోలలు ♦ విఱిచివైతు. 142

కం. చరికుండ పగులఁగొట్టుదుఁ, బరువడి సూత్రంబు ద్రెంచి ♦ పాఱఁగవైతున్
మఱిమఱి బలపము లిచ్చినఁ, బొరినమలుదుఁ బగులఁగొట్టి ♦ పోయె నటంచున్. 143

పా. 1. చతురాఖ్య ♦ విప్రుఁ డొకఁడు,
* కాగితంపుఁబ్రతుల యందంతట నిగీతమున్నది, తాళపత్రప్రతిలో లేదు.

తే. గీ. నన్ను బింగీలు పెట్టించు♦నాఁడె యయ్య్య,వారు నిద్రింపఁగాఁ జూచి ♦ చేరి యచటి
చింతవ్రేల్కొమ్మవంచుక ♦ సిగకుఁగట్టి, విడిచి యుఱికితి నయగారు ♦ మిడికికూయ. 144

తే. గీ. అంతఁ దలిదండ్రు లయగార ♦ లదిమొదలుగ, వేఁడివెనలట్లు వేసరి ♦ విడువ నేను
గొంటెవగ నాతతాయులఁ ♦ గూడుక పలు,గాకిచేష్టల నాటలఁ ♦ గ్రందుకొంటి. 145

వ. అంత మఱియును. 146

సీసమాలిక. దూచియు జాబిల్లి ♦ బూచి కన్నులకచ్చి [1]గుడిగుడికుంచంబు ♦ కుందెనగిరి
చీఁకటిమొటికాయ ♦ చింతాకుచుణుదులు పులియాటలును జిట్ల♦పొట్లకాయ
తూరనదుంకాలు ♦ తూనిగతానిగ చిడుగుడు మొకమాట ♦ చిల్లకట్టె
దాఁగిలిమూఁతలు ♦ తనుబిల్ల యాలంకి గుప్పటగురిగింజ ♦ కొండకోఁతి
చిక్కణబిల్లయు ♦ జెల్లెము గొడుగును [2]బిల్లదీవులు లక్కి♦బిక్కిదండ
గడ్డెనబోడి యొ♦క్కసికొక్కు బరి గాయ పోటు గీరసగింజ ♦ బొంగరములు
పెంచులబేరి దో♦పిల్లు గాలిపటంబు సరిబేసి పుటచెండు ♦ చాకిమూట
గోట దొర్లుడుకాయ ♦ గొబ్బిళ్లు మోపిళ్లు నీగపోగినబంతి ♦ దాగిలాట
వెన్నెలకుప్పలు ♦ వ్రేలుబొట్టనగిరి సింగన్నవత్తియుఁ ♦ జిందువఱువు
గచ్చకాయలు కిఱ్ఱు♦గానుగత్రిప్పళ్లు గుఱ్ఱపెక్కుడు మంటి♦గుళ్లుమళ్లు
కాలికంచంబును ♦ గట్టెగుఱ్ఱము వినాయకుతిరితూనెకొ♦ట్లాట చమర
కా యొత్తిగొడుగు బొం♦గరము రామన్నాట పొదుగుళ్లు నుయ్యాల ♦ బోర్లపక్క
బండ్లికలును జొప్ప♦బొడ్లమంచంబులు గంగెద్దులాటలు ♦ గనికకొండ
లీనెగాజులు పోకు♦టీనెగుఱ్ఱంబులు నాల్గుకంబాలాట ♦ నట్టకోఁతి
దంట్లకిన్నర మంటి♦గంటిపొట్లాటలు సింగన్నదాటులు ♦ జిరుకురాతి
జారుళ్లు తాటాకు♦చక్రాలు చక్రాలత్రిప్పుడు తోఁచిడు ♦ లొప్పగాయ
పాడుపాతర మళ్లు♦పాతరల్ బంతులు చిమ్మనగ్రోవులు ♦ చిఱ్ఱుబుఱ్ఱ
లాకుపీకలు జిండ్రి♦లాటలు చుండ్రాళ్లు గిలకలు చిటికెలు ♦ కీచుబురలు
కోలాటములు పిల్లఁ♦గ్రోవులు గుమ్మడి క్రోవికూఁతలు నూఁదు♦క్రోవు లొడ్డు
విడుపు నెట్లుడుకాయ ♦ పిండ్లమ్ములాటలు పులిజూదములు కట్టె♦పుట్టచెండ్లు
దాయాలు సొగటాలు ♦ దాటురా చదరంగమును పోతురాళ్లును ♦ మూఁతపొదువు
వామనగుంటలు ♦ వడి గుప్పిగంతులు చెఱకులపందెముల్ ♦ చిమ్ముఱాయి
తుమ్మెదరేఁపుళ్లు ♦ కుమ్మరసారెలు బండారుబసవన్న ♦ పత్తికాయ
తిరుగుడుబిళ్లల♦త్రిప్పళ్లు జరుగుళ్లు చిటితాళమీలలు ♦ నెటికెతట్లు

---

పా. 1. గుడిగుడిగుంజాలు  పా. 2. బిల్లమెరము

తే. గీ. [1]తిక్కబిల్లలు మైనపు♦తేళ్లు చిక్కు, ముళ్లు జమిడాకుచిల్కలు ♦ తాళ్లపాము
లకట యగచాట్లప్రాఁతనై ♦ యాడుకొంటిఁ, జదువుపై సంధ్యపై నాస్థ ♦ చాల లేక. 147

కం. విను మాట్లాడఁగఁ బెద్దలు, ననుఁగని పనిసేయుమనుచు ♦ నాటిన కోపం
బున నేవలాడ వినలే,కను దేశభ్రమణవృత్తిఁ ♦ గైకొని మఱియున్. 148

కం. సత్రాశన పాత్రుఁడనై, విత్రాసము మాని వింత♦విషయముల వడిన్
యాత్రావస్థలఁ దిరిగితి, రాత్రి పవళ్లనక వినుము ♦ రాకేందుముఖీ. 149

వ. ఇంత యేమిటికంటేని. 150

సీ. తల్లికిఁ గలనైన ♦ దయలేదు నామీఁదఁ దండ్రి యెప్పుడు చూచి ♦ వేండ్రపడును
బినతండ్రి బెదరించుఁ ♦ బెదతండ్రి కారించుఁ బెదతల్లి యూరక ♦ బెట్టుఁదిట్టుఁ
బినతల్లి మెటికెలు ♦ బెళ్లునవిఱుచును నన్నదమ్ములు చూడ ♦ రతులకరుణ
వదినెలు మఱఁదండ్రు ♦ వదరుచు శాపింతు రక్కలుఁ జెల్లెండ్రు ♦ లెక్కఁ గొనరు

తే. గీ. మేనమామలు బావలు ♦ గానివానిఁ, గాఁగఁ జూతురు మావాడ♦కట్టువారు
కంటగింతురు నన్నంటెఁ ♦ గమలజాతు, వ్రాఁతఫలమేమియో కాని ♦ వనజగంధి. 151

తే. గీ. ఇంక నెన్నైనఁగలవు నా ♦ హీనదశలు, నాపదలుఁ జెప్ప నేఁటిమీఁ ♦ దాఱు నెలలు
పట్టు నది యేటిజోలి నా♦పాపఫలము, నేఁటితోఁ దీఱె నోకొమ్మ ♦ నిన్నుఁ జూడ. 152

కం. అని చతురాఖ్యుఁడు వేగమె, తనవృత్తాంతంబుఁ జెప్పి ♦ తరళాక్షి క్షుధా
ర్తిని డస్సితి భోజన మిడు,మని భాషిణి నడుగఁగానె ♦ యది యిట్లనియెన్. 153

కం. ఈవేళమాత్ర మన్నము, గావించెదఁగాని మాపు♦కడల దినాముఁ
నీవు పరుండెదవా సుఖ, జీవితముగ నిచట నొకటి ♦ సెప్పెద నీకున్. 154

తే. గీ. అనినఁ జతురాఖ్యుఁ డామాట ♦ కాశఁ బొంది, నీవు చెప్పినమర్యాద ♦ నిజము నేను
జేయఁగలవాఁడ నని బాసఁ ♦ జేసి యపుడు, భోజనమొనర్చి వెలువడి ♦ పోయి యతఁడు.

సీ. అప్పుడే యేమని ♦ యడుగనైతి నటంచుఁ బలుమాఱుఁ దలఁచి యూ♦ర్పులునిగుడ్చు
నీసారి చని వేఁడ ♦ నేమనునోయని సంకోచమునఁగొంకి ♦ చక్కఁబోవు
నస్తమయము గా ద♦టంచుఁ బాదచ్ఛాయ లొనరించి వేళ్లెంచి♦కొనుచునుండు
నీయూర గడియూర ♦ మిడలేవోయని వీథివీథివెంబడిఁబోయి ♦ వెదకి చూచు

తే. గీ. లీలఁ బవళించు దిగ్గన ♦ లేచిపోవు, నిలుచుచోటను నిలువక ♦ నిప్పద్రొక్కు
కోఁతిచందానఁ జతురాఖ్య♦కుండు దిరుగు, వెలఁదిపై మోహ మెద హత్తి ♦ వెఱ్ఱియెత్తి.

---

పా. 1. తే. గీ. తాటియాకులచిలుకలు ♦ తాళ్లపాము, లకట యగచాట్ల ప్రాఁతనై ♦ యాడుకొనుచుఁ
జదువుపై సంధ్యపై నాస్థ ♦ చాలలేక, పొలఁతి యారీతి నేఁ బ్రొద్దు♦పుచ్చుచుండ.

కం. ఇటులఁ దమి హెచ్చి మారుఁడు, సటలం బెట్టంగ నొచ్చి ♦ సడి నటునిటుఁ జెం
దుటకు వెఱసొచ్చి రతినం,ఘటనార్థము మిగుల వేఁగు ♦ కాలమునందున్. 157

ఉ. భానుఁడు గ్రుంకఁగాఁ గని య♦పారముదంబునఁ బొంగి భాషిణీ
మానినియిల్లు చేరి వగ♦మాటల తేటలఁ బ్రొద్దుపుచ్చి యా
హానిపుణోక్తులం జెనక ♦ నాబిడ జూ చిటురమ్మటన్న చోఁ
బూనిక నిల్లు చేకొనెడు ♦ బుద్ధికిఁ జొచ్చితి వేమి చెప్పరా. 158

తే. గీ. మంచి తగ్గగుర స్తవా ♦ దెంచఁ బరక, కెత్తుకొమ్మన్నఁ బాతికె ♦ కెత్తుకొంటి
వనినఁ జతురుండు వణఁకంగ ♦ నప్పళించి, జడియకు మటంచుఁ గౌఁగిటఁ ♦ జక్కఁజేర్చి.

కం. తరితీపువగలుఁ జిన్నెలు, మురిపెములు వినోదకథలు ♦ మోహపుభాష
ల్పరిపరివింతలతలపులు, నెఱయంగాఁ జూపి సురత♦నీరధి ముంచెన్. 160

వ. ఇట్లు చెలంగి. 161

చ. "కురు సురతక్రియాం, ప్రణయ♦కోపమతిం త్యజ, పూర్వసంగమం
పరిచిను, దేహి గాఢభుజ♦బంధన,మంగజశాస్త్రవాసనాం
స్మర, రదఖండనం ఘటయ, ♦ మా మవ మారశరా, న్నఖక్షతం
విరచయ" యంచుఁ బల్మఱును ♦ వేడ్కఁ వచింతురు జారదంపతుల్. 162

వ. ఇట్లన్యోన్యసరససల్లాపంబుల నెడతెగని మోహాతిరేకంబున సంఫుల్లహల్లకభల్ల మల్లయుద్ధ మహోద్ధతసన్నద్ధబుద్ధిని సరికట్లం బెనంగి యలసిల్లి కరంబులు కరంబుల నురంబు నురంబున ముఖంబు ముఖంబున నూరువు లూరువులం గీలుకొల్పికొని నిద్రించు సమయంబున. 163

చ. వనితయు నిద్ర లేచి తెల♦వాఱెను లెమ్మని జారు లేపి నీ
వనుదిన మిట్లు రాత్రిసమ♦యంబున వచ్చి యనంగసంగరం
బున నను డాయు మంచు నెర♦మోహముతో వినుపించ మంచి దం
చును వచియించి వేడ్కపడు♦చుం జతురాహ్వయుఁడేగె నొతయున్. 164

తే. గీ. ఏగి సంధ్యాద్యనుష్ఠాన ♦ మెలమిఁదీర్చి. పురములో రచ్చతావులఁ ♦ బ్రొద్దుపుచ్చి
యస్తమయము సమీపస్థ ♦ మయిన నేటి,కేగి మజ్జనమాడి య♦థేచ్ఛతోడ. 165

కం. అక్షసరం బార్ద్రాంశుక, మక్షయ కరపాత్ర మమర ♦ నతఁ డప్పురిలో
భిక్షాందేహి యటంచు న,పేక్షం బ్రతిగృహముఁ దిరిగి ♦ భిక్షం బెత్తున్. 166

తే. గీ. ఎత్తి తెచ్చిన భిక్షాన్న ♦ మెల్లఁ జల్ల,శాకమిడునింట భుజియించి ♦ సకలవైశ్య
జాలయాచనలబ్ధతాం♦బూలచర్వ,ణోష్ఠశోణిమ మోమున ♦ నొఱపునెఱప. 167

కం. మనుజులు నిద్రాశయులై, యొనరినతఱి నాల్గుదిక్కు ♦ లొగిఁ జూచుచు వే
చని భాషిణియింటికి ముద,మునఁ జతురుఁడు నిచ్చ దాని ♦ ముచ్చటఁ దీర్చున్. 168

వ. ఇట్లు ప్రతిదినంబున నతండు భామినీయోషాభిప్రాయంబు దీర్చుచున్నంత. 169

మ. ఉహుహుహూత్కారితనూవిధూనన జన♦వ్యాహారవభూజృంభమా
ణ హసంతీజ్వలనంబు శీతపవమా♦నస్పర్శరోమోద్గమా
వహనాంగాఖిలజంతుసంఘము హిమ♦వారితావృతాజాండ మి
మ్మహిమీఁదం బొడసూపె నెయ్యెడల హే♦మంతంబు దుర్దాంతమై. 170

సీ. సకలదిశావ్యాప్త♦బకశీతీకృతములు బహుళనిద్రాముద్ర♦పంకజములు
నిబిడవర్షితమహా♦నీహారకణములు శీతలోత్తరజాత♦వాతతతులు
వర్ధితనిర్ధూమ♦వహ్నిహసంతులు గైరవవికసన♦కారణములుఁ
దాలవృంతవిహార♦కేళిదారణములు యామినీ సముదయా♦యామదములు

తే. గీ. సరసమృగమద మేచకా♦గురుసుగంధ, బంధురస్త్రీకుచద్వంద్వ♦బాధయుక్తి
చకితపురుషావళీ శీత♦సాధ్వసములు, భాసురము లయ్యె హేమంత♦వాసరములు. 171

ఉ. శాంతములయ్యె నెండలు ని♦శాంతములయ్యె వధూకుచంబు ల
త్యంతము వాడి వేఁడిమికిఁ ♦ దాంతములయ్యెఁ బయోజము ల్వ్రిణా
క్రాంతములయ్యె వాతెఱలు ♦ శాంతములయ్యె మహోష్ణవస్తు లా
శాంతములయ్యెఁ దావులు ని♦శాంతములన్ హిమవారిబారికిన్. 172

తే. గీ. అట్టి హేమంతకాలంబు♦నందు నొక్క,నాఁడు చతురుండు భామిని♦తోడఁగూడి
రాత్రిఁ బరిపరిరీతుల ♦ రసికవృత్తి, సురతకేళుల నైపుణిఁ ♦ జూపునపుడు. 173

చ. నెలవునఁ జండశర్మని గ♦నిష్ఠకుటుంబిని లేనిపోనివా
దుల జగడించి యిల్వెడలఁ♦దోలిన వ్రాలిన చింతనొంది యూ
ర్పు లెనయ దైవమా యనుచుఁ ♦ బొక్కుచు నెవ్వరుఁబల్కరించుఁ బే
రెలుఁగున భామినీయువతి♦యింటికి వచ్చె నతండు ఖిన్నుఁడై. 174

తే. గీ. వచ్చి యచ్చండశర్మ తా ♦ వాకిటకడ, నిలిచి తనయగ్రమహిషినిఁ ♦ బిలువఁగానె
గుండె ఝల్లని చతురుండు ♦ గొంకుచుండ, నతని నెట్లింతి యిలువెళ్ల ♦ ననుపవలయు.

కం. ఇది దెలిసిన నృపునెనయం, బద మని రాయంచ వలుక ♦ భామామణి నా
కది తెలియ దెటుల ననుపునొ, విదితముగాఁ దెలుపు మనిన ♦ విహగం బనియెన్. 176

తే. గీ. అటుల నిజపతి తనుఁబిల్వ ♦ విటుని కేలు,వట్టి తోడ్తెచ్చి భామినీ♦పద్మగంధి
తలుపుఁ దెఱచుచు నామూల ♦ నిలిపి వాని, నాత్మనాథుని కెదురుగా ♦ నరిగి యపుడు.

ఉ. నెయ్యము మీఱఁ దచ్చరణ♦నీరజము ల్తలసోఁక మ్రొక్కి వే
డ్కయ్యెడఁ బల్లవింప హృద♦యంబున భామిని యాత్మనాయకున్

శయ్యకుఁ దార్చి దివ్వె లిరు♦చక్కి వెలుంగ ముసుంగు వెట్టి నేఁ
డెయ్యెడ కైన నేగవె చ♦లీ యని పల్కి పరుండెఁ దిన్నగన్. 178

చ. అనువచనంబు దన్ను నొక♦యన్యగృహంబున కేగు మంచుఁ బ
ల్కినదని యాత్మ నెంచి వడి ♦ గేహము వెల్వడి యావిటుండు పో
యినతరువాత భామిని ని♦జేశునిదగ్గఱఁ బండసైఁవకం
గొనకొన లేనివాడు లొవ♦గూర్చి చరించెను వేఁగునంతకున్. 179

కం. జారులపై నాసక్తులు, నారుల కున్నటుల నాత్మ♦నాయకులపయిం
గోరిక లున్నవె యని ఖగ, మారయ వచియించుతతి ని♦శాంతం బైనన్. 180

మ. కని హేమావతి దానిమెచ్చుచు సమ♦గ్రస్వర్ణసౌధాంతరం
బున నక్షీణనిజాళువాగొలుసులన్ ♦ బొల్పొందు నుయ్యాలపై
ఘనతం జేరి వసుంధరాధిప వియో♦గప్రాప్తి ఘస్రాంతమా
దనుకం గుంది తమిస్రమాట కెద మో♦దం బంది యాపిమ్మటన్. 181

సీ. సకటాక్షదీప్తి కాం♦చనరత్న తాటంక ధగధగల్ చెక్కట్లు ♦ దలఁగఁ ద్రోయ
సకపోలకాంతి మౌ♦క్తిక హారవల్లికా చకచకల్ సాంద్రచం♦ద్రికలుగాయ
నవలయధ్వని హేమ♦సప్తకీకింకిణీ ఘణఘణల్ శ్రుతి కౌతు♦కముగ మ్రోయ
సస్థానకసుగంధి♦సారసదళదామ ఘుమఘుమ ల్ఘ్రాణోత్స♦వములఁ జేయఁ

తే. గీ. గళుకువనిచిల్క వగనేఁత ♦ తళుకు లొలుకు, జాళువాకమ్మి సరిగంచు ♦ చలువవలువ
ధళధళ ల్జాజిపువ్వుమొ♦త్తములు గురియ, నంచకడఁ జేరె సాతాని♦మించుఁబోఁడి. 182

కం. చేరిన హేమావతి ముఖ, మారసి నెఱజాణ వౌదు ♦ వనుదినము మెయి
న్వేఱొక వగ గుల్కఁగ శృం,గారింపఁగ ననుచు ముదము ♦ గల్పించి యనెన్. 183

## పండ్రెండవరాత్రికథ.

చ. మనవి పరాకుమాని విను♦మా యనఁగాననఁగా కళింగభూ
మిని సిరి కాస్పదంబు జన♦మేజయుఁ డేలు సుగంధబంధురం
బనుపుర ముల్లసిల్లు మణి♦హర్మ్యవినూతనకేతనచ్ఛటా
జనితసువాతధూతసుర♦సాలపతత్సుమధౌతవీథియై. 184

శా. అం దుండున్ భసితత్రిపుండ్రమును గా♦మాక్షు ల్జడ ల్కక్షపా
లందంబందెడు కావివస్త్రములు రు♦ద్రాక్షల్ దువాళించు కా
లం దె 1ల్పాదుకలు న్మృగాజినము బె♦త్తం బొప్ప సంసారియో
గీందుం డొక్కఁడు శూద్రుఁ డీశపదభ♦క్త్యేకాగ్రచిత్తాబ్జుఁడై. 185

---

పా. 1. ల్పావలు లాత బెత్తు బృసి చె♦ల్వై యొప్పు సంసారి యో,గీందుం డొక్కఁడు.

వ. అతండు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచభూతంబులును, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబు లను జ్ఞానేన్ద్రియంబులును, వాక్పాణి పాద పాయూపస్థలను కర్మేంద్రియంబులును, శబ్దస్పర్శరూప రస గంధంబులను విషయేంద్రియంబులును, మనో బుద్ధిచిత్తాహంకారంబులను నంతఃకరణచతుష్టయంబును, జీవునితోఁ గూడిన పంచవింశతితత్త్వంబులగు నని యెఱింగి యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనంబరఁగు నష్టాంగయోగంబులఁ జతురుండై కమల యోగ బ్రహ్మ గారుడ సుఖ వీర కూర్మ సిద్ధానంత కుక్కుటాసనంబుల నిశ్చలతనిలిచి రేచక పూరక కుంభకంబులను, ప్రాణాపాన వ్యానోదాన సమానంబు లను ప్రధానవాయువులను, నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయంబు లను నుపవాయువులను స్వాధీనత నొందించి, యిడాపింగళసుషుమ్నా మార్గంబులను, నున్మనిమనోన్మనులను, నాదబిందుకళలను, సాంఖ్యతారకామనస్కంబులను, మంత్ర హఠ లయ రాజయోగంబులను, మూలాధార స్వాధిష్ఠాన మణిపూర కానాహత విశుద్ధాజ్ఞేయ సహస్రారంబు లను చక్రంబులను దెలియనేర్చి యాత్మానాత్మ పరమాత్మ జ్ఞానాత్మ స్వరూపంబు లెఱింగిన సత్పురుషుల నాశ్రయించియుఁ దత్త్వలబ్ధిఁ గానక కేవలంబు శైవమతధురంధరుండై యుండె నంతట. 186

కం. ఆరాధ్యుఁడు తమవంశా,చారమునకు గురుమహాత్ము ♦ సత్తముఁడు ప్రియం
బారఁగ నతనికిఁ బెట్టెఁ, పేరున శివదత్తుఁడండ్రు ♦ బిసరుహగంధీ. 187

తే. గీ. సంతతమ్మును జంగమా♦ర్చనలు సల్పి, భౌమవారంబునను వీర♦భద్రుపళ్లె
రంబులిడి వారి పాదతీ♦ర్థమున భుక్త, శేషమునఁ దృప్తిఁ బొందుచుఁ ♦ జెలఁగు నతఁడు. 188

సీ. అయ్యావళీ ముఖ్య♦మై తనరారెడు మిండజంగంబులు ♦ మెఱసి నడువ
గౌరఘోమల్లప్ప♦గంగకు నను కంచికావళ్లవారును ♦ గలసి చనఁగ
గుమ్మెత లిక్కన్నర ♦ ల్గూడి వాయించుచు భైరవజోగు లా ♦ బడినె కదల
బసవగంటలు బృహ♦త్పటుశంఖములు మ్రోయ శివరాత్రిజంగాలు ♦ చేరికొలువ

తే. గీ. లశునతిలపిష్టచూర్ణ భా♦గశనమసిసి, యుల్లిపచ్చళ్లు పులిదోసె ♦ లూరుబిండ్లు
మూలజోలలు చిటిగాళ్లు ♦ మ్రోసితేగ, నాతఁ డేఁటేట శ్రీశైల ♦ మరిగి వచ్చు. 189

తే. గీ. వెఱ్ఱిశైవంబు ముదిరి యే♦వేళనైన, హరహర శివా మహాదేవ ♦ యనుచుఁ బల్కు-
పలుకులే కాని యితరసం♦భాషణంబు, లాడఁ డెన్నఁడుఁ బెండ్లాము♦తోడనైన. 190

కం. ఆతనికి విశాలయనం,గాఁ దరుణి యొకర్తు దనరుఁ ♦ గమ్మవిరిలకో
రీతురకరౌతులాయము,లో తేజీరతన మనుచు ♦ లోకులు పొగడన్. 191

కం. దాని వికాసపువదనము, దాని చొకాటంపు గబ్బి♦తఘకులగుబ్బల్
దాని పసఘుంచు దేహము, మానవతీ పొగడ శక్య♦మా విధి కైనన్. 192

సీ. నీలాల రుచి నవ్వ ♦ నెఱినిగ్గు మొత్తమ్ము తమ్ముల నిరసించుఁ ♦ దగు మొగంబు
గంబురాభుగభుగ ♦ ల్గల్పించు నునుఁబల్కు పల్కుదు రాణుల ♦ పసను మించు
మించులనిర్జించు ♦ మెయితీవపొంకంబు కంబుసోయగముల ♦ గళము మారు
మారుగుడారము ♦ ల్మానినిగుబ్బలు బలుదీవి నగు నితం ♦ బంబుమహిమ

తే. గీ. హిమమయూఖాస్యయూరుల ♦ యేపు దెగడు, గడుసురంభలసొగసు జం ♦ ఘులు జయించు
నించువిలుకానిశరధుల ♦ నేణనయన, యనఘపదములు కెంజివు ♦ ళ్లపహసించు. 193

కం. చివురా వాతెఱ నల్లని, కవురా నునుసోఁగ వెండ్రు ♦ కలు పుత్తడిమేల్
సవురా దేహము ముద్దుల, దవురా యని జనులుపొగడ ♦ నాబిడ యడరున్. 194.

తే. గీ. దానినెమ్మోము మెఱుఁగు దాఁ ♦ బూనఁగడఁగి, పుత్తడివెలంది చిద్రుపల్లై ♦ ముద్రవోసి
యొఱసి పట్టంబు వడికాఁగి ♦ నెఱయఁజిమిడి, కరఁగి నీరయిపోవును ♦ గలువకంటి. 195

ఉ. సారసమానవీనఘృణి ♦ సంపదఁ గాంచును నెమ్మొగంబు కా
సారసమానవిభ్రమము ♦ సారె జయించును నాభియుర్ సుధా
సారసమానమాధురిని ♦ జాల రహించును మోవి చంద్రికా
సారసమానవక్త్రరుచి ♦ సంతతి మించును గాంతహాసముల్. 196

శా. పున్నాగంబును గెల్వఁజాలు రుచిరాం ♦ భోజాస్యవేణీరుచు
ల్పున్నాగంబును నవ్వనోపు నెఱయుర్ ♦ లోలాక్షి యానంబులుం
బున్నాగంబును గేరియీఁతి మెఱయుం ♦ బూఁబోఁడినూగారుజాల్
బున్నాగంబును మించు నాభిచెలువం ♦ బుర్ సారెవర్ణింపఁగన్. 197

కం. అతనుజయధర్మలీలా, హితవృత్తిర్ గన్బొమలు ర ♦ హించె ననుచుఁ దా
మతనుజ యధర్మలీలా, హితవృత్తి రహించి మించు ♦ నింతికుచంబుల్. 198

చ. అది పతిభక్తినీఱక ది ♦ నాంతముదాఁకను సేవఁజేసి యిం
పొదవఁగ నారగించి వస ♦ నోత్తమభూషణపుష్పగంధసం
పదలనుదేలి రేలు ప్రియ ♦ భర్తను సిబ్బెపుగబ్బిగుబ్బలర్
గదియఁగఁ గౌఁగిలింపఁ జనఁ ♦ గాఁగని కోపవిఘూర్ణితాత్ముఁడై. 199

కం. శివదత్తుఁడు హరహరయని, యవలికిఁబో రంకులాడి ♦ యని తను ద్రొబ్బం
గ వయసుదిగనుక నాశలఁ, దిఘురు నప్రీతి కతుల మోహ ♦ దీక్ష చెలంగన్. 200

సీ. పదము లొత్తెదనంచుఁ ♦ బతిజంఘికలు దన తొడలపై ద్రవేసికో ♦ మిడిసిపడును
నడుము పట్టెద నంచు ♦ నాథుని చిఱుతొడ ల్పుణికినఁ జీయని ♦ పొరలు నవల
నుపబర్హమెగఁద్రోయ ♦ నుంకించి మోముపై మోముఁజేర్చినఁజూచి ♦ ముదుగులాడు
వ్రేల్మోటికెలుదీయ ♦ వెసనెత్తి హస్తంబు కుచములపై వ్రేసి ♦ కొనినఁ డిట్టుఁ

తే. గీ. బక్కలోఁ జేరి కౌఁగిటఁ ♦ జిక్కఁబట్టి, కులుకుగుబ్బల నెద ద్రొమ్మ ♦ గ్రుమ్మికుమ్మి
రతిబలాత్కారమునఁ జేయ ♦ ధృతివహించు, ప్రేయసిని జూచి రోయుచుఁ ♦ ద్రోయు నతఁడు.

కం. ఈలాగు నిచ్చ నిచ్చలు, వాలుగుటెక్కెంబుఁ బూను ♦ వాని దురంబుల్
లీల నొనరింపఁ జూచు వి,శాలను చీ రంకులాడి ♦ చను మని తిట్టున్. 202

తే. గీ. అతఁడుపరసౌఖ్యమున కెగా ♦ కాపఁ బొందఁ, డిహమహోన్నత సౌఖ్యాప్తి ♦ కింతయైన
జాతి కిడునట్టి గిలిగింత ♦ లైతనర్చుఁ, గాని ప్రియురాలిచేష్టలు ♦ గలఁచ వతని. 203

వ. అదిమఱియును. 204

సీ. ఎడలేక కవగూడి ♦ యెప్రొద్దు రతిసల్పువారి వైఖరుల కే ♦ కారఁ దొడఁగు
సయ్యాటములు గల్గు ♦ జంపతీక్రీడకుఁ గరలి వేమాఱు గ్రు ♦ క్కిళ్లు మ్రింగు
గందర్ప కేసులఁ ♦ బొందు సతీపతు లాసక్తికిని భావ ♦ మందుఁ గుందు
సురతఖేలనవహూ ♦ వరుల మైత్రికి మానసమున నిట్టూర్పులు ♦ సల్పి పొక్కు

తే. గీ. విరిలకోరీదు నేదారి ♦ దురముఁ గోరి, మీరి పోరాడు సుకుమార ♦ మిథునతతుల
వైభవముఁ గాంచి హాయంచు ♦ వడిఁ దపించు, సంగమవిహీనయైన యా ♦ జలజనయన.

తే. గీ. కుడువఁ గట్టను దొసగను ♦ విడువ ముడువ, నెంతగలిగినఁ బ్రాయంపు ♦ టింతులకును
గ్రామ్యధర్మంబు లేకున్నఁ ♦ గలుగు దుఃఖ, మెంతని వచింపవచ్చునో ♦ దంతిగమన. 206

తే. గీ. వినుము నానావిధంబుల ♦ దినము దినము, రాత్రి రమణుని గదియఁ బో ♦ రంకులాడి
పోవెయన్ని త్రోయ గుబ్బలఁ ♦ బొందు పైఁట, చెరఁగు బఱచుకఁ బండు ను ♦ సురసురనుచు.

ఉ. మిన్నక యిట్లు భర్తతన ♦ మీఁద విరాళి వహింపకున్న నా
కన్నియ చూచి యీముదివ ♦ కారునితోఁ బని యేమి నా కటం
చున్నిరసించి పంచశర ♦ సుందరరూపుల జారవీరులం
గ్రొన్ననవింటివాని మొన ♦ కుం గదియించెద నంచు నెంచుచున్. 208

కం. రేవిన శివదత్తునకును, సేవలు సేయుటలు మాని ♦ చిత్తం బలరన్
భావజనిభు లగు జారుల, త్రోవలు గనుచుండె విరహ ♦ దోహళకాంక్షన్. 209

చ. చికిలి విభూతిరేఖ జిగిఁ ♦ జిల్కెడు కన్నులకాంతిజోక హా
టకమణిభూషణంబులమి ♦ టారపుఁ డెక్కులమూఁక వాసనా
ధికసుమగంధసంపదల ♦ తేటగుసిస్తులపేఁక యొప్పఁగా
నకట విశాలనామసఖి ♦ హర్షముతోఁ జరియింపుచుండఁగన్. 210

కం. అంతట నితాంతహర్ష, స్వాంతయుతఖ్యాతజనర ♦ వక్షుభితహరి
ద్దంతిశ్రుతియై నగర, ప్రాంతంబునఁ గోడి పడవ ♦ పందెము నాఁగెన్. 211

తే. గీ. కాచిపాత్రలు దారాలు ♦ కట్టుముళ్లు, ముష్టులును నీళ్లముంతలు ♦ మూలికలును
గత్తులపొదుళ్లు మంత్రము ♦ లక్కట్టుపసరు, లెనయ వచ్చిరి పందెగా ♦ ళ్లేపురేఁగి 212

తే. గీ. వేగ నెమిలి పింగళికోడి♦డేగకాకి, వన్నెలై దింటి కిరులందు♦వెన్నెలందు
రాజ్యభోజనగమనని♦దాక్రమరణము,లను విచారించి యుపజాతు♦లను వచించి. 213

సీ. పట్టెజుట్టుది మైల♦పుట్టజుట్టుది గూబ చిలుకజుట్టుది మూఁగ ♦ చిట్లుకోడి
పెట్టమార్పుది యర♦జుట్టుది బోరది బూడిదెవన్నెది ♦ పొడది సెల్ల
కాలుది గుజ్జది ♦ గాజులగాడుసోగలది వంబెట్టది ♦ గద్దెకాళ్ల
దెబ్బని డురగలి ♦ దీఁకెలదారెము నల్లది కొప్పది ♦ తెల్లయురగ

తే. గీ. పిల్లవేళ్లది మొద్దుది ♦ నల్లయురగ, లనఁగఁ దగు కత్తికా ల్పుంజు ♦ లందులోనఁ
బసపుపావళ్లు కాలందె ♦ లెసఁగునట్టి, రావిరేకలు బిరుదులు ♦ కీవి గలుగు. 214

సీ. గరుడండు శరభంబు ♦ కంచుడమారము రణభేరి కార్చిచ్చు ♦ జాతిబొమ్మ
రామబాణము మిత్తి ♦ రాహుత్తు పిడుగు హంవీరుండు పుంజుల♦వేరువిత్తు
గంపగత్తెరగుండె♦గాలంబు మాష్టీడు పట్టభద్రుఁడు జెట్టి ♦ భైరవుండు
కత్తులపొది సింహ♦గాలి బేతాళుండు వసులపాతర పాద♦రసము చిలుక

తే. గీ. టమ్ము సుడిగాలి చక్రంబు ♦ నెమ్మిజడిద, శూలము పిరంగి వెలినక్క ♦ సాళువంబు
కాళరా త్ర్యంతకుఁడు పందె♦గాండ్రమెచ్చు, ననెడుపేరులపుంజులఁ ♦ గొని మొఁగించి. 215

చ. చొరఁబడి కాఁచి పాత్రలును ♦ చుట్టియుఁ గత్తులు వేసి సందిటం
బెరయఁగఁ బట్టి చెక్కు గఱ♦పించి గె రేర్పడ గీచి నిల్చి కొం
[1]కెరయఁగఁబూని వంగి లవు♦డించుక దీడుచుఁ జెక్కువేసి స
ళ్లిరిమజ్జిభో యటంచును ఖ♦ళీఫెళి పుంజులు దన్నులాడఁగన్. 216

కం. కృకవాకువునొగిబట్టిన, కకపికవా దడచుచుండఁ ♦ గాలజ్ఞరసో
ర్వీకడను నిలిచిన శకనా,మకు నొకనాయకునిఁ జూచి ♦ మానిని మెచ్చెన్. 217

ఉ. మెచ్చినయంతలో జిగుఁరు♦మే లడిదంబు ఝురాన దుస్సి బల్
పచ్చనివింటిబోయ చెలి♦పైఁ బడి నిబ్బరపుబ్బుసిబ్బెపు
న్మచ్చలగబ్బి గుబ్బకవ ♦ నాఁటఁ గచిక్కనఁ గుమ్మిక్రుమ్మి తా
నచ్చుగఁ బేర్చి యార్చె హరి♦ణాక్షిమనంబు గలంగ నెంతయున్. 218

తే. గీ. అపుడు తనుదానె తెలుసుక ♦ యబ్జనయన, కులుకు గుబ్బలఁ జిన్నారి ♦ గోట్ల రవికె
పిగలఁ బోకము డూడిపోఁ ♦ బేర్మితోడ, శకునిఁజూచుచుఁ దనయింటి♦చక్కినిలిచె. 219

పా. 1. డొరయఁగఁబూని పందియపు♦టుంకువదిద్దుచు చిక్కువేసి స

చ. అతఁ డొకనీటికాల్వకడ ♦ కంతటఁ వేచని తామ్రచూడ శో
ణితయుతహస్తముల్ గడుగు♦నేర్పున నుండఁగ వానిచెంతకుం
గుతుక మెలర్పఁగాఁ జని శ♦కుం గని కోమలి కొంకుపాటుతోఁ
గొతుకుచుఁ బల్కె నొంటి నిటు ♦ గూడునె రా ననువంటిదానికిన్. 220

కం. అని నీళ్లఁ గాళ్లుగడుగుచుఁ, జనఁగావలె నమ్మచెల్ల ♦ సరె తడవాయెం
గన నెవ్వారును లేరని, ఘనకుంతల పల్కుచుండఁ♦గా శకుఁ డంతన్. 221

కం. ఇంతీ యెవ్వరు లేరని, గొం తేటికిఁ జేసె దెవరు ♦ గొనిపోయెద రే
యెంతపనివచ్చె నేనిదె, చెంతనె యున్నాఁడ భీతిఁ ♦ జెందకు మనినన్. 222

చ. విని చిఱునవ్వు నవ్వి భువి ♦ వింతలు హో మగనాండ్రి నీగతిం
బనుపడ నొంటినుండఁ గని ♦ పల్కుట నాయమె యంచుఁ బల్కె నీ
వనుదిన మెందు నుందు వెవ♦రైనను వచ్చెద రేల చెప్పుమా
ననవిలుకానివంటి నెఱ♦నాయక యంచు విశాల వేఁడినన్. 223

కం. నేనుందు నెపుడు మాహురి, లోన న్నాపేరు శకుఁడు ♦ లోలాయత నే
త్రా నారుల మానసములు, పూని కనుంగొనెదు బుద్ధి ♦ భూమిఁ జరింతున్. 224

వ. అని చెప్పి నవ్వుచు వెండియు నిట్లనియె. 225

కం. ఈవీట నొండుచిత్రము, గావించెపాటిదానిఁ ♦ గన మీవఱకున్
నీవైతె జాణ వౌదువు, గావోలు న్మాట లటులఁ♦గా వినఁబడియెన్. 226

కం. అదిగాక నిన్నుఁజూచిన, మొదలున్ మదనాస్త్రజాల♦ములఁబడితి ననుం
గదియించి గబ్బిగుబ్బల, పొదువుక నీడేర్పు రతులఁ ♦ బొసఁగించి సఖీ. 227

తే. గీ. అనిన విని యావిశాల యా♦శౌరయనుచు, మెచ్చి తనమదిలోఁ గల ♦ మేలిమెఱిఁగి
తెలిసితివి జాణ వౌదని ♦ పలికి యతని, రమ్ము నాయింటి కిపు డని ♦ నెమ్మి మీఱ. 228

కం. త్వరితగతిం దనయింటికిఁ, దిరిగి తిరిగి చూచుకొనుచుఁ ♦ దెరవయుఁ జనె నా
సరణిని వడి శకుఁ డాబిడ, శరణమునకుఁ జనియె వేడ్క ♦ నసులొత్తంగన్. 229

తే. గీ. ఇద్దఱీరీతి నింటిలో ♦ కేఁగినప్పు, డొంటిపాటయ్యె శివదత్తుఁ ♦ డింటలేని
కతన నని పొంగి యన్యోన్య♦కాంక్షలూర, సురతకేళికిఁ జెలరేఁగి ♦ చొచ్చిరపుడు. 230

చ. అలసతలేక సహ్యగుణ ♦ మందక తగ్గక తొట్రుపాటునం
గలఁగక పాఱిలుమాలక వి♦కారము బొందక యాలసించకం
దొలఁగక నిద్రమబ్బుగొని ♦ తూలక నిద్దఱు నేకకాంక్షతోఁ
దలిరుకటారికాని బెడి♦దంపుదురం బొనరించి రెంతయున్. 231

✓చ. లకుముకులట్ల సర్పముల♦లాగునఁ గుక్కుటజాతిచాడ్పునం
బికములలీలఁ బారువఁపు♦బిట్టలతీరున జెట్లపీఁక ధే
1నుకముల పోల్కి మేషముల♦నూఁకుడుభంగిని భైరవాశ్వయు
గ్మకమువిధాన సింహముల♦కై వడిఁ బోరి రనూనచాతురిన్. 232

తే. గీ. అటులఁ దమిదీరకుండెడి ♦ యాస్థతోడ, ముచ్చటలు దీఱ నిరువురు ♦ మొనసి పెనఁగు
వేళ శివదత్తుఁ డింటికి ♦ వేగ వచ్చి, చూచియు మహోగ్రకోపవి♦స్ఫురితుఁ డగుచు. 233

వ. ఇత్తెఱంగున. 234

కం. ఘూర్ణించి కనుల నిప్పుల,వర్షంబులు గురియఁ జూచె ♦ వల్లభునకు నా
ధర్షిణి యపు డేవిధమున, హర్షము గావింపవలయు ♦ నని యడుగుటయున్. 235

తే. గీ. హంసకులసార్వభౌమ నీ ♦ వనుదినంబు, కథకుఁ గథ కిట్లు నన్నడు♦గంగ నేల
చెప్ప మేలాగు హర్షింపఁ♦జేసె మగని, ననిన హేమావతిని జూచి ♦ హంసయనియె. 236

కం. విను మటుల మగఁడు కోపము, పెనఁగొన వగగులుక పలుక ♦ భీతిల్లక యా
వనజదళాకారవిలో,చన ధైర్యము చెదరనీకఁ ♦ జతురత ననియెన్. 237

కం. మరుకేళిఁ గలయ నవ్వాలి,కరుగవె చీ రంకులాడి ♦ యని నను నిచ్చల్
నిరసింతువు యోగివి గన, నర కా నీవాకె తాఁకె ♦ నాకున్నేఁడుఁగ. 238

చ. పలుమఱు రంకులాడి యని ♦ పల్కెడు నీవచనం బమోఘమై
నెలకొనఁదాఁకె సిద్ధుఁడవు ♦ నీమహిమం బది యేల వ్యర్థమై
తొలఁగు నటంచుఁ బల్కి చెలి♦దూరిన నాత్మతపోవిభూతిచేఁ
దలకొను వాక్యసిద్ధికి ము♦దంబు గొనెన్ శివదత్తుఁ డెంతయున్. 239

చ. అటుల నిజాధినాథుఁ డపు ♦ డాత్మమహత్త్వగుణోపలబ్ధి కు
త్కట మగు మోదమందఁగను ♦ గామిని జూచి ననుం బతివ్రతా
పటిమ వహించు మంచు బహు♦భాషలఁ బల్కుము పల్కుచున్న నీ
కిట ఘటియింతు హత్య తను ♦ వేటికి నేఁటికి నింద వచ్చినన్. 240

తే. గీ. అనెడు సతివాక్యమునకు స్త్రీ♦హత్య కళికి, తనదు వాక్సిద్ధికిని నద్భు♦తంబుఁ జెంది
నీవిఁక మహాపతివ్రతా♦భావమహిమ, వెలయవే యని యోగి దీ♦వించెఁ బ్రీతి. 241

కం. అటువలె దీవించుచు నె,వ్వటియట్లనె వేఱులేని♦పక్షంబున న
జ్జటిలుం డుండెను జెలియును, బటుముదమున మెలఁగుచుండెఁ ♦ బడఁతుక వింటే. 242

కం. ఆరీతి మహోపాయము, నేరిచినన్ రాజుఁ గదియ ♦ నెలకొను మన నా
రార జగజంత యని తెల,వాఱుటఁ గని భామ కేళి♦వసతికిఁ జనియెన్. 243

---

పా. 1. నుకముల వైఖరిం గవుల♦నూఁకుడు భంగిని

వ. అని ప్రత్యుత్పన్నమతిచెప్పిన విని హర్షంబునొంది నలుండు దరువాతివృత్తాంత
బానతిమ్మని ప్రార్థించిన. 24

మ. నిరవద్యాన్వయశోవినిర్జిత మహా♦నీహారనీహారభూ
ధరపుత్రీశ్వర రౌప్యగోత్రవిధికాం♦తా గౌరతా గౌరవా
కరమందార పటీర శంకర పతా♦కా తారకా తారరా
డరవిందోద్భవవాహ పవ్యదితి పా♦కాహార కాహారపా. 24

అనులోమవిలోమకందము. రామాకుజరాజనుత ర
సామరసుమరాగకర సు♦మాకర సమరా
రామ నరకమాసుర కగ
రామ సురమసారతనుజ ♦ రాజకుమారా. 24

తోటకవృత్తము. వారణ వారణ ♦ వారణరక్షా
సారస సారస ♦ సారసపక్షా
శారద శారద ♦ శారదకీర్తీ
హారిమ హారిమ ♦ హారిమమూర్తీ. 24

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్యనిస్తంద్ర శ్రీరామానామ
పారాయణనారాయణామాత్యప్రణీతం బైన హంసవింశతి యను
మహాప్రబంధమునందుఁ దృతీయాశ్వాసము.

---

శ్రీ రస్తు.



# హంసవింశతి.



## చతుర్థాశ్వాసము.

### పదుమూఁడవ రాత్రి కథ.



శ్రీరాజితజితవారిధి
వారిధికన్యాంశజాత ♦ వసుధాపుత్రీ
భూరిస్తన కుంకుమఘన
సారమృగీమదసుగంధ ♦ చర్చితవక్షా.

వ. అవధరింపుము ప్రత్యుత్పన్నమతి నలునకిట్లనియె నట్లు ప్రభాతకాలంబుఁగావచ్చినఁ గనుంగొని. 2

కం. చిగురాకుబోఁడి యప్పుడు, మగరాజిగిరాయిడించు ♦ మందిరభూమిన్
వగరాజిల్లెడు తొగరా,జగరాతిన్నియ వసించి ♦ సాయంబైనన్. 3

కం. కని జలకమాడి సొమ్ములుఁ, దనరంగ నలంకరించి ♦ తరలేక్షణ రా
డ్తనయునిపై మోహంబునఁ, జనఁగా రాయంచ చూచి ♦ సఖితో ననియెన్. 4

తే. గీ. అక్క రుచిఁగల్గు చక్కెర ♦ లానవాలు, పెట్టెదవె యొక్కగాథఁ జె♦ప్పెదను వేడ్క
నది నవీనప్రవాళరా♦గాధరోష్ఠి, వినిన నొక్కింతనేర్పు నీ♦కెనయు సుమ్మి. 5

కం. అనవిని చిఱున వ్వొలయం, బనిచెలుపుల కథలు చెప్పి ♦ పార్థివుఁ జేరం
జననీయ వైనఁ జెప్పుము, వినియెద నను సతికి హంస♦విభుఁడిట్లనియెన్. 6

తే. గీ. పూర్వమున బ్రహ్మసభకేను ♦ బోయి కొంత, కాల మందుండి యజుఁ డంప♦కంబు సేయ
మానససరంబునకు వచ్చి ♦ మామకీన, కులజులను గాంచి భువిఁ జూచు♦కోర్కి పొడమి. 7

సీ. హిమవన్నిషధమేరు ♦ హేమకూటాస్తోదయద్రోణమలయవిం♦ధ్యత్రికూట
మాల్యవన్మంధర ♦ మైనాక గంధమాదనసహ్యపారియా♦త్రికసువేల

ఋక్షవచ్ఛతశృంగ ♦ ఋశ్యమూక మహేంద్ర సోమను గోశృంగ ♦ చంద్ర వృషభ
శాలేయ సుశిర బీ♦జ మతంగ కైలాస శతకేతు భృగునీల ♦ చక్రవాళ

తే. గీ. కనకమేఘాంశుమత్పుష్ప ♦ గరుడభద్ర, చిత్రకూట సుదర్శన ♦ శేషసింహ
రోహణ శ్రీగిరిక్రౌంచ ♦ రుద్ర మత్స్య, సూర్యమోహనముఖగిరు ♦ లూచి యంత. 8

సీ. కోరింద నలతుమ్మ ♦ గొటికె కోడారెయు వెణుతు రూషుగ దంతి ♦ వెఱ్ఱినిమ్మ
చిటిగార సుందరి ♦ చీ కెఱ్ఱదుమ్మయుఁ దెల్లదుమ్మ యులింద ♦ కల్లితొట్టి
జమ్మి బలుసు గార♦చండ్ర పఱికి తెల్ల పూలిలొద్దుగ జిడ్డు ♦ బుడ్డతుమ్మ
కలివె రేగుండ్రయు ♦ గచ్చ పెన్మంగయు దుడ్డుమంగయు భూత♦తొట్రు కోలె

తే. గీ. మాడ్పు చిటికొక్కి సీకాయ ♦ మండ్ర తొఱ్ఱి, వెలఁగ వాకుడు పల్లేరు ♦ ములక వేఁప
నగిరె నీర్గొబ్బి మొదలుగాఁ ♦ జగతిఁగల్గు, కంప లన్నియు వేవేగఁ ♦ గడచి కడచి. 9

సీసమాలిక. జిల్లేడు వెంపలి ♦ జిడ్డువెంపలి పైఁడితంగేడు తంగేడు♦తగిరి నుస్తె
ములువెంపలి ములుస్తె ♦ గలిజేరు గుంటగల్జేరును దంతిబం♦దారి నేల
తంగేడు మెట్టబం♦దారి దుంషుగ బ్రహ్మదండి భూతుల సెఱ్ఱ♦దండి చల్ల
పిల్లిమూడుపు చెంగ ♦ పిల్లడ్డ చిత్రమూలము నల్లతీఁగె కో♦లాకుపొన్న
ముయ్యాకుపొన్నయు ♦ మొగబీర తుత్తెర బంకతుత్తెర హంస♦పాది గంట
కామ జీలుగు మెట్ట♦దామర వెఱ్ఱిసెనగ జంబిరము కాచి ♦ నల్లకాచి
శ్రీతులసియు సంబ♦రేణు నేలుసిరి కేశ్వరి నేలవే మూటి ♦ చల్లగడ్డ
సహదేవి జుట్టుప ♦ చలిపిండి చిటిముటి పెన్నేరు పసబొద్ది ♦ పిండి కొండ
నెమటాయి గొలిమిడి ♦ సిరుప్రబ్బలి వ్రబ్బివేరు గన్నే రాఁడు♦బీర చేతి
బీర పేరాముటి ♦ పీచరములు గొలిమిడి చేతిపాట్ల యు♦మ్మెత్త తిప్ప
తీఁగె విష్ణుక్రాంత ♦ తీం డెబ్బచిత్రమూలము దొండతీఁగె ము♦ల్లంగి గొల్ల
జీడెద్దు మట్టేసు ♦ చేగొడ్త చంద్రకాం తెఱ్ఱనియబ్బెంద ♦ యెఱ్ఱతుమ్మి
కుప్పి సూర్యకాంత ♦ ముప్పుడు నరవంజ గాడిదెగడపర ♦ కన్నెకొమర
నల్లగెంటెనపూలి ♦ తెల్లగెంటెన యుత్తరేణు గుబ్బిరి సంబ♦రేణు బండి
గురిగింజ గురువింద ♦ తురకపత్తియుఁ బత్తి తిలపిడ చబ్బెంద ♦ చెలివిచీకి
వెలగ విషమదారి ♦ వెఱ్ఱికుందెన మంచికుందెన కలబంద ♦ గువ్వగుత్తి
మామెనయును నేల♦మామెన యటకమామిడి దూలగోవెల ♦ మేఁకమేయు

తే. గీ. నాకు నల్లేరు నులిజెము ♦ డాకుఁజెముడు, నేలతీట కసిందెయుఁ ♦ గోలచెముడు
బొంతచెము డల్లియును సదా♦ముస్తె మొదలు, గాఁగలుగునట్టి చిట్టుచెట్లఁ గాంచి యంత.

సీసమాలిక. రాప మామిడి కొండ♦రావి మేడియు బ్రహ్మమేడియు జీడిమా♦మిడియుఁ జింత
పులిచింత మోదుగు ♦ ములుమోదుగును వెల్గ పుల్లవెలఁగ వెఱ్ఱి♦చిల్ల చిల్ల

బూరుగ కలుగొట్లు ♦ భూతపాదరి కుక్కబూరుగ చిటిగొట్టె ♦ భూతనెండె
నేరేడు మఱి యల్ల♦నేరేడు పాదిరి తడగూబ తడసేఁకు ♦ కడపబట్ట
కడపకొడిశ పాల♦కొడి శెట్టలొద్దుగు చిరిసేఁకు లొద్దుగు ♦ జిడ్డుపాల
కలుజువ్వి జువ్వి వా♦విలి కొండవావిలి మ ద్దినుమద్ది నీ♦రుద్ది యుద్ది
తెల్లకాంచనము తుం♦దిల మెట్టకాంచన ముప్పి తెల్లుప్పి నీ♦రిప్ప యిప్ప
తాండ్రి చందన మేపి ♦ దాసాన మెట్టదాసానము చిందుగ ♦ జారజేన
మట్టి విరికి తొండ్లి ♦ మట్టితూ కిబ్బెడ పెద్దవిరిగి పక్కె ♦ గద్దనెల్లి
కాకితూ కందుగు♦కానుగ వరగోఁగు గోడు బొట్టుకబిక్కి ♦ గోఁగు కొండ
గోఁగు పొగడ ములు♦గోరంట గోరంట వెలమ సుంకేసరి ♦ వెట్టిబిక్కి
నారువ సురపొన్న ♦ వారిజమును బొన్న నెల్లి మూలుగబిల్లు ♦ నెమిలియడుగు
కొండగుమ్ముడు రేఁగు ♦ గొరవిసంపఁగి కొండసంపెంగ మూరేడు ♦ సరళదేవ
దారు గుమ్ముడుమోవి ♦ తప్పిసి కుమ్మరపోల్కి గుగ్గిల మెట్ట♦పోల్కి వేగి
దేవదా రుసిరికె ♦ తిలకము తెల్లనగిరి వేఁప కరివేఁప ♦ తురకవేఁప
వేరుపనసగుత్తి ♦ వెట్టినారువ రేల పనస కరకకొమ్మి ♦ పలుకరేణి
బండచింతయు నల్ల♦బలుసు సురభి చీకి రేనికూఁకుడు నెమ్మి ♦ పేరింఖణమ్మ
భూతాంకుశ మశోక ♦ భూర్జపత్రిమ్మలు బోళము మంకెన♦ పులుసు గంగ
రేఁగు తక్కిలి ములు♦వేగి భూచక్రిము మొక్కపు కొక్కెస ♦ మొల్లమ్రాను
హనుమంతబీర మం♦కెన గిరికర్ణిక పెడమల్లె కొండము♦క్కిడియుఁ గోల
ముక్కుదాడిమ బీర ♦ మొగలింగ గోదాడు నేదాడు ఖర్జూర ♦ మీఁత నేల
తాడి బగ్గిస పోఁక♦తాడు కొబ్బెరచెట్టు పెద్దమాను పతంగి ♦ బెండ గలుగు

తే. గీ. కణుదు రిరుగుడు కాలుగ ♦ కాన్గ సన్న,విరిగి సోమింద గున్నంగి ♦ దిరిసెనంబు
మొదలుగాఁగల్గు బహువిధ♦భూరుహములు, నిండియుండెడు కానల♦పిండు లరసి. 11

కం. వెస జంబూప్లక్షక్రౌం,చసుపుష్కరశాల్మలికుశ ♦ శాకద్వీపా
లెసఁగఁ గని కంటి లవణే,క్షుసురాఘృతదధిపయోవి♦శుద్ధజలాబ్ధుల్. 12

సీ. స్వాయంభువోత్తమ ♦ స్వారోచిష బ్రహ్మ దక్ష వైవస్వత ♦ తామసేంద్ర
రౌచ్య రైవత రుద్ర ♦ భౌచ్య చాక్షుష సూర్యు లనెడు చతుర్దశ♦మనువులు మఱి
బ్రాహ్మర్క్ష దివ్య బా♦ర్హస్పత్య సౌర చాంద్ర గురు సావన పితృ♦నామ కనప
మానమ్ములును గేతు♦మాల కింపురుష హిరణ్మ యైలావృత ♦ రమ్యక కురు

తే. గీ. భరత భద్రాశ్వ హరిసంజ్ఞ ♦ వర్షములును, భారతీంద్ర కశేరు గ♦భస్తి నాగ
తామ్ర రౌహిణి సౌమ్య గాం♦ధర్వకాఖ్య,లమరు నవఖండముల నొప్పెఁ♦. నవషియందు.

సీ. ద్రవిళ విదేహ మా♦ళవ మత్స్య మళయాళ కొంక ణాంగ విదర్భ ♦ కురు పుళింద
చేది కొంకణ వత్స ♦ సింహళ కర్ణాట మగధ ఘోట కళింగ ♦ మద్ర యవన
కుకురు బాహ్లిక పౌండ్ర ♦ ఘూర్జర నేపాళ శక వంగ కాంభోజ ♦ సాల్వ లాట
సౌరాష్ట్ర చోళాంధ్ర ♦ శబర పాండ్య వరాట కుంతల కేకయా♦వంతి కాశ
తే. గీ. నాట కరహాట సింధు గాం♦ధార నిషధ, కేరళ కరూశ పాంచాల ♦ శూరసేన
కోస లోత్కళ కాశ్మీర ♦ కుత్స బర్బ్రాణ మరు హూణాఖ్యసర్వదే♦శములు చూచి. 14

కం. యమునాతమసాసామధ్య, క్షమఁ గమలోత్పలమరంద♦సంగ్రహణాద
భ్రమదభ్రమద్భ్రమరవి,భ్రమగీతతతాభ్రసరత♦రంగిణి చెంతన్. 15

సీ. పొడమెండగాయని ♦ పొన్నగున్నలనీడఁ గ్రొమ్ముత్తియపుటరం♦గులఁ జెలంగు
గొజ్జంగిపొదరిండ్ల♦పజ్జలఁ బచ్చకవ్రములు నిండినద్రాక్ష♦పందిలి గల
శశికాంతకుట్టిమ♦స్థలుల బన్నీటి తుంపరజల్లు జలయంత్ర♦పాళి దనరు
కేళి కేళాకూళి ♦ క్రేవ చక్ర చకోర హంసభ్రమరసార♦సాదికలిత
తే. గీ. కలకలారావ విస్తార ♦ కమల కుముద, సౌర భాగార నీహార♦నీరపూర
వీచికావార దుర్వార ♦ విహృతి ధీర, శీతలసమీర కాసార♦సీమఁ గంటి. 16

వ. మఱియుఁ దత్కాసారంబు ననిమిషసంచారయోగ్యంబై యమరావతీపురంబును,
శంఖమకరకచ్ఛపాధిష్ఠానంబై యలకాపట్టణంబును, ధార్తరాష్ట్రవిహారస్థలంబై హస్తినగరంబును,
బకనివాసంబై యేకచక్రంబును, శంబరాధారంబై కాంతారంబును, శింశుమారచక్రప్రకా
శితంబై మేరువునుం బద్మాసనంబుగావున పుండరీకాక్షువక్షస్థలంబును, కూర్మలీలావిలాస
భాసమానంబుగావున యోగీశ్వరువడువును బురుడించుఁ దత్తీరంబున. 17

కం. పల్లవిత లలిత పుష్పిత, సల్లలిత మరంద వళిత ♦ సత్ఫలిత మహీ
జోల్లసితాభ్రంకషమై, యుల్లము రంజిల్లఁజేయు ♦ నొకవన మొప్పున్. 18

ఉ. ఆవనసీమ నొక్కతరు ♦ వంబరచుంబితశాఖయై ముదం
బావహిలంగఁ జేయఁ గని ♦ యాగమనశ్రమమున్ క్షుధార్తియుం
బోవ ఘటింపఁ బూని యల ♦ భూజముపై వసియించి నాకగం
గావనజాతజాతబిస♦ఖండము లానుచు నుంటి నయ్యెడన్. 19

ఉ. కొండలు క్రిందుమీఁదుగను ♦ గూల దిశావళి వ్రీల, నష్టవే
దండము లుర్వి వ్రాలఁ, ద్వరి♦తంబున వారిధు లింకి క్రాల బ్ర
హ్మాండము తూల, నాదిమమ♦హాహిపసూకరకూర్మమూర్తు లొం
డొండఁ గలంగి సోలఁ జటు♦లోద్ధతి నుర్లెను నేలయు మ్రొగ్గెన్. 20

వ. అప్పుడు. 21

చ. హరిశిఖిదండిదైత్యవరు♦ణానిలయక్షపభర్గు లాది యా
మరకరిమేషవాహరిపు♦మానవనక్రమృగాశ్వనందులన్
గురుపవిశక్తిదండవర ♦ కుంతగుణధ్వజఖడ్గశూలభృ
త్కరులయి శుంభయంత్రగతిఁ ♦ దాల్చిరి దిక్పరసైన్యసంగతిన్. 22

కం. ఆతఱి నే నాకసమున, కాతతసండీనగతుల ♦ నతిజవ మొప్పం
గాఁ దెలివి నెగసి చూడఁగ, భూతలచలనం బడంగి ♦ పోయినపిదపన్. 23

కం. ధరణీసుర భూభృద్వి, ట్చరణజభటరథగజాశ్వ ♦ సద్వస్తులచే
నిర వొంది పాండ్యభూమిని, బరిపూర్ణం బనఁగ నొక్క♦పట్టణ మున్నన్. 24

తే. గీ. కని మహామోద మొనరింపఁ♦గాఁ బురంబు,కాఁపురంబుగ నుండెడు ♦ ఘనజనముల
కలిమి బలిమియు వీక్షించు ♦ కాంక్ష వొడమి, యొక్కసౌధంబుపై డిగ్గి ♦ యుంటి నందు. 25

తే. గీ. పరకతలగుడ్డ యొకపాటి♦పచ్చడంబు, ముదుక నీర్కావిదోవతి ♦ మొలనునంచి
తిత్తి వెండుంగరము వ్రేల♦హత్తి మెఱయ,నుండు శకుఁ డను పేదని♦యోగి యొకఁడు. 26

*సీ. క్షేత్రఘాతంబుల♦స్థితులు వక్కాణించి సౌవర్ణగణితోక్త♦సంఖ్య దెలిసి
మిశ్రితగణితార్థ♦మిళితమనస్కుఁడై గాఢప్రకీర్ణక♦గణిత మెఱిఁగి
త్రైరాశికాద్యంత♦సారాంశము గ్రహించి సూత్రగణితములు ♦ జొచ్చికలఁచి
మఱి భిన్నగణితంబు♦మార్గమెల్లను గాంచి పరగణితంబులు ♦ పారఁజూచి

తే. గీ. నిఖిలసిద్ధాంతసూత్రము ♦ లేర్చి జగతి,గణకకులసార్వభౌమత్వ♦గణనకుఁ దగి
గణితమర్మజ్ఞుఁ డితఁ డని ♦ ఘనులు మెచ్చఁ, దెలిసి యతఁ డెంతలెక్కైనఁ ♦ దేటపఱుచు.

సీ. త్రైరాశికప్రకీ♦ర్ణ సువర్ణపంచరాశికమేరుపౌర్ణరా♦శికసమాధి
కారవీరాచార్య♦ఘాతకుంటాహ్వయచ్ఛాయార్యభటబృహ♦జ్జాతకోత్క
లితసప్తరాశిక ♦ లీలావతీవర్గ వర్గమూలక్షేత్ర♦వాస్తుభాగ
గణితసారచతురం♦గప్రశంసాభళనాధీయబీజభి♦న్నవరాశి

తే. గీ. క ఘనఘనమూలశిల్పిసం♦కలితసూర్య, సోమసిద్ధాంతయుగలబ్ధ♦శోధరత్న
ఘట్టితైకోనరాశ్యాది♦గణితతతులు, దెలిసి యతఁ డెట్టిలెక్కైనఁ ♦ దేటపఱుచు. 28

తే. గీ. సరవి గుడికట్టుగా చెంగ♦వరుస వ్రాసి, యంశకము వేసి కుళవర్గు ♦ వాయకట్టు
దీర్చి దినవహీనఫరగ♦తి త్రిపేర, నౌఠవణ నిర్ణయింప శే♦షాహి యతఁడు. 29

చ. చదువులుచెప్పి చూచి మఱి ♦ సారెకుఁ గూలికి లెక్కవ్రాసి చూ
చదయతఁ గోలుకాఁ డగుచు ♦ నన్నిఁట మందువల న్నటించి చూ

*తాళపత్రప్రతులందీ సీసము గానరాదు.

చదియునుగాక రాయసపు♦టార్యుల ఘంటము లాకు దుద్దులున్
వదలక మోసి చూచె నొక♦పట్టునఁ బొట్టకు లేక తక్కినన్. 30

కం. పొరుగిరుగువారికలిమికి, గుఱిగాఁ దా నెంతొగోడు ♦ గుడుచుచు పీటం
దిరుగాడి ప్రొద్దుగ్రుంకెడు, వఱ కొకపాతికకుఁ గొలుచు♦వడిఁ గొనితెచ్చున్. 31

తే. గీ. తెచ్చి సుఖమతి యనునామ♦ధేయమునను, బరఁగు ప్రియురాలిచేతి కే♦ర్పడఁగ నీయ
నాబిడన్నంబు సంకటి ♦ యంబలియును, జేయ నవరేయివేళ బో♦నేసి పోవు. 32

కం. అతఁ డీలాగున గ్రాస, స్థితికై యూరెల్లఁ గలయఁ ♦ దిరుగాడంగా
నతనాలు మరుని కేళికి, వెతఁగొని తిరుగున్ భుజంగ♦వీరులఁ గనుచున్. 33

కం. ఒనవరి వగలది ముద్దుల, దసియాఱెడుగొను గలది ♦ యందములది పైఁ
డి నరైనమేలుచాయల, వస గలదని విటులు దాని ♦ పసికలపడుచున్. 34

తే. గీ. ఎనయ నేవేళలందైన ♦ నేపురేఁగి. పురిని గల జారు లత్యంత♦మోహు లగుచుఁ
గ్రుక్కిళులు మ్రింగికొనుచు నొ♦క్కొక్క రొనర, తిరుగుచుందురు దానింటి♦తెరువుఁబట్టి.

ఉ. ఇందుఁడు కందు నందపుర♦హిం దగు సుందరి మోముగోము తా
నందమి నిందిరేందుముఖి♦నందనుఁడుం దనడెందమందు నిం
దిందిరకందబృందకచ ♦ దృక్తతిచందముఁ జెంద జాళువా
లొందమిఁ గుందు జారులిఁక ♦ యుగ్మలిఁ బొందమిఁ గంది కుందరే. 36

శా. నెత్తావు ల్వెదచల్లుపువ్వులతల ♦ న్నిమ్మేను సింగంపురా
మొత్తంబున్ నునుగొను శ్రీలగరిమం♦బున్ వీను లందమ్ము ద
ళ్కొత్తుం గ్రొవ్విరిగుత్తులన్ మినుకులో♦ల్కున్ గబ్బిచన్గుబ్బలున్
నెత్తమ్మిన్ గళదేరుమోము దెగడు ♦ న్నీమాటి రంభన్ వగున్. 37

కం. ఆసుఖమతి తరుణవయ, శ్శ్రీసంగతి నలరు విటులఁ ♦ జేరి రతులకున్
వేసరకనూసుకొల్పక, తా సుఖపడి వచ్చునట్టి ♦ ధన్యులలోనన్. 38

చ. ఒకనికి మోవిచుంబనము ♦ లొక్కనికిన్ జనుగుబ్బపోటు వే
ఱొకనికిఁ జెంపపెట్టు మఱి ♦ యొక్కనికిన్ బిగిగౌఁగిలింపు లొం
డొకనికి గాఢసంగమము ♦ లొక్కనికిన్ రతిబంధనైపుణుల్
కకవిక చూపు మన్మథుఁడు ♦ గట్టిన ధట్టి వదల్ప నియ్యకన్. 39

చ. దుసికల బారుచీఁకటుల ♦ దూఁకొనుచుండెడుకీలుగంటుపైఁ
బస పొనరించు నిగ్గు గల ♦ ఫాలతలంబునఁ జాదుబొట్టు దృ
గ్వసతిని గజ్జలంబు నర♦కాలున నంచులుఁ జీఱుచీర దా
రసముగుపువ్వుకంచుకము ♦ రంజిలఁగాఁ జరియించు వీథులన్. 40

తే. గీ. ఇటులఁ జరియింపఁగా దాని ♦ యెమ్మె లెఱిఁగి, పట్టియనుమానములచేత ♦ బెట్టుగుంది
కని విరూపిణిఁగాఁ జేసి ♦ కాంతవీడి, చనియెద నటంచు నెమ్మది ♦ శకుఁడు దలఁచి. 41

కం. ఒకనాఁటిరాత్రి యింటను, సకియకడం బవ్వళించి ♦ సంభ్రమమునఁ బొం
ద్రక దేశమునకుఁ జనియెద, నొకవని కని వేగు యామ ♦ మొందెడువేళన్. 42

తే. గీ. పయనమై లేచి పోవుచో ♦ భార్యతోడఁ, జెప్పి యొక్కింతదూర మ♦చ్చిగురుఁబోఁడి
సాగ నంపి బహిశ్శంక ♦ కేఁగ నతఁడు, దిరిగి కిఱురించి వేగ మం♦దిరము సొచ్చి. 43

ఉ. దూలముమీఁదియట్టువను ♦ దొంగవిధంబున నిశ్చలాంగుఁడై
తాలిమిఁ జిక్కఁబట్టి కుల♦తామరసేక్షణచర్యలెల్ల నా
మూలముగాఁ గనుంగొనెడు ♦ బుద్ధిని నాశకుఁ డుండునంతఁ బ్రా
క్శైలశిఖాగ్రభాగమున ♦ సారసమిత్రుఁడు దోఁచె నంతటన్. 44

కం. పనిపాటఁ దీర్చి సుఖమతి, పనివడ నేఁ డింటితోడను ♦ బాసెఁ గదా యం
చును వెల్వడి చని వీథిని, మనసిజవేదనల జాలి♦మాలి తిరుగఁగాన్. 45

సీ. గౌరిపంచాంగము ♦ గౌళిపంతును పంచపక్షులశకునము ♦ లెప్పఁడికంటి
పలుకులరీతులు ♦ ప్రశ్నభాగంబులు గబ్బులుగూ యంగఁ ♦ గలుగు మేలు
కీడును బోఁచిళ్ల ♦ జా డెఱింగెడు నేర్పు దిక్కు విదిక్కులు ♦ దెలిసి మడువుఁ
దుమ్ములక్షణములు ♦ తొడరు శాకరవంబు సాముద్రికస్థితిఁ ♦ జతురమహిమఁ

తే. గీ. దెలియ నేర్చినయొకమహా♦ధీరవరుఁడు, శకునవిద్యాదికవిచ♦క్షణుఁడు సొకు
మార్యరేఖల మారట ♦ మారుఁ డైన, యువనిదివిజుండు మతిమంతుఁ ♦ డనెడువాఁడు.

కం. ఎదురైనఁ జూచి సుఖమతి, కదియం జని వాని సొబగు♦కలిమికి మోదం
బెదనొంది యతని నో నవ,మదనా యని పిలుచునంత♦మాత్రనె యతఁడున్. 47

తే. గీ. దీనిఁ దగిలించుకొనవలెఁ ♦ దియ్యవిలుతు, దురముపనిలోకి నేఁడు ము♦ద్దుగ నటంచుఁ
దలఁచునంతటిలో జాణ♦తనములాడి, లోఁబఱచి వానిఁ దోడ్తెచ్చె ♦ లోలనయన. 48

మ. అటులం దోడ్కొనివచ్చుచోఁ గులుకు టొ♦య్యారంబుగాఁ జూచుఁ జొ
క్కటపుఁ జిబ్బెపుగబ్బిగుబ్బనెలవం♦క ల్సాము గాన్పింపఁ బై
పట మొక్కింత సడల్చుఁ బచ్చిదొరలన్ ♦ భాషించు లేనవ్వుతో
నటులుం జేష్ట లొనర్చుఁ బైపయిఁ బదుఁ ♦ జారుండు హర్షింపఁగన్. 49

చ. నిలయములోని కిట్లు పిలు ♦ నింపుగఁ దోడ్కొని వచ్చి హెచ్చి కం
బళము ముదంబునం బఱచి ♦ పల్లవుఁ డందు వసించినంతన
య్యళికచ యేక్రియం గనెనొ ♦ యట్టుపపై నిజభర్త యుండుటం
దెలిసిన భీతిలేక సుద♦తీ యపు డేమని బొంకుఁ జెప్పమా. 50

చ. అని యల వానజాలిపులుఁ ♦ గా వనజాక్షినిఁ జేరి వేఁడినన్
విని తలపోసి చూచి యిది ♦ వింతసుమీ తెలియంగలేను నే
ర్పున నది భర్త కింపు మదిఁ ♦ బుట్టఁగ నెట్టులబొంకెఁ జెప్పవే
యనఁ గలహంసవంశకల♦శాంబుధిచంద్రుఁడు కాంత కిట్లనున్. 51

కం. విను హేమావతి సుఖమతి, తనవల్లభుఁ డటువమీఁద ♦ దాఁచుక యున్నాఁ
డని తెలిసి ధృతి చలింపక, యనుపమచాతుర్యధుర్య♦యై విటుమ్రోలన్. 52

కం. వక్కాకిడి సద్భక్తిని, మ్రొక్కి కనుంగీఁటి శకున♦ములు చూచు వరుం
డెక్కార్యంబున కేఁగెనొ, యక్కార్యము లెసఁగ సఫల ♦ మానో కావో. 53

తే. గీ. లెస్సగాఁ జూచి చెప్పుము ♦ లేమిచేతఁ, జనిన నాపతి శీఘ్రుంబె ♦ సఫలుఁడై సు
రక్షితంబుగ వచ్చునో ♦ రాఁడొ యనుచుఁ, దెఱవ వేఁడిన నాసైఁగఁ ♦ దెలిసి యతఁడు.

సీ. అంగుళిక్రమమున ♦ నశ్విని భరణియుఁ గృత్తిక రోహిణి ♦ మృగశి రార్ద్ర
పొసఁగఁ బునర్వసు ♦ పుష్య మాశ్లేషయు మఘ పుబ్బ యుత్తర ♦ మఱియు హస్త
సరవిఁ జిత్రయు స్వాతి ♦ పరఁగ విశాఖానురాధలు జ్యేష్ఠయు ♦ రమణ మూల
పూ ర్వోత్తరాషాఢ ♦ లుర్విని శ్రవణ ధనిష్ఠలు శతభిష ♦ ప్రోష్ఠపదలు

తే. గీ. నుత్తరాభాద్ర రేవతు ♦ లొనర నెంచి, మేష వృషభ మిథున కర్కి ♦ మృగప కన్య
కా ధటాళి ధనుర్నక్ర ♦ కలశ మీన, రాశి సంఖ్యలు వరుస నే♦ర్పడ గణించి. 55

తే. గీ. సూర్య శశి భౌమ బుధ జీవ ♦ శుక్ర మంద, రాహు కేతుగ్రహస్థాన ♦ రాశికూట
చారహోరోపచయ కేంద్ర ♦ సారనీచ, పరమసోచ్చాంశలగ్నము ♦ ల్పదిలపఱిచి. 56

తే. గీ. జన్మకర్మసాంఘాతిక ♦ సాముదాయ, కాంగజామిత్రవై నాశి♦కానివామ
పార్శ్వవేధలులత్తలు♦భావ దుస్వ, భావదుష్టాస్తమయములఁ ♦ బరిహరించి. 57

సీసమాలిక. ద్వాదశాబ్దాబ్దమా♦త్రిగ్రహామాత్యనక్షత్రాంశరాశిమా♦సదిన మరసి
పద్మసింహాసన♦ఫణికూర్మనరచాప కుంతలఖలజీవ ♦ కుంభవర్గ
శనిఖడ్గరథగజా♦శ్వవ్యూహనాడికాదిద్విధచ్ఛత్రద్వి♦తీయపంచ
విధదశవిధరాహు♦వృశ్చికలాంగూల పంచసప్తశలాక ♦ పక్షిడింభ
కామాఖ్యతోరణ ♦ గౌళిక్షుతశ్యేనయాత్రా త్రికాలసూ♦ర్యఫణిజయక
ఘోరకాలానల ♦ గూఢకాలానల భూచరఖేచర ♦ పూర్ణభూమి
చంద్రకాలానల ♦ సంకట సూర్యకాలానలరాహుకా♦లానల కపి
వర్తులభాస్వర ♦ వామగౌళీద్వితీయతృతీయమాతృకా ♦ చతురదీర్ఘ
వర్ణేశ్వరాహ్వానే♦వాయోగతుంబురు ప్రస్తారసర్వతో♦భద్రకులకు
లాలకోటామహా♦లక్ష్మీనఖక్షితిప జయలక్ష్మీ క్షేత్ర♦పాలభూమి

తే. గీ. ఘనపుళిందకొల్లాపురి ♦ వెనకకటక, కాలరేఖమహామాలి♦కానిరామ
యాఖ్య లలరారుచక్రము ♦ లందు బీజ,పంక్తి లిఖియించి తత్ఫలా♦ఫలము లరసి. 58

కం. ఈలాగుచక్రముల గ్రహ,జాలము లిఖియించి చూచి ♦ చంద్రాస్యవరుం
డాలయమున దాఁ గుండుట, కాలజ్ఞుఁడు దెలిసి పలికెఁ ♦ గౌతుక మెసఁగన్. 59

తే. గీ. కడుపులోఁ జల్లగదలక ♦ కలికి వినుము, నేఁడు రేపటఁ దలపువ్వు ♦ వాడ కతఁడు
రాఁగలఁ డటంచు శపథ మే♦ర్పడఁగఁ జెప్పి, యతఁడు దానిల్లు వెలువడి ♦ యపుడ చనియె.

ఉ. ఆసమయంబునందు శకుఁ ♦ డట్టువపై వసియించియుండి యెం
తో సుముఖత్వ మొప్పఁ గని ♦ తొయ్యలిభక్తికి సచ్చరిత్రలీ
లాసుగుణ ప్రసిద్ధికి భ♦ళా యని మెచ్చుచు డిగ్గి వచ్చి రా
వే సరసీరుహాక్షి యని ♦ వేగమె కౌఁగిటఁ జేర్చి వేడుకన్. 61

కం. ప్రమదా నీపాతివ్రత్యము భక్తియుఁ గంటి సంది♦యము లే దిఁక నం
చు మనోరాగంబున శకుఁ, డమితస్తుతు లొనరఁ జేయ ♦ నది యిట్లనియెన్. 62

తే. గీ. కాంత నే నెన్నకోరాదు ♦ గాక నన్నుఁ, బోలఁగల సాధ్వు లున్నారె ♦ పుడమిలోన
ననుచుఁ బతితోడఁ జెలరేఁగి ♦ యాడుకొనుచు, నిండుమోదంబున సుఖాన ♦ నుండెనపుడు.

చ. అని కలహంస చెప్పిన న♦యారె కథాస్థితి యంచు మెచ్చికొం
చును దపనోదయప్రభలు ♦ సుందరి గన్గొని యింటిలోనికిం
జని పవళ్లెల్లఁ బోఁగడపి ♦ సారసమిత్రుఁడు పశ్చిమాద్రికిం
జనినయనంతరంబ మను♦జప్రభుపై విరహంబు మీఱెనన్. 64

సీ. కళదేరు కస్తూరి♦తిలకంబువాసన లుపనగంధములకు ♦ లంచ మొసఁగ
నవరత్నతాటంక♦వివిధకాంతిచ్ఛటల్ నునుఁజెక్కుఁజిగికిఁ గా♦నుక నొసంగ
నలరుమానికపుసో♦యగఁపుదండలటెక్కు కలితాంగదీప్తికిఁ ♦ గట్న మిడఁగఁ
జెంగావివలిపెంపు♦చీరంచుసరిగడా ల్పదశోణఘృణులకుఁ♦1బన్నులొసఁగ

తే. గీ. మదనమదహస్తి విడివడ్డ♦మాడ్కిఁ బడఁతి, పుడమియొడయనికడ కేఁగ ♦ బెడఁగునడల
నడుచువడిఁ గడుఁగ్రొమ్ముడి ♦ సడలి విరుల, జడి పొడము నిల్లువెలువడి ♦ చనఁగనపుడు. 65

కం. కని రాజహంసవరుఁ డి, ట్లను భళి మేల్జాణ వౌదు♦వౌ సొగ సమరెన్
జననాథు నెనయఁ బోయెదొ, విని పొ మ్మొకకథ యటన్న ♦ వెలఁ దిట్లనియెన్. 66

మ. కలహంసాధిప 2నీవునాకొఱకునై ♦ కల్పించెదో కాక పె
ద్దలచేఁ బూర్వము విన్నవాఁడవొ మహా♦దైవప్రసాదంబొ విం
తలుసు మ్మిట్లు వచింప నన్యులకు మే♦ధాశక్తి నిన్ బోలువా
రలు లే రింక భళారె చెప్ప మనుచున్ ♦ రాజాస్య 3ప్రార్థించినన్. 67

పా. 1. బగిడిఁ బెట్ట పా. 2. నీస్వబుద్ధి నిటులం ♦ గల్పించెదో పా. 3. యాలింపఁగన్.

## పదునాల్గవ రాత్రి కథ.

కం. ఆమానసౌక మభినవ, తామరసమరందబిందు♦తతబృందంబుల్
నేమించుగుఱియు వాక్కుల, హేమావతి కనియె [1]మోద ♦ మిగు రొత్తంగన్. 68

చ. వినుము విదర్భదేశమున ♦ విశ్రుతమై సిరులందు విహ్వాలం
బన నొకపట్టణం బమరు ♦ నచ్చట నొండొకవైశ్యుఁ డెంతయుం
దనరు హిరణ్యగుప్తుఁ డను ♦ నామముతోడఁ దదీయభార్య హ
స్తిని యనుపేరునం బరఁగుఁ ♦ జెప్ప నశక్యము దానివైఖరుల్. 69

కం. మిలమిలమిలఁ దళుకులబలు, పొలియలరుల వలపుగులుకు ♦ పొలఁతుక నవ్వుల్
దోలు కళికులచలదలకలు, చెలిసోలపులపలుకు లలరు ♦ చిలుకలకొలికీ. 70

కం. విరులా [2]నగవులు నీలపు, సరులా కురు లుబ్బుగబ్బి♦చన్నులు జాళ్వా
గిరులా యూరు లనంటుల, సిరులా యని జనులు మెచ్చఁ ♦ జెలువ చెలంగున్. 71

కం. [3]కెందమ్ములసరి కరములు, గుందమ్ములతీరు రదన♦కోరకపంక్తుల్
మందమ్ములు గమనమ్ముల, చందమ్ములు పొగడఁ దరమె ♦ సఖియందమ్ముల్. 72

ఆ. వె. కలువచలువ చెలువుఁ ♦ గైకొనుకన్నులు, జగ మెఱుంగు రంగు♦జగ మెఱుంగుఁ
గులుకుఁ దొలుకుమొలక♦గుబ్బల పసగల, వనిత మేలు కొక్క ♦ వనిత మేలు. 73

సీ. బలితంపుఁ బులినంపు ♦ కళఁ బెంపు జఘనంపుఁ బోఁడి మెన్నఁగ నొక్క♦నాఁడు పట్టు
విరితమ్ములను గ్రిమ్మ ♦ సిరిఁజిమ్ము వదనమ్ముచెలువ మెంచుట కొక్క♦నెలయుఁ బట్టు
నిరులెప్పుడును గుప్పు ♦ నెఱికప్పు గలకొప్పుఁ బ్రణుతింపఁగా మహా♦బ్దంబు పట్టు
జితజంభ కరికుంభ ♦ తతదంభ కుచకుంభయుగ మెన్నుటకు నొక్క♦యుగము పట్టుఁ

తే. గీ. జొక్కటపుఱిక్కగమినిక్కు ♦ టెక్కుఁ జెక్కు, నఖములనుతింప వేధది♦నమ్ము పట్టుఁ
గెంజిగురు నంజ కెంజా[illegible]♦పుంజిఁ దెగడు, పదము లెన్నంగ బ్రహ్మక♦ల్పంబు పట్టు. 74

కం. ఘనజఘన స్తనయుగములు, వెనుకను దనుమ్రోల నుద్ద♦విడి నొత్తంగాఁ
జనలేక యూరుమరుఁగుల, [4]వినమితగతి నిల్చెఁ గొను ♦ వియదాకృతితోన్. 75

సీ. విష్ణుపాదంబంటె ♦ వేమఱు మేఘంబు చంద్రుండు ముట్టె నీ♦శ్వరుశిరంబు
తీర్థంబులోఁగొని ♦ ధృతి నిల్చె శంఖంబు కోరి ప్రసాదంబుఁ ♦ గొనె ఘటములు
[5]దండనుండిన సాధు♦తరులఁ జెందెనులతల్ దండైన పొదదండ ♦ నుండె విరులు
పుణ్యనదీనదం♦బుల నిల్చెఁ బులినమ్ము లలపితామహునాజ్ఞ ♦ నలరె నంచ

---

పా. 1. మోహ ♦ మిగు రొత్తంగన్. పా. 2. నఖములు పా. 3. చిందం బనఁదగు గళమును,
పా. 4. బనుపడ దాఁగె ననఁ గొను ♦ భామసుఁ దనరున్.
పా. 5. దండనుండిన సాధు♦శరుల దాఁకెను లత లతనుధర్మముల తోఁ♦డనియె విరులు

తే. గీ. కుంతలానన కంధరా ♦ కుచసుబాహు, నఖకటీయానపటుశోభ♦నత వహించి
1దీటురాలేక వంచలఁ♦దిరిగె నహహ, చెలియ తనయంగముల బాస ♦ చేసినటులు. 76

ఆ. వె. మొగము నిండియుండు ♦ మోహంపుఁగన్గవ, యురము నిండియుండు ♦ నుబ్బుచనులు
వీఁపు నిండియుండు ♦ వేనలిజొంపంబు, దానిఁ బొగడ బ్రహ్మ♦కైన వశమె. 77

కం. ఆహస్తిని యౌవన ము,త్సాహమునన్ బిడ్డపావ♦నంబడి లేమిన్
మోహనతరవిటవృషభ, వ్యూహములకు వల్లెత్రాఁటి♦యొఱపున మెఱయున్. 78

చ. మిడిగలనూనిచేకటులు ♦ మేలిమినూలలపూసదండలున్
కడెములు నందిబొందెలును ♦ కమ్మలమించులమించుమించులున్
నిడి బుగడల్ జిరానరిపె♦ణీలఁ దనర్చినకట్లదండ చే
గడ కులికంట్లు నూనకము ♦ ఘుల్లను మెట్టెలు పూని వీఁగుచున్. 79

కం. అది గరగర నగు2పురుషుం, డెదుటం బడ వీఁడు జీవి♦తేశ్వరుఁ డయినన్
మదిఁగలదుఃఖం బెల్లను, దుదముట్టు నటంచు మోహ ♦ దుర్దశ నొందున్. 80

వ. అది మఱియును. 81

చ. ముదమునఁ బల్లెపట్టిలకు ♦ మూఁటకు ముల్లె కటంచు నాథుఁ డిం
పొదవఁగ నేఁగ 3జారజన♦పొందికలన్ మదిఁగోరి వీథులం
గదిసి చరించుఁ జిన్నెలను ♦ గాసిలఁజేయుచు మోహకాంక్షతో
మదనుఁడు నూనచిమ్ముఁలు సు♦మాళముతోఁ దులఁ జిమ్ముచుండఁగన్. 82

వ. ఇట్లు సంచరించు నయ్యవసరంబున. 83

4సీ. హారాది యొడ్డాది ♦ భారాదులను నచ్చు గోనెలు తణగాలు ♦ గోతములును
నూలామునగలు కం♦ట్లాలు కంబడికట్లు మూఁటలు చిక్కాలు ♦ బాటమందు
వలలారణము బట్టు♦వార లదుకోళ్లు సుంకము చీటికా♦సులు మగాలు
కావలి దేవళ్ళ♦కాసులు కుప్పబత్తెము విశేషము దోవ♦తీర్వ యర్థ

తే. గీ. మాన్యములు తరుగువిడుపు ♦ మడుపుమణియ,గానికోల్కానిబంట్రోతు ♦ కరణములకు
నారిసెట్టి బసివిగణా♦చారుల చల,వాదిలెక్కలు రాఁబట్టు ♦ వాఁ డొకండు. 84

---

పా. 1. దీటురాకే మటంచును ♦ దృఢమనీవఁ, జెలియ యంగమ్ములకుఁ బాస ♦ చేసినటులు.
పా. 2. చెల్వన, నెదిరిన తిలకించ నేము♦నీశ్వరుఁడేయినన్ పా. 3. జారజన♦యూథహితప్రదభాగధేయమై
పా. 4. సీ. బహుఘంటరొదలతో ♦ బలువిడి నేతెంచు గోనెలు తణగాలు ♦ గోతములును
నాలానునగలు కం♦ట్లాలు కంబడికట్లు మూఁటలు చిక్కాలు ♦ బాటమందు
వలలారణము బట్టు♦వారలదుకోళ్లు సుంకము చీటికా♦సులు మగాలు
దినుసులకుప్పలు♦ బత్తెముపిశ్శేయుసుకాపు, తిరువర్థమాన్యమ్ము ♦ తరుగువిడుపు
గీ. తే. నిడుపు లెక్కలకైవచ్చి ♦ నడుకు మణిహ, గానికోల్కాని బంట్రోతు ♦ కరణములుగ
ణారి సెట్టి బసివిగణా♦చారులచటఁ, గమ్మకొని నిండు వేడుకఁ ♦ గలసిమెలఁగు.

ఉ. సుంకరకోలుకాఁడు సర♦సుం డనువేరిఁటవాఁడు చూడ నే
ణాంకవసంతకంతుల జ♦యంతుని నెంతయుఁ బోలువాఁడు ని
శ్శంక నలంకరించుక హు♦శారున వీథికి వచ్చుచుండి యా
పంకజలోచనం గని సె♦బా సని మెచ్చినయంతలోపలన్. 85

చ. పొగడహిజారుచెంగలువ♦బొందల మేలకిపువ్వుథట్టి సం
పఁగి విరితేఁటిమల్లెనన♦పాగ శిరీషపుగోషుఫేషు మేల్
జిగి తొగడాలు జాజిబరి♦సిం గొని చిల్కహుమాయితేజి బల్
1 తెగువతొనెక్కి ధైర్యమున ♦ దే యని యా ర్చెద ఱొమ్ము గ్రుమ్మినన్. 86

సీ. వ్రీడావహిత్థప్ర♦వేగోన్మదోగ్రరోషప్రదోషవితర్క ♦ చపలదైన్య
పరుషసంత్రాసక ♦ చరమవిలాపనిర్వేదనాసూయావి♦షాదగర్వ
మోహాంధకారస♦న్ముగ్ధభావవిహీనచిరసుప్తిధృత్యప♦స్మారహైన్య
హర్షవిజ్ఞానశం♦కాలస్యసుఖనామధేయముల్ గల్గివ♦ ర్తిల్లునట్టి

తే. గీ. ముప్పదియు మూఁడు సంచార♦ములను మ్రగ్గి, స్వేదవైవర్ణ్యరోమాంచ ♦ విస్వరాశ్రు
కంపముల్ ప్రళయస్తంభ♦కము లనఁ జను, సాత్త్వికపుభావములచేత ♦ జడిసి తెలిసి. 87

సీ. సాక్షాత్కరించిన ♦ చంచలాలతికయో మాటాడనేర్చిన ♦ మణిశలాకొ
జీవంబువచ్చిన ♦ చిత్రరుబొమ్మయో కడురూపుదాల్చు శృం♦గారరసమొ
చేష్టలు వెలసిన ♦ చివురుపూరెమ్మయో చెఱలాఁడుజాబిల్లి♦చిన్నికళయొ
కలితరేఖ నటించు ♦ కమ్మనెత్తావియో మోహింపఁ జేయు స♦మ్మోహనంబొ

తే. గీ. కాకయుండిన నీతళ్కు♦కాంతిముఱుపు, సొగ సలంకృతికళయును ♦ సురభిశుభద
విభ్రమంబులు గలవె త్రి♦విష్టపముల, నిండియున్నట్టి చక్కని♦నెలఁతలందు. 88

కం. కరములు సుమలతికాశ్రీ,కరములు చిఱునవ్వు లిందు♦కరములు పద్మా
కరములు నాభీరుచు లా,కరములు సొగసులకుఁ జెలికిఁ ♦ గల యవయవముల్. 89

కం. నారి కెన సఖులు వేరే, లేరే దొరఁదెగడునిటల♦లీల లయారే
యారేఫునమరునారే, నారేఖకుఁ దనుఘునాళి ♦ నాఁగను మెఱయున్. 90

కం. బాలాదృక్తతి వాలా, వాలాఱుంగన్ను లతుల♦వనజశ్రీలా
శ్రీలా చెవులు సులీలా, లీలావతికంఠరవము♦లెఱపా బాలా. 91

సీ. శశిరేఖశశిరేఖ ♦ సత్కళాసౌందర్యములు మాయఁ జేయు ని♦చ్చెలువతీరు
పద్మినీపద్మినీ♦పరిమళజాతుల నలరించుచుండు ని♦క్కలికిసొదు

పా. 1. తెగువను గంతుపాదుషహ ♦ దే యని

రేవతీరేవతీ♦రేఖావిలాసముల్ తలఁకింపఁ జేయు ని♦ త్తరుణిమణువు
వరహేమవరహేమ♦సురుచిరలీలలు గరఁగంగఁ జేయు నీ♦కాంతహారువు

తే. గీ. తారఁదార నుదారను ♦ దారసించు, భద్రి భద్రిసుభద్రిను ♦ బరిహాసించు
నౌర యిట్లుండ వలదె శృం♦గార మనుచు, మెచ్చి పల్మాఱు బలుమోహ♦మెచ్చి కెరలి.

కం. మిఱు కై నయిాకృశాంగీ,మణి నివ్వఁడు మోహినీసు♦మతమంత్రిక
ర్షణకళ నాకర్షించుక, కణకం బలుగతుల రతులఁ ♦ గవిసెద ననుచున్. 93

కం. మది నూహచేసికొని తన, సదనంబున కపుడె వచ్చి ♦ చలమునఁ దన్నున్
మదనుం డేచఁగఁ దమిచే, నొదవిన యొకయమృతసిద్ధ♦యోగమునందున్. 94.

సీ. వైష్ణవి కౌమారి ♦ వారాహి చాముండి బ్రాహ్మి మాహేశ్వరి ♦ బగళ లలిత
కాత్యాయ నీంద్రాణి ♦ కాళరాత్రి భువనేశ్వరి మహామాయి పం♦చదశ దుర్గి
భగవతి మాతంగి ♦ బాల మహాకాళి కామేశ్వరియు భద్ర♦కాళి శక్తి
మలహారి కృష్ణాక్షి ♦ మాధవి శాంభవి శాకంభరియు లఘు♦శ్యామ హంత్రి

తే. గీ. మోహినీ కామరాజాఖ్య♦ముఖ్యదేవి, రాజరాజేశ్వరియు మంత్రి♦రాజరాజ
ముఖరిరూపిణి భైరవి ♦ ముఖ్య మూల,మంత్రిములలోన మోహినీ♦మంత్రి మరసి. 95

సీ. కడుభక్తి శుక్లప♦క్షమునఁ బుష్యార్కమినాఁడు హస్తిని వీథి ♦ నడుచువేళఁ
గుడియడు గిఱుమన్ను ♦ గొని తెచ్చి శయనమందిరము గోమయమున ♦ నెఱయ నలికి
మధ్యమంబున నెల్లె♦మంటిపట్టిడి పసపున ముగ్గొనఁగి మధ్య♦మునను మన్ను
నెఱపి యాపైని న♦న్నెలఁతరూపము వ్రాసి చుట్టుయంత్రము గురు♦స్తుతి యొనర్చి

తే. గీ. మొదల నోం శ్రీం వినిర్మించి ♦ మోహమోహి,నీ పటుస్వాహ యనిమంత్రి♦నియతిఁదీర్చి
యందు దిగ్బంధన మొనర్చి ♦ యరుణగంధ, పుష్పధూపదీపాదులఁ ♦ బూజఁ జేసి. 96

ఆ. వె. లక్షజపముచేసి ♦ లక్షణయుతముగఁ, దద్దశాంశను మధు♦తర్పణంబు
తద్దశాంశ మగుచుఁ ♦ దగు పలాశలతాంత, హోమవిధియుఁ దీర్చు♦చున్నయపుడు .97

సీ. మినుకొప్పు నునుకొప్పు ♦ మినమిన ల్దూలాడఁ గన్నులతళతళ ♦ మిన్నులాడ
బునుఁగీతనెఱపూత♦భుగభుగ ల్చెఱలాడ గుబ్బలచకచక ♦ ల్దొబ్బులాడ
జిగిపూని తగు మేని♦ధగధగ లిరుగాడ నగుమోము నిగనిగల్ ♦ నాట్యమాడ
కటినుండువిరిదండ♦గమగముల్సోలాడ నందెలఝుళఝుళ ♦ ల్చిందులాడ

తే. గీ. నెదుట సాక్షాత్కరించు మో♦హినికి నతఁడు, గరిమెతో లేచి మ్రొక్కినఁ ♦ గరుణఁ జూచి
తనరు బూర్ణాహుతి యొనర్చి ♦ తప్పకుండఁ, దంత్రము ముగింపుమా నీవు ♦ దలఁచినట్టి. 98

కం. వర మొసఁగెద నన నటువలె, జరిపి మనోజాత పంచ♦శర యని యంత్రి
వరణము దుడిచి మదీప్సిత,ము రయంబునఁ దీర్పు మనిన ♦ మోహిని యంతన్. 99

తే. గీ. మంచి దని యచ్చెలిని నావ♦హించి శక్తి, తెచ్చి ముందట నిల్పి య♦దృశ్య యైన
సంభ్రమంబున సరసుండు ♦ సరసగతులఁ, బరవశత్వంబు నొందించి ♦ భ్రమము గొల్ప.

చ. కనుఁగవ విచ్చి చూచి యల ♦ కామిని యెక్కడి దీనికాంత మీ
ఘనుఁ డితఁ డెవ్వఁ డిట్టిరతి♦గల్గుట యేమని విస్మయంబుచే
మనమున నెన్ని యే మయిన ♦ మంచిదె నామదిఁ గోర్కెఁ దీర్చెఁ బ్రి
బ్బినమకరాంకు నింకఁ దన♦భృత్యునిగాఁ బని పూని యేలెదన్. 101

వ. అదియునుంగాక. 102

తే. గీ. భద్రుఁ డన దత్తకుఁ డనంగఁ♦బరఁగు కూచి,మార పాంచాల విట పీఠ♦మర్ద నాగ
రిక విదూషకు లనఁ బ్రౌఢ♦రీతి మెలఁగు, నాయకులవంటిరసికుఁ డీ♦నాయకుఁ డని. 103

చ. మనమున మెచ్చి నాయకుఁడ ♦ మానెఱజాణవు ప్రౌఢ వేక్రియన్
గొని రతి నేలినాఁడ వను♦కూలము నా కిది నిచ్చనిచ్చలున్
ననవిలుకానికేళికల♦నన్ వెలయించు మటంచుఁ బల్కినన్
విని సరసుండు మంచి దది ♦ వేడుక నాకనిపంపె నింటికిన్. 104

కం. అది మొదలుచేసి హస్తిని, మది రంజిల సరసునీఁది ♦ మమతను నిచ్చ
ల్మదనుని కేళికిఁ బిల్చును, దుదఁ దనగృహమునకు సందు ♦ దొరికినయెడలన్. 105

వ. ఇట్లు విహరింపుచుండి యొక్కనాఁడు. 106

కం. మధ్యాహ్నవేళ జనతా,రాధ్యుం డగుసరసుఁ డలరి ♦ రతిపతికేళీ
సాధ్యత 'బుద్ధిమతాం కిము,సాధ్య'మ్మని యావధూటి ♦ సదనమె చేరెన్. 107

తే. గీ. చేరినప్పటి సరసుని♦తీరుఁ జూచి, భుజము లుప్పొంగి హస్తినీ♦పుష్పగంధి
కలయఁబడి మఱి పన్నీటఁ ♦ గాళ్లుగడిగి, [1]మేలమునబట్టి తోడ్తెచ్చె ♦ మెచ్చిహెచ్చి.

సీ. జీవదంతపుజగా♦జీనినఖాసుమేల్తళుకుటద్దపుబిళ్ల ♦ బెళుకురవలు
వింతసంతనఁ జేసి ♦ నిప్పగాఁ దాపిన హురుమంజిపూసల ♦ మెఱుఁగుకుచ్చు
లునిచి తీర్చినసొంపు ♦ మిను కైనకెంపురా మొనముక్కు లూడెడు ♦ ముద్దుగులుకు
కళుకుఁగ్రొంబని పచ్చ ♦ చిలుకలు రహిమించు తొగరాచలువరాల ♦ నెగడు లోవ

తే. గీ. గలవగలనిండుపచ్చని♦జిలుగుపత్రిను, కతల నిరవొందు చిత్తర్వు ♦ కప్పురంపు
మెప్పు మేల్కట్లు చవికెలో ♦ మెఱయు హంస,తూలికాతల్పమునఁ జేర్చి ♦ తోయజాక్షి.

కం. తొడరి నునుగబ్బిగుబ్బల, పొడ వడఁగఁగఁ గౌఁగిలించి ♦ పొడమినదార్ఢ్యం
బెడలంగనీక మన్మథు, బెడిదపుదురమం దతనికిఁ ♦ బ్రియ మొందించెన్. 110

పా. 1. మేల మాడుచుఁ దోడ్తెచ్చె ♦ మెచ్చు హెచ్చి.

తే. గీ. ఇత్తెఱంగున వారిద్ద ♦ ఱేపు రేఁగి, మిథునకార్యప్రవిష్టులై ♦ మెలఁగుచుండ
దానిపతి యింటి కరుదెంచి ♦ తలుపుఁదెఱువు, మనిన నది యెట్లు బొంకఁగఁ ♦ జనునొ చెపుమ.

తే. గీ. తెలిసెనా నీకు హేమావ♦తీలతాంగి, తెలియకుండినఁ జెప్పెదఁ ♦ దెలిసికొనుము
విభుఁ డటులఁ దన్నుబిల్చిన ♦ విటుఁడు వడఁక, వెఱువకు మటంచు ధైర్యంబు♦గఱపి యపుడు.

చ. మునుఁగిడి పండియుండుమని ♦ మోహముతోడ వితర్దిఁ జూపి తా
నును రసు రంచు ఖిన్నయయి ♦ యొయ్యన నేఁగి కవాట మవ్వలన్
బెనబెనఁ ద్రోచి మూఁటఁ దలఁ♦బెట్టుక వచ్చినభర్త కింత సా
ధ్వస మొదవంగఁ జెప్ప విని ♦ వాఁడు వితావిత యేమి యం చనెన్. 113

వ. అనిన హీనస్వరంబున. 114

కం. అడిగినపతితో నిట్లను, దడవాయెను సుంకరీఁడు ♦ తనలెక్కలకై
పడియున్నాఁ డదె కనుమని, పడఁతి యతనిఁ జూపఁ జూచి ♦ భయ ముప్పొంగన్. 115

కం. వెను కడుగు లిడుచు నవ్వలఁ, దనపొరుగింటను విభుండు ♦ దాఁగిన-చో జా
రుని రతితృప్తార్థన్ వే, తనిపి వెడల ననిపి తరుణి ♦ ధవునిం బిల్చెన్. 116

తే. గీ. పిలువ నతఁ డెప్పటట్ల న♦భేద మైన, కూర్మితో నుండె సతి దాను ♦ సుందరదన
వింటివా యట్టిచాతుర్య♦విశదశక్తి, నీకుఁ గలిగినఁ బోవమ్మ ♦ నృపతి నెనయ. 117

చ. అని కలహంస చెప్పఁగ మ♦హాదరణంబున నాలకించునం
తనె తపనోదయప్రభలు ♦ తద్దయుఁ గాన్పడఁ గేళికానికే
తనమున కేఁగి యచ్చట సు♦ధాకరబింబనిభాస్య ప్రొద్దుగ్రుం
కిన దనుకా వియోగమునఁ ♦ గేవలమున్ వెతఁ జెంది యంతటన్. 118

కం. కుముదమ్ములు కుముదమ్ములు, నముదమ్ములు గాఁగ మెఱయు ♦ సాయం బైనన్
రమణీమణి ఘనరుచిభా,రమణీఘృణి సిరుల నిరులు ♦ రంజిలువేళన్. 119

సీ. తారకావృతపయో♦దముమాడ్కి సుమదామపరివృతం బగుకొప్పు ♦ పరిఢవిల్లఁ
దీఁగను ననలు హా♦త్తినచందమున మేన సొగసుగా రతనంపు♦సొమ్ము లలర
వదనచంద్రుని గూడ♦వచ్చిన రోహిణి ముఱువున ముత్తెంపు♦ముక్కు రమర
మంచుగప్పిన గట్ల♦నంచున వలిపెంపుఁ బైఁటలో గబ్బిగు♦బ్బలు చెలంగఁ
తే. గీ. బరఁగు జగడాలపగడాల♦భరణిలోనఁ, గ్రోలు మగరాలనిగరాల ♦ లీల విడెపు
టరుణరుచిఁ జిల్క నోరఁ బ♦ల్వరుస మెఱయ, వచ్చినిల్చినయాహేమ♦వతినిగాంచి. 120

కం. జలజభవాశ్వం బిట్లనుఁ, జెలియా యింకొక్కగాథ ♦ చిత్రతరంబై
చెలు వొందది చెప్పెద వినఁ, గలవే యని యడుగ వినెదఁ ♦ గాకని నిల్వన్. 121

వ. హంసం బిట్లనియె. 122

## పదునేనవరాత్రికథ.

మ. ఇతరధ్యానము మాని నీవు వినుమా ♦ హేమావతీ ద్రావిడ
క్షితిలోఁ జిత్రవిచిత్రవస్తుపితతుల్ ♦ జెన్నారు కాంచీపురిన్
స్థితుఁడై కాఁపుర ముండు శూద్రుఁ డొకఁ డా ♦ శ్రీదృష్టికిం బాత్రమై
శ్రితనానాజనభాగధేయ మగుచున్ ♦ సీరాంకనామంబునన్. 123

సీ. ముంగిటఁ బలిజూద♦ములు గీచియుండిన రచ్చబండలు గొప్ప♦ప్రహరిగోడ
పంచతీనెలు చాదు♦పట్టెలు ముమ్మూల గూండ్లు దీర్చినయట్టి♦గోడ లలరు
దేవరచవికె పం♦దిరి కోళ్లగూడులు గొట్లు గుంటుక కాడి ♦ క్రొత్తవల్పు
లట్టువగల గాడి♦కొట్టంబు వలగడ కంపపాతినతేగ♦కదుపుదొడ్డి

తే. గీ. ప్రత్తిగూటంబు తొట్టియుఁ ♦ బలకపీఁట, బావి పిడకలకుచ్చెల ♦ పసులమేపు
మంగలము దాలి బో లిర్క♦మ్రానినందు, గలిగి విలసిల్లు నాతని♦నిలయ మెపుడు.

వ. అదియునుంగాక మఱియును. 125

తే. గీ. ముద్దగిడగరపులమార్పు ♦ ముసుగుపచ్చ, మార్పు జింకపురిపరంగి ♦ మల్లెమార్పు
పాల్పునరకొమ్ము సూగారి ♦ పైరజిల్లి, [1]మనర తెల్లెఱ్ఱజొన్న ల♦మ్మంగఁగలవు. 126

సీ. జడకొఱ్ఱ కొఱ్ఱలు ♦ చామలు వెలిచామ కుట్టారి కారిక ♦ కొండబరిగె
బరిగెసజ్జయు గిడ్డ♦గిరసజ్జ మొబ్బుపాల్గిడ్డచే న్వెద్దరా♦గెయును యవయు
గోదుమ పెదనువ్వు ♦ కుఱునువ్వు తెలినువ్వు కునుమ వెల్లగిసెయు ♦ గోఁగు జనుము
చిటితోఁట వెలిపెద్ద ♦ చెవరంగి పేరామిదము చక్కెర చిఱాము♦దమును మఱియు

తే. గీ. మినుము లెఱతెల్లకంది చి♦ర్సెనగ సెనగ, పిచ్చ నలవచ్చ కుఱుపిల్ల ♦ పెసరగాయ
మళ్ళు నలపందు లుబ్బడాల్ ♦ నల్లతెల్ల, యులవలు పటాణములు పుట్ల♦కొలఁదిగలవు.

సీసమాలిక. బంగారుతీఁగెలు ♦ గంగాజలమ్ములు కస్తూరినిగరాలు ♦ కటకసరులు
నిప్పపూరాజనా ♦ లేనుంగుకొమ్ములు మల్లెశ్రీగంధులు ♦ మదనగంధు
లేలకిరాజనా ♦ లీశ్వరప్రియములు రావిపూరాజనాల్ ♦ రత్నసరులు
కుసుమపూరాజనా ♦ లుత్తిబల్లుత్తులు కస్తూరిపట్టెలు ♦ గంధసరులు
మండిగండ్రలు నాగ♦మల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు ♦ వెలువడాలు
మన్మథబాణాలు ♦ మరువంపుమొలకలు సన్నమణింగెలు ♦ జున్నుబ్రాలు
పొన్నశ్రీరాజనా ♦ లుప్పుఁగురాజనములు ముద్దుప్రాలు లారళ్ళు ♦ ముత్యసరులు
సన్నసూదులు పచ్చ♦గన్నేర్లు గోదండరామము లేకనర్లు ♦ రాయసర్లు
చంద్రవంకలు జీని♦సరులు కాంభోజులు వంగాకు బుడమలు ♦ పొంగు బ్రాలు

---

పా. 1. మరవత ల్లెఱ్ఱజొన్న

జిలకర రాజనా ♦ ల్చింతపువ్వులు గోరురాజనా ల్బాదప్రోల్ ♦ రాజనాలు
గొబ్బికాయలు బలు♦గుత్తులు పాలమీఁగడలు శ్రీరంగాలు ♦ కామదార్లు
రామబాణాలు రే♦క్కాములు వెన్నముద్దలు జిల్మ బుడమలు ♦ దాళువాలు
ఱెక్కపాలలు కాకి♦ఱెక్కలు పుష్పమంజరులు సీతాభోగ♦సరులు గౌరి
కుంకుమల్ రణబెండ్లి♦కొడుకులు పిచ్చుకగోళ్ళు ప్రియాగలు ♦ గుజ్జుఁబ్రాలు
గరుడసరు ల్పోతు♦గంటరాజనములు మోదుగతొడిమలు ♦ ముదుకసరులు
పచ్చసరుల్ రెడ్డి♦పాలవంకెలు సుఖభోగులు పచ్చక♦ర్పూరసరులు
నివ్వరు ద్దెబ్బస ♦ ల్నీరుకావులు గాజుకప్పెర ల్కురువడా ♦ ల్కంఠసరులు
సాలంక లలుగురా♦జనములు సంభావు లవసరదార్లు మో♦హనపుసరులు
మణిసరుల్మసరలు ♦ మంకెన ల్పగడంపుతీఁగెలు మడిప్రాలు ♦ దేవసరులు
లత్తుకజొత్తులు ♦ లక్ష్మీమనోహరా ల్భారతీసేసలు ♦ బొహువురులు
వజ్రపుఁదళుకులు ♦ వాసనరాజనాల్జవ్వాజివంకెలు ♦ గవ్వసరులు
సంపంగిపూవడ్లు ♦ జాజిరాజనములు గంబూరరాజనా ♦ ల్కన్నెసరులు
తుమ్మిపూరాజనా ♦ లమ్మకుకొణిగెలు జీనువముక్కులు ♦ చిలుకముక్క
లేదుకట్లలవంకె ♦ లిసుకరాజనములు పులిగోళ్లవంకెలుఁ ♦ బొగడసరులు

తే. గీ. జల్లిత్రోకరాజనములు ♦ నల్లవరులు, దెల్లనల్లచెన్నంగులు ♦ దీనసరులు
నాది యగుపేర్లు గలుగువ♦డ్లతనియింట, నుంకుశతకోటిబారువు ♦ లొక్కదినుసు. 128

తే. గీ. దొండకాయ ముల్లుకకాయ ♦ తొట్లకాయ, జంబికాయయు వెజ్జల♦సందకాయ
వెలయు నుస్తెకాయయు రామ♦ములుకకాయ, మేడికాయ కాచరకాయ ♦ గూడ నింక. 129

సీ. రామగుమ్మడి యోబ♦రాజుగుమ్మడి చారగుమ్మడి బూడిదె♦గుమ్మడులును
గిండిసొఱయుఁ దీఁగె♦కిన్నరసొఱయును బీఱ సముద్రపు♦బీఱ నేతి
బీఱ పిచ్చుకపొళ్ల ♦ పెద్దపొ ళ్లేనుఁగుదంతపు పొ ల్లలు ♦ తంబలు పెలి
కాకర పొట్లకా♦కరలు మేఁకచెవి చిక్కుడు పాలగణపుల ♦ గోరుచిక్కు

తే. గీ. డులు సుగంధాలు బొంతనం♦టులు సురభులు, గంజిపందిటికపురపొం♦కాయలు తరు
బూజపుచ్చ కురాసాని♦పుచ్చ పెద్ద,దోస నక్కదోసలు వాని ♦ తోఁటఁగలవు. 130

ఆ. వె. చేమ కంద గెనుసు ♦ చితిగోరు పెండ్లము, పొనఁగు తెల్ల గెనుసు ♦ భూతగెనుసు
లల్ల ముల్లి పసపు ♦ ముల్లంగి వెల్లుల్లి, గాజరయును మొదలు♦గాఁగఁగలవు. 131

చ. గురు గెఱబొద్ది చెంచలియుఁ ♦ గుచ్చలి చిట్రి తగిర్సి తుమ్మి దు
స్సరి బలుగూటిబొద్దిసెలి ♦ చల్మలి పల్లెరు రూకపాత్కె వె
ల్పరగిసె ముస్న వెల్ల చెవి♦పావిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి సరవంజి చేతర స♦దాపయు గొండలి కొండపిండియున్. 132

తే. గీ. పాల వాయింట తక్కాలి ♦ బచ్చలి కొయి,కూర చక్రవర్తము చిల్క ♦ కూర గోళి
కూర దుంపబచ్చలి తోఁట ♦ కూర కొతిమ,రాకు సోపు మెంతాకు చు ♦ క్కాకుగలవు.

సీ. పనస సీతాఫలా ♦ ల్చిననిమ్మ గజనిమ్మ దూదినిమ్మ యనాస ♦ మాదిఫలము
నారదఖర్జూర ♦ నారికేళాదులు రామఫలాంజూర ♦ జామఫలము
లలరారు బొంతకి ♦ త్తళి కిత్తళియుఁ బోక పిప్పలి నేరేడు ♦ పెద్దవెలఁగ
రామావళ్ళియు గమ ♦ రక జీడిమామిడి బాదంగి పెనురేఁగు ♦ పాలఫలము

తే. గీ. చెట్లు పండెడితోఁటలు ♦ చిట్టి గొట్లు, చెఱకు రసదాళిచెఱ కెఱ్ఱ ♦ చెఱకు నల్ల
చెఱకుతోఁటలు కలుజోడు ♦ సీర్పి దినుసు, కారపా కాకుతోఁటలు ♦ గల వతనికి. 134

సీ. మామిడికాయయు ♦ మారేడుగాయయుఁ గొండముక్కిడికాయ ♦ కొమ్మికాయ
గరుగుకాయయు మొల్గు ♦ కాయ యందుగుకాయ లుసిరికెకాయలు ♦ నుస్తెకాయ
లేకరక్కాయయు ♦ వాకల్వికాయయుఁ జిఱినెల్లికాయయుఁ ♦ జిల్లకాయ
కలబంద గజనిమ్మ ♦ కాయ నార్దపుకాయ చిననిమ్మకాయయు ♦ జీడికాయ

తే. గీ. కుందెనపుకొమ్మ మామెన ♦ కొమ్మ బుడమ,కాయ యల్లము మిరియంపు ♦ కాయ కలివి
కాయ కంబాలు కరివేఁప ♦ కాయ లాది,యైన యూరుఁగాయలు గల ♦ వతనియింట. 135

తే. గీ. పంట మోటాటి పెడగంటి ♦ పాకనాటి, యరవెలమలాదికొండారె ♦ మొఱసుగోన
కొణిదెకాఁపులు మొదలైన ♦ క్షోణిఁ దనరు, కాఁపులకు నెల్ల మిన్న య ♦ క్కాఁపుకొడుకు.

తే. గీ. అతనికొక్కకులాంగన ♦ యగ్రమహిషి, చనిపిమ్మట సత్యకే ♦ శిని యనేటి
పేరుగల్గినచిన్నాలు ♦ బిసరుహాస్త్రిఁ, డేలుప్రియురాలు నాఁగ సొం ♦ పెక్కె గ్రాలు. 137

సీ. మెఱుగంచుకమ్మలు ♦ మెణ్ణాలు గెరలముక్కర యుడ్డబుగడలు ♦ కట్లసరులు
తీరైన చింతాకు ♦ తీఁగెయల్లిక నాను వల్లేరుబూవులు ♦ బన్నసరము
కుప్పెసౌరము మెచ్చి ♦ కొన్నసూలలదండ యందగించినజోడు ♦ సందిబొందె
నిగరమైన సిరాజి ♦ పగడాలచేకట్లు కాంతికడెంబు లుం ♦ గరపుజోళ్లు

తే. గీ. గిలుకుమట్టెలు జంటీలఁ ♦ గులుకు అవికె, సన్నమావేయుఁగన్నుల ♦ చలువచీర
పసిమిఁ జెల్కెడుముంజేతి ♦ పచ్చలమర, దుడ్డెతనమువఁ దిరుగునా ♦ రెడ్డిసాని. 138

కం. ఆచొక్కపుజిగి చన్గవ, యాచక్కనిమెఱుఁగుటూరు ♦ లామోమందం
బాచక్కనిరూపమహో, చూచిన మరుఁడైన భ్రాంతి ♦ సొలయక యున్నే. 139

సీ. మేఘేందుకార్ముక ♦ మీనదర్పణవజ్రకచముఖభ్రూనేత్ర ♦ గండనాన
దరసుధాబింబకుం ♦ దశ్రీమణికకీరగళవాగధరదంత ♦ కర్ణజిహ్వా
పద్మలతాధర ♦ భంగభోగమృగేంద్రకరభుజాకుచవళి ♦ కటిమధ్య
బిలతుండచక్రికా ♦ మాళతారపల్లవనాభ్యూరుకటిజంఘు ♦ నఖరపాద

తే. గీ. ప్రసవవిద్రుమచలదళ◆వల్లికనక,కదళికాపర్ణకౌముదీ◆గంధసార
మార్దవాంగుళ్యనంగస◆ద్మరుచిచరమ, చరమభాగస్మితసుగంధ ◆ చానమెఱయు. 140

కం. మినమినలీనెడు మేనున, నొనరిన యౌవనజనయన◆నూతననలినా
ననమున ననువుగఁ గనుఁగొనఁ, దనరిన కనదనఘునఖని◆దానసునాభిన్. 141

సీ. పలుకులు కపరింపుఁ◆బలుకుల వర్షించు చూపు [1]మారునితూపు ◆ రూపుఁజూపు
గరములు బిసభీతి◆కరములై సిరులొందు జడజగ్గు విరులకు ◆ జడతసేయు
మందయానము హంస◆మందము నిరసించు [2]మైనిగ్గు క్రొమ్మించు◆మదమణంచుఁ
గుచములవస లాలి◆కుచముల నిర్జించుఁ జెక్కిళ్లు ముకురాలఁ ◆ జెక్కువైచుఁ

తే. గీ. దావికెమ్మోవి యమృతంపు◆బావిశోవి,యారు చెన్నారు చీమల◆బారు దూరు
నూరు లలరారు ననఁటుల ◆ సౌరు గేరుఁ, గొంత యగుఁ గొంతలతికాంత◆కుంతకాంత.

కం. కమలంబులఁ గమలంబులఁ, గమలాననలోచనముల ◆ కాంతి జయించుం
బ్రమదాళులఁ బ్రమదాళుల, రమణీమణివాలుఁజూపు ◆ రహి నిరసించున్. 143

తే. గీ. దానిబిగిగబ్బిసిబ్బెంపుఁ ◆ దళుకుటుబ్బు, గుబ్బచన్నులకౌఁగిలిఁ ◆ గోరనట్టి
మానవాగ్రణి వసుమతీ◆స్థానములను, వెదకి చూచిన లేఁడుపో ◆ విద్రుమోష్ఠి. 144

తే. గీ. అది మనోజ్ఞములై నయా◆హారములను, గండమొందై నమదముచేఁ ◆ గన్నుఁగాన
కమితపల్లవరతికేళి ◆ కాన వాఁడమి, మీఱుచిత్తముతోడ నే◆కారఁ దొడఁగె. 145

సీ. పనివంటవార్పుల◆బాధ లించుక లేక తీరెడు మంచిసం◆సార మొదవె
నత్తమామలపోరు ◆ నారుదూ రెఱుఁగక పొంద తనిచ్చఁగాఁ◆పురము దనరెఁ
గుడువఁ గట్టను బూయఁ ◆ దొడుగ వస్తువులు యథేచ్ఛముగా నుండు ◆ నిల్లుదొరకెఁ
బట్టిపల్లార్చ కే◆పట్టున దయఁ జిల్కు మనసు గల్గినయట్టి◆మగఁడు గలిగె

తే. గీ. నింతగల్గిన నేమి నా◆హృదయ మెఱిఁగి, మమత దీఱను బడివేల◆మంది మగలఁ
గలుగఁజేయక చెడుదోస◆కారిబ్రహ్మ, యొకనిగాఁ జేసె ననుచు నూ◆రక తపించు. 146

కం. ఆపాప మేమి చెప్పదుఁ, గాఁపుది మదమెత్తి కన్నుఁ ◆ గానక పురిలోఁ
జూపరుల నెవరినైనను, నేపున సంభోగకేళి ◆ కెనయంజూచున్. 147

చ. అటువలెఁ జూచువేళ నొకఁ ◆ డంగదనామకుఁ డాయుధోపజీ
వటకుఁ బ్రయోజనార్థము ర◆యంబున వచ్చిన వానిపెక్కుచో
క్కటపుటొయార మారఁ గని ◆ కాఁపుది మోహము నిల్వలేక మి
క్కుటపురతిప్రయత్నమున◆కుం గరఁగించెద నంచు నిట్లనున్. 148

---

పా. 1. మారునితూపుఁ ◆ జూపుచుండు  పా. 2. మించు మైనిగ్గు క్రొ◆మ్మించు నొంచుఁ

తే. గీ. ఎన్నఁడును రానివాఁడ వీ ♦ వేమి పనికి, వచ్చినాఁడవు కూర్చుండు ♦ వన్నెకాఁడ
మంచ మదె తెచ్చి యింటిలో ♦ నుంచినా న,టన్న విని వాడు పోవలె♦ననుచుఁబలుక. 149

ఉ. పోవలెనంటి వాలి నగు♦మో మటుఁజూడక నీడ నుండ లే
వో విలపించుబిడ్డలకు ♦ నొయ్యనఁ జన్నిడి నిద్రఁ బుచ్చఁ బోఁ
గావలెనో భ్రమించు విట♦కత్తెలయల్కలు దీర్చఁబోయెదో
శ్రీవిభవోత్తమా యెఱుఁగఁజెప్పు♦మటంచును జెట్టవట్టుచున్. 150

తే. గీ. కోళ్లు నిండారఁగా దుద్దు♦గొంగ డపుడు, వఱచి యాతని మంచంబు♦పైకిఁ జేర్చి
వలచి వలపించి చిన్నెల♦వగలు చూసి, యెనసి రతికేళి నేలె న♦య్యిగురుఁబోఁడి. 151

వ. ఇత్తెఱంగున. 152

కం. అనిరుద్ధచేష్టఖేలన, మనివారితదంతఘాత ♦ మతిచిత్రతరం
బనిదంపూర్వానందం, బనుపమగురుసురతసౌఖ్య ♦ మబ్బినయంతన్. 153

కం. ఈలాగు నిచ్చ నిచ్చలు, మేలుగఁ గోరికెలు దీఱ ♦ మిథునత నన్నుల్
దేలింపు మనుచు ననిపినఁ, జాలం బాదుగ నతండు ♦ సలుపుచు నుండెన్. 154

కం. అలకాఁపువగల చిలుకల,కొలికికిఁ దమి యింతయైనఁ ♦ గోల్పడక ముదం
బలరారి యుండ నొకనాఁ, డెలమిని నయ్యూరిబేరి ♦ హిత మలరారన్. 155

చ. ముదుకరుమాలుగుడ్డ భుజ♦మూలమునం గడితెంబు మీఁదఁ బ్రాఁ
తది యగుదుప్పటంబు మొలఁ ♦ ద్రాడును గీసరయుండు తిత్తి స
న్నది నెలవంకనామము వి♦నాయకు నుంగర మంగుళంబునన్
బొదలఁగ రత్నగుప్తుఁడు స♦మున్నతి నింటికి రాఁ బ్రియంబునన్. 156

కం. ఆసత్యకేశినీసతి, నాసత్యసమాన వైశ్య♦నాయకురూపం
బాసఁ గొని చూచి మోహము,తో సరసము లాడుకొనుచుఁ♦దోషణమొదవన్. 157

కం. వక్కాకుఁ బొగా కిడు మని, చక్కటికిని బోయి పైఁట♦జాఱఁగ నెదుటన్
మొక్కనగ వొప్ప నిలఁబడి, దక్కితి వీఁక నెందుఁ బోయె♦దవురా బావా. 158

తే. గీ. అనుచుఁ దమి నిల్పలేక న♦య్యంబుజాక్షి, వలుదగుబ్బలఁ గౌఁగిట ♦ బలియఁబట్టి
సురతకేళులఁ దేలించి ♦ చొక్కుచుండ, నపుడటకు వచ్చి యయ్యంగ♦దాహ్వయుండు.

ఉ. వచ్చితి రెడ్డిసాని తల♦వాఁకిలి దీయు మటంచుఁ బిల్వ లో
హెచ్చినసాధ్వసాప్తి నపు ♦ డెంతయు వైశ్యుఁడు సంచలింపఁగా
నచ్చపలాక్షి వాని భయ♦మందకు మం చొకగాదెలోపలం
జెచ్చెర నుంచి నాయకుని ♦ చెంతకుఁ జేరి మహానురాగయై. 160

ఉ. వాఁకిలిఁదీసి చొక్కటపు ♦ వాలుగకన్నులఁ దేలఁజూచి నా
ళీకదళాక్షి కుందనపు♦లిబ్బుల నేలెడు గుబ్బచన్నొనల్
సోఁకఁగఁ గౌఁగిలించి కెఱ♦సొంపునఁ గేళిగృహంబులోనికిం
దోకొనిపోయి వాని రతి ♦ నూతనసంభవపారవశ్యయై. 161

కం. అలకాఁపుసంపదలఁ దన, రలకాఁపువధూటి యాన♦నాలంకృతికా
ర్యాలకాపుంజితయై వే,డ్కలఁ గాఁపుర మొప్పఁ జేయు ♦ కాలమునందున్. 162

ఉ. నల్లనికమ్మిపచ్చడము ♦ నామఁపు బొట్టును గుచ్చుటుద్దముల్
తెల్లరుమాలు వల్లె మొలఁ ♦ దిత్తి కరంబునఁ గోల వ్రేళ్ల సం
ధిల్లిన వంకుటుంగరము ♦ తీరగుపూజలజంటిగుండ్లు రం
జిల్లఁగ రెడ్డి వచ్చి తన♦చెల్వను వాఁకిలి దీయఁ బిల్చినన్. 163

కం. ఆమెడ నిద్దఱు మిండలఁ, బాయక రతిసల్పు కాఁపు♦పడఁతుక యెటులన్
మేయించి బొంకవలెఁ జెపు,మా యని చక్రాంగవంశ♦మండన మనియెన్. 164

ఉ. ఆవచనంబు వేడ్క విని ♦ యాదల యూఁచి నిడూర్పు పుచ్చి హే
మావతి పల్కె హంసవర ♦ మాటికి మాటికిఁ బృచ్ఛ యేల నీ
వే వినుపింపుమా వినెద ♦ వింత సుమీ తెలియంగరా దదె
ట్లో విశదంబుగా ననిన ♦ నుత్పలగంధికి హంస మిట్లనున్. 165

చ. తననిజనాయకుం డటులఁ ♦ దల్పు సడల్పు మటంచుఁ బిల్చినన్
విని యల వన్నెకాఁడు భయ♦విహ్వలుఁ డైన వడంకవద్దురా
యని నగి వీఁపుఁ దట్టి చను♦మా వగఁ జాటుచు మల్లి చూడ కే
మనకయు రెడ్డితోడ నని ♦ యాసఖి పంచిన నాతఁ డంతటన్. 166

వ. మంచి దని యప్పుడు. 167

కం. త్వరితమ్మునఁ దలవాఁకిలిఁ, దెఱచుక బంట్రవుతు నోటె♦తేఁటయుఁ దీఱన్
బొరిపొరి వదరుచుఁ జనియెడి, తెఱఁగు నిరీక్షించి రెడ్డి ♦ తెగువ న్మగువన్. 168

తే. గీ. పిలిచి కోపారుణాక్షుఁడై ♦ పేర్చి పలికె, నేమె బంట్రౌతుగాఁ డిటు ♦ లెమ్మెఱసి
వచ్చినాఁ డదిగాక తా ♦ వదరుకొనుచుఁ, బోవుచున్నాఁడు సెప్పుమా ♦ పువ్వుఁబోఁడి.

కం. అని పతి యడిగిన జడియక, వినుమా యని రెడ్డిసాని ♦ వింతలు గులుకన్
నునునగ వొప్పఁగఁ జెప్పెను, గనుమా యీసెట్టిగాని ♦ ఘర్షణ మొదవన్. 170

తే. గీ. నగరివారలు పిల్చుచు♦న్నా రటంచుఁ, దఱుముకొని రాఁగ నిలుఁజొచ్చి ♦ తలుపువేయ
గోడతఁడు దూఁకివచ్చి తో♦డ్కొనుచుఁ బోవ, రెడ్డి లేఁడుగదా యని ♦ యడ్డపడితి.

ఉ. అంతట నీవు వచ్చితివి ♦ యాతఁడు నాగ్రహావృత్తిచేత న
న్నెంతయు దూఱుకొంచుఁ జని ♦ యెన్ మగఁడా యని చెప్పి వైశ్యునిం
జెంతకుఁ జేరఁ బిల్చిన వ♦సించుకుసూలము వెళ్లి సాధ్వసా
క్రాంతశరీరుఁడై యెదురు♦కట్లకు వచ్చిన రెడ్డి నవ్వుచున్. 172

తే. గీ. వాని దయఁ జూచి నే నున్న♦వాఁడ నీవు, భయపడకు స్వేచ్ఛగా యని ♦ పల్కరించి
పొమ్మనిన మస్తకవిధూన♦నమ్ము చేసి, యేఁగె నాతఁడు తనయింటి ♦ కేమి యనక. 173

ఉ. ఆవిధి బొంకనేర్చిన నృ♦పాగ్రణిడగ్గఱ కేఁగు మన్న హే
మావతి నాసికాగ్రమున ♦ మాటికి వ్రేలిడి కర్ణపత్రశో
భావళి చెక్కుల న్నటన♦మాడ శిరం బటు లూఁచి మెచ్చుచున్
వేవినఁ జూచి యంత నిజ♦వేశ్మముఁ జేరఁగ నేఁగె గొబ్బునన్. 174

కం. ఈగరిమను నిజగృహమున, కేఁగి ధరాధీశమోహ♦హృదయాంబుజయై
యాగజగామిని యొండొక,లాగున దినమెల్లఁ గడపి ♦ లలి నిశి యైనన్. 175

చ. ఘనశితికంఠకంఠకల♦కంఠఘనాఘననీలకంఠకం
జనయనఖంజరీటబల♦శాసననీలతమాలమాలికా
ప్రణుతమృగేక్షణాచికుర♦భారమృగీమదచంచరీకకా
ననకిటికోటికజ్జలవ♦నద్విపసన్నిభ మైనచీఁకటిన్. 176

ఉ. కొప్పున జాజిక్రొవ్విరులు ♦ గుంకుమగంధపుఁబూఁత గుబ్బలం
గొప్పుసుపాణిరాసరులు ♦ గోమలదేహలతాంతవల్లికం
గప్పెడుసొమ్ము పెన్సిరులు ♦ గన్నులపండువు లాచరింపఁగా
నెప్పటియట్ల వచ్చి హరి♦ణేక్షణ నిల్చెను హంససన్నిధిన్. 177

ఆ. వె. నిలువఁ గలువకంటి♦చెలువంబు వీక్షించి, దినముదినము క్రొక్క♦తెఱఁగు దోఁప
సొగసుఁ బూననేర్చు ♦ సుందరాంగివి నీవె, యనుచు మెచ్చి హంస ♦ మనియె సతికి.

## పదునాఱవ రాత్రి కథ.

మ. పొగడం జొప్పడు శౌరసేనజగతిం ♦ బుణ్యోపలబ్ధం బనే
నగరం బొక్కటి యందుఁ గాఁపురముదీ♦ర్ణప్రౌఢితో నుండు భ
ద్రగుణోపేతుఁడు సూతవంశజుఁడు కు♦ద్దాలాభిధానంబునన్
దగఁ బెంపొందినవాఁడు రూపజితకం♦దర్పుండు భామామణీ. 179

తే. గీ. రాజ నలరాజ రతిరాజ♦రాజరాజ, రాజ రాజాత్మజామర్త్య♦రాజ జనన
రాజ రాజితరేఖావి♦రాజమాన, సౌష్ఠవాకారసంపత్తి♦ జరుపు నతఁడు. 180

కం. తరణిజసుతరణిధరణీ, తరుణీరమణీయవేణిఁ ♦ దతనిర్ఝరిణీ
వరరమణీమణిశ్రితజన,దురితాటవ్యరణిసుగుణ♦ధోరణి యమునన్. 181

తే. గీ. ఈఁదుకొయ్యలు తెప్పలు ♦ నీఁదుకాయ, లరడ లరిగూళ్లు పడవలు ♦ తరులుపుట్లు
చేపడవ లోడ లాదిగాఁ ♦ జెలఁగునట్టి, యంబుతరణంబులకు నెల్ల ♦ నధిపుఁ డతఁడు.

కం. ఆకర్ణదఘ్నపుణ్యక,థాకర్ణనలలితహృదయుఁ ♦ డసమానయశుం
డాకర్ణధారుఁ 1డతులసు, ధీకర్ణుఁడు ధీవరకుల♦దేవుం డరయన్. 183

తే. గీ. కొడమ తిబ్బిడ్డకొడమ దొ్రి♦బ్బుదుపటంబు, చాప యెత్తిలిగూడయుఁ ♦ జల్లు డూఁడు
లుంటగాలంబు తెర దెమ్మ ♦ లుసురుగాల, మొసుకుగోరకపుఱుసొక్కు ♦ లెసఁగుచుండు.

కం. మెడవల సన్నపువల త్రో,వుడువల డొంకవల మిట్ట♦ముక్కిడివల దాఁ
టుడువల సింగిత మనుపవ, లెడవల కండెవల మొదల♦యినబలువలలన్

సీ. నీరుకుమ్మరపుర్వు ♦ నీరుఁగె తలకప్ప తెలిదెమ్మ కరివెల ♦ పొలికె నత్త
గుల్ల చుట్టుడుగుల్ల ♦ కురిమింద నాచుడుగవ్వ మురుండము ♦ కాకిచిప్ప
నలిబిల్ల మెరబిల్ల ♦ పురుగు గోదురుగప్ప కప్ప యెత్తలి యెండ్రి♦గాయ జెలగ
గులుగురింతయు నీరు♦గుట్టు శంఖనఖంబు పులుకాసి నసిమిరి ♦ బుంగపురువు

తే. గీ. పిలుక నిర్ఘాత కౌచు తాఁ♦బేలు పిడక,మొసలి శింశుమారము పెద్ద♦మొసలి నీరు
పాప నీరేన్గ నీర్వల్లి ♦ ప్రాచిపురువు, లాదిఘోరగానిజంతువు ♦ లన్నివిడిచి. 186

సీ. కొరద దాసరికొయ్య ♦ కొఱ్ఱమీ నులసముచ్చంగి బేడిస జెల్ల ♦ చారమీను
వాలుగు ముఖదొమ్మ ♦ వల్లికతట్ట పుత్తడికాను పూమీను ♦ కడిసెలంబు
పక్కె చిత్తెర నీచు♦పాపెర మలుగు మీ నరిజె యిల్లెప్రుచేఁప ♦ యాకుజెల్ల
మిసికల్ల రుజు తేలు♦మీను దొల్లిక జాతికొరుకు మాపురమును ♦ గుంటముక్కు

తే. గీ. మొర పక్కిస దొండును ♦ గూరముక్కు, పుల్లరుజు గెచ్చె గెండెయు ♦ బొమ్మడాయ
యల్లెద ముమ్మప్పచేఁపయు ♦ గొల్లదొందు, పరిగె కొయ్యాదియగుమీలఁ ♦ బట్టునతఁడు.

కం. కులకాయకపుంజాలరి, కులనాయకమంబుతరణ♦కోటీశత్వం
బులు తూర్కక్రియశాసన,మలవడ కుద్దాలుఁ డంద♦కౌనన మెలఁగున్. 188

తే. గీ. మేలుబలువాలుగల నేలు ♦ మిసిమిగ్రాలు, కన్నుగవడాలు మరువాలు♦కరణిఁబోలు
మురిపెములప్రోలు కల దొక్క ♦ ముద్దరాలు, వానియిల్లాలు దొమ్మర♦వానిడోలు.

తే. గీ. దానినామంబు తగు భద్ర♦సేన యనఁగ, రూపయౌవనగరిమ నా♦రూఢి కెక్కి
యీడుజోడును సరి సాటి ♦ యొందులేక, విఱ్ఱవీఁగుచు నుండు నో♦విద్రుమోష్ఠి. 190

---

పా. 1. డంహాతి, ధీకర్ణుఁడు

సీ. జడ చిల్వ యాస్యంబు ♦ శశి నొసల్ నెల బొమ ♦ లనువు లక్షులు తొవ ♦ ల్నాస గంధ
ఫలి చెవుల్ శ్రీ దంత♦ములు మొల్ల లధరంబు తలిరు చెక్కి ళ్లద్ద♦ములు గళంబు
జిగిశంఖ మంగుళు ♦ ల్పగడాలు కరము లబ్జములు కక్షములు భో♦గములు భుజము
లు లతలు గుబ్బల♦దుర్గిలు వళు లూర్మ్మిలారసి నాభి గుహ కౌను బ♦యలు కటి యిల

తే. గీ. దొడ లనంట్లు మోఁకాళ్లు బి♦రడలు పిక్కలు శరధులు గుల్భములరశ♦లు ప్రపదములు
కూర్మములు గోరులుడు లడు♦గులు మహోత్పలములు వెల బల్కనైన యొప్ప♦లలనకెపుడు.

కం. కెంపా వాతెఱ జిగిబిగి, శంపా నునుమేను మోము♦సొ రిందుసిమేల్
సొంపా బలభిన్మణిఘృణి, గుంపా కుంతలవిభూతి ♦ కోమలి కెన్నన్. 192

సీ. సారంగసారంగ♦సారంగములఁ గేరు గమనంబు కనుదోయి ♦ కచభరంబు
సారాబ్జసారాబ్జ♦సారాబ్జముల నేలు వదనంబు కంఠంబు ♦ పదయుగంబు
పున్నాగపున్నాగ♦పున్నాగములఁ బోలుఁ దీరైన నాభి నూ♦గారు నడుము
తారకతారక♦తారకమ్ముల మీఱు దంతము ల్నఖములు ♦ దరహాసనము

తే. గీ. వడిఁబ్రివాళప్రివాళప్రి♦వాళలీలఁ, దనరు భుజములు వేర్లిల్లు నె♦త్తావిమోవి
రమ్యతరచక్రిచక్రిచ♦క్రిములఁ దెగడు, ముదితజఘనంబు చనుఁగవ ♦ ముఱుగులరయ.

కం. మబ్బులు గ్రిమ్మెదు క్రొమ్మడి, జొబ్బిల్లెడు తేనెమోవి ♦ సొబ గా మొగమున్
సిబ్బెంపుగబ్బిగుబ్బలు, నిబ్బరమా పిఱుఁదు తొడలు ♦ నిగ్గుచెలంగున్. 194

సీ. మృగధరబింబంబు ♦ మెలఁత నెమ్మోమ్ము మృగంబు కన్దోయి ధ♦రంబు లుదుటు
గబ్బిసిబ్బెపుచను♦గుబ్బలు బింబంబు తావిచక్కెరలొలుక ♦ మోవి శీవి
సుమచాపబాణంబు ♦ లమరు పాదమ్ములు సుమములు నవ్వు చా♦పములు బొమలు
బాణము లొక్కరివ్వాఁడి♦రాణించు వాల్జూపు లళులు నిద్దపుఁగుటి♦లాలకంబు

తే. గీ. లమృతదరమావిహారంబు ♦ లలరుకురులు, నమృతములుపల్కులు దరంబు ♦ రమణిగళము
మావి కెంపుచిప్పుళ్ళు స♦మ్పత్కరములు, హారములు దంతపంక్తిసో♦యగము లరయ.

ఆ. వె. భ్రమరకములఁబోలు♦భ్రమరకములడాలు, పృథులకుచములొఱయుఁ ♦ బృథులకుచము
లతనుభామఁగేరు ♦ నతనుభామాకృతి, యలరుఁ గొమ్మఁదెగడు ♦ నలరుఁగొమ్మ. 196

శా. ఆరాజన్ముఖమూర్తినీలచికురం ♦ బాచెక్కుటద్దంబు లా
శ్రీరమ్యాధర మాభుజాలతిక లా♦సిబ్బెంపుచన్గుబ్బజో
డారోమావళిపొంక మానడలయొ♦య్యారంబు వీక్షింప న
మ్మారుండైనను దానిసంగతికిఁ బే♦ర్మిన్ బంటు గాకుండునే. 197

తే. గీ. అదియుఁదల్లికి జనియించి♦నది మొదలుగ, సంగమాపేక్ష తలకెక్కి♦చాలఁదివురు
నంత నుపకాంతసంగతి ♦ యబ్బెనేని, యాశసము తూఁటువోదుచుక♦మైనఁ జనును. 198

సీ. కలికిచూకాటంపు ♦ బెళుకుచూపుల ముద్దు కనుబొమ్మలఁగింపు♦కొనెడు హాయలు
కలయక మాటలఁ ♦ గరఁగించు చెలువంబు లాన పుట్టఁగ నవ్వు♦నట్టినేర్పు
తేలించి చేతులు ♦ ద్రిప్పెడు పొంకంబు హర్షించి తా నుచు♦క్కనెడు సొబగు
చిన్నెలవనఁ జూపి ♦ నవ్వఁ జేసెడితీరు ముక్కుపై వ్రేలిడి ♦ చొక్కువగలు

తే. గీ. వలుదగుబ్బలఁబయ్యెద♦వైచు ఠీవి, నఱుకుమెట్టెలరొద లీన♦నడుచు సొగసు
విను త్రిలోకములందుండు ♦ వెలఁదులందుఁ, గానఁబడ దెన్నటికి నైనఁ ♦ గమలగంధి.

తే. గీ. అదియుఁ గొవ్వున వీరు వా♦రనక చొచ్చి, ఒక్క గలవాని రూపుసొం♦పెక్కువాని
బలము గలవాని రతులఁ బే♦ర్పడినవాని, గనిన విడువదు వానితోఁ♦గలసి కాని. 200

వ. ఇట్లనుదినప్రవర్ధమానానూనమోహాతిరేకంబున నన్యమానవవితానమీనకేతనాయోధ
నాధీనమానసాంభోజయై యయ్యంభోజనయన విజృంభించి మెలంగుచున్న యవసరంబున. 201

చ. ఒకఁడు కిరాతదేశమున ♦ నుండెడు కోమటిపోలిసెట్టిపు
త్రకుఁడు హిరణ్యనామకుఁడు ♦ తండ్రి యదల్చిన నల్కతో సఖి
ప్రకరము గొల్వఁగా సుకృతి♦పాటవ మొప్ప మహోనదుల్ నిధుల్
సకలముఁ జూడఁ గోరి చనె ♦ సత్వరయానమునన్ ముదంబునన్. 202

వ. ఇట్లు చని చని. 203

ఆ. వె. బదరికాగుహేతు♦కదళికాచంపక, సహుమదేవదారు♦నైమిశములు
దండకావనంబు ♦ దనరు వింధ్యాటవి, యాదియగు మహావ♦నాళు లరసి. 204

సీసమాలిక. గంగ సరస్వతి ♦ కాళింది గౌతమి చిత్రోత్పల విశాల ♦ శీత చంద్ర
భాగ కావేరి వి♦పాశ సితాలక శీతలవాహిని ♦ సింధు సరయు
గిరి యిరావతి గండ♦కి దశార్ణ కృష్ణవేణిక శంబమాల దే♦విక తృణఘ్ని
బహుళ విశాఖని ♦ బ్రహ్మభాగ సురాస వాలుకావాహిని ♦ వర్ధమాన
శోకావధూతపి♦నాకిని బుతు తామ్రపర్ణి వలని తామ్ర♦వతి వితద్రు
నర్మద బాహుద ♦ నంద చిత్రిత యుత్పలావతి కపిల మా♦ల్యవతి త్రిదివ
లక్షణ హారిణిక ♦ లాంగలిని త్రిసామ ద్యుమతి కుముద్వతి ♦ తుంగభద్ర
ఋషిత జితాపగ ♦ ఋజ్వాభద్ర సునంద భృగువర గండకి ♦ భీమరథి మ
హాజల గోమతి ♦ హంసావ ళీశ్వరగండిక హరిగండి♦క శతభద్ర
బ్రహ్మగండిక నీల ♦ పద్మావతీశావతి హిరణ్యాశాఖావ♦తి హిమకౌంచ
హరితల మానసి ♦ మాంసకంజ సుమేఘ సౌభద్ర కౌశికి ♦ చక్రధార
శ్యామ మహోత్కట ♦ సోమ మహావక్త్ర శౌక్లిపాశావతి ♦ చంద్రమత్త
పంచగం ధ్యరుణప్ర♦భంజని వల్లవ వజ్రవాలుక శూక ♦ వరుణవక్త్ర

పంచమహోమాయి ♦ ఫల్గుణి సురకర్తృష ధనుష్మతి వితస్త ♦ చంద్రవర్త్మ
స్కందావతి సమూల ♦ వక్షుకదంబక పుండరీక పయోష్ణి ♦ భూతపాద
కూట వైఘయుఁ జిత్రకూట వేదవతి నక్రవతి వేగవతి వేత్రవతి గర్భ
వతి యింద్రనందియుఁ ♦ గృతమాల కృష్ణపాద జయంత వందశాంతాఖ్య శుక్తి
మతి హారిద్యుతి సువర్ణలతీ మణిప్రభా ప్లక్ష కజల బప్పల శుచి సింధు
వర్ణ కాశ్యపి మణికర్ణిక మందాకిని మలప్రహారి సానుమతి 1 క్షీర
2కౌమోదకీ సఖీమోమిత కరతాల వేదత్రయి మయూఖ ♦ విలయ విదిత
భవనాశనియు సర్వపాపహ కిటికక్ష పోద్రవేదస్మ జంబూక కుంభ
గాపుణియు త్రిసంధ్యగాయత్రి బుషికుల్య ప్రభవిష్ణు వలికూట ♦ రత్నకృష్ణ
తోయపాపఘ్ని వింద్విష్టద సర్వద వైర్ణదృష్టిద్యుతి ♦ వందవార
శీఘ్రోద్రదయుఁ బ్రణీత ♦ చెయ్యేరు గుండ్లకమ్మయుఁ గుందు మొదలుగా ♦ మహీఁదనర్చు

తే. గీ. పుణ్యకూలంకషాబృందములు నమంద, వికస దరవింద గంధిల ♦ విమల కమల
స్ఫురవరంబుల నురుభక్తి ♦ జలక మాడి, సకలదానాదిసత్క్రియల్ ♦ సలిపె నంత. 205

తే. గీ. శార్ఙ్గకోటి గదాకోటి ♦ శంఖకోటి, చక్రకోటి త్సరుఃకోటి ♦ చంద్రకోటి
సిద్ధకోటి మహాకోటి ♦ చిత్రకోటి, పుణ్యకోటి ధనుఃకోటి ♦ ముక్తికోటి. 206

తే. గీ. పద్మసర సీంద్రసరసిని ♦ బ్రహ్మసరసి, శుభ్రసరసి మహాసర ♦ సభ్రసరసి
గృధ్రసర సీందుసరసిని ♦ క్షీరసరసి, మానససరసి సన్నిఁట ♦ స్నానమాడె. 207

సీ. స్వామిపుష్కరణిలో ♦ స్నానంబు గావించి శశిపుష్కరణి నీళ్లు ♦ చల్లులాడి
చంద్రపుష్కరణిలో ♦ జలకంబు ఘటియించి సోమపుష్కరణిలోఁ ♦ జొచ్చి పొరలి
గుహాపుష్కరణి నీఁత ♦ కొమ్మకొప్ప నొనరించి యమృతపుష్కరణిలో ♦ నాడి వెడలి
నిత్యపుష్కరణిల్లో ♦ నీళ్లాడి చిత్రపుష్కరణిలో జోతలర్పిమము జూపి

తే. గీ. శంఖపుష్కరణిని గ్రుంకి ♦ చక్రపుష్కరణి మునిఁగి దేవతాపుష్కరణిఁ దొలంచి
క్షీరపుష్కరణిని దూఁకి ♦ సేతుపుష్కరణిని మజ్జనమాడి సద్గుణత మెఱయ. 208

సీసమాలిక. మత్స్య కూర్మ వరాహ ♦ మాండవ్య నరసింహ రామ పరశురామ ♦ రామ వామ
న మహేంద్ర చక్ర గో ♦ నారద శంఖ పాండవ శార్ఙ్గి పక్ష్యగస్త్య విజయ జయ
కపిల వసిష్ఠ మార్కండేయ భృగు జహ్ను వాయు ముని బ్రహ్మ ♦ వరుణ విష్ణు
ధర్మ పరాశర ♦ దామోదర కపింజల శుక కౌండిన్య గాలవ హిరణ్య
వసు కృష్ణ శాండిల్య ♦ వజ్రి కౌశిక ధనంజయ ముక్తిదేవర్షి ♦ సర్వపిప్ప
ల సరస్వతీ ముద్గల భరత పర్వత పరమ కాశ్యప శేష ♦ పంచగోవ

పా. 1. క్షుకవ పా. 2. కసదా రమోమిత ♦ కరతాల వేదత్రయి విగాహిని మయూ ♦ ఖవిలయ దిత

రైభ్య భరద్వాజ ♦ శైభ్య తుంబురు గౌతమ జటిల భార్గవ ♦ మాధవ గురు
బాభ్రవ్య పుణ్యగో♦పాల ముకుంద త్రివిక్రమ సౌర గో♦వింద మోక్ష
కుల్యాచ్యుతామృత ♦ గోమంత సురకృప నారాయణ మను జ♦నార్దన హరి
వైకుంఠ కేశవ ♦ వాసుదేవ పతంజలి విరజ ధన్వంత♦రి కురు భోగ
పావన శ్రీధర ♦ పావన ప్రద్యుమ్న పురుషోత్తమ పరమ♦పురుష సిద్ధ
పాతకనాశన ♦ పాపహా ళాళ్వారు విమల భాస్కర హార♦కమల సోమ

ఆ. వె. నామధేయములను ♦ భూమిలో సార్థత్రి,కోటితీర్థములను ♦ మేటి వనఁగఁ
దనరునట్టినూఁట♦యెనిమిది తీర్థాల, స్నానదానవిధులు ♦ సలిపె నంత. 209

వ. మఱియును. 210

కం. తిరుకోళము నూతిమోటయు, చెఱువు మడువు లొండు కుంట ♦ చెలమ పడియకో
నెరు బుగ్గవాఁగు దొనతల,పరిగుండము లోన డిగ్గి♦బావి దొరువులన్. 211

సీ. సంకల్పములు సెప్ప♦సాగి బ్రాహ్మణు లుండ భైరవార్ఘ్యం బిచ్చి ♦ భక్తితోడ
స్నానంబు గావించి ♦ పంచిమాత్రము దక్కఁ గల ధన మెల్ల బా♦పల కొసంగి
కపిలగోఘృతములు ♦ గ్రముకపర్ణంబులు గుడములు ఫలములు ♦ గుగ్గిలంబు
గానుక ల్వత్తుల♦కట్టలు పూలసరాలు గైకొని మోద♦రసము జిల్క

తే. గీ. నార్ద్రవస్త్రంబు లంగంబు♦లంట వడిఁకి, కొనుచు నమ్రత నడుగడు♦గునకుఁ బెద్ద
మాట గోవింద లనుచును ♦ నూఁటయెనిమి,దితిరుపతులలో స్వాములఁ ♦ దెలియఁజూడ.

వ. మఱియుఁ దలంచి చనిచని. 213

మంజులగతిరగడ. శ్రీవైకుంఠ♦క్షేత్రమునఁ దగు వాసుదేవునకు ♦ వందన మొనరిచి
యామోదస్థలి♦యందలి సంకర్షణునకుఁ గర్ణా♦చ్ఛాదనముల నిడి
పరవిఁ బ్రమోద♦స్థలమునఁ జెలఁగిన ప్రద్యుమ్ననకును ♦ బ్రణతి యొనర్చుచు
సమ్మోదాఖ్య♦స్థలమున నుండెడు ననిరుద్ధునకు స♦మారాధన మని
సత్యలోకమున ♦ సతముగ వెలసిన విష్ణువునకు గో♦విందలు సల్పుచు
సూర్యమండలము ♦ సొంపుగఁ బ్రబలిన పద్మాక్షునకుఁ బ్ర♦పత్తి వహింపుచు
క్షీరాబ్ధిస్థలి ♦ శేషశయనునకు హస్తస్వస్తిక ♦ మనువందింపుచు
శ్వేతద్వీప ♦ క్షితిఁ బ్రభవించిన తారకహరికిని ♦ దండము లొసఁగుచు
రమణ బదరికా♦రణ్యంబందలి నారాయణునకు ♦ నమ్రత లొసఁగుచు
నైమిశపుణ్యవ♦నంబునఁ బొందిన హరికిని మంగళ♦హారతు లెత్తుచుఁ
దనరు హరిక్షే♦త్రంబున నెలకొను 1సాలగ్రామ♦స్వామి గణింపుచు

పా. 1. సాలగ్రామ♦స్వామి కభిష్కృతి

బూనఁగ నయోధ్యా♦పురిలోఁ జెలఁగెడు రఘునాయకులకుఁ ♦ బ్రణిపాతము లని
మధురాపురిలో ♦ మహిమలఁ జెందిన బాలకృష్ణునకుఁ ♦ బ్రాణాచారము
మాయాస్థలిలో ♦ మధుసూదనునకు నిరతం బల్లో♦నేరే ళ్లనుచును
కాశీస్థలిభో♦గశయానునకును నమరఁగ నూర్ధ్వాశ♦యంబులు జొనుపుచు
దలఁప నవంతీ♦స్థలిలో నవనీపతిదేవునకును ♦ బ్రాంజలు లిడుచును
ద్వారవతీ యా♦దవకులభర్త్రకుఁ దాళహస్తములు ♦ దప్పక కొట్టుచు
వ్రజపురిలోఁ దా♦వలమై చిక్కిన గోపీప్రియునకు ♦ గొబ్బిళ్లనుచును
వసతిగ బృందా♦వనమున నిలిచిన నందాత్మజునకు ♦ నతు లొప్పించుచు
నలరఁగఁ గాళియ♦హ్రదతలమునఁ గల గోవిందునకును ♦ గొండిమె లెన్నుచు
గోవర్ధనమునఁ ♦ గొలువై కన్పడు గోపవేషునకుఁ ♦ గొఃశిగ లొనర్చుచుఁ
దనరు భక్తలో♦చనపాపఘ్నస్వామికి 1పుష్పాం♦జలు లర్పించుచు
మహిమ వెలయ గో♦మతపర్వతమునఁ జేరినశౌరికి ♦ సేవ లటంచును
రమ్యహరిద్వా♦రమునఁ బ్రసన్నుండైన జగత్పతి ♦ కభివాదన మని
చాల బ్రయాగ♦స్థానమ్మునఁ గల మాధవునకు స♦న్మానకరంబులు
గయలో సాక్షా♦త్కారము నొందు గదాధరునకు జో♦తలు చెల్లింపుచు
2గంగోదధిసం♦గస్థలిఁ జెలఁగిన శ్రీవిష్ణునకు ♦ జేజేలాగుచుఁ
జిత్రకూటమున ♦ సేమం బందిన రాఘవునకు నే♦త్రనిమీలన మని
నందిగ్రామము♦నను జెలువొందిన రాక్షసఘ్నుఁడగు ♦ రామున కెఱఁగుచు
సరవిఁ బ్రభాస♦స్థలి సంచరుఁ డగు విశ్వరూపునకు ♦ వినుతులు సేయుచు
శ్రీకూర్మస్థలిఁ ♦ జేకొను కూర్మస్వామికిఁ బుష్పాం♦జలు లర్పించుచు
నీలాచలమున ♦ నెలకొను పురుషోత్తమునకు హాణిగలు ♦ దండిగఁ జేర్చుచు
సింహాచలమునఁ ♦ జెందు మహాసింహాకారునకు జో♦హారులు నెఱపుచుఁ
దులసీవనమునఁ ♦ దులకించు గదాధరునకుఁ జర్యలు ♦ తఱుచుగ జఱపుచుఁ
గృతశౌచస్థలిఁ ♦ గేళిక లొందెడి పాపఘ్నునకు స♦పర్యలు బెనుపుచు
శ్వేతాద్రిస్థలి ♦ సింహాలోచనున కెలమిని గేకిస♦లిచ్చుచు భక్తిని
ధర్మపురిక్షే♦త్రపు యోగానందస్వరూపునకు ♦ దాస్యము సలుపుచు
శ్రీకాకుళమున ♦ సిస్తుగనిలిచిన యాంధ్రనాయకున ♦ కర్చన మనుచును
ఘనత నహోబల♦గరుడాద్రిహిరణ్యాసురవధునకు ♦ నతిజోబిళ్లని
పాండురంగమునఁ ♦ బాటిలు విట్ఠలదేవునకు సదా ♦ దిగ్విజయము లని
వేంకటగిరిపై ♦ వెలసిన తిరువేంగడముడియారులఁ ♦ గని వందనమని

---

పా. 1. భక్త♦స్తంభనఁ బటుచు  పా. 2. గంగాసాగర♦గస్థలిఁ

యాదవపర్వత♦మందలి నారాయణునకు జయజయ ♦ లావర్తింపుచు
ఘటికాచలమునఁ ♦ గల్గు నృసింహుని గృపణత్వంబునఁ ♦ గీర్తన నడుపుచు
వారణగిరిపై ♦ వరదస్వామికిఁ బిడికిలింత లని ♦ పెంపుగ నొడువుచుఁ
గాంచీపురిలోఁ ♦ గమలాక్షునకును మోదముతోడుత ♦ ముకుళితకర మని
యొప్పన నుండు య♦థోక్తస్థలమయథోక్తకారునకు ♦ దోయిలి దీర్చుచుఁ
బరమస్థలిలోఁ ♦ బరమేశ్వరునకుఁ గర మర్థింపుచుఁ ♦ గన్నులమ్రొక్కుచుఁ
బాండవభూస్థలిఁ ♦ బాండవదూతకు వలయబాహువులు ♦ వైపుగఁదీర్చుచు
విక్రమస్థలిఁ ద్రి♦విక్రమహరికిని సారెకు సారెకు ♦ సాగు భళా యని
కామాసికిలో ♦ గణుతికి నెక్కిన శ్రీనృసింహునకుఁ ♦ జేతులు మొగుపని
యష్టభుజస్థలి ♦ నష్టభుజునకును జిత్తము రంజిలఁ ♦ జిన్నిపువ్వు లని
పాతాళస్థప్ర♦వాళవర్ణునకు నమర నమోనమ ♦ యని వర్ణింపుచు
దీపాభస్థిత ♦ దీపాభునకును మోదముతోడ న♦మోవాకం బని
రాజిలు గృధ్రస♦రస్తీరస్థలిఁ గలుగు విజయరా♦ఘవునకు శర ణని
రసికతవీక్షా♦రణ్యాశయానఁపు వీరరాఘవులఁ ♦ జేరి నుతింపుచు
తోతాద్రిస్థలిఁ ♦ దుంగశయానస్వామికి నిత్యో♦త్సవములఁ బనిగొని
యలరు గజస్థల♦మందు గజార్తిఘ్నునకు శయద్వయిఁ ♦ గోలాటం బని
బలిపురమందుల ♦ బలియు మహాబలదేవున కిదిగో ♦ తిరువారాధన
భక్తసారమునఁ ♦ బ్రబలు జగత్పతికిని సంధించిన ♦ గిడిగిళ్లో యని
మైంద్రిస్థలమున ♦ నవతారముగొను దేవదేవునకు ♦ ధృతహ్మాత్పుటములు
గోపపురస్థలి ♦ గోపదేవునకు నెలమిఁ బ్రదక్షిణ ♦ [1]మేగెద గొబ్బున
శ్రీముష్ణస్థలిఁ ♦ జెలఁగు వరాహస్వామికిఁ బేర్చెదఁ ♦ జంకలఁ జేతులు
మహితస్థలమున ♦ మసలక పొదలెడు పద్మాక్షునకును ♦ బడుబాటలు వడి
శ్రీరంగస్థలి ♦ శేషశయనుఁ డగు రంగస్వామికి ♦ రహి మ్రొక్కెద నని
శ్రీరామస్థలి ♦ సీతాప్రియునకు మానక యెపుడు న♦మస్కారము లని
శ్రీనివాస మను ♦ క్షేత్రంబునఁ గల పూర్ణమూర్తి కిదె ♦ పొరిఁ బూజం పని
స్వర్ణమందిరసు♦వర్ణస్వామికిఁ గేరుచు సలిపెద ♦ కెడికోళ్లనుచును
వ్యాఘ్రపురస్థలి ♦ యందు మహాబాహుస్వామికిఁ గే ♦ లోసఁగెద హితముగ
నాకాశనగర♦మం దనువొందెడు హరిమూర్తికి నిదె ♦ యప్పాల్ దిరిగెదఁ
బరఁగ నుత్పలా♦పతికస్థానం బందలి శౌరికి ♦ నారాధన మని
మణికూటస్థలి ♦ మలయు మణిప్రభు పెరుమాళ్లయ్యకుఁ ♦ బింపిళ్లాడుచు
విష్ణుపురంబున ♦ విలసిల్లు మహావిష్ణుస్వామికి ♦ వెన్నెలకో లని

పా. 1. మెనసెద గొబ్బున

భక్తస్థానము ♦ భక్తిప్రియునకుఁ బొసఁగఁగ జేసెదఁ ♦ బొర్లుదండములు
శ్వేతహ్రదను♦క్షేత్రంబందలి శాంతమూర్తికిని ♦ సంసర్గంబులు
నగ్నిపురస్థలి♦యందు మురద్విషునకు నొనరింతుఁ బ్ర♦ణామము లూకొని
భార్గవతలమున ♦ భర్గస్వామికిఁ గీలించెద లం♦కెగఁ గేల్మొడతలు
వైకుంఠపురీ♦వాసుండై తగు మాధవునకును న♦మస్కృతిఁ జేకొని
పురుషోత్తమమునఁ ♦ బొల్పగుపార్థసఖస్వామికి నిజ♦కైంకర్యంబని
చక్రతీర్థసం♦చారి సుదర్శనదేవుని మదిఁ బ్రా♦ర్థించుచు నంతటఁ
గుంభకోణమునఁ ♦ గొనకొని కదలని శార్ఙ్గధరు నుపా♦సనఁ జేసెద నని
భూతస్థానము♦పురమున నెళ వగు శార్ఙ్గిస్వామికిఁ ♦ జాగుబడికె లని
యరయఁ గపిస్థల♦మందలి దంతావళవరదునకు ని♦వాళికరము లని
చైత్రకూటమున ♦ సరసతఁ గొల్వగు గోవిందునకును ♦ గొల్పుడు చేతులు
నుత్తమతలమున ♦ నుత్తమహారికిని ఘనతరభక్తిని ♦ గైలాటము లని
శ్వేతగ్రావ♦క్షేత్రంబునఁ గల పద్మలోచనునిఁ ♦ బ్రస్తుతి సేయుచుఁ
బార్థస్థలమున ♦ బాగ వసించు పరబ్రహ్మమునకు ♦ రామురాము లని
కృష్ణకోటి యను♦క్షేత్రము లోని మధుద్విషునకు నిదె ♦ తొంగలిపాట్లని
నందపురీభవ♦నంబందు మహానందునకును శర♦ణార్థి ఘటించుచు
1వృషపురస్థలిని ♦ విడియు వృషాశ్రియదేవుని కిదిగో ♦ దీవెనకో లని
కడక సంగమ♦గ్రామంబందలి సంగమస్వామికి ♦ సాగిలింత లని
తనరు శరణ్యా♦స్థలము శరణ్యస్వామికి నిదె కై♦వారపుచె య్యని
చెన్నగు సింహ♦క్షేత్రమహాసింహస్వరూపునకు ♦ హస్తార్పణ మని
మణిమంటపమున ♦ మల్లరిసామికిఁ బొందించెద గో♦వింద లటంచును
నిబిడస్థలిలో ♦ నిబిడాకారస్వామికి మతిఁ గై♦చాపు లొనంగుచు
ధానుష్కస్థలిఁ ♦ దలఁకొను జగతీశ్వరునకుఁ 2బెట్టెద ♦ సరిలెంకణ మని
మాహురమం దస♦మానత విడిసిన కాలమేఘునకుఁ ♦ గైమోడుపు లని
చక్కని మధురా♦స్థానమ్మునఁ గల సౌందరరాజ♦స్వామికి మేలని
యనిశంబును వృష♦భాద్రిని యళఘురి పెరియస్వామికి ♦ బేడిస లెన్నుచు
వరగుణస్థల ♦ వ్యాపకుఁ డగు నాథస్వామి పద♦ధ్యాన మొనర్చుచుఁ
గుళకస్థలమునఁ ♦ గూర్చున్న రమాసఖుని మంత్రపు♦ష్పము లిడి వేఁడుచు
గోష్ఠపురస్థలి♦గోష్ఠస్వామికి మిక్కిలి మేలిడు ♦ మేలుకొల్పులని
దర్భసంస్తర♦స్థానంబందు శయానదాశరథి ♦ కతి కైవిప్పని

పా. 1. వృద్ధపురీస్థలి ♦ విడియు   పా. 2. జెప్పెద ♦ పరిడెంకలమని

ధన్విమంగళక ♦ తలమున నెలకొను శౌరికిఁ దగు పరి ♦ చర్య లొనర్చుచు
భ్రమరస్థలమునఁ ♦ బరఁగు బలాఢ్యస్వామికి సలా మని ♦ సత్కర మెత్తుచు
ధరణిఁ గురంగ ♦ స్థలమందలి పూర్ణస్వామి నవా ♦ రణమునఁ గొల్చుచు
నవని వటస్థల ♦ మందలి విష్ణుశ్రీమూర్తికి నిదె ♦ చెంగనలో యని
క్షుద్రనదీస్థలి ♦ శోభిలుచుండెడు నచ్యుతునకును ది ♦ నావనతులు నిడి
యంత ననంతశ ♦ యనమందుండెడు పద్మనాభునకుఁ ♦ బాణిమోడ్పు నని
ధర నూటెనిమిది ♦ తిరుపతులందుల నవతారంబుల ♦ నలరఁగ వెలయుచుఁ
1గృపతో మము ర ♦ క్షించెడు రామస్వామికి పదివేల్ ♦ సాష్టాంగంబులు. 214

వ. అని ప్రపత్తిపూర్వకంబుగా నష్టోత్తరశతతిరుపతులు సేవించి యంత. 215

సీసమాలిక. అభిషేకవల్లి మో ♦ హనవల్లి విద్రుమవల్లి చంపకవల్లి ♦ వజ్రవల్లి
మకరందవల్లి కో ♦ మలవల్లి మాణిక్యవల్లి చందనవల్లి ♦ వచనవల్లి
గంబూరవల్లి కా ♦ సారవల్లి వసంతవల్లి శోభనవల్లి ♦ వసుధవల్లి
మరకతవల్లి ని ♦ ర్మలవల్లి మౌక్తికవల్లి కస్తూరికా ♦ వల్లి గంధ
వల్లి విభ్రమవల్లి ♦ వర్తులవల్లి వరహావల్లి నిక్షేప ♦ రాజవల్లి
2యంబుజవల్లి వి ♦ కాసవల్లి వినోదవల్లి నిత్యోత్సవ ♦ వల్లి చిత్ర
వల్లి మనోహర ♦ వల్లి కేతకీవల్లి సారంగవల్లి క ♦ ర్పూరవల్లి
కల్యాణవల్లి శృం ♦ గారవల్లి మనోజ్ఞవల్లి నాయకవల్లి ♦ స్వచ్ఛవల్లి
సౌభాగ్యవల్లి కే ♦ సరవల్లి మధువల్లి మాలతీవల్లి సా ♦ మ్రాజ్యవల్లి
మంజులవల్లి సం ♦ భ్రమవల్లి శుకవల్లి నర్తితవల్లి యా ♦ నందవల్లి
ఘనతరవల్లియుఁ ♦ గౌమోదకీవల్లి కౌస్తుభవల్లి ప్ర ♦ కాశవల్లి
దీపితవల్లి దే ♦ దీప్యవల్లి విలాసవల్లి సత్పరిమళ ♦ వల్లి విజయ
వల్లి రేఖావల్లి ♦ వరగుణవల్లి రసికవల్లి శ్రీగిరి ♦ శిఖరవల్లి
కేయూరవల్లి కో ♦ కిలవల్లి సుస్థిరవల్లి సుమంగళ ♦ వల్లి మదన
వల్లి సరసవల్లి ♦ వైభవవల్లి కిసలవల్లి రుచివల్లి ♦ చారువల్లి
కౌతుకవల్లి శ ♦ ర్కరవల్లి వికసితవల్లి మండనవల్లి ♦ పరమవల్లి
హాసవ ల్ల్యమృతవల్లి ♦ యనురాగవల్లి కుసుమవల్లి సుఖవల్లి ♦ శుభ్రవల్లి
చంచలవల్లి భూ ♦ షణవల్లి సుకుమారవల్లి జీవనవల్లి ♦ వనజవల్లి
రంగవ ల్ల్యకలంక ♦ రత్నవల్లియు శ్యామవల్లి కుండలవల్లి ♦ వకుళవల్లి
విచికిలవల్లియు ♦ వేదవల్లియుఁ బెరుందేవివల్లియు భూమి ♦ దేవివల్లి
యలమేలుమంగతా ♦ యారును బీబినాంచారు శ్రీరంగనాం ♦ చారుతాయి

పా. 1. గృపతో మము ర ♦ క్షించెడు స్వామికి సరిపెఁ బదివేల్ ♦ సాష్టాంగంబులు..
పా. 2. బూదూరువల్లి వి ♦ నోదపల్లవివల్లి వల్లి నిత్యోత్సవ ♦ వల్లి చిత్ర

కొమరొందు శ్రీచూడి◆కుడుతనాంచారమ్మ చెలువొందుచుండెడు ◆ శ్రీపిరాట్టి
నందగుపేళ్లఁ జె◆న్నొందు దయాన్విత సీతాభిధాన ల◆క్ష్మీస్వరూప
ములను నూటెన్మిదితిరుప◆తుల వసించు, విష్ణుమూర్తులతోఁ గూడి ◆ వివిధగతుల
తే. గీ. ననుపమవిహారములమించు ◆ నమ్మవార్ల, పాదపంకజముల కతి◆భక్తి మ్రొక్కి. 216

సీ. వారక పొయిఘాళు◆వారలఁ గొనియాడి వరలుపూదత్తాళు◆వార్లఁ గొలిచి
ధీరులౌ పేయాళు◆వారల దర్శించి పెరియాళువారల ◆ పేరు దలఁచి
నమ్మాళువారల ◆ నెమ్మదిలో నిల్పి తిరుమంగయాళ్వార్లఁ ◆ దెలియఁ జూచి
తిరుమషియాళ్వార్లఁ ◆ బరికించి తొండరడిప్పొడియాళ్వార్ల ◆ శేవఁ బొగడి
తే. గీ. వేడ్కఁ గులశేఖరాళ్వార్ల ◆ వినుతి చేసి, మఱి తిరుప్పాణియాళ్వార్ల ◆ మరుగుఁ జెంది
మధురకవియాళువారుల ◆ మాట లెన్ని, నాథమునియాళువార్లకు ◆ నతు లొనర్చి. 217

కం. సాక్షాద్వైకుంఠం బిదె, వీక్షింపుం డనుచుఁ జూపు◆విధిని బ్రిపత్తిన్
నిక్షేపించి సుమేరున,దృక్షంబుగ నున్న వైన◆తేయునిఁ గొలిచెన్. 218

సీ. మత్స్యావతార న◆మస్తే మహాకూర్మదేహ నమస్తే వ◆రాహముఖ న
మస్తే నృసింహ న◆మస్తే వటో నమస్తే భృగుకుల నమ◆స్తే దశరథ
తనయ నమ స్తేర్క◆తనయావిభేదనోద్దండకోదండప్ర◆చండవిక్ర
మకర్మోదగ్ర న◆మస్తే బలానుసంభవ నమస్తే బుద్ధ ◆ భవ్యరూప
తే. గీ. ధర నమస్తే కల్కివేష ◆ సురసురారి, శక్రిముఖదిక్పతిపయోజ◆జాతరుద్ర
సిద్ధసాధ్యాదినుత నమ◆స్తే యటంచు, వివిధవిష్ణుస్థలములు సే◆వించి వేడ్క. 219

వ. తదనంతరంబ శ్రీశైల ఝల్లి చక్రేశ్వర మూకాంబికా కోటీశ్వర గోకర్ణ కేదార
హాటకేశ్వర జంబుకేశ్వర బ్రహ్మేశ్వర పుండరీక పంచనదేశ్వ రారుణాద్రీశ్వర జటానాథ వైద్య
నాథ విశ్వనాథ గౌరీనాథ రామేశ్వర శంకర నారాయణ సుబ్రహ్మణ్యస్థలాద్యనేశ్వరులగు నీశ్వరు
లను సేవించి వెండియు మహీమండలిం గల పుణ్యస్థలవిశేషంబులం జూచుచు సంచరించు 220
నయ్యవసరంబున.

శా. సర్వద్వీపవతీప్రపూరితపయ◆స్సంబద్ధధారాధరా
ఖర్వధ్వానభయోత్పతిష్ణుబిసభు◆గ్రాజ్యాద్యకూర్మాదికం
బుర్వీంద్రాయుధపాతభగ్నకుబిల◆ప్రాయాహతక్షరద్వాఃపత
త్పర్వశ్మక్షుభితాహిలోక మగుచున్ ◆ దర్పించె వర్షం బిలన్. 221

సీ. నెళనెళధ్వనులతో ◆ ఫెళఫెళారను గర్జితములు కర్ణ(క్షో)భ◆ధాటి మెఱయ
ధళధళద్యుతులతో ◆ మిలమిల గ్గలమించు లక్షిబతాంధత్వ ◆ మడఁచుచుండ

ఘుళఘుళార్భటులతో ♦ ఫళఫళా రనువాన ధార్తరాష్ట్రిలకు మ♦హార్తి నింపఁ
జిటచిటారవముతోఁ ♦ దటతటల్ వడగండ్లు యువరాజముఖ్యుల ♦ నొదుగఁ జేయ
తే. గీ. విజయవిఖ్యాతి నమ్మహా♦వృష్టిసమయ, మమరవరధర్మవిలసనం ♦ బనిలజాత
ఖేలనము కృష్ణఘనయుక్తి ♦ చాలఁ గలిగి, యవనిజనములు వినుతింప ♦ నతిశయించె. 222
కం. ఆమెడ సఖు లొకఁ డొక్కఁడు, కూయిడి జతగూడ కెడసి ♦ గునుకుపరువులం
బోయిరి చెంగటియూరుల, కాయూరవ్యుఁడు హిరణ్యుఁ ♦ డ ట్లతిగతితోన్. 223
తే. గీ. వడఁకు చట భద్రసేన యా♦వాసమునకుఁ, బోయి నేను బ్రవాసి నో♦పుణ్యురాల
తడిసితిని వర్షధారలఁ ♦ దాళఁజాల, నేర్పెఱుఁగ నిందు తావిమ్ము ♦ నిద్రఁ జెంద. 224
కం. అని వేఁడిన వైదేశికు, ఘనకరుణాదృష్టిఁ జూచి ♦ కామిని పఱుకొ
మ్మని ముంగలిచావిడిఁ జూపిన హా లక్ష్మి యటంచుఁ ♦ బేర్కొని యచటన్. 225
చ. తడిసినవస్త్రము ల్విడిచి ♦ తాళ్ళపయి న్వైన నాఱవేసి యో
పడఁతుక నీదు పెద్దలకుఁ ♦ బల్కఁగ శక్యముగానిపుణ్యు మ
య్యెడు నిట కగ్నిఁ దెచ్చి సెగ ♦ యించుకచూపు మటంచు వేఁడఁగాఁ
దొడిపడ నట్లొనర్చి యల♦తొయ్యలి యాతనిరూపసంపదల్. 226
తే. గీ. మంటవెలుఁగున వేమాఱు ♦ మనసు మాఱఁ, దళుకు తెలివాలుగన్నులు ♦ బెళుకఁజూచి
యెప్పు డేగ్రామ మెందుండి ♦ యేమి పనికి, నెచటి కేఁగెదు నీదు పే♦రేమి చెపుమ. 227
కం. అనినసఖి కనియె నుండుదు, ననిశంబు కిరాతదేశ♦మందు హిరణ్యుం
డనఁ దగుఁ దనపేరిలఁ బుణ్యనదీనిధులెల్లఁ జూచి ♦ యరిగెదఁ బురికిన్. 228
చ. అనివచియించు తైర్థికున ♦ కావనజాయతపత్రనేత్రి యి
ట్లను నవయౌవనంబున ర♦తాస్థఁ దొలఁగి కులాబ్జగంధిపైఁ
గనికర మింతలేక తిరు♦గ న్మనసొగ్గె నఁటోయి నీకు నా
విని నిజమౌను నీపలుకు ♦ వే యన నేల వివాహహీనుఁడన్. 229
తే. గీ. ఆలి కే నంగలార్చుచు ♦ నన్యసతులఁ, జూచి గుక్కిళ్లుమ్రింగుచు ♦ సుఖము లేని
కతన యాత్రఁ జరించెడి ♦ కతయెకాని, మనసు సంభోగవాంఛల ♦ మమతఁ దిరుగు. 230
చ. అనుపరదేశికుం గని మ♦హాదరణంబున లేచి కౌఁగిటన్
నునుజిగిగబ్బిసిబ్బెపుఁజ♦నుంగవ నాఁటనుజేర్చి మోహముల్
జినుకఁగ మోవి నొక్కి మరు♦చివ్వకుఁ దార్చిన వాఁడు పేర్చుచుం
డినతమిచేతఁ దద్రతికి ♦ శీవి సమున్ముఖుఁడై ముదంబునన్. 231
తే. గీ. గుబ్బపొంబనఁటుల యూఁతఁగొని మనోజ, కేళికావార్ధిలోపల ♦ నోలలాడు
చుండె నవ్వేళ దానినా♦థుండు వచ్చి, యెవరు వారని ఘర్జించి ♦ హెచ్చరించె. 232

కం. ఆసమయంబున నెటువలె, భాసురమతిఁ బొంకవలయుఁ ♦ బలుకంగఁ గదే
యోసుదతీ యని యడిగిన, నాసతి యిది తెలియ ననుచు ♦ నటుమొగ మయినన్. 233

తే. గీ. హంస హేమావతికి నిట్టు♦లనియె వేడ్కఁ, దెలియకుండిన నేమాయెఁ ♦ దెలిసికొనుము
వింటివా పతి ఘుర్ఘింప ♦ విటుఁడు వడఁక, వెఱపకు మటంచుఁ జెలి వాని ♦ వెన్నుఁ జఱచి. 234

ఉ. కీలెలుఁగుఱ్ఱ ఘటించి పరి♦కింపఁగ పందుకయుండి పల్కె యా
త్రాలసదుర్విచారులము ♦ రాత్రిజనించిన నేఁడు తావకీ
నాలయమందు మే మిదె సు♦ఖాప్తి ని సుప్తి యొనర్చి రే పుషః
కాలమునందుఁబోయెదము ♦ కారుణికోత్తమ యుండనీయవే. 235

తే. గీ. అనిన మంచిది యని లోని♦కరిగె నాథుఁ, డరిగినది చూచి సఖి లేచి ♦ యంతలోన
బంటుతో నీళ్లు పట్టుక ♦ యింటిలోకిఁ, బోయి యేడుంటి పీనరి♦ప్రొద్దుదనుక. 236

కం. ఒక్కతనె గ్రుక్కుమిక్కని, దిక్కెడసినరీతి నుండ ♦ తెరువరు లెవరో
యిక్కడికిఁ బండవచ్చిన, నక్కట ప్రాణములనుంటి ♦ నధిపా యనినన్. 237

ఆ. వె. నిండినింటిలోన ♦ నీకేల భీతిల్ల, గోల యూరఁబ్రొద్దు ♦ గ్రుంకలే ద
టంచుఁ గౌఁగిలించి ♦ యనుమాన మొందక, యోర్పుతో సుఖాప్తి♦నుండెఁ జెలియ. 238

శా. ఆలీలన్ వెస బొంక నేర్చిన ధరా♦ధ్యక్షైకచూడామణీ
కేళీసంభ్రమజృంభమాణసురత♦క్రీడాచమత్కారచ
ర్యాలాలిత్యకథాప్రయత్నమున క♦త్యాసక్తితోఁ బొమ్ము తే
దా లోలాంబక యూరకుండు మని కా♦దంబేంద్రుఁ డిట్లాడఁగన్. 239

చ. తెలతెలవాఱవచ్చుట స♦తీమణి యప్పుడు చూచి కేళికా
నిలయముఁ జేర నేఁగి ధర♦ణీధవుపైఁ దమిమీఱ నుండె నా
చెలి యనుచుం బురోహితుఁడు ♦ సెప్పిన నాత్మ జనించు వేడ్క నా
నలనరపాలమౌళి తద♦నంతరగాథ వచింపుమా యనన్. 240

శా. రక్షశ్శిక్షకపక్షయక్షయన్నృహా♦ర్యక్షాసదాక్షేమకృ
ద్వీక్షారక్షితశుభ్రపక్షహయవా♦ర్ధిక్ష్మాక్షమాధాత్రిస
ద్దాక్షాయణ్యనలాక్షరాక్షసజలా♦ధ్యక్షాగ్ని వాయుక్షపా
ధ్యక్షక్ష్మార్భకపద్మరక్షకరమా♦ధ్యక్షారవిందేక్షణా. 241

పాదభ్రమకకందము. రామానుతతనుమారా
ధీమదవనధీరసార♦ధీనవదమధీ

తామసజయయజసమతా
నామగతామనయతతయ♦నమతాగమనా. 242

మణిగణనికరము. హరిహయహరిణభృ♦దవయవభరణా
హరిహయహరిణభృ♦దవనవితరణా
నరవరదవిగమ♦వ వినుతచరణా
నరవరదవిగమ♦న విమలకిరణా. 243

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్యనిస్తంద్ర శ్రీరామనామ
పారాయణనారాయణామాత్యప్రణీతం బైనహంసవింశతి
యను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.



# హంసవింశతి.



## పంచమాశ్వాసము.



శ్రీధర ధరధర వర ధా
రాధరనిభవర్ణ సమద♦రావణమకుట
1క్ష్మాధరధరహార విబుధా
రాధిత కరుణాభిరామ ♦ 2రఘుకులరామా.

వ. అవధరింపుము నలరాజన్యునకుఁ బ్రిత్యుత్పన్నమతి యిట్లనియె నట్లు ప్రభాతంబు గావచ్చిన నిజమందిరంబు చేరి మఱునాఁడు దినాంతం బయినయనంతరంబ హేమావతీకాంత యత్యంతసంతోషంబున. 2

సీ. నిటలాధరీకృత♦స్ఫుటచంద్రికళలీల నెలవంకనామంబు ♦ నీటు గులుక
మరుదాప్తి నెఱయు ప♦ద్మరజంబువలె వక్త్రతలమున ఘనసార♦తిలక మమర
నంతస్తన్నపవిర♦హాగ్ని పైఁ బర్విన గతి గుబ్బ కుంకుమ♦కలప మమరఁ
జిగిరించి పూచిన ♦ చిన్నారిలతరీతిఁ జిత్రపటావృత♦గాత్ర మమరఁ
తే. గీ. గనకసుమదామఘుమఘుమ♦కల్కచమునందుఁ, గంబురాపూఁతభుగభుగ♦ల్గళమునందు
నంద మొందంగ వాసింప ♦ హంసయున్న, నెలవునకుఁ జేరె సాత్రాని♦యులరుఁబోఁడి. 3
తే. గీ. చేరినప్పుడు కలహంస♦శేఖరుండు, తివిరి హేమావతీకాంత♦దిక్కుఁ జూచి
వేడుకలరంగ నొకగాథ ♦ వింటివేని, చెప్పెద నటన్న మంచిది ♦ చెప్పు మనిన. 4

వ. హేమావతికి హంసరాజం బిట్లనియె. 5

### పదునేడవరాత్రికథ.

కం. పరఁగు నొకపురము రత్నా,భరణం బనఁ దరణికిరణ♦పటలీసంరో
4ధ్యురుసౌందర్యస్థిరకో, త్కరచిత్రపటాంశుచిత్ర♦తద్యుతలం బై. 6

---

పా. 1. క్ష్మాధరచరశర పా. 2. రఘుకులసోమా. పా. 3. ల్కబరియందుఁ, పా. 4. ధ్యురుసౌధస్థితకేతూ,

తే. గీ. తనయుఁ డగురాజు ఘనమార్గ♦మునను రాఁగఁ, గోట యాత్రోవ నరికట్టు♦కొన్న సుద్ది
వినిజలధి దానిచుట్టును ♦ విడిసె ననఁగ, నారసాతలనిమ్న ఖే♦యంబు దనరు. 7

ఉ. అందొకకుంభకారకమ♦హాన్వయమండలదుగ్ధవార్ధిపూ
ర్ణేందుఁడు చక్రిదాసుఁడన ♦ నెన్నిక కెక్కిన పేరుఁగల్గి చె
న్నొంది మనోహరాంగరుచి♦రాకృతిసంపదచేత నిందిరా
నందనుఁడే యితండగు న♦నందగఁ గాఁపురముండు నెప్పుడున్. 8

ఆ. వె. సలుప కడవరాయి ♦ సారె కళాసంబు, కట్టె యినుము జల్లి♦కడవ ముల్లు
మంటిగుంత గుబ్బి♦మ్రాను నావంబును, మన్ను మోయుపోఁతు ♦ మలసియుండు. 9

సీ. ఆదివరాహంబు ♦ మేదిని నెత్తినమాడ్కిఁ జొప్పడఁగఁ దా ♦ మన్ను మోయుఁ
బ్రథమవేళలసృష్టి ♦ బ్రహ్మచేసినయట్లు ఘటసృష్టి యుత్సాహ♦గరిమఁ జేయు
విష్ణువు చక్రంబు ♦ వేడుకఁ ద్రిప్పెడుచాడ్పునఁ బలుమారు ♦ సారెఁ ద్రిప్పు
బయలిపురంబులు ♦ భర్గుండు గాల్చినయడరు సూవట్ట నా♦వంబుఁ గాల్చుఁ

తే. గీ. గపివరుఁడు పర్వతంబులు ♦ గమిచి తెచ్చి, కుప్పలిడురీతిఁ గుండలు ♦ కుప్పవెట్టు
నవి దివియు ధాత కాండంబు ♦ లడఁచు కరణి, సాధుపథవర్తి ఘటకార♦చక్రవర్తి. 10

తే. గీ. కాఁగు మజ్జలముంతయుఁ ♦ గడవ గూన, బాన పెనల బుడిగి పంటి ♦ పరపుచట్టి
కడవ ముంత [1]గరిగెదుత్త ♦ పిడత గురిగి, కుందెనటికయు మూఁకుడు ♦ బిందె పంతె. 11

చ. చెవులపెనంబు గోలమును ♦ జిల్లులసిబ్బియు దోనితొట్టియుం
గువిచిలుమాతమూలమును ♦ గుమ్మెత మజ్జనధూపపాత్రియుఁ
సవరని బూజపొందొనయు ♦ సానికెసిద్దె కమండలంబు లే
దొవదొవకంబినుత్త గెర♦దుబ్బయుఁ గప్పెరపంటు లాదిగన్. 12

తే. గీ. [2]తీర్చుపూదెలు కదుకులు ♦ తేటగొట్లు, గెరలమురువులు వడితట్లు ♦ కిరుదుకట్లు
బొద్దుటీనెలు నునుపులు ♦ మొదలుగాఁగ, బనులు నిర్మించుఁ గుండల♦పై నతండు. 13

సీ. దేవకార్యములకుఁ ♦ దిరునాళ్ళకును మహోత్సవములకును గంగ♦జాతరలకు
సంప్రోక్షణములకు ♦ జన్నములకుఁ బెండ్లి వడుగు నోములకును ♦ వ్రతములకును
సత్రంబులకు స్వాహ♦స్తంబులకును సమారాధనపితృకార్య♦యూధములకుఁ
బండుగులకు నాల♦పబ్బంబులకు బొంగలికిని దేవలకు గొ♦బ్బికిని యడకు

తే. గీ. జంగమార్చనలకును దా♦సళ్ళభోజనములకును దండు వెట్టికి ♦ నగరివారి
[3]కొండబక్కలకును భిక్షు♦కులకు నైనఁ, గొఱఁతవడకుండఁ గుండ లా♦కుమ్మరిచ్చు. 14

---

పా. 1. కడిగెదుత్త పా. 2. తీర్చుపూజలు కుడుములు ♦ త్రేటగోట్లు, గెరలమురువులు పడితట్లు ♦ కిరుదుకట్లు
పా. 3. ప్రాపుఁ గలిగినవారికి ♦ బక్కలకును, గొదువ వడకుండఁ

కం. ఒకపాటికలిమిచేతను, గకవికపడ కప్పలేక ♦ కబళాభరణాం
శుకముల గరగరికల నిం,చుక తక్కువగాక నతఁడు ♦ సుఖమున నుండున్. 15

కం. ఆతని కొక్కకులాంగన, శీతాంశునిభాస్య రూప♦సేనాఖ్యను వి
ఖ్యాతిని వెలయును గంతుని,చేతిజగాబాఁ కనంగ ♦ జిగిబిగివగతోన్. 16

ఆ. వె. ఘనము ఘనముకన్నఁ ♦ గచనైల్యవిస్ఫూర్తి, మెఱుఁగు మెఱుఁగుకన్న ♦ మేనిచాయ
విపుల విపులకన్న ♦ నుపమింపఁ గటితటి, దాని కెనయె భూమి♦లోనిసతులు. 17

ఉ. పోఁకలరీతి నొంది, మెఱు♦పు ల్గొని, మిట్టలు గట్టి, పైమొనల్
జోకఁగఁ దీరి, తాళముల♦చొప్పునఁ గన్పడి, చెండ్లపై ఖరిక్
దీకొని యొప్పి, గిండ్ల వగి♦దిం గొమరొంది పసిండికుండలై
పీఁకను దండనిండి యలి♦వేణికుచంబులు పొల్చు నెంతయున్. 18

ఉ. పంచశరాహితుండికుఁడు ♦ భామిని పొక్కిలిపెట్టెలోనఁ దా
నుంచినకాలసర్పము స♦మున్నతి నాడఁగ లేవమీఁట బు
స్సంచుఫణాగ్రి మెత్తి యల♦రారెడుచాడ్పున రోమరాజి య
భ్యంచితలీల మించి మది ♦ హర్షముఁ జేయు జనాళి కెప్పుడున్. 19

సీ. చంద్రభాగనిరూఢి ♦ సతిమోము రాణించు నెఱిగొప్పు కృష్ణవే♦ణిగతిఁ గాంచు
నువిదవాల్గనుదోయి ♦ యుత్పలావళి నొంచు సకియ పల్కులు సర♦స్వతిని మించు
శంఖవర్ణనిరూఢి ♦ సతిగళంబు జయించు నవ్వులు క్షీరసుం♦దరత నించు
స్తనములుతుంగభ♦ద్రి సులీలదర్పించు నారు నీలాకృతి ♦ నందగించు

తే. గీ. జఘనము విశాలహేలల ♦ సంభ్రమించుఁ, బదయుగము పల్లవాకార ♦ మద మడంచు
నడలు హంసావళిఖ్యాతిఁ ♦ గడువహించు, నంగము హిరణ్యకళలతో ♦ నతిశయించు. 20

కం. తమ్ములు చెలికరములు కుం,దమ్ములు పలువరుస పర్వ♦తమ్ముల బలుచం
దమ్ములు చన్నులు తొవలం,దమ్ములు కను లలక లంబు♦దమ్ములు పొగడన్. 21

చ. హరివరకాంచనాబ్జకమ♦లాళిఘనాకృతు లందు కెంతయ
బ్బురము పటూక్తి నాస గళ♦ముం గరముల్ కుచయుగ్మ మంచు న
త్తెఱవ సుమధ్యదేహముఖ♦దృక్కుటిలాలకకేశపాశముల్
హరివరకాంచనాబ్జకమ♦లాళిఘనాకృతు లందు నిచ్చలున్. 22

ఉ. దానిమిటారిసోయగపు ♦ దట్టపుమోహపుటోరచూపు ని
ద్దా నిగరంపుసొంపువగఁ ♦ దాల్చినచాయలరాయిడించు ఖం
డా నెరసోఁకుతాఁకుల మ♦నంబు గలంగఁగ మోహిగాని య
మ్మానవుఁ డెందు లేఁడు విను♦మా యనుమానము మాని మానినీ. 23

చ. అది నెఱ ప్రాయపుఁ జొగసు♦దాట నొకానొకచైన గర్భమిం
పొదవని దాట నింటియెను♦బోఁతునకంటె మదంబు హెచ్చి న
మ్మది పరసంగమంబునకు ♦ మార్కొని పొక్కుఁగ జారవీరులన్
వదలక చూచుచుండఁ దల♦వాఁకిలి గాఁపుర మయ్యె దానికిన్. 24

కం. చిటిపొటిసొమ్ములు వెట్టుక, పుటపుటగా వీథివెంటఁ ♦ బొరుగిండ్లఁబడిన్
విటులనిమిత్తము మట్టెలు, చిటుకుచిటు క్కనఁగఁ దిరుగు ♦ సిస్తుగ వగతోన్. 25

సీ. జేజేలరారాల♦జిగిఁ గ్రాలు నిడువాలుకురులు వేమఱు దువ్వి ♦ కొప్పు బెట్టి
బలువాలుగలనేలు ♦ తెలిడాలు గలమేలుకనులరేఖలుదీర్చి ♦ గజ్జలంబు
కపురంపురుచిపెంపు ♦ కడునింపుఁదులకింపు పెదవి కెంపెక్కఁగ ♦ విడెము సేయు
వలిసిబ్బెముల గుబ్బ♦తిలునిబ్బరపుగుబ్బచనులఁ బూయును మంచి♦చందనంబు
తే. గీ. మంగళాభంగరంగ ద్ర♦భాంగవృత్త, ఘనజఘనసీమ నవరించుఁ ♦ గలువచెలువు
[1]నలువమరు చెల్వొజినుఁగు దు♦వ్వలువ మెఱయఁ, జిత్తజునిదాడి కుమ్మర♦చిగురుఁబోఁడి.

సీ. తరితీపునగలు బి♦త్తరపుఁజూపులు మోవి విఱుపులు సొలపులు ♦ వింతమాట
లుదుటుచొకాటంపు♦టొయ్యారిచేష్టలు సోబానపాటలు ♦ సొగసుగుల్కు
పొగరువికావిక♦నగవులు బెళకించు కనుసన్న [2]నేర్పులు ♦ కలికికతలు
సామెతల్చిన్నెలు ♦ జాణతనంబులు తెచ్చికోల్మరువులు ♦ తేటపడని
తే. గీ. జంకెనలు ఱొమ్ముతాటింపు♦సాహసములు, పచ్చి తేరఁగఁ బల్కుడి ♦ ముచ్చటలును
విటులఁ గనుగొన్నవేళల ♦ విస్తరించు, రూఢి మించిన తమితోన ♦ రూపసేన. 27

కం. ఈలాగునఁ జెలి పల్లవ, జాలచకోరములకెల్లఁ ♦ జంద్రికయనఁగాఁ
జాలి విహరించుచుండెడు, కాలంబున నొక్కనాఁటి ♦ కడయామమునన్. 28

మ. పరఁగం గూలినయిండ్లు ద్రెళ్లు గరిసెల్ ♦ పల్లేరు లుమ్మెత్తలుం
జిఱుతెంకుల్ చిగిరింతలున్ గునుకులున్ ♦ జిల్లేడులున్ మూషకో
త్కరముల్ దున్నినపొట్టుదిబ్బలును న♦క్కల్ పందికొక్కుల్ దరు
ల్దొరుఁగం బూడినపాతరల్ పడినగు♦ళ్లున్ గల్గు పాడూరిలోన్. 29

ఉ. లాఁడెకు మూఁగుకాకులప♦లాయన మొందఁగఁ జేయ వీఁపుపై
ద్రాడునవ్రేలు నీఁకె గుది♦తారినదేహము పీడి కాళ్లకున్
లోడి నశించుతోఁక బలు♦తోమము లైతగు జోటీగలున్
గూడిన బంధముం గలిగి ♦ కూర్కుచునుం డొకబక్కగుఱ్ఱమున్. 30

పా. 1. నలువలరు చల్వజిలుగు దు♦వ్వలువ మెలఁగు   పా. 2. చేష్టలు

తే. గీ. మందగుది రెప్పగొరిసెలు ♦ మక్కిగొండ్లు, బరతుమురుకొమ్ములును మోటు♦బర్లు తడక
వాటు తెరడొక్క మిడితోఁక ♦ వేటుగాళ్లు, నేరుబాసిన యొకబీద♦యెద్దుఁ జేరి. 31

వ. అందు వసియించి యున్నసమయంబున. 32

చ. వలుపగు తూఁకిచేవన గ♦నంబడుకొమ్ములు వింత చింతని
ప్పలసరివచ్చు కన్నుఁగవ ♦ పోసరపు స్మెడ ముద్దవక్కలం
డెలుపులురాలు లావుపొల♦తిం దగుపాదము లుక్కుపోత సం
ధిలినవిధాన నుండు బలు♦దేహము గల్గెనుబోఁతు వచ్చుటల్. 33

ఉ. చేరి శుభంబె ఘోటకమ ♦ శ్రేయమటే వృషభంబ మీర లీ
తీరున డస్సియుండుకథఁ ♦ దెల్పుఁ డటం చెనుబోఁతు వేఁడ వే
సారక విన్ము చెప్పెదను ♦ సైరిభవర్య మదీయగాథ యం
చారని యార్తిఁ గుర్రింకుచు వృ♦షాగ్రణి పోఁతును జూచి యిట్లనున్. 34

సీ. తలయేరుఁ బెట్టి బీ♦ఁడులు దున్ని పడఁగొట్టి గాలుచిక్కనబండ్లఁ ♦ గట్టి మొత్తి
పొలముకాండ్లకుఁ బుచ్చి ♦ తలదిమ్ము బట్టించి పట్టుడుకపిలల♦పదను జెఱచి
పాపడమ్ములఁ జిక్కు♦పఱచి రెండేసి గొఱ్ఱులకాడి నమరిచి ♦ రొష్టుచేసి
బలుగుంటకలచేలు ♦ పాయుచో సాగని 1తావులసెలకోలఁ ♦ దాఁక మొత్తి

తే. గీ. గానుగలఁ ద్రిప్పి సరువళ్ల ♦ గలఁచి బండి, దండిబరువెత్తి యురికింతఁ ♦ దరిమి మొదలు
2గళ్ళిపడి రెండుదుక్కులు ♦ వెళదున్ని, యఱ్ఱు గడగి పోఁదోల ని♦ల్లైతి సుమ్మి. 35

కం. అనవిని తలద్రిప్పెనుబోఁ,తనియె మహోక్షంబ కష్ట ♦ మనుభవ మయ్యెన్
వనజభవువ్రాఁతఁ గడువను, మనతరమా యనుచు వగచి ♦ మహిషము హారితోన్. 36

సీ. తెగుబొల్లి విషపది ♦ తీసిక ట్టగనెమ చ్చగ్నిబావురసాలు ♦ నధికదంతి
బూడిదెముక్కలు ♦ పీడికాళ్లును బొల్లుగంటురోమంబులు ♦ కాకనంబు
వరపారి విషనిధి ♦ వరబొల్లు సర్పి కోకావర్తకము కంద♦కప్పు పట్టె
డసుడి పింగళియు పిం♦డావర్తకంబు నెదావర్తకము దీర్ఘ♦దంతి దీర్ఘ

తే. గీ. వాలమును పొట్టసుడి గళా♦వర్తకంబు, వాలుచెవులును మఱి భుజా♦వర్తకంబు
పూతసుడి తోఁకసుడి దివా♦జాతమాది,యైన దోషంబు లావంత♦యైన లేక. 37

కం. జరదా కొమ్మెత మునకే, కరెడ ననాయుజు సురంగు ♦ కల్యాణ నునే
రరుక బిలక శ్రీవృక్షకి, హరి బోరును నీలలను హ♦యంబులలోనన్. 38

తే. గీ. నీవు హరిరీతి గంధర్వ♦నిచయమెల్లఁ, గొలువ యాదేవమణిచక్ర♦ములు వహించి
విబుధుల భరింపుచుండెడు ♦ విధమదెల్లఁ, దొలఁగి చిక్కితి విటులేల ♦ తెలుపు మనిన. 39

---

పా. 1. తొవులపరివేసి ♦ దర్పఱుడఁచి   పా. 2. గుళ్లపది

వ. తురంగంబు మహిమంబున కిట్లనియె. 40

కం. ఆనాఁటి కటులనుండితి, నీనాఁటికి నిటుల నయితి ♦ నేమందు నయో
లేనాఁటి మేనిసత్తువ, లేనాఁటికిఁగలవె విను చ♦లించినవిధమున్. 41

సీ. ప్రేమ నెదుర్కొలు♦పెండ్లివారల కిచ్చి తెవులైనవారి క♦ద్దెలకు నిచ్చి
మేయఁ బోయినచోట ♦ మెడవెండ్రుకలు వట్టి యాతతాయులును వ♦య్యాళిఁ దోలి
అమర గృహప్రవే♦శమువారి కొప్పించి 1సంత సారికెలంచు ♦ చాలనోంచి
పల్లెపట్రిలనుంచి ♦ బర్వు వేసుకవచ్చి వలపలచే కంట్ల♦ముల ఘటించి

తే. గీ. తీరకున్నట్టిపేదసం♦సారమునకుఁ, గసవు కట్టెల లద్దుల ♦ గాసిపఱచి
లావు సత్తువ చెడఁగొట్టి ♦ లాఁడె పోవఁ,జేసి పోఁదోల నిటకు వి♦చ్చేసినాను. 42

చ. కొఱవము చెడ్డయొట్టు చలి♦గొట్టినచో కవణంబు కల్ల మే
నఱసిదువారమూర జల♦మార్చుట యెన్నఁడు కానివావి యే
తఱిఁ గలలోనను బడెదు♦దాణ యెఱుంగను బేడదంట్లుముం
దఱఁ బడవేసి యెడ్ల కడ ♦ దామెనత్రాడునఁ గాలుగట్టినన్. 43

తే. గీ. ఎడ్లు పోట్లాడి కొమ్ముల ♦ నెత్తివేయు, గేదె లోకదిక్కు సెలఁగంగఁ ♦ గ్రోపుదూడ
లాస్థఁ దన్నంగ నమ్మహా♦వస్థచేత, గుజ్జమై పుట్టియును గోను♦కుడువవలసె. 44

సీ. పిల్లపీచర నక్క♦పి ట్టెల్కచెవి గొఱ్ఱెపాలలంబును మేఁక♦పాలలంబు
బుడ్డకాచర యుట్ల♦బొద్ది దొంతరలంబు మాడుపుగురుగును ♦ మదనకట్టె
నూనెముంతలమును ♦ నానఁబ్రాలలమును గొండగురుగు పాల♦పెండలంబు
పొర్లుగాడియు నల్ల♦పూలల మినక చెంచలి కందికారియు ♦ గిలకలంబు

తే. గీ. చన్న చేర్లెద్దు మట్టెకు ♦ వెన్నవెదురు, లంజెనవరము వెఱ్ఱిపూ♦లలము చిట్ల
బొట్లలము గోళ్లలము బొల్లి♦కట్లలంబు, నల్లతీగాదియలములు ♦ నళ్లివిడిచి. 45

తే. గీ. కనవపులు వీడి గోరిగె ♦ కాకివెదురు, దర్భ చిగిరింత గరికెమో♦దంబు జమ్మ
2పెద్దజ మ్మూదరయు తుంగ ♦ పెద్దతుంగ, భోగవతి నక్కతోఁకయు ♦ పోనవిడిచి. 46

సీ. కాచిగోగడ నేండ్ర♦కారె బూడెదతోలకాచి పందెడగోళ్ల ♦ గడ్డియూబ
ముల్లూపచెంగాయ ♦ మల్లియకరివేల యఱగొయ్య వెణుతురు ♦ మెఱుఁగుగడ్డి
గంపడొల్లక కొమ్ము♦కాయ పొత్తరముల్లు వటిరింత కదురు కా♦ర్వాకు చిప్రి
కందురు బూతరా♦కాసి పిచ్చుకబియ్య మశ్మరి వెర్లి చే♦మర్లు గునుకు

పా. 1. సంత సారికెలందు ♦ స్వారి వెడలి పా. 2. జంబు నూదరతుంగ పెఱ♦జంబు పెద్దతుంగ భోజ
వతీ నక్క♦తోఁక విడిచి.

తే. గీ. చీమచిప్పర చిప్పర ♦ చేఁతిబోద, యుల్లగడ్డుల్లచిప్పర ♦ యూటు కనవు
పొలికి పొనుకెడ కుందేటి♦పొఱుజు గరక, పరికి సాల్వాము సొంపెకుం♦దురు గరిమిడి. 47

వ. మఱియును. 48

తే. గీ. పీరితోఁణంగి తొండును ♦ మారుపెల్లి, తొప్ప రంటెఱింత యెద్దుకొ ♦ మ్ముప్పగడ్డి
పుల్ల పూరూచయును బూద ♦ పూలగడ్డి, కదురు తుంగాకు తుంగలు ♦ గలయ విడిచి.

ఉ. చిక్కులమారి యాబలిజ♦సెట్టి వయాళులమెట్టి బర్వులక
సుక్కడలంగఁ గొట్టి తన♦సుందరిచేతికి గడ్డికోసమై
చెక్కుడుపార యీయ బడి♦సే టది నిచ్చలుకోడెకాండ్రపైఁ
బ్రిక్కలవ్రాలి సోలి నగు♦బాటున కక్కక సంజచీఁకటిన్. 50

తే. గీ. తానఫరువాండ్రు లద్దితోఁ ♦ దగలఁదీసి, దిబ్బలను ద్రవేయు చెడుగత్తు ♦గబ్బుగడ్డి
గంపలో వేసికొనివచ్చి ♦ చంపఁజాలు, పూనికను గ్రమ్ముకొని నామొ♦గాన వైచు. 51

కం. విను మాపెచర్య కినుమడిఁ, గొనకొని కావించు దాని♦కోడలినడతల్
కను కని వేసారితి హెచ్చెను బాపపుఁగాల మనుచుఁ ♦ జెప్పెదువేళన్. 52

సీ. చండవేగోద్ధభూ♦మండలధూళ్యాప్తి పంకీకృతాభ్రకూ♦లంకషాంభ
మభ్రోత్పతద్ద్రుమ♦ద్వ్యాఘాతభగ్నధాత్రీండతురద్బాహ్య♦కాండకాండ
మదిభిత్కేక్ష్యట♦వ్యగ్రభాగదాక్రకృతపోద్ధుతకుమా♦స్థకుమాజ
ముగ్రత్రిపురధీకృ♦దుగ్రత్వరోద్ధుతద్యోవీధ్యటద్ధరి♦త్యుచ్ఛిన్నతపుర

తే. గీ. ముద్ధతాబ్ధిప్రహాదప్రహోది♦నీద్ధవార్మ్మి, హుర్మ్మహుర్న్వాతినిపతద్బ♦హూరుచక్ర
వాళమద్ర్యశ్మపూరిత♦వార్ధి వీచె, భయదగతి నొక్కఁ ఝంఝా ప్ర♦భంజనంబు. 53

మ. వరుణాశాగతమారుతోద్ధుతశిలా♦వ్రాతాహతిద్రాగ్దళ
త్తరళద్యోపతనాతిభీతిభరణా♦ర్థబ్రహ్మదత్తార్జునో
త్కరమృత్ప్రస్తరముఖ్యవస్తుఘటిత♦స్తంభభ్రమాపాదిభీ
కరవాత్యోత్థధరాపరాగవలయా♦ఘంబు ల్దనర్చె న్మహిన్. 54

వ. మఱియు నవ్వాయువు శోషితసింధురాజంబును గర్ణవిస్ఫోటనంబును గావున ధనంజయపరాక్రమంబును, నష్టకబంధంబును బలాశవిజయకరంబును గావున దాశరథి ప్రతాపంబును, ఖగరాజమానభంగంబును శైలబలఘాతియుఁ గావున మహేంద్రవిక్రమంబును ననుకరించె నంత. 55

ఉ. భేకశుభప్రదం బనల♦భీమ మనేకపఘోణికాసరా
సీకశరీరతాపహ మ♦నీగతటాకనదీనదాదినీ

రాకరహర్ష కారణ మ♦హాఃపతిదీప్తినిరోధి కంధరా
లోకనహ్యాప్తభీతశిఖి♦లోకమరాళము సోన దోఁచినన్. 56

చ. జలదము నీలిచల్లడము ♦ శక్రశరాసన మొప్ప కాశధా
రలు తెలిజల్లులేగుబక♦రాజి వహించిన బూదిపూఁత ల
గ్గలపు మెఱుంగు లాయుధపు♦కాంతులు గర్జితగర్జ లొప్పఁగాఁ
దొలుకరివీరముష్టి నడఁ♦ద్రొక్కె నభస్థలవణ్యవీథికన్. 57

సీ. ఆకాశగజకుథం♦బై యొప్పు మొకమాలు కాలకువిందోత్థ♦నీలపటము
మిహిరాంగనాభంగ♦మేచకోల్లోచంబు కకుబజాజీవిక♦కంబళంబు
కమలజాండభ్రాష్ట్ర♦గతమషీవ్రాతంబు ద్యుమణిదీపోదిత♦ధూమచయము
నడిమిలోకముతేని ♦ నల్లపట్టుగుడారు ప్రకృతికస్తూరికా♦పంకచర్చ

తే. గీ. యనుచు జగముల జనములు ♦ వినుతిసేయ, నీలకాకోలకలకంఠ♦నీలకంఠ
కజ్జలవ్రజ్వాలన్నీల♦కంఠకంఠ, ఖంజరీటాభఘనఘనా♦ఘనము నెరసె. 58

మ. జగదండం బనుబ ల్పిరంగి జలభృ♦త్సంఘంపు మం దుంచి పొం
దుగ శంబం బనుగుండు వ్రేసి పటువి♦ద్యుద్వహ్నిచే భ్రాష్ట్రమం
టఁగఁ గాలం బనుయంత్రకారకుఁడు చూ♦డన్ మ్రోయు నామ్రోఁతలై
జగము ల్గంపము నొంద మ్రోసె ఘనగ♦ర్జల్ భీషణాకారతన్. 59

సీ. వనదాంజనగ్రావ♦మునఁ గనచ్ఛోణాంశువితతి దళ్కను ధాతు♦తతు లనంగ
జలదపూర్వాజాండ♦జలరాశితీరమారుతచలద్విద్రుమ♦లతిక లనఁగ
నమరులకడవినో♦దము సల్పు సమయమాంత్రికు నోర వెడ లగ్ని♦దీప్తు లనఁగ
ధారాధరవ్యాజ ♦ వారణేంద్రమదారుణేక్షణాంచలకాంతు ♦ లెసఁగె ననఁగ

తే. గీ. ఘనఘనాఘనగహనసం♦ఘాతములను, గర్జితధ్వానములు మ్రోయఁ♦గా దహించు
దావపావకకీల లం♦దంద పర్వె, ననఁగఁ దళుకొత్తెఁ జంచల ♦ లభ్రసరణి. 60

సీ. బిబిబిబిద్గరగర♦ద్భేకభీమధ్వని వివిధజంతుశ్రేణిఁ ♦ జెవుడువఱుప
ధగధగద్ఘృణిగణో♦ద్యద్దివ్యవిద్యుచ్ఛటల నిశ ల్పవలట్లు ♦ వెలుఁగుచుండఁ
బెటపెటార్భటిరణ♦చ్చటులాభ్రనిర్ఘోషముల ముజ్జగమువార ♦ లులికిపడఁగ
ఘుమఘుమారావసం♦కులకులాకులకుభృత్కుహరానిలముల ది♦క్కోటు లురుల

తే. గీ. చిటచిట యటంచు కరక లు♦త్కటత రాల, నిగనిగద్యుతి మేఘము ♦ ల్మింగి నెరయ
ఫళఫళపయఃపృషత్పరం♦పరలు గురియ, ఝోరుఝోరున దారుణా♦సార మడరె. 61

కం. పటుధాటీరటదుత్కట, పటహాలటహాకోటిరవము ♦ పాటిలినటులన్
నెటనెట ఘటఘట ఘుటఘుట, పిటపిట చటులార్భటులను ♦ బిడుగులువడియెన్. 62

వ. అప్పుడు. 63

తే. గీ. అర్జునా ఫల్గునా పార్థ ♦ హరి కిరీటి, శ్వేతవాహన బీభత్స ♦ విజయ జిష్ణు
సవ్యసాచి ధనంజయ ♦ దివ్యపతిజ, పేరులెన్నుచు నేఁగిరి ♦ భీతి జనులు. 64

వ. ఆసమయంబున. 65

సీ. గగనమండలభద్ర♦కాయమానంబున ఘనపంక్తు లను మేలు♦కట్లు కట్టి
ధరణివేదికమీఁదఁ ♦ గరకానికాయమౌక్తికముల రంగవ♦ల్లికలు దీర్చి
ఘనఘోషభేరికా♦ధ్వనులు బర్హిణగణధ్వానకాహళనినా♦దములు మ్రోయఁ
దెగనిమెఱుంగులన్ ♦ దివ్వటీలు వెలుంగ ద్విజరాజమంత్రము ♦ ల్విస్తరిల్ల
తే. గీ. వృష్టిగజరాజగామినీ♦విభుఁడు సమయ,పురుషుఁ డయ్యెడ నిమ్నగా♦పుత్రికలను
గాంచి పెంచి ప్రమోదంబు ♦ గడలుకొనఁగఁ, బరిణయమొనర్చె శరధికి ♦ భవశరధికి. 66

తే. గీ. అప్పు డవ్వానగొట్టున ♦ కళికి యులికి, పడినగోడలు నొరుగుకం♦బములుపట్లు
వదలి కూలినగోపురా♦వళులు గల్గు, పాడుగుడిలోని కెనుపోఁతు ♦ పఱచి నిలిచె. 67

కం. అంతట వర్షము నిలిచె ది,నాంతము జనియించెఁ గజ్జ♦లాభ్రితమాలా
కాంతరుచి పర్వె నెల్లెడ, సంతమసము చుక్క లమరె ♦ సత్పథవీథిన్. 68

కం. ఎనుబోఁతు నపుడు కుమ్మరి, తనయింటికి రాకయున్నఁ ♦ దత్పురినిండ్లన్
వనముల వంకల డొంకలఁ, గనుగొనుచున్ వచ్చి నిలిచి ♦ కని యచ్చోటన్. 69

ఉ. లంపులమారినదాన నిను ♦ లాచుక మాదిగవాఁడు గోయ వే
కొంపకుఁ బొమ్మటంచు మిఱు♦గుర్లు జనింపఁగఁ బండ్లు దీడి మై
కంపము పుట్టఁ జేగుదియ♦కట్టెను దిట్టుచుఁ గొట్టఁ బోఁతు బ
ల్గుంపెన నింటికై చనినఁ ♦ గుమ్మరి గాడిని గట్టెఁ గట్టినన్. 70

తే. గీ. కట్టు విడువకు మని చెప్పి ♦ కాంతతోడ, రేయి యొకరీతిఁ గడిపి యా♦రేపకడను
గుమ్మ రయ్యూరిపల్లెలఁ ♦ గుండలమ్మ, వెడలఁ దద్భార్య జారుల ♦ వెదకుచుండె. 71

ఉ. సారణనామధేయుఁ డొక ♦ సాలియవాఁడు మనోజ్ఞమూర్తి కా
శ్మీరధరిత్రినుండి యల ♦ సింధువసుంధరఁ జేరఁ బోవ నా
దారిన రాఁగ రాగమునఁ ♦ దప్పక యాతనిదిక్కు చూచి యే
యూ రెట కేఁగె దేమిపని ♦ యున్న తెఱం గెఱిఁగింపుమా యనన్. 72

తే. గీ. అతఁడు దాని నెగాదిగ ♦ నరసి చూచి, దుడ్డెగట్టిది పనిలేంది ♦ తొల్తఁ దానె
పిలిచె నిది పాట్లమారి గా♦వలె నటంచుఁ, జేరి తనపేరు పురిపేరు ♦ చెప్పినిలిచె. 73

దప్పి కిమ్మన ముది ♦ దప్పిన దా యనుఁ జెంబుదె మ్మనినఁ గు♦చంబె యనును
బెట్టు మనఁ జే♦కూఱె నా హిత మను నన్న మటన్న జ♦హాన్న మనును

నున్న మిమ్మున్నఁ గూ♦నున్నమే యనుఁ బోఁకవక్కలే దన్న గు♦ర్వాక్కై యనును
నిప్పని పలుక రా ♦ నిప్పని కనియను నాకియ్యమనిన నీ♦యాకె యనును

తే. గీ. దేహ మలసె నటన్న సం♦దేహమా య,టంచు నిక్లెపురేగి య♦మ్మించుఁబోఁడి
యతని మాటల కరమాట ♦ లాడుకొనుచుఁ, గేరి నవ్వినఁ జూచి యా♦సారణుండు. 74

కం. నెరమాటలఁ గోడిగముల, నరమాటల జాణతనము ♦ లతిచతురతలన్
బరిహాసంబుల నీసరి, బెరగాయపుసతులు లేరు ♦ బిసరుహగంధీ. 75

వ. అని పలికి యంత. 76

ఉ. కొమ్మ యవేళపొద్దు నెట♦కుం జనలేను బరుండ నింత చో
టిమ్మని పల్కరించఁ దర♦ళేక్షణ మంచి దటంచు నవ్వుచున్
రమ్మని చేరఁ బిల్చి యర♦ర మ్మొగి మూసి గడెల్ గదించి మో
దమ్మున రెట్టఁబట్టికొని ♦ దర్పకకేళికి సంభ్రమించినన్. 77

తే. గీ. అతఁడు సురతాభిలాషసం♦గతుఁడెకాన, మంచి దని సమ్మతించుక ♦ మమతతోడఁ
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుక ♦ కుచము లొత్తి, మొనసి మదనరణక్రీడఁ ♦ బెనఁగులాడ. 78

ఉ. అంతట జానిభర్త నిల♦యాంగణసీమకు వచ్చి నిల్చి య
య్యింతిని దల్పుఁ దీయు మని ♦ యెంతయు ఘూర్ణతోడఁ బిల్చినం
జింత నొకింతలేక యల ♦ చేడియ యేగతి బొంకుఁ జెప్ప మో
కాంత యటంచు నంచ యడు♦గన్ విని యాబిడ యూర్పు సంధిలన్. 79

తే. గీ. తెలియ దెటువలె బొంకునో ♦ జలజగర్భ, పీఠిరత్నమ చిక్కులు ♦ పెట్టనేల
చెప్పినను జెప్పు మిక్కథ ♦ చిత్త మలర, వినియెద నటన్న రాయంచ ♦ వెలఁది కనియె. 80

చ. అటువలె భర్త పిల్చిన భ♦యంబునఁ జారుఁడు కంప మొంద నా
కుటిలసుకుంత లయ్యెడను ♦ గొబ్బున వానిభయంబు వాపి యు
త్కటధృతి సైరిభంబు మెడఁ♦గట్టినతాడు వదల్చి దైవమా
కటకట రట్లు సంగతము♦గా నెనుబోఁతును గల్గఁ జేసితే. 81

తే. గీ. గాడిపట్టున నిల్వదు ♦ కట్టివేయఁ, దరముగా దంచు వాఁకిలి ♦ దెఱచి పోఁతు
వెడలి పొయ్యెని వాఁకిలి ♦ వేయు మనుచు, మగనితోఁ జెప్పి యాదిట్ట ♦ మమతపుట్ట. 82

తే. గీ. ఈదయానిధి వీథిలో ♦ నేఁగుచుండఁ, బిలిచి తోడ్తెచ్చితిని మెడ♦తలుగు పెట్ట
వింతమానిసిఁ గనఁ గట్టి♦వేయనీక, నురుకఁగాఁ దల్పు వేసితి♦నోయి రమణ. 83

కం. అని చెప్పి మగనిచే జా,రుని నుతిసేయించి వారి♦రుహాముఖియు విభుం
డును దొంటిరీతి నుండిరి, యని యంచ వచించునెడ ని♦శాంతం బైనన్. 84

చ. పొనపొన నిద్రిమబ్బునఁ బ్రి♦ఫుల్లసరోజదళాయతాక్షి మె
ల్లన నృపమోహతాపకర♦లంపటతాయతి నంచదెల్పఁ దా
వినినకథాచమత్కృతికి ♦ వేమరు నొదల ద్రిప్పికొంచు హా
యనుచు నిడూర్పుపుచ్చుచు న♦యారె యటంచును బోయె నింటికిన్. 85

తే. గీ. పోయి యభ్రంకషం బైన♦చాయ లొలుకు, కలువగాజాలకళుకులో♦వలు రహించు
తళుకుమగరాలగోడలు♦గల సుపాణి, మేటిక్రొమ్ముత్తియపుజాతి♦మేడలోన. 86

చ. పరపుపలంగిపోషుగల ♦ బంగరుమంచముపై వసించి భా
స్కరుఁ డుదయింప నూడిగపుఁ♦గామిని లేపఁగ నిద్రిలేచి త
త్తరకరుఁ డస్తమించుదను♦కా నొకరీతి మెలంగి చీఁకటుల్
నెరసినపిమ్మటన్ నలిన♦నేత్రి మహీపతిమీఁదికోరికన్. 87

ఉ. రాలు మరాలు వాలుసవ♦రాలు మెఱుంగులనూపురాలు వ
జ్రాలసరాలు మేటిబవ♦రాలు వరాలజిరాలు తూలుహా
రాలు తురాలు ముంగపుము♦రాలు తరాలసిరాలు నందిదో
రా లుదుటుంగరాలు జిగి♦రాలఁగ నాజవరాలు దాల్చెగిన్. 88

సీ. చీరకుచ్చులు నేలఁ ♦ జీరకుండఁగఁబట్టుకొని పార్శ్వముల సఖీ♦జనము నడువఁ
బాదుకల్మెట్టిరాఁ ♦ బదిలమం చుడిగంపుటింతులు కైదండ ♦ లిచ్చి కొలువ
మనుపుల కని చెలు ♦ ల్గునుకుపర్వుల వచ్చి మొగతెఱకట్టుతో ♦ ముచ్చటాడఁ
బొద్దున నేపను ♦ ల్పాని చేయుద మంచు బోనకత్తెలు వేగి♦రాన రాఁగఁ

తే. గీ. ద్వరితగతి నిండ్లకుఁ జనంగఁ ♦ దమకుఁ దమకు, సెలవొసఁగు మంచుఁ బాటలు ♦ సెప్ప విప్ర
యోష లేతేర నొయ్యార ♦ ముట్టిపడఁగ, వచ్చినిల్చిన రాయంచ ♦ మెచ్చి యపుడు. 89

సీ. సొగసుమిటారంబు ♦ సొంపునొయ్యారంబు నీటు జగ్గుతనంబు ♦ నేవళంబు
సొబగు నాగరికంబు ♦ చొక్కాటమునుఁ డెక్కు గరకరి కందంబు ♦ ఘనత నడత
హొయలు చక్కదనంబు ♦ నొనపరి నెరకీవి సవరణ చెలువంబు ♦ సరసరీతి
హాసు చమత్కార ♦ మారజంబును నేర్పు గంహారంబును నాయ♦కంబు వన్నె

తే. గీ. సిస్తు జిగిబిగివగ బాగు ♦ చిన్నె యొప్పు, పేరు నాణెంబు మురిపెంబు ♦ పెద్దతనము
కులుకు ప్రౌఢత్వ మభినుతి ♦ గొనబు నెళవు, నరయ నిట్లుండ వలదె హా ♦ యనుచుఁ బలికె.

వ. ఇవ్విధంబునఁ దనుమెచ్చి పలికిన రాయంచం జూచి హేమావతి యిట్లనియె. 91

కం. తురగము వృషభముతోఁ దన, తెఱఁ గెన్నుచుఁ దనకుఁ గసవు♦దేనిచెలిని ద
ద్వరనుతసతి నెంచెఁ గదా, మెఱఁగింపుము దానిచర్య ♦ లెట్టివో యనినన్. 92

ఆ. వె. అంచ మించుబోఁడి♦యాననం బీక్షించి, యడుగవలయు నిట్టు ♦ లడిగినపుడు
చెప్పకున్నఁ దనదు ♦ శేముషి యది యేల, యనుచు నిట్టు లనియె ♦ నాదరమున. 93

## ప దు నె ని మి ద వ రా త్రి క థ .

శా. శ్రీధామం బననొక్కపట్టణము ధా♦త్రిన్ మించుఁ జంచన్మణీ
సౌధస్తోమవధూముఖేందుఘృణిసం♦స్పర్శస్రవత్స్వచ్ఛతా
రాధీశాశ్మపయఃపృషచ్ఛయవిధూ♦తాకాశకూలంకషా
సాధూత్తుంగతటీమునీశ్వరతప♦స్సంజాతసంతాపమై. 94

తే. గీ. సాల మున్నతి భూర్భువ♦స్స్వర్మహర్జనస్తపస్సత్యములు ఖేయ♦నైమ్న్య మతల
వితల సుతల తలాతల♦తతి రసాతలము మహాతల [1]పాతాళ♦కము లెఱుంగు. 95

చ. [2]కనఁ బురిచుట్టుతోఁటల సు♦గంధఫలంబులు రాల వానిపైఁ
బనసలు పండి త్రెళ్లి పడు♦పాటున రొంపులు గట్ట వానిమీఁ
దనె రసదాళి వ్రీలి రస♦ధారలు నించఁగ నైనయుబ్బలిన్
జనువడిఁ బాంథు లందుఁ బడ♦ సారె హసింతురు శాలిపాలికల్. 96

కం. ఆపురమున నొకఁడుండును, గోఁపురముగ బలిజసెట్టి♦ గణదాసుఁ డనన్
దీపురముగాఁగ నయ్యల,కాపురమున ధనదుఁ డుండు♦గతిఁ గడువేడ్కన్. 97

వ. వెండియు నతండు. 98

చ. సరిపెణతోడిసజ్జ బలు♦సందిటితాయెతు లింగవస్త్రముల్
సరిగెచెఱంగుపాగ విల♦సన్మణిముద్రిక లంచుకమ్మలున్
మెఱుఁగులుగుల్కుదోవతియు♦ మిన్నగునీలపుపోఁగుజోడు బి
త్తరపువిభూతిరేఖ లఱు♦తన్ రుదురాచ్ఛలు గల్గి భాసిలున్. 99

ఉ. మోరకసీదుపట్టెముగ♦ ముల్లతలాడము జల్లు లెట్టుచిం
బోరయుఁ గంచుకుప్పెలును♦ బూజలనొల్లును బెద్దగంట సిం
గారపుసృష్టిదండ మెడ♦ గజ్జెలపేరులు నండె లొప్ప లో
దేరిన దొక్కపస్సె యొకి♦రింత మహోక్షము పొల్చు వానికిన్. 100

చ. తణగము లానుకంట్లములు♦ తండిగము ల్సలకల్ దడె ల్కుతూ
గణములు చెక్కుగుంపు లడి♦గంబులు పంజులు త్రాడుగట్లమం
కెణములు గోతము ల్నగలు♦ గంటెలు బోరము లాతనింటిలో
గణన కసంఖ్యలై వెలయుఁ♦ గంజసమానవిశాలలోచనా. 101

సీ. గూటపుఁదిరుగుళ్లు♦ కొలికిదామెనత్రాళ్లు కందలీకము కోలె♦ కదురుకోల
మరగజమున మోడి♦మెఱుఁగుగాఁ దీసిన పిల్లచుట్టలు నల్గు♦చిల్ల వల్లె

---

పా. 1. బలిసదనము   పా. 2. ఘనపురి

త్రాళ్లును బురికోళ్లు ♦ దబ్బనములు నుసిగంతలు నట్టెన♦కట్టె లసిమి
బలుపొన్ను లలరారు ♦ బగినెగూటంబులు పెనుజోగిపట్టెళ్లు ♦ పిల్లపట్టె
తే. గీ. డలును బూవులకరెడగి♦న్నెలు విభూతి,పండ్లు గంగాళమును గుసి♦గిండి పాల
మడ్డిభరణి రుద్రాక్షలు ♦ మజ్జనంపు, పాత్రముల్లు గల్గియుండుఁ ద♦ద్భవనసీమ. 102

ఉ. కామునిమేనుగాలెఁ బలుఁ♦గాకి జయంతుని రూపు గూలె నా
సోమునిసత్కళాగరిమ ♦ చూడఁగఁ జూడఁ గృశింపఁ జాలె నీ
భూమి జనించి యాక్షణమె ♦ పొల్చు వసంతుని యాకు రాలె నో
హో మఱి వీనిరీతిఁ జెలు♦వొందిరె వారని యెంతు రంగనల్. 103

చ. అతనికి నొక్కనారి గల ♦ దన్నిటమేటి మిటారి రూపునన్
రతి నిరసించు మీఱి మరు♦రాయలదిగ్జయభేరి వింతలౌ
చతురతలందుఁ గేరి ఘన♦సాహసచర్యల బల్తుటారి వా
క్తతిచెలువంపుకీరి యభి♦ధానముచేత విహారి యారయన్. 104

చ. కమలభవాలయారిగజ♦గర్వ మడంచుముఖంబు యానము
ల్గమలభవాలయారికళ♦ల న్నగుఁ గంఠము శ్రోణిబింబముల్
గమలభవాలయారిగతిఁ ♦ గైకొనుఁ గన్నులు గబ్బిగుబ్బలున్
గమలభవాలయారిఘృణిఁ ♦ గాంచుఁ గరంబులు వేణి యింతికిన్. 105

చ. ఘనము కచంబు చెంబు లన ♦ గబ్బిచనుంగవ మించుమించులన్
దనురుచి మాపు మాపు నెల♦తక్కల గెల్చుమొగంబు గంబురా
లనఁ దగుఁ బల్కు పల్కుదు ర♦యారె సుపాణులు పాణు లబ్జముల్
మనసిజునారి నారియస♦మానపుటా రలరారుఁ దీరునన్. 106

కం. ఆ లపనము శశిబింబం, బాలపనము తేనెధార ♦ లంబుదవర్ణ
శ్రీ లపనయించుఁ గబరీ, శ్రీలపణముఁ బొగడఁదరమె ♦ శేషునకైనన్. 107

ఆ. వె. కాంతకలము గళము ♦ కలముద్దరూపంబు, దరము దరము దరము ♦ దరము దరము
వాలుమీలఁ బోలు ♦ వనజాక్షికన్నులు, సార సార సార ♦ సారసములు. 108

సీ. మొన మైననఖరాన ♦ మిను కైననిటలాన జోకగుల్క విభూతి ♦ రేకమర్చు
నయ్యారె జిగిదేఱ ♦ నొయ్యార మలరారఁ బసవుతో సన్నంపుఁ ♦ బట్టెదీర్చు
నలదండ కళతండ♦ముల నిండుతనముండ సరసకుంకుమరేఖ ♦ సంఘటించు
యాచెంత కాసంత ♦ యాసంత జగజంత సొగసుగా నిడు చాఁదు♦చుక్క బొట్టు
తే. గీ. మెడను జందనచర్చ ధ♦మ్మిల్లసీమ, విచికిలంబులు గంబూర ♦ కుచములందుఁ
గప్రపువిడెంబు పుక్కిట ♦ ఘుమ్ము మనఁగ, విటుల వలపించుమరుఁడైన ♦ వెస భ్రమించు.

తే. గీ. మీఱిగడిదేరి భోగము♦వారి కేరి,జేరి చిన్నారి వగఁ గేరు ♦ వారి దారి
కోరి విటుఁ జీరి రానిచో ♦ మారుబారి, సారెవేసారి 1పొరలు వి♦హారి నారి. 110

వ. ఇత్తెఱంగున. 111

కం. పరపురుషచింత నచ్చెలి, నిరతము చరియింపఁ జాలు ♦ నిలి చభివృద్ధిం
బరఁగుచు నవమాసంబులు, బరచిన తదనంతరంబ ♦ భామామణికిన్. 112

సీ. గుడిమీఁదఁ బడురావి♦కడిలోనిచెడు గీఁగె పుణ్యనదీతీర్థ♦మునను మొసలి
కంటిలోఁ గొడవెండ్రు♦కయు రచ్చమఱ్ఱిని బొమ్మరక్కసి కాఁపు♦రమ్ము సేయు
భవనసీమను దాఁచు♦పాము కల్పకుజంబుకడ గచ్చపొద పాల♦కడలి విషము
వనమునఁ జిచ్చు ది♦వ్యౌషధికినిఁ బుప్పి బ్రతుకు బాలేయింటఁ ♦ బరశురామ

తే. గీ. హస్త ముదకాన గ్రుడ్డు స♦స్యమున మల్లె, జీవవితతిని రోగంబు ♦ చెఱకు నెన్ను
మణిని దోషంబు నృపునందు ♦ మార్దవంబు, పుట్టుచందానఁ బుట్టెను ♦ బుత్త్రుఁ డొకఁడు.

తే. గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి♦ వఱలఁ బెరిఁగి, కాఁకలనుదీఱి గడిమీఱి ♦ గట్టిపారి
రాలుఁగాయతనాన బే♦రజపుదారి, నాఱితేఱి నెరాగంట్ల♦మారి యయ్యె. 114

మ. గుణమా సెబ్రి వివేకమా నహీ మనో♦గూఢత్వమా లే సుభా
షణమూ కల్ల విచారమా తవళి వం♦శాచారమా నాస్తి మా
ర్గణముఖ్యావనశీలమా శశకశృం♦గప్రాయ మాప్తాదితో
షణమా దబ్బర సత్యమా హుళి గణిం♦చన్ వాని కద్రిస్తనీ. 115

వ. వెండియు నతండు. 116

సీసమాలిక. ఆతతాయ బిగాది ♦ యడిగుండబండఁడు మొండికట్టె గులాము ♦ మొప్పెగోవు
బోలెవా టగచాట్ల♦పోఁతు దుర్మార్గుండు బడిశవాటు గరాసు ♦ పంద లండి
కొయ్యదిప్ప ఖరాబు ♦ కోచ బందెలమారి ముండడి పాపాల♦ముద్ద ధగిడి
వోగు దూబరదిండి ♦ వోచవా టవలక్షణము బాడుగోలు వ్రా♦త్యము బజారి
పలువిత్తు పలుగాకి ♦ ప్రాడ్వాక్య ముచ్ఛిష్ట ములిపెకట్రరువంద ♦ మొలికిదిప్ప
పాపిష్ఠి బజగేడి ♦ పంచమహాపాతకి వ్యతీపాత పో♦కిళ్లమారి
దరిబేసి చెడుగొట్టు ♦ బెరికి దబాకోరు విషపాలవిత్తు చి♦ల్బిషము దగులు
బాజి హరాంకోరు ♦ వాజ వ్రిక్కలముచ్చు చీవాట్లమారి ప్రా♦చీనవిత్తు
మూసనమురికి ని♦ర్మోహి స్వామిద్రోహి దుష్టు రోఁతలమారి ♦ దోసకారి
బడిమికూళ్లకుమిత్తి ♦ పడిసె మెంగిలికాయ బడుపుగూడసగొట్టు ♦ పాడెగట్టు

పా. 1. పొరలెనా ♦ శైవనారి.

గుండెగుళ్లడము తాఁకూళ్లమారి యభాసి కడుపేర్చిత నడపీన్గు గంపదింపు
దూటదర్శన మూఁడుఁతోఁక గుంకన గుల్ల గుత్తాలగోవోడె గొరుకుబల్లి

తే. గీ. కొంకెు కనుమాళమును దూప కొంపచెఱుపు, చేరిగేడియు చెరపనచేట రోసు
బడియ దుర్బీజమును భ్రష్టు మడియ చేట,సేయ కలుముచ్చు చెడుగు సాపెనలమారి.

కం. అనుచుఁ బొరుగిరుగువారుం, దనవారుం గానివారు తక్కినవారల్
దనుఁ దిట్టఁ జేయు దుడుకులు, మనమున లజ్జింప కతఁడు మఱియు న్మఱియున్. 118

తే. గీ. వానికెనిమిదియేండ్లద్ది మేనమామ, కూఁతురినిబెండ్లిచేసినఁ గోడెవయసు
పాక ముట్టూతలూఁగెడు భార్యమీఁద, మనసు చాలించి దుర్మార్గమతి వహించి.

కం. భోగాలవారియిండ్లకుఁ, బోఁగాఁ దమిమించి యరుచిభోఁగామించెన్
బాగాలవలపు విడియపు,బాగాలవకుసుమదీప్తివలె మోహైనన్. 120

వ. ఇట్లు నిజవధూసైముఖ్యంబును, వారవనితాభిముఖ్యంబును వహించి వల్లవుండను
వాఁడు వర్తింపుచుండె నొకనాఁడు. 121

సీ. రంభ ఘృతాచి యూర్వశి మణిప్రభ చిత్రరేఖ మేనక శశిరేఖ హరిణి
హేమ స్వయంప్రభ హితమోహ మోహన పుంజికస్థల రత్నపుంజ సరస
ధాన్యమాలిని తిలోత్తమ వరూధిని మంజుఘోష సౌగంధిక కుంగ తార
మణిమాలిక సుమంజ మంజరి మణిభద్ర మణిక విద్యున్మాల పదమయూర

తే. గీ. దివ్యవర్ణసువర్ణదేదీప్యమాన, రుచిరమకరందసౌదామవిచికిలాంగ
యనఁదనరు నప్సరస్త్రీలకన్న మిన్న, చెన్నలరు వారసతులహో చెన్నుఁ గలరు. 122

కం. ఆవారసతులలో సొగ,సై వారణలేనికలిమి నందలరు సుశో
భావారత మరు పసిఁడిజి,రావారణ మననొకర్తు రతిసేనాఖ్యన్. 123

సీ. కలధనమెల్లఁ బోకడఁబెట్టి సన్యాసియై బిచ్చ మెత్తని యగ్రజుండు
చేతికై దువకు నాశింపక తెగఁ బెట్టె కులశేఖరులఁ గూడుకొననిరాజు
సంచిమూల్యమునించి సడి కోర్చి త్రైవర్ణికులజంటఁ దిరుగనికోమటీఁడు
కారుకలపమొదల్ గానమ్మి సీమపై జోగులఁ గలియని శూద్రబిడ్డ

తే. గీ. లేఁడు ధరలోన రతిసేనఁ గూడిమాడి, యున్నవిటులందు రతిజెంది యున్నవేళ
నందు గనిపెట్టుకొనిపెట్టుమందుగుళిగె, మహిమ లెటువంటివో కాని మధురవాణి. 124

వ. అది మఱియును. 125

సీ. బారుడంబును శుద్ధపద్ధతి బహురూప లక్షణంబును దండలాసకంబు
పేరిణపద్ధతి పేరణపద్ధతి కుండలీనృత్తంబు భాండికంబు

---

పా. 1. బడిపోని

రాసకాఖ్యయు నాట♦రాసకంబును జిత్రపద్ధతియును దేశ్య♦పద్ధతియును
జర్చరి కందుక ♦ చాసరి కోలాటములు నాఁగఁ దగు పేర్లు ♦ గలిగినట్టి

తే. గీ. షోడశవిధనృత్తంబుల ♦ చొరవ లెఱిఁగి, సరవిఁ జంచత్పుటంబుఁ బాం♦చత్పుటంబు
ధ్రువము మఠ్యము రూపక ♦ త్రిపుట జంపె, యేకతా ళాటతాళాదు ♦ లెల్లఁదెలిసి. 126

సీ. భైరవి మాళవి ♦ బంగాళ హిందోళ రాగమంజరియు శ్రీ♦రాగ గౌళ
భూపాళ లెన్మిది ♦ పురుషరాగంబులు దేశాక్షి ఘూర్జరి ♦ దేశితోడి
దేవక్రి యాందోళి ♦ దేవగాంధారి మాయాగౌళ గుండక్రి ♦ యాహిరి లలి
త బిళావహురి కురంజి ♦ ధన్యాసి పూర్వగౌళ వరాళి నాట భ♦ల్లాతకి మల

తే. గీ. హరియు సారంగ రామక్రి♦యలు ననంగఁ, గన్నడ యనంగ మంగళ♦కౌశికనఁగ
వెలయు నారాయణానఁ జతు♦ర్వింశతీవి,ధములఁ దనరారు స్త్రీరాగ♦కములు మఱియు.

సీ. కాంభోజ కేదార♦గౌళ శోకవరాళి పున్నాగ గుమ్మకాం♦భోజి శంక
రాభరణము మేఘ♦రంజి తోడి వరాళి నాదనామక్రియ ♦ నాట రీతి
గౌళ రామక్రియ♦మేళ రామక్రియ గౌళ నారాయణ♦గౌళ మధ్య
1మావతియు ముఖారి ♦ మలహరి సామంత పంతవరాళియు ♦ బౌళి రాగ

తే. గీ. చెంచుమలహరి దేశాక్షి ♦ శ్రీవరాళి, మాళవియుఁ బొండి సింధురా♦మక్రియయు వ
సంతసామంత శుద్ధవ♦సంత గుజ్జ,రియును హెజ్జిజ్జి నీలాంబ♦రియు ననఁగ. 128

తే. గీ. పొసఁగు ముప్పదిరెండు న♦పుంసకములు, మాళవశ్రీ యనంగ కో♦మలహరి యన
దేవమలహరి కేవగు♦ప్తి యన కొండ,మలహ రన నైదుమిత్రి లీ♦మర్మ మరసి. 129

తే. గీ. షడ్జ గాంధార మధ్య మ♦ర్షభ నిషాద, పంచమ సుధైవతాఖ్య స♦ప్తస్వరములు
మంద్ర మధ్యమ తారక ♦ మహిమ లెఱిఁగి, యాడఁ బాడఁగ నేర్చు న♦య్యబలఁ జూచి.

కం. వలచి యతఁడు కడుమోహము, తలమునుకలుగాఁగ మరుని♦తామరవిరితూ
పుల కకబికలకుఁ గోల్పడి, మలయుచుఁ దానింట జాలి♦మాలం దిరుగున్. 131

వ. ఇట్లు దిరుగుచుఁ దాఁజేయుయత్నంబునఁ దన కభిమతంబు ఘటియింపం దలంపని యారతిసేనను మరులుకొల్ప నూహించి యావల్లపుండు వైద్యసహవాసం బొనర్చి యంత. 132

తే. గీ. ఇంద్రగోపంబు రోచన ♦ మెత్తులు వెలి,గారము జలభ్రమణములు ♦ నీరుగొబ్బి
విత్తనా ల్పుట్టపండు ర♦సాత్తముగను, నూరి మడుపునఁ బెట్టిన ♦ నారి వలచు. 133

సీ. నల్లేరు కణిక గం♦ధకము తేనెయునూరి లేపించి కూడిన ♦ లేమ వలచు
కరక తాండ్రి యుసిరి♦కలు కోష్టు పాలచే నూరి పట్టించిన ♦ నారి చేరు

పా. 1. మ ముఖారి సామంత ♦ మలహరి పంతవరాళి వసంతవ♦రాళి జాళి

వెలిగారమును నెఱ్ఱ♦విసెపూలు నిజతనూజలముల నూరిడ ♦ చెలియ కలియఁ
గలుగొట్టునీ రావు♦కాల్మడితో నూరి విడెములోఁ దగిలింప ♦ వెలఁది చిక్కుఁ
తే. గీ. గూర్మి జిల్లేడుదూదిని ♦ గోశఫలరసమున మేదించి వత్తిగాఁ ♦ జక్కఁజేసి
కుసుమనూనెను దీపంబు ♦ పొసఁగఁ బెట్టి, చూప లోనౌదు రెటువంటి♦సుదతులైన. 134

తే. గీ. జాజికాయయు జాపత్రి ♦ చారపప్పు, సెనగ లనుములు గసగసల్ ♦ మునుగపూలు
మదనవిత్తులు కొబ్బెర ♦ మందపాల, నూరి త్రాగిన మద ముబ్బు ♦ నాటువేళ. 135

కం. అనుచు నిజరచితవితరణ, జనితామోదమున వైద్య♦జనములు దెలుపన్
వనితావశ్యౌషధములు, విని యిట్లొనరించి యింతి ♦ వెస వలపింతున్. 136

కం. అని నిశ్చయించి యాబోజుఁ, గనుపమమణిహేమఘటిత♦మై సిరు లొలయన్
దనరు రతిసేనమందిరమున గాపెట్టుకొనియుండు ♦ మోహముకల్మిన్. 137

సీ. పంచాంగమయ్యకుఁ ♦ బాగ సమర్పించు నట్టువకానికిఁ ♦ బెట్టు ముఁడుపు
భరతంపుటొజ్జకుఁ ♦ బచ్చడం బొగిఁ గప్పు బాగడుభట్టుకుఁ జేర్చు ♦ బోఁగుజోడు
కథఁ జెప్పు భూసురా♦గ్రణికి దోవతొసంగు గనుపుకానికి బత్తె♦ మొనయ నడుపుఁ
బూలగట్టు సాతాని♦బోడ కుంగర మిచ్చు గందొడివానికి ♦ విందు సేయుఁ
తే. గీ. జతురికకుఁ జీర దూతికి ♦ సందిబొందె, కడెము సంచారికకు సారి♦కకును రవికె
త్రాపికొక సొమ్ము వైశ్యమా♦తకును గాన్క, లిచ్చి చెప్పించు రతిసేన ♦ కెచ్చుతమిని. 138

వ. మఱియును. 139

ఉ. గుండనికిం బసిండియును ♦ గోరడిబండకు వెండితాయతుల్
లండికిఁ జేకడెంబు పది♦లంబగు గుమ్మెతకాని కందె మేల్
బెండెము బాడుగోలునకు ♦ భృత్యునకు న్మడనూలు చాటుకో
1దండునకున్ మురాలు మొల♦త్రాడలకుం బెనకాని కియ్యఁగన్. 140

కం. వారందఱు తమచాతురి, మీఱి మహాసంపదాప్తి ♦ మించినవాఁడీ
జారాగ్రణి యని చెప్పిన, 2నారతిసే నపుడు మంచి♦దని యియ్యకొనెన్. 141

కం. పడఁతుక నతఁ డీగతి లోఁ, బడఁజేసుక మురిపె ముట్టి♦పడఁ గడుదమి దుం
దుడు కొనరింపఁగఁ గోరిక, లడరఁగ రతిసేన రతుల ♦ కాయత్తుండై. 142

కం. పన్నీట జలక మొనరిచి, కన్నురి రానున్న మిన్న ♦ గన్నన్నకు మున్
మున్నొసఁగి సన్నబియ్యపు,టన్నము మితభుక్తి చేసి ♦ యమితోత్సుకతన్. 143

తే. గీ. చారు శ్రీగంధ మగరు కే♦సరి కదంబ, మంబరు పునుంగు జవ్వాది ♦ హారిణమదము
బుక్క యత్తరు గోవగం♦బూర జేలు,చట్ట కలపంబు పన్నీటఁ ♦ జాఁది పూసి. 144

పా. 1. దండున కుంగరాలు   పా. 2. నా రతిసేనయును మంచి♦దనియెన్ వినియెన్.

కం. సిగ నరవిరిసరములు పొందుగ వేసి రుమాలు గట్టి ♦ దుప్పటి వలెవా
టుగ వైచి విడెము సేయుచు, పొగ సుట్టి వడంగ నతఁడు ♦ సొంపు జనింపన్. 145

సీ. సకినెలపట్టెమం♦చము పాన్పు తలగడబిల్లలు చందువ ♦ మల్లెవిరులు
కరడ సురటి గిండి ♦ గద్దె సున్నపుఁగాయ గా జద్ద మడపము ♦ కలపము చిటి
చాప తబుకు సాన ♦ జాలవల్లిక దీవెములు గంధవడిపెట్టె ♦ పునుఁగుబరణి
యాకుసంబెట తంబు ♦ రగురుధూపము పాదుకలు తమ్మపడిగము ♦ కప్పురంపు

తే. గీ. కోవి కస్తూరివీణె కుం♦కుమపుపూవు, పొట్లములు రుద్రవీణె మే♦ల్కట్లు బాగ
ములకరండంబు రతిబంధ♦కలితచిత్ర,ములు గలుగు కేళినిలయ మిం♦పలరఁ జేరి. 146

తే. గీ. బలసి కూకీలు నొడ్డీలు ♦ పల్లటీలు, పావురాయులు బకదార్లు ♦ బట్టిగాండ్రు
నంచలు నెమళ్లు కేర్జము ♦ ల్పంచవన్నె,చిలుకలు పికాదిశకునము ♦ ల్గలసి పలుక. 147

తే. గీ. చంద్రకావి ఖురాళంబు ♦ సరిగెచెఱఁగు, జినుగుకెందమ్మి దోమమ్మి ♦ చీనిరుమ్మి
పైఠిణీకమ్మి తెఱచాటు ♦ పాన్పుమీఁదఁ, బదటుతమి నుండునంత న♦ప్పణ్యకాంత. 148

వ. మజ్జనభోజనాదివిధుల సంతుష్టహృదయయై భావసూచకబిబ్బోకహావభావలలితకుట్టమితకుతూహలకిలికించితవిహృతవిచ్ఛిత్తి విభ్రమ ధైర్య లీలాహాసమాధుర్య హేలావిలాస చకితాది శృంగారచేష్టలుగులుకన్వచ్చిన నాలింగనంబు సరసాలింగనంబు దృఢాలింగనంబు సర్వాలింగనంబు స్పృష్టక పృథక అనురూపగూహన జఘనోపరిగూహన కుచాలింగన లలాటిక నిరూపణ లతావేష్టిత వృక్షాధిరూఢ తిలతండులక క్షీరనీరంబులను చతుర్దశాలింగనంబులు గావించి యుప్పొంగుతమకంబున నతండు. 149

తే. గీ. చుంబనంబును బీడిత♦నంబుఁ గబళి,తంబు చూషణ మనుపేళ్లఁ ♦ దనరు నాల్గు
గతుల ముఖరతిభేదము ♦ ల్గలయఁజేసి, ద్రవముఁ బుట్టించు నానకా♦ల్తడవి చూచి. 150

తే. గీ. నఖయ యంగుష్ఠపదగుల్భ♦జానుజఘన, నాభ్యురస్స్తనకక్షకం♦ఠసుకపోల
1దంతపటపక్ష్మఫాలమ♦స్తకశిరోజ,ములు ప్రతిపదాదిగల కళా♦స్థలము లంటి. 151

సీ. చెప్పులనిమిత్తంబు ♦ చెక్కులస్ఫుటితంబు నధరోష్ఠమున భ్రాంత ♦ మడరు కన్ను
గవ దిర్యగంబును ♦ గక్షదేశంబులఁ బ్రథితంబు చనుదోయి ♦ నధరకంబు
చిత్తజుగృహమున ♦ నుత్తరస్ఫుటితంబు పొక్కిట సంపుటం♦బును శిరోధి
ననుపదం బూరుల ♦ నస్వీతం బన నొప్పు దశచుంబనములు ద♦త్తత్స్థలములఁ

తే. గీ. బొదలు ముదమునఁ బర్యాంకు♦మున ఘటించి, కలయ శశకప్లుతమయూర♦ఫలకరంజి
పచ్ఛురితమండలికగండ♦భాగ సుతిరి,ముఖమున నఖక్షతంబులు ♦ మొనయఁజేసి. 152

పా. 1. దంతగల్లాక్షిఫాల

తే. గీ. క్షతరదోచ్ఛానఖండాభ్ర♦కప్రవాళ, మణికమూఢకరుచిబిందు♦గుణకబిందు
మాలికాగోళచర్చితా♦ఖ్యాళి వెలయు, పది రదక్షతముల నేడ్కఁ ♦ గదియ నొక్కి. 153

కం. స్థితమును దిర్యగ ముత్తానితమును నాభిసిత మనఁగ ♦ నిపుణజనులు ప్ర
స్తుతిగొనఁ దనరు చతుర్విధ, రతుల గతుల నతుల ముద్భ♦రము గావించెన్. 154

వ. వెండియు నఖండసురతపాండిత్యంబున విటుండును, నయ్యండజయానయు మదవేదండంబులరీతి జృంభక కూర్మకరణాస్కంధయుగ గర్భపీడిత సాధుక దృఢలావుక కర్కట సముద్ధక వేణుదారిత సంయమకృత కోపరతి ధృతోరుక నాగర ప్రేమాభిరామ చక్రభ్రమణ ప్రసారిత శూలాంచిత కుంచిత పాదవేష్టిత బాణరంజన మదనరంజన పార్శ్వసంఘట్టన భావికోల్బణ మండూకకరణ గ్రామ్యకరణ సర్వతోభద్ర పార్శ్వభద్ర మండలప్రభ మధురకంపితాగ్ర సంపుటార్ధసంపుట పద్మకార్ధపద్మక అంబురుహ చారుచరణ పాదపదక పాదబంధ పాదాశ్లేషణ మదనడోలన చిత్రడోలన లఘుడోలన చంద్రార్ధ మండలార్ధ యూరుచరణ కక్షపాద విష్టిక హారికకరణ నాగపాశాంగ చక్రగుహ్యక ద్విరదావలంబన చిత్రలాఘవ మదనకుంచిత గగనకరణోర్ధ్వబాహూద్ధూత మర్కట విమర్దన వేణుకోద్వేగ పదావృత్త గజాంగ దృఢాంగ సింహావలోకన పాదారోహణ ప్రియాంగ బాడబ బాణవృత్త మదన రాజహస్త లాఘవ బాహుచరణ మధ్యచరణ చక్రపాదమదన సంఘట్టన పాదమేళన గోముఖాంగ పాదాంగ సంవేద్యకరణ నమితాంగకరణంబులను చౌశీతిబంధంబులం బెనంగుచుండి రయ్యవసరంబున. 155

సీ. గంబూరమును జాజి♦కాయ లుమ్మెత్తవిత్తులు మర్లునూతంగి ♦ కలువగడ్డ
పచ్చయెన్నులు కోష్టు ♦ పచ్చికమం చేనుఁగమదము గుల్లసు♦న్నమును రుద్ర
జడవేరు వస ఖురా♦సానివామము పుడుకలపోదిగాడు మై♦గారుచెమట
నీరాపు గజ్జల♦బేరినమష్టును గాల్మడి ఊతంటు♦గాను నూరి

తే. గీ. కలయ గురిగింజలంతేసి♦ గుళిక లమరఁ,జేసి నీడనె యారించి ♦ తీసి దాఁచి
యున్న మందింత మడుపులో ♦ నొసఁగె నతని, కధికతరమోహమాన నా♦హంసయాన.

కం. ఈబాళిమందు మసగొని, యాబిడ తనకండ్ల గట్టి♦నట్లుండ నతం
డేబుద్ధిలేక నచ్చెలి, సోబెలకే దక్కి చిక్కి ♦ చొక్కుచుఁ దిరిగెన్. 157

తే. గీ. వాఁడటుల మీఱి భోగము♦వారి కేరిఁ, జేరి రతిసేన రతి నాసఁ ♦ జెలఁగు మదిని
దానిసొమ్మైన యమ్మైన ♦ దట్టమైన, వయసు మరుబారిఁ బడఁజేయ ♦ వానిజాయ. 158

సీ. బొమ్మలపెండ్లిండ్లు ♦ బువ్వంపుబంతులు పుణికిళ్ళు నిట్టిక్కి ♦ బొమ్మరిండ్లు
గుజగుజరేకులు ♦ గొబ్బిళ్లు నీగిగె బుడుకిస్సు జాబిల్లు ♦ పుక్కటిల్లు
గుజ్జనగూడులు ♦ కోలుకోలన్నలు గిరనగింజేలు ♦ పారుపట్లు
పింపెళ్ళు తొక్కిళ్లు ♦ బేడిసెతిరుగుళ్లు నచ్చనగండ్లు దా♦యాలు పొళ్ల

తే. గీ. లోలి వామనగుంట ల♦ప్పాల యాది, నైనయాటలఁ బ్రొద్దుపో ♦ వసుఁగుఁ జెలులఁ
బాయక చరించు బాల కీ♦ప్రాయ మేల, వచ్చె విరహాగ్ని యిటులేల ♦ హెచ్చెననుచు.

కం. నెరవయసు పిక్కటిల్లఁగ, సురతం బొకవేళనైనఁ ♦ జొప్పడమి మదిన్
బరపురుషవాంఛ వొడమిన, విరహంబున రేయిపవలు ♦ వేగుచు నుండున్. 160

చ. ఉదు టగువానిఁ బ్రాయమున ♦ నుండెడువాని మనోజ్ఞలీలసం
పద గడిదేరువాని గుణ♦పాటవ మొందెడువాని నేవుచేఁ
బొదలెడువాని గీతముల♦పొల్పు లెఱింగినవాని సంగమో
న్మదమున మించువానిఁ గని♦నన్ మరుబారికి నగ్గమై పడున్. 161

తే. గీ. ఇరుగుపొరుగులదంపతు ♦ లేఁపురేఁగి, సంగమక్రీడ లాడుచు ♦ సరసమాడు
సొవసొవలు విన్నమాత్ర ను♦స్సురు మటంచు, మన్మథునిబారిగొఱ్ఱెయై ♦ మగువ దలఁకు.
వ. అంత నక్కాంత వేఱొక్కవాసరంబున. 163

చ. అటువలె వేగుచుండి మగఁ ♦ డత్తయు మామయు నింటలేమి వె
ల్పటికి హుషారునం జని గు♦బాదెబ వీథులవెంట జంటలై
చిటిలినపూఁతగంధముల ♦ సిస్తగుపాగల నిండుచల్వదు
ప్పటుల విభూషణావళుల ♦ బాగుగ నేఁగెడు దుడ్డెకాండ్రతోన్. 164

సీ. పసిఁడికుప్పెలవేలి♦బారుకుచ్చులు నిండ్రిగోపంపుజగజంపు♦గుంపుబారి
1కుచురుకుసింగముల్ ♦ గూర్చుల్లమున నాబుచెక్కడపుం బచ్చ♦చిలుకచెండ్లు
వట్టుపటంబుతా♦స్తాలేపు జీవదంతపుగోడియలు పట్టు♦త్రాళ్ళు దిండ్లు
నేనుఁగుకొమ్ము 2హొ♦పెరుకుశ్రీటాకుజిరేకలమ్ముల సెల్లు ♦ తెండ వీటి

తే. గీ. కెనులివం కగ్గి సోఁకు పొ♦క్కిటులపోటు, పుట్టచిమతిండియును లేఁత♦ముదురునిడుద
గణపుసదులంపు సీలర♦క్తములులేని, కొమ్ముపున్నాగ మమ రంద♦లమ్ములందు. 165

కం. వగ లుట్టిపడఁగఁ దమతమ, సొగసులతో విఱ్ఱవీఁగు ♦ సొంపుల మీసాల్
పగటున వడివేఁ్రయుచుఁ జిఱు, నగవులఁ బద మనుచు జార♦నాయకు లలరన్. 166

సీ. పైచరమోరడిం ♦ బలిమికం బొద్దిక ముల్లడితాకుడు ♦ జిల్లకల్లు
మైసుళ్ళు మెదుగుడు ♦ మారువెంబడిచిట్టు జతుకు సమాధాన♦జతన మడుగు
లోదాటు నడ్డకా♦లువ పాదబెళకునిబ్బరము నీరడికంద ♦ బలిమికిరుదు
నుమ్మలి సెలవు పా♦దొత్తుగల్లు దువాళి తొడిగట్టె యంగాల♦జడుపులాగు

తే. గీ. హాయలు చొరగొమ్ము పన్నాగ♦హాయలు బిగువు, బొట్టిడెగుదలగరెగప్పు ♦ జట్టుడినుము
పటముతాకుడుమొగహాయ ♦ ల్పదిలమదిగో, హెచ్చరికటంచు వడిబోయ ♦ లేఁగుచుండ.

---

పా. 1. కుచ్చుకుక్క సిగ్గెము ♦ ల్గాలెప్పిల్లు ముననాభు చెక్కడపుంబచ్చ♦చిలుకచెండ్లు..
పా. 2. కా♦జేరికిఁ ఖేటాకు విలికెలమ్ములు సెల్లు ♦ వెండవీటి

ఉ. సంచపురేకుదుప్పటులు ♦ జాఱుసిగ ల్బిగిచల్లడాలు వా
సించెడిగంధపట్టియలు ♦ జిన్గురుమాలలు సందితాయెతు
ల్మించఁగ సానచిమ్మినను♦మీసలు దీడుచు మీఱి కేరి డీః
క్కెంచపటంచు గుంపుగొని ♦ కేకలు వేయుచు వచ్చువారిలోన్. 168

తే. గీ. మంతుఁ డన నొప్పు నెరవింత ♦ హొంతకారి, సొగసుబయకారిజాణను ♦ జూచిదగ్గి
కేకరించిన నాతఁడు ♦ కెరలి కాంచి, యిదియు వగలాడిరా యని ♦ కదియఁ జనఁగ. 169

ఉ. గేదఁగిరేకుబెత్తమునఁ ♦ గీల్కొనుచూతదళంబు లాల మిం
పూఁదినజాజిమొగ్గ గజ ♦ ముత్పలపుఙ్ జెలికట్టు సంపఁగిం
బాదరుగా నొనర్చినతు♦పాకిని బుప్పొడి మీఁదు కప్పిపుం
బూదియగుండు నించి మరు♦బోయ ఘమీయన నేసె నిర్భరన్. 170

వ. అప్పు డామంతుఁ డయ్యింతిచెంతకు సంతసంబున వచ్చుచు నిజాంతరంగంబున. 171

ఉ. ఆరయ నేరకేటియస♦లందుల వెన్నెలతేటనించి తొ
ల్కారు మెఱుంగురంగు లిడి ♦ కమ్మసుధ న్పద నిచ్చి మేటిశృం
గారరసంబుతోడఁ బొసఁ♦గంగ ననంగవిధాత చేసెఁ గా
కీరమణి న్విధాత సృజి♦యించుచు నంటినఁ గంద కుండునే. 172

సీ. దీర్ఘమై విలసిల్లుఁ ♦ దేటవాల్గనుదోయి 1గుడుసులై కనుబొమల్ ♦ గులుకుచుండుఁ
కొమ్మిచ్చుగతి హెచ్చుఁ ♦ గొమిరెచేతులరీతు, 2లుత్వంబుచందాన ♦ నొప్పు జఘన
మహత్వంబుభాతిని ♦ నమరుఁ గర్ణద్వయం బేత్వమై జడపొంక ♦ మెసఁగఁబొసఁగు
నైత్వంబువిధమున ♦ వల యూరు లల రారుఁ దలకట్టువలె మించుఁ ♦ దళుకునొసలు
తే. గీ. సున్న నడుము విసర్గలు ♦ చన్నులు సుడి, పొక్కిలి వలపలగిలకల్ ♦ భుజము లనఁగ
నలరు గుణితంబువై ఖరిఁ ♦ జెలఁగు నంగ,సౌష్ఠవముతోడ నున్నది ♦ సకియ యనుచు.

వ. కదియం జేరి యప్పుడు. 174

చ. చెలియరో యేపురం బెటకుఁ ♦ జేరఁగ వచ్చిట నిల్చినావు నీ
కలరవ మొప్ప దగ్గితివి ♦ నెమ్మదిలోఁ గల పూనికి దెల్పు మా
యలు పచరింపఁ బోకనిన ♦ నమ్మక చెల్లరో యీతఁ డెందు కెం
దుల కుఱు లొడ్డె నెంచి కడు♦దొమ్మికి గాఁ దలఁచెఙ్ సెబాసుపో. 175

తే. గీ. అనుచుఁ జిఱునవ్వు మోవిపై ♦ నంకురింప, భయము సిగ్గును దనుముంపఁ ♦ బలుకునెడల
గద్గదరవంబు జనియింపఁ ♦ గన్నెదాన, మేలు పడినాను జాణ న♦న్నేలుకొనర. 176

పా. 1. గుడుసైన నాభియుఁ పా. 2. లోత్వంబు

కం. అనవిని మంచిదియని యొక్కనివాసస్థలముఁ జేరఁ♦గా రమ్మని వ
చ్చినఁ జెలిముందరనిడి మెల్లనఁ జేష్టల నుబుసుపుచ్చి ♦ లాలిత్యమునన్. 177

కం. కళలంటి ముద్దువెట్టుక, వెలసినతమి మోవి నొక్కి ♦ వీపునఁ జనుము
క్కులువెళ్లఁ గౌఁగిలించుచుఁ, బలురీతుల రతులఁ గలసి ♦ భ్రమ నొందించెన్. 178

కం. ఈచక్కి నీవు నిచ్చలు, రాచిలుకసిపాయిరౌతు♦రణమున వలపుల్
బీచణఁచు మనిన హో యని, యాచిగురుంబోఁడి కాతఁ ♦ డభయం బిచ్చెన్. 179

తే. గీ. ఇచ్చి సందైనయపుడెల్ల ♦ వచ్చి సైగ, చేసి విటుఁ డేగఁ దోనేగి ♦ చెలియ యింట
సురతకేళుల ననరింప ♦ సుఖము మరిగి, తిరిగెఁ దనయత్త కన్నుఁ గా♦వరముపట్టి. 180

ఆ. వె. అత్తకన్నకోడ ♦ లయ్యత్త కోడలి, కన్న నేపు రేఁగి ♦ యాప్తజార
జనులఁగూడి 1పాడి ♦ చరియింప సాగిరి; యొంటిపాటు దొరకి♦యున్నయెడల. 181

తే. గీ. అత్త యేమఱియుండెడు♦నంతలోనఁ, గోడలు చరించి వచ్చును ♦ గొంతదడవు
కలయఁగ ఖుశాలు వచ్చునా♦క్షణమె బుద్ధి,కోడలికిఁజెప్పి యత్త రం♦కాడఁబోవు. 182

కం. ఈమాడ్కిని నన్యోన్యం, బేమాత్రము తెలియకుండ ♦ నిచ్ఛావృత్తిన్
గామించుచు నొకదినమున, లేమాపునఁ గోడ లింట ♦ లేకుండునెడన్. 183

కం. వలవనిసతిపురుషులకును, వలపులు పుట్టించు మందు ♦ వగ లెఱింగి రతిన్
2గలయఁగఁజేయం జాలిన, భళియుం డను హొంతకారి ♦ పద్ధతి రాఁగన్. 184

ఉ. అత్తరి హొంతకారిని ర♦యంబునఁ దోడ్కొని మూలయింటిలో
హత్తుక కేళిసల్పునెడ ♦ నంతటఁ గోడలు వచ్చి చూచి మా
మత్త విభుండు లే రనుచు ♦ మంతునిఁ దోడ్కొని యిల్లుచేరినన్
దత్తర మారఁ గోడలిని ♦ దద్విటునిం 3గనెనత్త సేర్ష్యయై. 185

తే. గీ. అపుడు గృహమధ్యముననుండు ♦ నత్త నత్త,విటునిఁ గోడలు గాంచె న♦వ్వేళనెట్లు
నేర మొక్కింత రాకుండ ♦ నేర్పు మెఱసి, వారలిరువురుబొంకఁగా♦వలయుఁ జెపుమ. 186

కం. అనవిని హేమావతి యే, యను వమరఁగ నితరశంక ♦ లందక యుండన్
ఘనకచలు బొంకి తమవిట, జనముల నిల్వెడల నంపఁ♦జాలిరొ యెఱుఁగన్. 187

కం. నీ వెఱిఁగించిన పనియెడ, నా విని హేమావతీ వి♦నం గడువేడ్కన్
భావమున నున్న విను మని, ధీవిభవము హంసవంశ♦తిలకం బనియెన్. 188

తే. గీ. అటుల విటయుక్తయై యింటి ♦ కరుగుదెంచు, కోడలినిజూచి యత్త సం♦క్రోధయగుచు
వీఁ డెవఁడు వీనిఁ దోడ్కొని ♦ వేశ్మమునకు, సంజకడ రాఁ బనేమని ♦ జడియ నడుగ.

పా. 1. యాడి పా. 2. వలపులు మరుపం జాలిన పా. 3. గని యత్త కిన్కతోన్

కం. దిటచెడక దిగులుగొని పొట,పొటఁ బోవక వెనుకముందుఁ ♦ జూడక బొంకే
డెటు లని చింతింపక యా, ఘటకుచ తడఁబడక యత్తఁ ♦ గన్గొని పల్కెన్. 190

తే. గీ. తల్లిదండ్రులు మీరు బాం♦ధవులు మఱియుఁ, జిక్కి తక్కినవారలు ♦ చెప్పినపుడు
వినక నాపతి నన్నిట్లు ♦ విడిచిపెట్టి, తిరుగుచున్నది మీకెల్లఁ ♦ దేటగాదె. 191

కం. వనితాపురుషుల కీయన, యనువున నన్యోన్యమోహ ♦ మందఁగఁ జేయన్
ఘనుఁ డని కొందఱు చెప్పఁగ, విని తోడ్కొని తెచ్చినాను ♦ విభు ననుఁ గూర్పన్. 192

కం. ఇది యేక్రియ నీయనచే, ముదమునఁ జేయింపవలెనొ ♦ ముగ్ధను బ్రియం
బొదివున్నదాన మోహము, మది సైఁపఁగఁ జాల ననుచు ♦ మమతఘటిల్లన్. 193

ఉ. కోడలుపల్కుపల్కు విని ♦ కొంకక నిక్కముగాఁ దలంచి యా
చేడియ నాదుజారుఁ గని ♦ చిత్తములో నెటులం దలంచునో
1దూడల నమ్మరా దని వి♦ధుంతుదవేణి తనందు సత్యపుం
జాడ కనంబడన్ స్వతను♦జాతలతాంగిని జూచి యిట్లనున్. 194

కం. నీవింత యడుగ నేటికి, నీవిభుఁడు పరేచ్ఛఁ బూని ♦ నిను విడిచి చరిం
చేవిధము తెలిసికాదే, యీవైద్యునిఁదోడితెచ్చి ♦ తింటికిఁ దరుణీ. 195

వ. అని యజ్జగజంత నిశాంతంబున నున్న తనయుపకాంతుని తేరకొనం జూచి వెండియుఁ
గోడలి కిట్లనియె. 196

కం. నీపతి నిన్నువరింపన్, బ్రాపగు యత్నంబు నితఁడు ♦ భవనస్థలిలో
నేపున నొనర్చినాఁ డిఁక, రేపట మర్నాట నీదు♦ప్రేమ ఘటిల్లున్. 197

తే. గీ. అనుచుఁ దనయందుఁ జెలి సంది♦యంబుఁ జెంద,కుండ నెఱిఁగించి యత్తయో ♦ యుత్పలాక్షి
యతని నంపించు మిప్పటి ♦ కితనిచేతఁ, గాకయుండినఁ జూతము♦గాక యనిన. 198

కం. విని కోడలు నాయందలి, నెనరున నీ యత్త యితని ♦ నిక్కము తోడ్తె
2చ్చినయది పతి ననుఁ గూర్చుట, కని తలఁ చటు నందుగామి ♦ ననిచెన్ విటునిన్. 199

ఆ. వె. అంత దానియత్త ♦ యాత్మోపపతిఁ జూచి, సైగసేయఁ దెలిసి ♦ జారవరుఁడు
తత్ప్రియత్న మపుడె ♦ తగఁ జేసి తని వార, లిరువు రెఱుఁగఁ బలికి ♦ యింటి కరిగె.

చ. అని కలహంసవంశమణి ♦ సాంగముగా వినిపించ వీనుదో
యినిఁ గడుసమ్ముదమ్ము జని♦యింపఁగఁ దత్కథ యాలకించి కాం
చనసుమగంధి యానతుల ♦ చాతురి కాత్మ సెబాసు ఖూబు మే
లనుచు గణించుకొంచు నిల♦యంబున కేఁగె నినుండు దోఁచినన్. 201

---

పా. 1. దూడెల  పా. 2. చ్చినదిపతినన్నుగూర్చుట, కనితలఁచిటుసందుగామి ♦ ననిచెన్ స్వవిటున్.

కం. ఈరీతిఁ బడకయింటికిఁ, జేరంజని మఱునాఁడు ♦ చీఁకటి జేజే
రారాక్షశ రా రాఁగల, యారజనీవేళ విరహ ♦ మగ్గల మైనన్. 202

సీ. విరిదండసత్తావి ♦ నెఱిగుంపు గంపుతుమ్మెదపిండునకు మోద ♦ మొదవఁజేయఁ
గాశ్మీరతిలకంపు♦కాంతులు వదనేందుబింబంబునకు సంజ♦డంబు గూర్పఁ
గస్తూరిపత్రిభం♦గములనిగ్గు కపోలశశిఖండములకు లాం♦ఛనములీన
వాసించు నెఱిగంద♦వడిపూఁత చనుగుబ్బ పువ్వుగుత్తులను బు♦ప్పొడులఁ గురియ

తే. గీ. నీలమణికాంచిఘృణులు వి♦శాలజఘన, ధరణి కంబుధిమేఖలా♦త్వము ఘటింప
నృపతిమణిఁ జేరుకోర్కె న♦న్నీరజాక్షి, వచ్చిరాయంచకడ నిల్చె ♦ మెచ్చులొల్క. 203

వ. అప్పుడు హేమావతికి హంసం బిట్లనియె. 204

పందొమ్మిదవరాత్రికథ.

కం. శ్రీకర మన నొకపురము సు,ధాకరబింబభ్రమాస్ప♦దస్వర్ణమణి
ప్రాకారగోపురగడ,ప్రాకారసువజ్రకలశ♦మై సిరు లొందున్. 205

శా. సాలాగ్రస్థలకేళితత్పరమహీ♦స్వామ్యర్భకవ్యూహదోః
పాళీక్రీడితరత్నకందుకమహా♦బాధప్రహారార్తిచే
నాళీక ప్రియు ధీరసారథికి ము♦న్నాటిల్లి యీనాఁటికిన్
బోలేదయ్యె ననూరునామ మదివో ♦ మూలంబు తత్సంజ్ఞకున్. 206

మ. పరిఘాంబూపరిదృశ్యమానవిలస♦త్ప్రాతాళసంచారబం
ధురసర్పోత్కరభోగరత్నఘృణిసం♦దోహంబు కెందమ్మిమొ
గ్గరహిన్ గుల్క గ్రహింపఁబూని యవి గా♦కన్ దక్కినన్ బల్మఱున్
గరముల్ సాఁచఁగ బోండ్ల నవ్వుదురు వీఁ♦కన్ వారికేళిన్ సరుల్. 207

తే. గీ. ఆపురంబున ఫణిహారుఁ ♦ డనెడుపేరఁ, గాఁపురము చేయు నొక తిల♦ఘాతకుండు
సంభ్రమంబున నాకార♦సౌష్ఠవమున, వాఁడు కందర్పునకుఁ జీటి ♦ వ్రాయఁగలఁడు. 208

తే. గీ. గానిగె కణెంబు మోకులు గడ్డపార, కాడి సిద్దెలు గూటంబు ♦ కడవ జల్లి
గంప కనుగంత 1తక్కెడి♦గట్టిమొద్దు, చుట్టునవిరెయు సర్వవ♦స్తువులు దనరు. 209

తే. గీ. వెల్లుగిసెనూనె కుఱునూనె ♦ వేపనూనె, నల్లనూ నిప్పనూనెయుఁ ♦ దెల్లనూనె
కుసుమనూనె గానుగనూనె ♦ కొబెరనూనె, నూనె పొగనూనె 2దుండుగ♦నూనె జేయు.

కం. పరిపాటికల్మిచేతను, గరగరిక వహించి మించి ♦ కడునాగరిక
స్ఫురణం దమపంశంబున, కరయుంగాఁ బిన్నపెద్ద♦యై యతఁ డుండున్. 211

పా. 1. రోలును పా. 2. తగిరెప♦నూనె మఱియు.

చ. అతనికి నొక్క-యింతిగల ♦ దంగజుపట్టపుదంతి జారిణీ
సతులకు మేలుబంతి విట♦జాలము లాడెడుపూలబంతి యా
యతమదజారచిత్తజమ♦హావిరహాగ్నికి శాంతి దేహని
ర్జితచపలానుకాంతి మణి♦చిత్రిణి నాఁ దనరారుఁ బేరునన్. 212

నిరోష్ఠ్యకందము. దరగళ ఘనరసధరకచ, ధరసదృశస్తన సురదన ♦ తరళనయన సుం
దరకనకకటకకరయుగ, సరసవచనరచనయవల ♦ సరసతఁ దనరున్. 213

సీ. నీలధారాధర♦నిర్మలకాంతుల గడియలో మాయించుఁ ♦ గలికివేణి
సంపూర్ణపూర్ణిమా♦చంద్రబింబస్ఫూర్తి దినము కుందఁగఁ జేయుఁ ♦ దెఱవముఖము
నిద్దంపురుచు లొల్కు ♦ నద్దమ్ము వీక్షించి గవుసెనల్ పెట్టించుఁ ♦ గాంతచెక్కు-
లలరారు జిగిదేఱు నల చకోరంబులఁ బుట్టుగుడ్లని పల్కుఁ ♦ బాలఁతికనులు

తే. గీ. నెట్టుకొని గట్టిపగపట్టు♦పుట్టచెండ్లఁ, బట్టి కొట్టించు వీఁపునఁ ♦ గుట్టుఁ బొఱఁ
గొమిరె సిబ్బెంపుగబ్బిచ♦న్గుబ్బదోయి, విను మదారంభగంభీర♦వేదిగమన. 214

కం. తనుకాంతి మెఱుఁగుమినుకా, మినుకావర మణఁచుఁ గౌను ♦ మేలిమి గనకా
కనకాద్రికొనరిజనుకాఁ, జనుకాఠిన్యమ్ము పొగడ ♦ సన్మణితునకా. 215

తే. గీ. నీరజేక్షణసిబ్బెంపు ♦ నిబ్బరంపు, గబ్బిగుబ్బలు తమరూపు ♦ గాంచదొడరు
కాంతిఁ బొంగారు బంగారు♦కలశములకుఁ, గనలు చిచ్చాక నీరాక ♦ గలుగఁజేసె. 216

మ. వనజాతాక్షిపయోధరంబు లలక♦వ్రాతంబు కంఠంబు మో
హనలీలం దగు ఫాలభాగమును నూ♦గారున్ గనల్లిలచే
ఘననీలాబ్జకళాకలాపజయకాం♦క్షన్ మించుచే యబ్రముల్
ఘననీలాబ్జకళాకలాపజయకాం♦క్షన్ వేణి రాణించఁగన్. 217

ఆ. వె. దానిజవ్వనంబు ♦ దనువు నిరీక్షింప, మానికైన నెనయ ♦ మనసు పుట్టు
నితరజనులు చూచి ♦ యేణాక్షిరతిఁ జెంద, నిచ్ఛయింతు రనుట ♦ కేమి యరుదు. 218

తే. గీ. తుప్పుమల్చిన మెఱుగారు ♦ తోయజాస్త్రి, చికిలినిద్దంపుఁగ్రైదువు ♦ చెలువు తోన
నూనెమెఱుఁగున నునుచాయ♦మేను దనర, నది విటాళుల కన్నాస♦యై వెలుంగు. 219

చ. నడవడిగల్లువాఁడు మఱి ♦ నాణెముచేఁ గలవాఁడు రూపునన్
బెడఁ గగువాఁడు బల్రితుల ♦ బేరజమై తగువాఁడు నిందఱున్
జెడుగుల బ్రహ్మ దీనిని ని♦సీ మగనాలుగఁ జేసె నంచు లో
మిడుకుచు దానియింటికడ ♦ మీసలు దీడుచు నుందు రెప్పుడున్. 220

సీ. పనిలేనిపని పూను♦కొని దాని ముంగిట నెళవుగం దిరుగని ♦ సీటుకాఁడు
వేఱొక్కకడ కేఁగు♦వేళల నటుతొంగి చూచి పోఁదలఁపని ♦ సొగసుకాఁడు

సంగడికాఁ డిందుఁ ♦ జనుదెంచెనా యని వాకిలిద్రొక్కని ♦ వన్నెకాఁడు
గానుగ యీపొద్దు ♦ కట్టలేదా యంచుఁ గూర్చి యింటికి రాని ♦ కోడెకాఁడు

తే. గీ. మందునకు నైనఁ బ్రియంపు♦మనుజులందు, వెదకి చూచిన నొకఁడైన ♦ వీటిలోనఁ
గలుగఁ డటువంటిమహిమ గ♦ల్గంగ దాని, కేమి జనవశ్యమున్నదో ♦ యెఱుఁగ రాదు.

ఉ. ఆమణిచిత్రిణీసుదతి ♦ యన్యజనోత్కరసంగమంబుపైఁ
బ్రేమ జనించి యాత్మ పిరు♦బీకులఁ బెట్టఁగ వీటిలో విట
స్వాముల గారవించుఁ గృక♦వాకుభుజంగమధేనుకేభము
ఖ్యామితబంధకేళులఁ గ♦ళాదు లెఱింగి కరంగఁజేయుచున్. 222

తే. గీ. పేరిపఁ గన్పట్టు వీథిలో ♦ బెళుకువగల, నరసి కనుసైగ చేసెడి ♦ యంతనంత
లోన లోఁబడఁజేయంగఁ ♦ బూనునేర్పు, దానికేకాక కూడ దే♦చానకైన. 223

తే. గీ. ఇరుగుపొరుగింత వినకుండ ♦ నింటిమగఁడు, తెలియకుండఁగ బరరతిఁ ♦ దేలి నంగ
నాచివలె నుండుఁగాని యా♦నాతిగుట్టు, బ్రహ్మదేవున కైనను ♦ బయలుపడదు. 224

వ. వెండియు నయ్యండజయాన విటతండంబులఁగూడి యఖండమోహంబునఁ బలుదెఱం
గులఁ జరింపుచుండె నివ్విధంబున. 225

ఉ. అంత వసంతవేళఁ జెలు ♦ వంతట నెంతయు సంతసిల్లె న
త్యంతలతాంతకుంతశర♦తప్త నితాంతదురంతతాంతతా
శాంతికరంబు కంతుశర♦సంతతిసంతతకాంతతాసమా
క్రాంతవనాంతరంబు కళి♦కాతతిదంతురితద్రుమాంతమై. 226

తే. గీ. కలయఁ గొమ్మలతోఁ గూడ ♦ కాననమున, నుండు విటపుల ననిలచో♦రుండు పట్టు
కొని దళాంబరముల దోచు♦కొనియె ననఁగఁ, బండుటాకులు గాడ్పులు♦పర్వ రాలె.

కం. వనలక్ష్మీమాధవశో,భన మగు నత్తఱిని బాద♦పలతాపురుషాం
గన లన్యోన్యముఁ గ్రీడిం,చిన నెఱయు వసంత మనఁగఁ ♦ జివురులు మొలిచెన్. 228

చ. వనకమలారుణాంబర మ♦వారితకుంజలతౌఘశోణలో
చనఘృణిమండలంబు తరు♦సంఘదిగంబరపంక్తి మస్తకో
కనదభసజ్జటావ్రజము ♦ కాననమేఘతటిల్లతోత్కరం
బనఁగ నవీనపల్లవచ♦యంబు రహించె నరణ్యభూములన్. 229

చ. అళితతి ధక్కనైల్యము సు♦మావళి చుక్కలనామ ముల్లస
త్కళికలు పూసపేరు నన ♦ దట్టము పట్టుగఁ బూని మావిజా
జులకు శుభాశుభాలు పిక♦సూక్తులఁ దెల్పుచుఁ జైత్రికుండనే
యల డుబుడక్కవాఁడు కల♦యం జరియించె వనాలయంబునన్. 230

చ. అళికుల గానవైభవము ♦ హర్ష మొనర్పఁగ రాగపూగముల్
జెలువపుతావిగందవడి ♦ జిల్కఁగ సమ్మదమొప్పఁ జిల్కప
ల్కుల నలరింపఁ గ్రొత్తవిరి♦గుత్తిచనుంగవ లింపు నింపఁ బో
ల్పలరు లతాలతాంగులను ♦ బాయుట లెట్లుగుఁ బల్లవాళికిన్. 231

ఉ. చారుతరాతపత్రములు ♦ చామరము ల్సురటీలు పావడ
ల్సారతరోత్తరీయములు ♦ చల్వపువల్పెపుదుప్పటంబు లిం
పారు సుగంధలేపనము ♦ లందముఁజెంద వితానపంక్తులై
మీఱె వనీరమాసతికి ♦ మెల్లనిగాడ్పుల 1రేఁగుపుప్పొడుల్. 232

వ. ఇత్తెఱంగున జగన్మోహనం బైన వసంతసమయంబున నవనీసురు లగ్నిష్టోమంబు నుక్థ్యషోడశ్యప్తోర్యామంబు ద్వాదశాహాస్న వాజపేయంబు పౌండరీకం బతిరాత్రంబు చయనంబు గరుడచయనంబు శ్యేనచయనం బశ్వాలంబంబు గవాలంభనంబు జ్యోతిష్టోమంబు ప్రతిపత్ స్తోమంబు మహావ్రతంబు విశ్వజిత్తు రాజసూయంబు సర్వతోముఖి విశ్వతోముఖ సత్రయాగంబు నరమేధంబు బృహస్పతిసవనంబు ప్రాతస్సవనంబు మాధ్యందినసవనంబు సౌత్రామియు నాగ్నేయం బుపస్థాం బాశ్వినంబు హేమంతప్రత్యవరోహణంబు వృషభయజ్ఞంబును మొదలగు సకలక్రతువు లొనరింప దొడంగి రట్టిసమయంబున. 233

కం. హరిశర్మ యనెడు పేరునఁ, బరఁగిన యొక సోమయాజి ♦ పనిచిన నొకభూ
సురసుతుఁ డొకదిక్కున న,ధ్వరపశువును బట్టుకొని ము♦దంబున రాఁగన్. 234

కం. కంతువసంతజయంతులఁ, బంతంబున గెల్చు నతని ♦ భవ్యాకృతి న
త్యంతముదంబునఁ గన్గొని, 2కాంతవశరహతుల కళికి ♦ గానుల దాత్మన్. 235

చ. కలికిచొకాటపుఁ సొగసు♦కాయము కాయజుఁ గేర మీఱు నిగ్
గలితవమోవిలాస బిగి♦కౌఁగిట సొక్కుచు నుండలేని యా
కులుకుటొయారిగబ్బిచను♦గుబ్బమిటారుల యంద మేల యె
మ్మెలపసయేల 3ప్రోడతన♦మేల యటంచు దృఢానురాగయై. 236

ఉ. చెంతకుఁ జేర నేఁగి ముఖ♦సీమ దరస్మితమొప్ప వారసీ
మంతిని కీయనో వెలకు ♦ మార్చనొ యేటికిఁ గొంచుఁ బోయె ద
త్యంతరయాన ఛాగము న♦టంచును మాటకుఁ దీసి పల్కన
శ్రాంతముదంబుఁ గైకొని ధ♦రాసురసూనుఁడు విచ్చఁగన్నులన్. 237

మ. అనవద్యాకృతి యౌవనంబు దగు న♦య్యబ్జాక్షి నీక్షించి హా
వనజాతాసనుసృష్టికౌశలము తే♦వల్ దీని నిర్మించినం

పా. 1. రాలు పుప్పొడుల్. పా. 2. కంతుశరాహతుల పా. 3. యం చతని♦మీఁదను గాంత

తన కానంబడ నేర్పుపెంపనుచుఁ ద♦ద్వాణీశుఁ గీర్తించి మె
ల్లనె చేరం జని దానిచెంగటను మే♦లం బాడుచున్ నిల్చినన్. 238

తే. గీ. అలరుకన్నులఁ దేలించి ♦ హర్ష మొదవ, సరస మాడుచుఁ గనుసైగ ♦ కెరలి వేగ
నింటి కేఁగిన నచ్చెలి♦వెంట నేఁగి, క్రీతుపశువు నాతఁ డోకచోటఁ ♦ గట్టివైచె. 239

వ. అప్పుడు. 240

కం. మోహాంబారఁగఁ గంద,ర్పాహవమున వార లిరువు ♦ రతులప్రౌఢిన్
బాహాబాహి కచాకచి, దేహాదేహిని బెనంగి ♦ ధృతి నున్నంతన్. 241

ఆ. వె. దానివిభుఁడు వచ్చి ♦ తలుపుఁదీయు మటంచుఁ, దనదుసతిని బిల్వ ♦ విని విటుండు
కడుభయంబు వొడమి ♦ కంపితదేహుఁడై, యింక నెట్లు లనుచు ♦ నింతి కనియె. 242

ఉ. అత్తఱి నెట్లు బొంకి వసు♦ధామరశేఖరుఁ డైన యాభుజం
గోత్తముఁ వెళ్ల నంపవలె ♦ నుత్పలగంధసుగంధి లెస్సఁగాఁ
జిత్తములోన యోచనము ♦ చేసుక తెల్పు మటన్న హంసతో
బిత్తరి నే నెఱుంగ నిది ♦ పెంపుగ నీవె వచింపు నావుడున్. 243

కం. మంచి యిది విను మటంచున్, గాంచనగర్భాశ్వ మబలఁ ♦ గనుఁగొని పలికెన్
బ్రాంచన్మధురసుధారస, చంచన్మకరందబృంద♦సదృశమృదూక్తిన్. 244

ఆ. వె. లలన నటుల భర్త ♦ పిలిచినఁ దా విని, వసుమతీసురుండు ♦ వడఁకుచుండ
వెఱవవల దటంచు ♦ వీఁపు దట్టి లతాంగి, వేగ మేఁకపోఁతు ♦ విడిచిపెట్టి. 245

తే. గీ. పోవుపోనీక పట్టుము ♦ భూమిదేవ,వర్య యనుకొంచు వచ్చి క♦వాట మెడయఁ
దీసినంతనె తద్భర్త ♦ యీసుతోడ, నెవ్వఁడీతండు గలిబిలి ♦ యేమి యనుచు. 246

చ. గదిమిన నావధూటి కల♦గన్బడ కాత్మ భయంబు లేక భూ
మిదివిజుఁ డీతఁ డీసవన♦మేషముఁ బట్టుకపోవఁ దార్చిడు చే
వదలిన వేగ వచ్చి మన♦వాసముఁ జొచ్చుక చిక్కకుండినన్
బదపడి తల్పు మూసికొని ♦ పల్మఱు మేషము ద్రిప్పలాడెడిన్. 247

కం. చూడు మని చూపి బాపనిఁ, బోడ కడు నుగ్ధ మేఁక♦పోఁతునుఁ బట్టి
మ్మోడకుఁ బోవలెనో యని, చేడియ చెప్పిన నతండు ♦ చిఱున వ్వొలయన్. 248

తే. గీ. తరిమి మేషంబు పట్టిచ్చి ♦ తరలు మయ్య, బ్రాహ్మణోత్తమ యని పంపి ♦ భార్యమీఁద
సందియము లేక యెప్పటి♦చందమునను, వేడ్క లిగురొత్తఁగా నుండె ♦ వెలఁది మగఁడు.

కం. ఈమర్యాదఁ జరింపం,గా మహిమ యొకింత నీకుఁ ♦ గల్గిన భూమి
స్వామినిఁ జేరఁగఁ బొమ్మని, హేమావతితో మరాళ ♦ మి ట్లనువేళన్. 250

సీ. కృకవాకుకంఠకే♦చకవివృద్ధ 1కదంబకములకు నపరది♦జ్మారుతంబు
బహుళనిద్రాముద్ర♦పద్మకానన 2సద్మభసలల మేల్కొల్పు ♦ పాఠకుండు
చక్రవాకద్వంద్వ♦సంబంధసంధాన శేముషీభూషణ♦చేటకుండు
సురమార్గదీప్తి కాం♦తరతారబిసఖండభక్షణాయాతవ♦లక్షపక్షి

తే. గీ. భూరికైరవవనరమా♦ముఖవివర్ణ, భావసంపత్కరం బైన ♦ పగలువత్తి
కులట లెదసుద్రిక్కఁ జోరులు ♦ గుట్టలెక్క, వేగ నుదయించె జిగినిక్క ♦ వేఁగుచుక్క. 251

చ. అపుడు కథాచమత్కృతి మ♦హాద్భుతమై తలఁద్రిప్పి యద్దిరా
నిపుణత జంత మేల్వగల ♦ నేర్పరి 3యౌనని మెచ్చికొంచు న
చ్చపలమృగాక్షి దివ్యమణి♦సౌధములో విరిదమ్మిపాన్పుపై
విపులనృపాలమోహపరి♦వేదనచే శయనించె సొక్కుచున్. 252

వ. ఇట్లు శయనించి కొంతదడవు నిద్రించి లేచి హేమావతి రాజదూతి యగుహేలతో ముదంబున నిట్లనియె. 253

చ. కలయొక టేను గంటిఁ గల♦కంఠసుకంఠి శుకాశ్వకేళికా
కలితకళాకలాప పతి♦గాఢభుజాపరిరంభణక్రియా
సలలితపారవశ్యసుఖ♦సంభ్రమగుంభనజృంభమాణపుం
స్కలనల మేలుకొంటి రవిఁ♦గంటి నకుంఠతరోదయోపరిన్. 254

వ. అనిన హేమావతిం గాంచి నీయిష్టంబు శీఘ్రంబున నీడేరు నని దూతి చెప్పిన విని సంతోషించి యమ్మగువ క్రమ్మర దినాంతంబున. 255

తే. గీ. నీల కాకోలకాకోల ♦ నీల నీల,కంఠ శ్రీకంఠ శ్రీకంఠ ♦ కంఠఘనఘ
నాఘనఘనాఘన ఘనఘ♦నాఘరుచుల, పెంపు గనిపించుచీఁకటు ♦ లేర్చువేళ.. 256

కం. నలుగిడి కుంకుమపిండిని, దల సంపెఁగనూనె నంటి ♦ తావుల గంధా
మలక మొసఁగి పన్నీటన్, జలకం బొనరిచి తడార్చి ♦ చల్వపువల్వన్. 257

సీ. చీనికలంకారి ♦ చీటికుచ్చెలమీఁద సిరిమించు సరిగంచు♦చీరఁగట్టి
కొదమరాచిల్కలఁ ♦ గూర్చి తీర్చుకసీదు సవురుమేల్పనిచల్వ♦రవికెఁ దొడిగి
తళుకుమానికపురి♦ద్దా చెక్కడపుఁబైడిసొమ్ములు నెమ్మేన ♦ నెమ్మిఁదాల్చి
కమ్మనెత్తావి చొ♦కాటంపుఁగలపంబు నెఱనీటుగా మెడ♦నిండఁ బూసి

తే. గీ. తుఱుములోపల నరవిరి♦సరులు దురిమి, వేడ్కఁ గపురపు బాగాలు ♦ వేసికొనుచుఁ
గులుకుజిగిబిగివగ వింత♦గొలుప వచ్చె, 4దరసిమదనునిఘోటి య♦త్తరువధూటి. 258

---

పా. 1. కదంబకములకుఁ బడమటి♦కడమరుత్తు పా. 2. పద్మభవనను పా. 3. వా దని పల్కి యంత న
పా. 4. బోఁటి లావణ్యమదనవ♦ధూటిఁ బోలి.

కం. వచ్చి తనమ్రోల నిలిచిన, యచ్చపలమృగాక్షిఁ జూచి ♦ హంసము భళి ని
న్మెచ్చితి నీసొగసుకు నను, మెచ్చుము కథ విని యటంచు ♦ మెలఁతకు ననియెన్. 259

ఇ రు వ ద వ రా త్రి క థ.

కం. ఉజ్జయిని యనఁగ నొకపుర, ముజ్జగతిఁ బ్రసిద్ధికెక్కు ♦ నిద్ధవిభాసం
వజ్జలజభాగహర్మ్యవి,రజ్జారాలింగితాప్స♦రఃస్త్రీగణ మై. 260

మ. నెలజాలోవలు చిల్కుకుల్కుప్రవ♦న్నె ల్వన్ను ముత్తెంపుఁదా
వల కప్పింపుటనంటిమొగ్గమగఁడౌ ♦ బల్వోబదె దంతంపుసి
స్తులు సొల్కుం బవడంపుఁజాఫ్రల రహిం♦చున్ గెంపుతాఁమోడుబి
ళ్లల నిద్దం బగు నిల్వుటద్దములనే♦డ ల్వేనవే లప్పురిన్. 261

చ. పురవనభూజపుష్పఫల♦ముల్ గనువేడుకఁ బూని తద్ద్రుమో
త్కరములమీఁది కెక్కి సత♦తంబును దండల నుండు నందన
స్ఫురదురువృక్షపంక్తి సుమ♦ము ల్వెసఁ గైకొని కొప్పులం దలం
కరణ మొనర్తు రౌర పురిఁ♦గల్గిన భిల్లసుపల్లవాధరల్. 262

వ. అందు. 263

మ. చతురోపాయసమర్థుఁ డప్రతికళా♦చాతుర్యధుర్యుండు వి
శ్రుతకార్యజ్ఞుఁడు రాజనీతిసుమనీ♦షుం డింగితజ్ఞానుఁ డ
ద్భుతశక్తిత్రయదక్షిణుండు గుణసం♦పూర్ణప్రభావుండు సం
తతభూపాదరణీయుఁ డొక్కరుఁ డమా♦త్యశ్రేష్ఠుఁ డుండుం బురిన్. 264

తే. గీ. అతని బహుమానమానితుం ♦ డండ్రు జనులు, మానినీరత్నమ పరాకు♦మాని వినుము
భర్తృహరిచెంగటను గీర్తిఁ ♦ బరఁగుసట్టి, మంత్రిజనులందు మేటి యా♦మంత్రిజూటి. 265

సీ. నిర్ణయం బౌబ్రహ్మ♦నిర్ణయంబు స్వమాయ విష్ణుమాయయుఁ జర్య ♦ కృష్ణచర్య
వాక్యంబు శ్రీరామ♦వాక్యంబు దృష్టి యీశ్వరదృష్టి దీప్తి భా♦స్వంతుదీప్తి
బల్మి భీమునిబల్మి ♦ పద పింద్రపదవి సత్యము హరిశ్చంద్రస♦త్యము ప్రతిజ్ఞ
రామప్రతిజ్ఞ ధై♦ర్యము మేరునగధైర్య మాజ్ఞ సుగ్రీవాజ్ఞ ♦ ప్రజ్ఞ గురుని

తే. గీ. ప్రజ్ఞ బలము దుర్యోధను♦బలము కట్టు, డన భరతుకట్టడ కలిమి ♦ ధనదుకలిమి
గాఁగఁ బతి మెచ్చ నఘటన♦ఘటనపటిమ, 1నన్మహామంత్రి రాజ్యభా♦రమ్ము దీర్చు. 266

వ. మఱియు గురు మహాప్రధాన సామంత సేనాపతి ద్వారపాల కావసరిక ఘటికానిర్ధారక గణక లేఖక పౌరాణిక పురోహిత జ్యోతిషిక కావ్యజ్ఞ విద్వజ్జన దేవతార్చక మాల్యాకారక పరిమళకారక గోష్ఠాధికార గజాధికా రాశ్వాధికార భాండారాధికార ధాన్యాధికా రాంగరక్షక

పా. 1. నెమ్మి నమ్మంత్రి రాజ్యభా♦రమ్ము దీర్చు.

సూత సూద భేతాళ మత తాంబూలిక తాళవృంతక నరవాహక ఛాత్రిక చామరిక కళాచిక కరశారిక కారపాలిక పాదుకాదార నర్తక గాయక వైణిక శాకునిక మాగధ వైతాళిక పరిహాసక కాంచుక క్షౌరక రజక సౌచిక చర్మకారక ముద్రాధికార పురపాలక వనపాలక నరవైద్య గజవైద్యాశ్వవైద్య పశువైద్య భేరీవాదక మురజవాదక రామక శిలాచ్ఛేదక కాంస్యకారక కుంభకారక చిత్రకారక వ్యవహారిక మృగయార్థి పక్షిఘోషక పణిహారక రాయభార కోశాగ్రాణాధికార వేశ్యజనంబు లాదియైన డెబ్బదిరెండు వినియోగంబులవారు సేవింప నతండు వెలయుచుండు. 267

ఉ. వానికిఁ గొన్నినాళ్ల కిల ♦ వార్తకు నెక్కెవాఁడు రూపరే
ఖానవపంచబాణుఁ డనఁ♦గాఁ దగుచక్కనివాఁ డొకండు స
న్మానవిభూషణుండు సుకు♦మారుఁడు దైవకటాక్షవీక్షణా
నూనకృపాప్తిచేఁ గలుగ ♦ నుత్సవ మొప్పఁగఁ బెంచి రెంతయున్. 268

తే. గీ. పెంచి యెలప్రాయమొదవఁగాఁ ♦ గాంచియతని, పెండ్లిసేయుఁదమనుచు సం♦ప్రీతినొంది
తల్లిదండ్రులతో బంధు♦తతులతోడఁ, బరిణయము వల్ల నే నని ♦ పలుక నతఁడు. 269

ఉ. వారలు పెండ్లి యేమిటికి ♦ వల్లనటంటి వటంచుఁ బల్కినన్
వారల కాతఁ డిట్లనియె ♦ వారిజనేత్రల నమ్మరాదు మా
యారచనాప్రవీణలు ప♦రానుగతేచ్ఛలిఁ కింత యే మనన్
వారక నాఁడురూపములు ♦ వ్రాసినయింటను నిల్తురే బుధుల్. 270

కం. కుల మెంచ రాడికోళ్ళకుఁ, దలఁకరు నడి వావివరుసఁ♦దలఁపరు నీతిన్
దలకొనరు సత్యమాడరు, కలహాత్మలు వారి నమ్మఁ♦గా నెటు లబ్బున్. 271

ఉ. చన్నులకన్న మున్నొడము ♦ సాహసము, ల్బెళకించు దృష్టికిన్
మున్నుఁగఁ బుట్టుఁ బెద్దలను ♦ మోసముపుచ్చు మసిమ, యౌవనా
సన్నతకన్న మున్నె యగు ♦ సత్య మసత్య మసత్య మెన్నఁగాఁ
దిన్నఁగ సత్య మంచనుచు ♦ దీకొను ధీరత పువ్వుఁబోండ్లకున్. 272

ఉ. ఒక్కలు నెమ్మొలున్ సొగసు ♦ తీవియు నాగరికంబు నిద్దపుం
జక్కఁదనంబు జవ్వనము ♦ సంపదసొంపు వినోదపున్వగల్
చొక్కపువైఖరు ల్రతుల ♦ సూడిది చాతురి గల్గువారికిన్
దక్కినయట్లు భర్తలకుఁ ♦ దక్కరు నిక్కవ మింతు లెంతయున్. 273

తే. గీ. గరగరిక్కనుండు మోహనా♦కారవిభవ, శుభవయఃపాకపురుషులఁ ♦ జూచినపుడె
దృష్టి వారలపై నిల్పి ♦ తెవులు లేని, దశలఁ గృశియింతు రింతులఁ ♦ దరమె తెలియ.

కం. అని పల్కెడు తత్పుత్రినిఁ, గనుఁగొని తలిదండ్రు లాప్త ♦ గణములు బంధుల్
వనితాభిముఖునిఁ గాఁ దమ, యనుపమచాతురి నొనర్చి ♦ రతిసంప్రీతిన్. 275

కం. కులగుణరూపప్రజ్ఞా,దులు గల కన్యకల మాన ♦ ధుర్యాహసజ్జన్
జెలఁగిన యతనికిఁ బరిణయ, మలరఁగఁ గావించి రంత ♦ నతఁడు నిజాత్మన్. 276

తే. గీ. నెలఁతలను నమ్మరా దని ♦ నిశ్చయించి, పోఁతుటీఁగకు నైనను ♦ బోవరాని
యొంటికంబపుమేడలం ♦ దునిచెఁ దత్స,తీద్వయంబును హితసఖు ♦ లైలిసి పోవ. 277

వ. ఇత్తెఱంగున నన్యులకుఁ బొందఁ శక్యంబులుగాని సౌధంబుల నిజభార్యాద్వయంబును వేర్వేఱఁ గాఁపురం బుంచి తత్పరిపాలనార్థంబు పెద్ద లగు హితవయస్యుల నియమించిన నచ్చెలి కత్తె లత్తరుణు లన్నపానాద్యుపచారంబులఁ బోషించుచుండునెడ భువనమోహనాకారం బైన యౌవనోదయంబు సంభవించె నాలోన. 278

సీ. కందర కమలారి ♦ కార్ముక కంజాత కాంచనకంబుల ♦ గర్వ మణఁచి
పద్మరాగ పటీర ♦ పద్మారి ఖండపల్లవ పద్మముల సము ♦ ల్లాస మొంచి
వజ్రవల్లిద్వయ ♦ వసుమతీధర వారణారి వారణ వసు ♦ ధాళిఁ గేరి
కదళికా కాహళ ♦ కచ్ఛప కలకంఠ కనక కర్పూరసం ♦ ఘముల మీఱి

తే. గీ. కచముఖభ్రూనయననాసి ♦ కాగళోష్ఠ, పరిమళ కపోల [1]మార్దవ ♦ పాణి దంత
బాహుకుచమధ్యగతినితం ♦ బాంక [2]జంఘ,కాంఘ్రివాగ్భాస్మితము లొప్పు ♦ నంగనలకు. 279

చ. తరుణుల కౌను లాకృతులు ♦ తళ్కుమొగంబులు చన్గవ ల్సువా
క్సరణులు పాణులున్ మెడలు ♦ చారునితంబము లారురేఖలున్
దరళవిలోచనంబులు ప ♦ దంబులు మేలు మిణుంగు లారయన్
హరికమలాబ్జచక్రనివ ♦ హంబు నయంబు రయంబున న్నగున్. 280

సీ. ధరజమోన్నతి మించెఁ ♦ దనరుచన్నులు కృష్ణ వర్త్మఘనాకృతి ♦ వఱలె నెఱులు
కనుఁగొమల్ ధర్మవి ♦ ఖ్యాతిఁ గైకొనె ముఖంబులు నిశాచరకళా ♦ కలన గెల్చె
జలధరసంభ్రమం ♦ బులఁ గేరె నాభులు కటులు మహాబలో ♦ త్కటతఁ దనరె
నీలకంఠప్రియ ♦ శ్రీలందె నాసలు [3]గజరాజగతిఁ దాల్చె ♦ గమనగరిమ

తే. గీ. యమరకాంతాదిలీలల ♦ ట్లవయవములె, పరిహసింపఁగ మెఱయు న ♦ ప్పద్మపత్ర
సదృశనేత్రల కిఁక ధరా ♦ స్థలిఁ జెలంగు, చెలువ లన నెంత హాసని ♦ర్జితలతాంత. 281

సీ. మెఱుఁగు మోవులు ప్రభా ♦ కరబలంబు వహించె లవనము ల్చంద్రబ ♦ లంబుఁగాంచె
జఘనము ల్వసుమతీ ♦ జాతబలం బందెఁ గలితబుద్ధులు సౌమ్య ♦ బలముఁ జెందె

---

పా. 1. కోమల పా. 2. జాను, పదవచోంగస్మితము లొప్పు ♦ భామినులకు. పా. 3. గజభేదిగతిఁ

గురుబలంబు వహించె ♦ గుబ్బచన్గవలు నఖంబులు శుక్రబ♦లంబుఁ బూనె
మందబలంబు స♦మ్యగ్యానములు దాల్చె స్వర్భానుబలము క♦చంబు లొందె

తే. గీ. నతను కేతుబలంబు బూనె ♦ నలరు కన్ను, లిట్లు సకలగ్రహబలాప్తి ♦ నెనసియును మ
నోజబలవేధఁ దత్సతుల్ ♦ నై జనాథ, బలము చాలక కోరిరి ♦ పరబలంబు. 282

వ. ఇవ్విధంబున నివ్వటిల్లిన యౌవనగర్వాతిరేకంబున నిర్మానుషంబు లగుసౌధాంతరంబుల నుండుటంజేసి పంజరమధ్యబద్ధకీరికలదారిని నపారజారవిహారవిచారపూరితమానసలైన యామానసకాసారగభీరనాభులు స్వాత్మగతంబున. 283

కం. పతిరతిఁదీరదు తమి పర,పతిరతి యేరీతి దొరకు ♦ భావంబున నం
గత మగు నీ వెతఁ దీర్చెడి, హితవరు లెవ రని తలంతు ♦ రెంతయు వంతన్. 284

సీ. అమరఁ దిర్యగ్జాతు♦లందైన వేఁయక నరజన్మమేల యం♦దఁగ నొనర్చె
నొనరించుఁ గాక నిం ♦ పొదవంగఁ బురుషులఁ జేయక మమ్మేల ♦ స్త్రీలఁ జేసెఁ
జేయుఁగాక రతీచ్ఛఁ ♦ జెందువానికిఁ గూర్ప కీరితి నిర్మోహి ♦ కేల కూర్చెఁ
గూర్చుఁ గాక యథేచ్ఛఁ♦గొని చరింపఁగ నుంచ కీదుర్గమస్థలి ♦ నేల యుంచెఁ

తే. గీ. గటకటా మాయెడాటను ♦ కఠినహృదయుఁ,డాయెఁగాఁబోలు వాణీశుఁ ♦ డటులగాక
యున్న సిల్లేలచేయు నం ♦ చువిద లాత్మఁ, బరితపింతురు మరుబారి ♦ విరహ మొదవ.

వ. ఇట్లు తమకు వలయునెడఁ బడఁతుల గొడవ కడు తడవనితమయెడయఁడు తమ్ము మిగులఁ గూడిమాడి యుండమిని దుర్గమస్థలసంస్థితలగుట జారక్రీడఁబొసఁగమిని గంతుశరసంతతిసంతాపంబున సంతపించుచుఁ బిన్ననాఁటనుండియును దమ్ము నెత్తిపెంచిన దాదులకునైతము నెఱుంగనీయక యొండొకతెఱంగున నయ్యంగనలు మెలంగుచుండి రయ్యెడ సువర్ణయను తదగ్రభార్య యవార్యమోహంబున మదనాదుల నుద్దేశించి తనమనంబున. 286

సీ. నీసుమశరముల ♦ నీసుమసమహాస నీసుమతిని నేయ ♦ నేల మదన
నీరాక నులుకు న♦న్నీరాక లిడక పోనీరా కళాకర ♦ నీరజారి
ఘనమార్గ ముడిగెంచ ♦ ఘనమా వధూవధ ఘనమా విషాపాది♦వనుచు నిన్నుఁ
బవమాన కరుణ నిం ♦ పవమానగతిఁజరిం పవమానమున కళ్కు ♦ వకట నీవు

తే. గీ. మధురధర్మందు సర్వజ్ఞ♦మౌళి సురప,థానువర్తి మహాబలుం♦డనెడు నిజమ
హాత్మ్యములుమాని యిట్లు స్త్రీ♦హత్యఁ జేయు,చున్న మీరీతి నెవరైన ♦ విన్న నగరె.

కం. తారాధిప రజనీకర, కైరవభేదనవిచక్షు ♦ గౌరీశశిరో
ధూర కమలానురంజన,కారణ వారాశిభంగ♦కారాభ్యుదయా. 288

చ. పరిధిమిషంబు మూలికల♦బంతి కళంకముగాఁ బుట్టు భీ
కరకిరణంబులుగ జడలు ♦ కౌముది భూతియుఁ దాల్చి మంత్రివై

విరహులఁ జంపసాగితివి ♦ వే యన నేమిటి కూరు ముక్కటిం
బరఁగిన తోడు బోఁతులర♦వం బనుమాట నిజంబె పో శశీ. 289

కం. కీరమణీ నీరోదకళ, కీరమణీ రత్న మిడి స♦కిల్బిషమతి లే
కీరమణీయపుఁజనవు శు,కీరమణా కానివారె ♦ కీరాలాపల్. 290

తే. గీ. మాటిమాటికి వేఁడు నీ♦మాటియెడలఁ, బాటి దప్పినవార లే♦పాటివారు
గావున దరూర్ధ్రబుద్ధి న♦న్గావు నీకుఁ, చేటి నావి-ందఁ గోప మిం♦తేటి కరయ. 291

కం. పికమా ఘోరాకృతి చూ,పిఁక మాపృశపిగహీణుల ర♦తీశమహోద్ది
పికమార్గము చూపకు న్యాపిక మానస మూని యేఁచ ♦ బింకమె నీకున్. 292

వ. అని వెండియు [illegible]జయాన పెక్కుతెఱంగుల ననంగుని సైన్యసమేతంబుగఁ బలుకు
చున్నసమయంబున దైవయోగంబున. 293

ఆ. వె. ఆసువర్ణమంది♦రాంగణంబున నొక్క, పాదుకాద్వయంబు ♦ పడియె నంత
దాని వెంబడిన మ♦హీనిర్జరుండొకఁ, డతిరయమునఁ బడియె ♦ నంగ మదుర. 294

వ. ఇట్లు పడిన యప్పుడమితెఱగంటికొమరు నత్యనుపమమోహనాకారు నిరీక్షించి భయ
విస్మయహర్షాదులు ముప్పిరిగొనుచిత్తంబున డాయం జని యొంటిపాటగుట వివిధోపచారంబుల
మూర్ఛఁదేర్చి నీ వెవ్వండ వి ట్లిందుఁ బడుటకు నిమిత్తం బేమి యనిన నాసువర్ణకు నతం
డిట్లనియె. 295

మ. హిమవత్పర్వతమందు మందుఁ డనుమా♦నీందుర్గిం డొకం డుండు సం
యమిచంద్రుండు తపఃప్రభావుఁ డల స♦న్యాసికి వెసఁ బోసపు
చ్చి మహాభ్రస్థలి వాయువేగమున వేం♦చేయఁ సమర్థంబులై
యమరుం బావలు తాను బూని చనుచో ♦ నాకాశమార్గంబునన్. 296

ఉ. ము న్నలవాటులేమిఁ బద♦ముక్తములై పడె పావ లిందు నే
ను న్నిలు పోపలేక దివి♦నుం డిటు వ్రాలితి నట్టిపావ లెం
దున్నవొ చూడు మం చనిన ♦ నుగ్మలి యం దొకచోటఁ గాంచి మేల్
పొన్నపుసన్నపుం బనుల ♦ సొంపు ఘటింపఁగఁజాలుపాదుకల్. 297

వ. వాని గ్రహించి యచ్చంచలాక్షి యాహారాదివిధుల సంతుష్టుం జేసి యాబ్రాహ్మణ
కుమారు నెత్తుకొని తత్పాదుకాసామర్థ్యంబున నిలయనికటనిజపతికేళికారామంబునం జేరి
తదనంతరంబ. 298

ఆ. వె. తగినపరిహారిగోడ ♦ దక్షిణోత్తరముల, నఱలు వెడఁదకూట ♦ మంద మొందు
మందిరంబుగాంచి ♦ యం దొక్కయఱఁ దన, పడకటిల్లు చేసెఁ ♦ బద్మనయన. 299

ఉ. అందొక కొంతసేపు వసు♦ధామరపుత్రినితోడ వేడుకన్
గెందలిరాకువిల్తురణ♦కేళులఁ దేలి యజస్ర మిట్లు పొ
ల్పొందిన యిప్పురంబున శు♦భోన్నతిచే వసియించి నన్ రతిన్
జెంది సుఖించు నీ వితర♦చింతలు మానుము భూసురాగ్రణీ. 300

కం. నీ కితరభయంబులు రా,నీక మెలంగుదు నటంచు ♦ హితవు గఱపి బి
బ్బోకిని యతనికి వ్యయమున,కై కొంతపదార్థ మిచ్చి ♦ యనిచెం బురికిన్. 301

వ. ఇట్లతనిఁ బ్రియపూర్వకంబుగా నాదరించి సెలవొసంగి క్రమ్మరఁ దనయిల్లు చేరె, నివ్విధంబునఁ దత్పాదుకాసామర్థ్యంబున. 302

కం. కేళీవనమున సముచిత,కాలంబున నతనితోడఁ ♦ గంతురణక్రీ
డాలలితసౌఖ్యవారిధి, నాలోలమృగాక్షి యోల♦లాడుచు నుండెన్. 303

వ. ఇవ్విధంబునఁ దద్ద్వితీయభార్య యగుసుప్రభయు సపత్నిరీతి విని పరపురుషవాంఛ వొడమి కడుమిడుకుటం జేసి యేచందంబునం బొద్దువోక యొక్కనాఁడు సౌధాగ్రంబున. 304

కం. ఆసుప్రభ సంగీతక,ళాసరసత గలది యాట ♦ లలితముగ సము
ల్లాసమున వీణమీటుచుఁ, జేసెన్ గానంబు సౌధ♦శిలలు స్రవింపన్. 305

కం. సురపథమున నపు డొకముని, యరుగుచు నిజగాననిస్వ♦నాకర్ణనవి
స్ఫురితానందంబున నట, కరుదెంచిన చూచి లేచి ♦ యతనికి మ్రొక్కెన్. 306

ఆ. వె. మ్రొక్కి నిలిచి వనిత ♦ మునితో స్వవృత్తాంత, 1మంతరంగ మెఱుఁగు♦నటులఁ బలికి
దేవ నీవు రతులఁ ♦ దేలించి ననుఁ బ్రోవు,మనుచు వేఁడుకొనిన ♦ నబలఁ జూచి. 307

తే. గీ. నేను విజితేంద్రియుఁడ నిట్టు♦గాన సతులఁ, జెందఁగారాదు నాకుఁ బూ♦ర్ణేందువదన
యైన నీయిష్ట మీడేరు♦నట్టినేర్పు, తెలియఁజెప్పెద విను మని ♦ తెరవ కపుడు. 308

వ. కారుణికాగ్రేసరుండై యొక్కసిద్ధమంత్రంబు చెప్పి యీమంత్రస్మరణంబున వలయు నెడలకుం బోయిరావచ్చుఁ గావున నీవాంఛితంబు దీనఁ దీర్చుకొమ్మని యానతిచ్చి మౌని విచ్చేసిన యంత నాకాంత యత్యంతసంతోషంబున నొంటిపాటైనసమయంబున. 309

కం. ఆరాజన్మంత్రిస్మృతి, నారామముచేరి యున్న♦యపు డచ్చటికై
చేరిన తద్వనపాలుని, మారసమాకారుఁ జూచి ♦ మది ముద మొదవన్. 310

తే. గీ. ఓరచూపులఁ జిన్నెల ♦ బేరజముల, మనసు గరఁగించి తనమీఁద ♦ మరులు కొలిపి
వానిఁ దోడ్కొనిపోయి య♦వ్వాలుఁగంటి, కడమయరలోన రతికేళిఁ ♦ గలసి చనియె. 311

పా. 1. మంతరంబు గరఁగు♦నటులఁ దెలిపి

ం. అదిమొదలు వానిc గవగొని, మదవతి యారామమధ్య♦మందిరమున నిం
పొదవcగ రమింపc దొడcగెను, మదనుcడు విల్లెక్కుడించి ♦ మరలి చనంగన్. 312

ఉ. అంతట నొక్కనాcటినిశ♦యందు శశిగ్రహణంబు గానc ద
చ్చాంతికి స్నానదానములు ♦ సల్పను వేcకువజాము వచ్చుప
ర్యంతము పట్టు నందనుక ♦ రాc డిపు డింటికి నాథుc డంచు దా
దెంతయు వచ్చి చెప్పిన మృ♦గేక్షణ లాత్మల వేడ్కc బూనుచున్. 313

వ. ఒంటిపాటై యున్నసమయంబున. 314

తే. గీ. జలక మొనరించి జిలుగువ♦ల్వలు ధరించి, కమ్మనెత్తావి కలపంబు ♦ కలయ నలcది
యరవిరులకొప్పు లమరించి ♦ యారగించి, తమసమర్థతc దద్వనాం♦తరముc జేరి. 315

కం. ఒకరొకరి నె[illegible] [illegible], సకియలు [illegible] కిండ్లు చేరి ♦ చౌకళిసుబం
ధకళానై[illegible] [illegible] కేళిc బెనcగు♦లాడెడివేళన్. 316

సీ. ఫణిరాజ ల్పం[illegible] పద్మనాభుం[illegible] తిన్నcగా శయనించు ♦ వన్నెc దెగడి
తనరు శ్వేతద్వీప[illegible] గాఢతమమొక్క దెసనుండి పర్వెడు ♦ పస హసించి
క్రిమమునc బుష్పగు♦చ్ఛముమీcద మగతేcటిమొత్తంబు వ్రాలెడు ♦ దత్తిమీcటి
హిమశైలతుంగశృం♦గమున నీలాభ్రంబు పర్యాయమునc గప్పు♦భాతి మెఱసి

తే. గీ. సార కర్పూర డిండీర ♦ హీర హార, తారకోదార ధవళాంశు♦వారకలిత
నీరజారాతిబింబ ము♦న్నిద్రరౌద్ర,గతి గ్రసించెను రాహు వ♦క్కాలమునను. 317

సీ. మంత్రికుమారుc డొ ♦ మానధూర్వహుcడు దివ్యౌషధం బవ్వనం♦బందుc గలుగు
టెఱిcగియుండుటc జేసి ♦ హితమితపరిజనాన్వితముగ దివ్వటీ ♦ ల్వెలుగ నేcగి
బదనిక గల పాద♦పముc జూపి యది తీసికొని రండు పొం డని ♦ కొందఱ హిత
వరుల నంపించి వా ♦ రరుదెంచునందాcకc దా విశ్రమింపcగాc ♦ దలcచి తనదు

తే. గీ. సతుల కెప్పుడు సంకేత♦సదనమైన, తద్వనీమధ్యసద్మంబు♦దండ కరుగc
బ్రస్ఫురత్కరదీపికా♦ప్రభలు సూచి, పరు లెవరొ వచ్చిరని యుప♦పతులు వడcక. 318

తే. గీ. వెఱవకుc డటంచు వారపుబో ♦ వెన్నుc జఱచి, యుపపతుల నిండ్లలోనన ♦ యుండcజేసి
నిలయములనుండి వెలువడి ♦ నెలcతలు తన, కెదురుగారాcగ మదిc గోప♦మొదవc జూచి.

తే. గీ. పరుల కటు తొంగిచూడను ♦ బొటుగాని, దుర్గమస్థలి నుండెడి ♦ తోయజాక్షు
లివ్వనంబున కేరీతి ♦ నెమ్మి మెఱసి, వచ్చినా రనుసందియం ♦ బిచ్చc బూని. 320

తే. గీ. ఇమ్మహానిశి నిచ్చోటి ♦ కేమిపనికి, వచ్చితి రటంచు గద్దించి ♦ హెచ్చరించు
వల్లభునితోడ నవ్వేళ ♦ వనిత లెట్లు, బొంకి పోవలె నెఱిcగింపు ♦ పంకజాక్షి. 321

కం. అని యడిగిన హేమావతి, తనతలఁ గదిలించి తెలిసి ♦ తా నది వివరిం
పనుజాల నీవె తెల్పుము, వినియెద నన హంస యపుడు ♦ వెలఁదికి ననియెన్. 322

తే. గీ. మానధూర్వహుఁ డప్పు డా♦మానవతులఁ, గాంచి వీరలు మత్కుల♦కాంత లనుచు
నిశ్చయించుక రౌద్రని♦ర్ణిద్రబుద్ధి, మీర లివ్వేళ నిట కేల ♦ చేరినారు. 323

ఉ. చెప్పఁడు చెప్పకున్న మిముఁ ♦ జిత్రముగా వధియింతు నంచు రేఁ
డప్పుడు తమ్ము దొట్టిన భ♦యంబు వహింపక యాసువర్ణ సొం
పొప్పఁగ భర్త కిట్లను శు♦భోన్నతలీలల నివ్వనంబునం
దెప్పుడు సంచరించు వన♦దేవతలంచుఁ దలంచు మమ్ములన్. 324

కం. నీమనమున మద్భామిను, లీమగువ లటంచు మమ్ము ♦ నెంచితి వాదిన్
మేము భవదీయసతులము, గా మస్మత్కుళలు నీదు ♦ కామినులనఘా. 325

వ. అదియునుంగాక. 326

కం. ఈయెడమీరు చరింపను, మీయంశమ్ముల జనించు ♦ మించుంబోఁఁణుల్
నాయిల్లాం డ్రని పల్కితి, వే యేమి నిమిత్తమనిన ♦ వినుమెఱిఁగింతున్. 327

తే. గీ. చైత్రరథమున మును మేము ♦ సరసగతుల, సంచరించుచు నవ్వేళఁ ♦ జైత్రుఁ డచటి
కరుగుదెంచినఁ గాంచి య♦నాదరమున, లేవకుండిన సక్రోధ♦లీలఁ బూని. 328

తే. గీ. సాపరాధుల మ మ్మామ♦సంతుఁ డరసి, మర్త్యసేవను నూఱేండ్లు ♦ మహిని మెలఁగుఁ
డని శపించినఁ బ్రత్యక్ష ♦ మటుల నుండఁ,జాలమని మేముప్రార్థింప ♦ సదయుఁడగుచు.

సీ. ఆరీతి మీరు ప్ర♦త్యక్షంబున మెలంగకుండనేరరయేని ♦ యువిదలార
మీయంశములఁ బుట్టి ♦ మెలఁతల మానధూర్వహుఁడను బహుమాన♦వరకుమారుఁ
డగువిప్రునకు భార్య♦లై యుండ నియమింపుఁ డని తెల్పి యావేల్పు ♦ చనిన నిచటఁ
గూర్మితో నీకు మే♦ల్గోరుచు నున్నవారము సువర్ణ యన సు♦ప్రభ యనంగ

తే. గీ. మామహాంశముల జనించు ♦ మనుజసతులు, నీకుఁ గులకాంత లైనారు ♦ నిక్కమిదియు
రూపయౌవనసంపదా♦రూఢి నీదు, చానలకు మాకు భేద మిం♦తైన లేదు. 330

తే. గీ. ఇట్టిచుట్టరికం బుండు ♦ టెఱిఁగి కాదె, నిను సహించితి మితరభూ♦జనులు మేము
మెలఁగుచోటికి నీవేళఁ ♦ బొలసినపుడె, చెడ శపింతుము నీవింక ♦ సుడియరాకు. 331

కం. చుట్టరిక మెంతగలిగిన, రట్టున రారానియెడకు ♦ రా వారలపై
నెట్టిసుబుద్ధులకైననుఁ, బుట్టును రోషంబు దానఁ ♦ బుట్టుం జెట్టల్. 332

కం. కావున నీవిచ్చటి కిఁక, రావలదు వసంతశాప♦రహితత మే మా
దేవవని కేఁగినంతట, నీవటవనమట చరింపు ♦ నీయాప్తులతోన్. 333

కం. అని సంతోషము భీతియు, జనియింప సువర్ణపలుకు ♦ జాడనె పలికెన్
వనితామణి సుపర్భయును, విని తద్వాక్యములు వారి ♦ విభుఁ డపు డాత్మన్. 334

ఆ. వె. ఏపు జవ్వనంబు ♦ రూ పొక్కటై యుండు, టాత్మ సతులె వీర ♦ లనుచు నుంటి
నేము నీసతులము ♦ గా మన్మవంశజ, లనుచు నీ లతాంగు ♦ లని రిదేమొ. 335

కం. ఇంటికిఁ జని కనఁదగు వా, ల్గంటుల యీపలుకు లాత్మ ♦ కామిను లింటం
దొంటిగతి నున్న సత్యము, లింటను లేకున్నఁ గల్ల ♦ లివి దృఢ మరయన్. 336

ఆ. వె. అనుచు నిశ్చయించి ♦ యతఁ డింటి కేఁగెను, వానికన్న మున్నె ♦ వనజముఖులు
నిజసమర్థతాప్తి ♦ నిలయంబులకుఁ బోయి, పవ్వళించియుండి ♦ రవ్విభుండు. 337.

చ. వెసఁ జనుదెంచి యింట నల ♦ వేణులఁ గన్గొని తద్వధూవచో
విసరము సత్యమా ననుచు ♦ వేడుకఁ గన్గొని తప్పనిదర్పలం
బసగల హంసతూలికల ♦ పాన్పులపై శయనించియున్న యా
త్మసతుల లేపి తొంటి వని ♦ తావిముఖత్వము మాని మానినీ. 338

తే. గీ. అరమరలు లేక కూరిమి ♦ నధిపుఁ డతఁడు, కులవధూటుల నెంతయుఁ ♦ గుస్తరించి
పచ్చి వగదేరు రతులతో ♦ నిచ్చ నిచ్చ, లిచ్చకము పుట్టఁజేయుచు ♦ నెనసియుండె. 339

కం. ఈమహిమ నీకుఁ గల్గిన, భూమివిభుని రతులఁ గలయఁ ♦ బొమ్మని హంస
గ్రామణి వినిపించిన విని, హేమావతి మెచ్చుకొని ఖ ♦ గేంద్రున కనియెన్. 340

తే. గీ. జనపతిని జేరఁబోనీక ♦ దినము దినము, కతలు చెప్పఁగ సాగితో ♦ కతలకారి
చిన్నిరాయంచ యిఁకనైన సెల వొసంగు, పోయివచ్చెద నన హంస ♦ పొలఁతి కనియె.

కం. ఇరువదిదినముల కింటికిఁ, బఱతెంతు నటంచు నీదు ♦ పతి చనుచో నా
కెఱిఁగించె ఁతేపవశ్యముఁ, బఱతెంచును గాన నీకుఁ ♦ బఱవం దగునే. 342

చ. నరపతిఁ జేర దర్పకర ♦ ణక్రియలన్ గడు బొద్దుపుచ్చి ని
ద్దురగొని మైనరాజు నినుఁ ♦ దోడనె పాయఁగ లేని కూర్మి మం
దిరమున కేఁగు మంచనక ♦ నిల్చిన నిల్చుటనైన నింటిలోఁ
దెరవరొ నీవు లేమి నరు ♦ దెంచిన నీపతి కేమి దోఁచునో. 343

కం. కావున భూవిభుఁ జేరం, బోవుట కార్యంబు గాదు ♦ పొ మ్మింటి కటం
చావనజాక్షికి హంసధ, రావరమణి దెల్పునపుడు ♦ రవి యుదయించెన్. 344

తే. గీ. అంత హేమావతీకాంత ♦ యంతరమున, భూవిభునిమీఁదిమోహంబు ♦ పొంగిపొరలఁ
బడకయిలు సేరి వేఁబోక ♦ పగిది నుండు, నపుడు తత్పతిసహచరుఁ ♦ డరుగుదెంచి. 345

కం. అదిగో నీపతి వచ్చెన్, ముదమున నగరోపకంఠ ♦ భూమిని విడిసెన్
సుదతి నినుఁజూచిరమ్మని, పదపడి ముందరగ నన్నుఁ ♦ బనిచెన్ వేడ్కన్. 346

కం. అని చెప్పినఁ దద్వాక్యం, బనలశిఖాతప్తశూల♦మై చెవి నాటన్
ఘనరయవిస్మయలజ్జా, తనుహర్షభయాదు లాత్మఁ ♦ దగ పెనగొనఁగన్. 347

ఉ. దిగ్గున లేచి నిల్చి సుద♦తీమణి భూవిభుమీఁదిబుద్ధి లోఁ
దగ్గుచు మ్రిగ్గ నిగ్గు సిరి♦తగ్గనితామరమొగ్గదోయి బల్
జగ్గుల కెగ్గు నింపొనఁగు ♦ చక్కనిచిక్కని గబ్బిగుబ్బలన్
సుగ్గడితంపు పయ్యెదయు ♦ సొమ్ములు గ్రొమ్ముడిఁ జక్కదిద్దుచున్. 348

ఆ. వె. ఓడబేరమాడ ♦ వేడుక మీఱేఁగి,నదియు మొదలు శుభమె ♦ యందఱకును
ననుచు బాంధవాది♦జనులు యోగక్షేమ, మడుగ భద్ర మఖిల ♦ మని యతండు. 349

కం. వెండియు నిట్లను మదవే,దండలసద్గమనతో సు♦ధారసధారా
పాండిత్యమండితోక్తులఁ, బండితమండలికిఁ జెవుల♦పండువుసేయన్. 350

కం. జనపదములు పురులు గిరుల్, గనులు వను ల్నదులు నిధులు ♦ కట్ట ల్మిట్టల్
కనుమలు పేఁటలు తోఁటలు, మునుకొని కనుగొనుచుఁ బోయి ♦ మ్రోలన్ లీలన్. 351

సీ. ముజ్జగంబులఁ బూత♦ములఁ జేయనగు ధౌతవనభంగ గంగ యె♦వ్వనికి భార్య
దేవాశనోత్సాహ♦దృఢకళాసందోహమున మించు చంద్రుఁ డె♦వ్వనికి సుతుఁడు
కడలేని సిరులీనఁ♦గల రమాగజయాన యలరారు నెవ్వాని ♦ కనుఁగుకన్నె
బహుళపద్మభవాండ♦పరిపాలనాఖండవాత్సల్యశాలి యె♦వ్వనికి నల్లుఁ

తే. గీ. డట్టి నక్రధులీకుళీ♦రాళివాశ్చ,రావళీయానకేళీమ♦హాబహూర్మి
మాలికాడోలికాపాళి♦కాలుఁ దన్మ,రాళికోల్లాసి కలశవా♦రాశి డాసి. 352

వ. సభయభక్తినమస్కారంబులు గావించి తదుత్కటతటంబున. 353

సీ. జాతివిలాయతీ ♦ సకలాతిమేల్కట్లు కలబరగీకను♦ఖాబులోవ
పైఠణీజరబాబు♦పనులగోడసరాద మే లరబ్బీమొక♦మాలు దిండ్లు
గోవబూర్నీసు ని♦గ్గులబిల్లసంతన బలుచీనిహాంబట్లు ♦ ప్రగ్గములును
దగటిరుమ్మాతాపు♦తానవారు కసీదు సిస్తు బందరుచీటి ♦ లస్తరీలు

తే. గీ. ఖాతురా జంబుఖాన మ♦క్కాటివాసు, లతలసుకవాసులు బనాతు♦లమరుదిండ్లు
కాంచనస్తంభములు రత్న♦కలశతతులు, డాల్గలముషజ్జరుజగాగు♦డారులోన. 354

కం. హితవరులతోడ యుష్మ,త్ప్రతి వేడుక విడిసి సకల♦పరిమళవస్తు
ప్రతతులు మౌక్తికవిద్రుమ,వితతులు మొదలైన రస్తు ♦ వెలలిడి కొనియెన్. 355

సీ. తళ్కుటుద్దంపుని♦ద్దపునిల్వుటద్దము ల్దంతపుదువ్వెన ♦ ల్తావులొల్కు
నత్తరుఁ [1]బునుఁగును ♦ నంబరు గౌళకచ్చూరము ల్నఖము గం♦బూర చోప

పా. 1. బలుగాలు

జల్లిసవరములు ♦ జిల్లరసము కదంబము గోవజవ్వాజి ♦ పచ్చి పునుఁగు
కురువేరు పచ్చక♦ప్పురము పన్నీరు బేడెము మలాకీలు కుం♦కుమపుపూవు

తే. గీ. బుక్కకస్తూరివీణెలు ♦ చొక్కటంపు, టగరు సంపెఁగనూనియ ♦ లాదిమైన
మెచ్చుఁగలదీవులందుండి ♦ తెచ్చినట్టి, వివిధపరిమళవస్తువు ♦ ల్వేలకుఁ దీసె. 356

సీ. ఘర్ఘరికలును బీం♦గాండ్లు తాంబాణాలు గిన్నెలు పింగాణి♦గిన్నెలు తపి
లెలు గిండ్లు తపనపా♦త్రిలు చట్టవములు తట్టలు తట్లు సంపుట♦మ్ములు కరండ
ములు తంబుగలు కంచ♦ములు చెరువములు గంగాళాలు బిందియల్ ♦ గరిటెలు పడి
గంబులు చిప్పలు ♦ చెంబులు హస్తావళులు కంకణములు ఘం♦టలును గజ్జ

తే. గీ. లాదిగాఁగల్గు దీవుల♦యందు వెలయు, కంచరపుజాతివగ వగ ♦ ల్మించఁజేసి
నట్టిసామగ్రి బలువెల ♦ ల్వెట్టికొనియెఁ, గాంత భూకాంతమణులకుఁ ♦ గాన్కఁజేయ.

1తే. గీ. లేళ్లకొదమలు వింతపొ♦ట్టేళ్లు పునుగు,పిల్లులు జవాదిపిల్లులు ♦ బెఱచిరుతలు
ముంగిస సివంగి జోణంగి ♦ సింగిలీక,గుంపు మానిసికోఁతులు ♦ కొన్నిగొనియె. 358

సీ. సంపంగికావులుఁ ♦ జందురుకావులు వెలిపట్టుపుట్టముల్ ♦ వేఁటచాళ్లు
జీబులు బొమ్మంచు♦చీరలు నాచులు నుదయరాగంబులు ♦ నురుతవన్నె
లొప్పుముయ్యంచుల♦పొప్పళ్లు హొన్నంచు వలువలుఁ గరకంచు♦వస్త్రతతులు
ముత్యాలపందిళ్లు ♦ నుత్తరగోగ్రిహణములు నిగమగోచ♦రములుఁ బద్మ

తే. గీ. పులతికలు నింఘువన్నెలు ♦ బొదలు బచ్చ,లును హరిణవళ్లు హంసవ ♦ ళ్లురగవళ్లు
పొదలుసామంతవీథులు ♦ మొదలుగాఁగఁ, దనరుపటములు వేనవే ♦ ల్గొనియె వెలకు. 359

రగడ. చౌకట్లు నొంట్లు చే♦సరులునుఁ మొలకట్లు
రాకట్టుచుట్టుంగ♦రములునుఁ చేకట్లు
మురువు లొప్పు కిరీట♦ములు మేటితాళీలు
సరిపణలు మించులును ♦ సాటిలేనితురాలు
రంగుగల ముంగాము♦రాలు నాభరణములు
నంగదంబులు మంచి♦హంవీరతాయెతులు
కంఠమాలికలు జిగి♦గల్గు చేకడియములు
కంఠసరములు బిరుదు♦గండపెండేరములు
నద్దంపుటుత్తరియ ♦ లలరు చిఱుగజ్జియలు
కుందనపుఁజెక్కడము♦గుల్కు మణిఘంటికలు

---

పా. 1. తే. గీ. వేఁడికొదమల వింతయా ♦ నేటిపునుఁగు, పిల్లుల జవాజిపిల్లుల ♦ బెట్టురురుల
ముంగిస సివంగి జోణంగి ♦ యింగిలీషు,కుక్కగుంపులఁ గోఁతులఁ ♦ గొన్ని గొనియె.

సతతమొక్కబెడంగె♦సగు సందిబొందియలు
మితిలేనివెల లిడిన ♦ మేఖలా లందియలు
చకచక ల్గలజాతి ♦ సకలమణినికరములు
నకలంకవర్ణప♦ట్టాంబరప్రకరములు
పీతాంబరంబులును ♦ బేర్వడిన బురుసాలు
జాతినీరాదులును ♦ శాలువలు చీనీలు
పచ్చపట్టులు ధగటి♦పాగలు దురంగీలు
నచ్చపు మెఱుఁగు గల ♦ యవురంగజేచీలు
బురతకాళీలు మహా♦మూదులు నిలాచీలు
సరి సేయరాని హం♦సావళులు లాకీలు
మాదళంబులు వెన్న♦మణుగులు ముషజ్జరులు
చాదరలు పైఠిణీల్ ♦ చక్కనికబాయీలు
నడరు బల్లానితేం♦ట్లమరు బుర్నీసులును
నడికట్లు మేఘవ♦ర్ణంబులును దోప్రులును
మొకమాలులును సూర్య♦పుటములు బనాతులును
సకలాతులింపొప్ప ♦ చలికప్పడంబులును
హొంబట్టు లోడీలు ♦ నౌనరా దుకూలాలు
కంభావతులు డాలు♦గల్గు జిరబాబీలు
వింతవింత మెఱుంగు♦వెలసిన భవంతీలు
కాంతితతి వెదచల్లఁ♦గల్గిన సరంతీలు
సురతబంధపువ్రాఁత ♦ సొగసైనచీటీలు
ఘనవిచిత్రపుపనుల్♦గల కళంకారీలు
తనరారుపూలీలు ♦ తగినకల్బరగీలు
తళుకొత్తఁగల సుళువు♦తాప్తాలు బురుడాలు
చెలువుబూనెడు కళా♦చికలు జముఖానాలు
దుద్దుకంబళ్లు చం♦దువలు తివాచీలు
పద్దులకుఁ గైకొన్న ♦ బలుజంబుఖానాలు
ప్రతిలేనిపట్టుచా♦పలు రత్నకంబళము
లతులితము లైన చతు♦రంగములబల్బలము
తళుకుపగడపుఁగోళ్లఁ♦దగు పట్టెమంచములు
కులుకునెత్తావికుం♦కుమపువ్వుతల్పములు
పక్కరంగితలాట ♦ లిడుగోవతేజీలు

ఢాకచూపట్టు సుర♦ఢాణి సింగాణీలు
కళలుదేరు పరంగి ♦ కత్తులును జూరీలు
పొలుపొందు నందలపు ♦ బొంగులును గేడేలు
ఏరి కైకొనిన హరి♦బీకెలును వన్నియలు
పేరైన సూరతను ♦ పీంగాణిగిన్నియలు
రాయంచ లైదువ♦ర్ణములుగల కీరములు
మాయురే యని మెంచ♦మరు పట్టుజీనువలు
చీర్ణంపుపనుల మం♦చిపరంగిపీఠములు
నిర్ణయింపఁగరాని ♦ నిఖిలసద్వస్తువులు. 360

కం. స్వరమండలములు కిన్నెర, లురబాబులు దండవీణె♦లును జారుతరా
ల్వార రావణహస్తంబులు, మఱి తంత్రులు తంబురలు స♦మస్తము గొనియెన్. 361

వ. అయ్యవసరంబున. 362

సీసచూలిక. రాయదుర్గము గుత్తి ♦ రాయవేలూ రానెగొంది మాహురి కాశి ♦ గోలకొండ
ముంగి పైఠణి ఢిల్లి ♦ ముళువాయ జాబురాబాదు మఖామహా♦మూదు మచిలి
బందరు సూరతు ♦ చెందరు గోవేరు శ్రీరంగపట్టంబు ♦ చెంజి కాంచి
చాదయు నౌరంగ♦బాదు దాలాబాదు కల్వర గాగర ♦ గదగు బిదురు
కోట కల్యాణంబు ♦ గొండాణ మహాముదానగరంబు బంగాళ ♦ నగర గోన
పన్నాళ చదరంగ♦పట్నంబు గలగల గజరాజధాని బం♦కాపురంబు
కాంబాగర ప్రయా♦గ ద్వారక యయోధ్య లక్ష్మీశ్వరంబు సో♦లాపురంబు
మధుర కొల్లాపురి ♦ మగధ మా యావంతికా పురాణపురమ్ము ♦ కలబరగయు
నానవేని కళింగ ♦ మాన్వరి వినుకొండ కొండవీడును నేల♦కొండపల్లి
పొదిలె విజాపురం ♦ బుదయగి రిక్కేరు మైసూరు పెనుగొండ ♦ మంగళగిరి
బసువపట్నము సీర్పి ♦ భద్రాచలము పాలవంచ నిజాంపురి ♦ వందవాసి
కుందుర్పి బెల్లము♦కొండ దేవరకొండ రాచర్ల మునిమడుగు ♦ రాయపురము
సైదాపురము గోవ ♦ సాళ్వాక దూపాడు రాపర్తి మాచెర్ల ♦ రాచవీడు
బనగానిపల్లె కం♦భము పోరుమామిళ్ల ధారాపురము చీని ♦ తాడిపర్తి
నంద్యాల శిరువళ్ల ♦ నందవరము కందుకూరు రామయపట్న ♦ ముండ్రుకొండ
హంపి విరూపాక్ష ♦ మారణి వేంపల్లె కొంపల్లినగరంబు ♦ కందనోలు
కడప సిద్ధవటంబు ♦ గండికోట కరూరు సింహాద్రి పోట్లూరు ♦ చింతగుంట
గయ చెన్నపట్నంబు ♦ గండవరం బోరుగల్లు దామెనచెర్వు ♦ వెల్లటూరు
కల్లూరు కలువాయి ♦ నెల్లూరు బేలూరు రాచూరు చదుమూరు ♦ రాచకొండ

కదిరి కూటాగూళ్ళ ♦ గంగేరు శృంగేరు రామళ్ళకోట వ♦జ్రగిరి నోసము
సూగూరు జాబాల ♦ బాగూరు కోళ్ళాల గుడిబండ బళ్ళారి ♦ కొత్తకోట
గుమినేనిపాళెంబు ♦ గొబ్బూరు బళ్ళాపురము పుంగనూ రౌకు ♦ రామబెంకి
మానువ కొత్తాళ ♦ మానుకొం డైనూరు జలపూరు పెదవలి ♦ జల్లికోట
కుంభకోణము కోట♦కొండ తంజావూరు పెరవలి దువ్వూరు ♦ బెంగుళూరు
వొత్తూరు చిత్తూరు ♦ హుజ్జిణి చిర్తనాపల్లి తొండమనాడు ♦ పా్రికటూరు
చిరుతని కాళహ♦స్తి సిమూరు మధ్యార్జునము తిరునామల ♦ నామఃకొండ
పాకల కావేరి♦పాక మోహనగిరి చదుకూరు మల్లూరు ♦ చాదుకొండ
సాగొండ వానిలి ♦ నాగోలు తాళ్ళూరు మైలాపురము బెద్ద♦మంగళంబు
రామసముద్రంబు ♦ [illegible]మాపురము జటపోలూరు వెల్లాల ♦ భువనగిరియు
హాసిపణాహళ్లి బే♦దనవారి గొండాపురము గౌరి మాయూర ♦ మమరవీడు
నిడిగల్లు కొక్కల్లు ♦ కడవకోలును రత్నగిరి వెలిగోడు తం♦గెళ్ళ దర్శి
కంగొంది తిరిగొండ ♦ కడప నెత్తము మాస్తి సివనగ ళ్ళవళంది ♦ సింగళంబు
మన్నారుకోవెల ♦ సొన్నగల్లు చిదంబరము వాగెనగిరి పు♦రాణపురము
వడియారుపాళెంబు ♦ నుడిపిసుబ్రహ్మణ్య ముజ్జంగి మండువా ♦ హాసనగల్లు
రామనాథపురంబు ♦ సాముగోళ్ళ బెడంద ధర్మవరంబును ♦ దాడిగోళ్ళ
మవణికె మండెము ♦ మారికాపురి కుంభ యారంగ ముజ్జారి ♦ హారికెహళ్లి
కెట్టివోలు కురంజి ♦ రేవణి సన్నక్కి బాగూరు గుజ్జరి ♦ పాలదాయి
రామచంద్రాపుర ♦మామూరు [1]బెజవాడ కొండేరు కాండూరు ♦ కోటకొండ

తే. గీ. మొదలుగాఁగల్గు జనపద♦మ్ములను దుర్గ,ములను బేఁటలఁ బాళెలఁ ♦ బురుల వెలయు
వర్తకులు వచ్చి రచ్చటి ♦ వస్తుతతులు, బేరసారంబు లాడెడు ♦ పేర్మి మెఱసి. 363

కం. ఆరీతి వచ్చువారల, కారయఁ దాఁ బిన్నపెద్ద♦యై సీవిభుఁ డిం
పారఁగ వస్తువు లన్నియు, బేరము పొసఁగించి చేసు♦వెల కిప్పించెన్. 364

ఉ. అంచితబుద్ధి వర్తకజ♦నాళుల కిట్లు సమస్తవస్తు లి
ప్పించి తదీయభూములకుఁ ♦ బేర్మిఁ జనుండని వారినెల్ల నం
పించి వృషోష్ట్రవాజిరథ♦బృందముపైఁ దన కొన్న వస్తు బొం
దించి సమిత్రుఁడై యరుగు♦దెంచెను సీవిభుఁ డూరు చేరఁగన్. 365

వ. అనిన విని హేమావతీకాంత సంతోషంబున భోజనాద్యుపచారంబుల సంతుష్టుం జేసి తనయోగక్షేమంబులఁ బతి కెఱిఁగింపు మని యతని నంపి తదనంతరంబ. 366

పా. 1. బెజ్జవాడాలకొం డెరకొండ♦పాళె మివియు

తే. గీ. కథలు తెల్పుటయెకాదు ♦ కరుణఁ బ్రొద్దు, పోనియపుడెల్ల రాయంచ ♦ పూనిచెప్పి
నట్టి నయవాక్యములచేత♦నైన సన్మ,నీష హేమావతీమంజు♦భాష యపుడు. 367

కం. పరపురుషసంగమం బిహ,పరసుఖదూరంబుగానఁ ♦ బాతివ్రత్య
స్ఫురణ గల సతులు మదిగో,ర రటంచును నిశ్చయించి ♦ ప్రమదం బెసఁగన్. 368

తే. గీ. చిత్రభోగునిపైఁ బ్రేమ ♦ చిందఁ జేసి, నిజవిభునిరాక కలరి య♦న్నీరజాక్షి
తనదు గృహకృత్యములు దీర్చు♦కొనుచునుండె, నంతఁ దత్పతి యింటికి ♦ నరుగుదేర. 369

కం. కుందనపుబిందియల హారి,చందనతరుఖండవహ్ని♦సంతప్తంబై
క్రొందావు లొల్క వన్నె,టం దగ జలకం బొనర్చి ♦ తడయక యంతన్. 370

ఉ. ఆజవరాలు కీలుజడ ♦ నంబురుహోత్పలకేసరాలు వ
క్షోజధరాలఁ గొప్పలగు ♦ క్రొమ్మగరాలసరాలు నంగుళీ
రాజి వినూత్నరత్నముల ♦ రంగుచెలంగెడి యుంగరాలు వి
భ్రాజితనూపురాలు పద♦పద్మములన్ సవరించు వెండియున్. 371

సీ. వనచరంబులు గాన ♦ వచ్చు మైత్రికిపన వేణికాళిశ్రేణి ♦ విరులు దురిమి
నీటఁబుట్టినవాట ♦ నెమ్మి డాసె ననంగ గళశంఖమున హార♦ములు ధరించి
జలజంబు లాటచే ♦ చెలిమిఁ జెందె ననంగఁ గరవారిజములఁ గం♦కణము లుంచి
సారంగజములాట ♦ సఖిత నొందె నన వక్షోజకుంభములఁ గ♦స్తూరిఁ బూని

తే. గీ. కనకరుచు లాట మిత్రిత ♦ ననఁగి పెనఁగె, ననఁగఁ దనుహేమలతను మి♦న్నగుపదాలు
వన్నెబంగారుపువ్వుల♦వలువఁ దాల్చి, పతికి నెదురుగ నేఁగె స♦ప్పద్మగంధి. 372

వ. ఆ సమయంబున. 373

సీ. మిసమిసచూపులు ♦ మిఱుమిట్లు గొలుపంగఁ గిలకిలనవ్వులు ♦ చెలువొనర్ప
ఘలుఘల్లు మని చిఱు♦గజ్జెలు రొదసేయ ధళధళద్యుతులఁ గ♦మ్మలు చలింప
ఝుణఝుణంకృతులఁ గం♦కణములు మొఱయంగ ఘనఘనధ్వనుల మే♦ఖల నటింప
ధగధగద్దీప్తి ర♦త్నపుసొమ్ము లలరార నిగనిగబావిలీ ♦ లీనటు చూప

తే. గీ. భుగభుగలుజిల్కు మైపూఁత ♦ సొగసుగుల్క, గమగమలఁ గ్రఁపువిడెంబు ♦ గంధమొలయ
మిసమిస ల్కుంకుమపురేఖ ♦ మించు లొల్క, ఖణిఖణిల్లని మెట్టెయ ♦ ల్కదురహింప.

కం. తన కెదురుగ వచ్చిన తన, వనితామణి నపుడు చూచి ♦ వదనాంభోజం
బునఁ జిఱునవ్వొలయఁగ నె,మ్మనమున నానంద మొందె ♦ మానిని యంతన్. 375

తే. గీ. విభునిపదములు పన్నీట ♦ వేడ్కఁ గడిగి, నెచ్చెలులతోడ వెస నివా♦ళిచ్చివైచి
యింటిలోనికిఁ దోడ్తెచ్చి ♦ యింతు లెంచ, భర్తతోఁగూడ బహుసుఖ♦ప్రాప్తి నుండె.

వ. అంత హేమావతీకాంతవృత్తాంత మంతయు నాత్మీయదూతి విన్నవించిన విని కంపిత శిరస్కుండై కొంతదడవు చింతించి మహారాజచంద్రుండును నీతిజ్ఞుండును, నకళంకుండును, వివేక ధురంధరుండును గావునఁ జిత్రభోగనృపాలుండు దనమనంబున. 377

ఉ. మున్నల రావణాదులు స♦ముద్ధతి సాధ్వులఁ గోరి యేమి సౌ
ఖ్యోన్నతిఁ జెంది రిట్లగుట ♦ నుర్విజనావళు లన్యకాంతలం
బన్నుగఁ గోరరాదు కదుఁ ♦ బాతక మంచుఁ దలంచి యింతిపై
నున్న1మనీష వీడ్కొని య♦థోచితపద్ధతి నుండె భూవరా. 378

కం. అనుచుఁ బురోహితుఁ డెఱిఁగించిన నలరాజన్యమౌళి ♦ చిత్తాంభోజం
బున నద్భుతప్రమోదము, లెనయఁగ మెచ్చుకొని రాజ్య ♦ మేలుచు నుండెన్. 379

2మ. నతసంజీవనజీవవేశభయకృ♦న్నారాచనారాచను
ప్రితబృందారక దారకత్వనపదా♦రక్షోభిరక్షోభట
శ్రుతసంధారణ ధారణార్హమణిభా♦సుగ్రీవసుగ్రీవము
ద్ధతలాలాపనలాపనద్యుతిచితా♦తారాపతారాపహా. 380

3కం. అక్షద్విడ్లక్షక్షి,ప్త క్షేమకటాక్షదక్ష♦దక్షతనూజా
ధ్యక్షమతపక్షపక్షి, ప్రేక్షుశ్శోక్ష్యమువిపక్ష♦రక్షాశిక్షా. 381

4స్రగ్విణి. పద్మపత్రేక్షణా ♦ భక్తసంరక్షణా, పద్మగర్భస్తుతా ♦ భానుబింబస్థితా
పద్మబాణాకృతీ ♦ భవ్యశౌర్యోన్నతీ, పద్మసర్వేశ్వరా ♦ పాలితోర్వీశ్వరా. 382

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్యనిస్తంద్ర శ్రీరామనామపారాయణ
నారాయణామాత్యప్రణీతం బైన హంసవింశతి యను మహా
ప్రబంధంబునందు సర్గంబును బంచమాశ్వాసము.

సంపూర్ణము.

---

పా. 1. మనంబు ద్రెక్కొని

పా. 2. మ. నతసంజీవనజీవవేశభయకృ♦న్నారాచనారాచను
ప్రితబృందావన దావనర్తనపద♦వ్యారోపణారోపభూ
సుతపద్ధారణ ధారణార్హవనిభా♦సుగ్రీవ సుగ్రీవభి
త్తతనీలాపనిలాపనద్యుతిజిత♦తారాపతారాపహా.

పా. 3 కం. సుగనికరార్చితపాదాం, బురుహోజ్జ్వలకీర్తి నిరత ♦ భూవనితాచి
త్తరసాయనీయసమ్య, క్స్వరమాణుకలాపయాన♦బంధురవచనా.

పా. 4. మాలిని. సురుచిరతరకీర్తీ ♦ సుందరోదారమూర్తీ
(సరసిజనిభవదనా ♦ సంతతోత్సాహసదనా)
గురుతరవసుచేలా ♦ గుంభితోక్తానుకూలా
పరమభవవినాశా ♦ పార్వతీహృన్నివేశా.

రాఁబోవు గ్రంథము.

# గోపాలలీలాసుధాలహరి.

ప్రయాగ కామేశ్వర కవి కృతము.

[ఉదాహరణముగాఁ గొన్నిపద్యములు.]

చ. తిగఁదిగ మానికంబులను♦దిద్దిన బంగరు కీలుబొమ్మలో
మగువల రూపముల్ గొని క్ర♦మంబున ద్రిమ్మరు మించుదీఁగెలో
తెగి జగతీతలంబునకు ♦ దిగ్గన జాఱిన చుక్కలో యనన్
దగి వెలమించుఁబోండ్లు సత♦తంబు విటాళిఁ గలంతు రప్పురిన్. 1-65

ఉ. ఈ ననఁబోఁణి చేసుకొన♦వేటికి నా లికుచంబు లంటి చూ
చేనని మోవిపంటిమొనఁ♦జీరెడు దండలువట్టి వేఱుగై
కొననరాదు చేరువెల ♦ కొంచమె వేఱొక యెత్తుఁజూచిన
న్మాను మటంచు నమ్ముదురు ♦ మాటిననల్ పురిఁ బుష్పలావికల్. 1-67

చ. తొలకరిమించు మించుదొర♦తో నొరవచ్చెటి మేలు మేలు క్రొం
దళుకు కడానిబొమ్మల వి♦ధంబున గాంతుల నీన నందియల్
గలగల మ్రోగ హారములు ♦ గాటఁపుఁ జన్నుల మీఁద నూగ న
న్నలినదళాక్షు లేగి యము♦నా తటినీతటి నీది నిల్వఁగన్. 1-87

చ. చిలుకలకొల్కి కౌఁగిటికిఁ♦జేర్చిన క్రొవ్విలు గంటిరమ్మ యు
త్కలికలు గ్రమ్మఁగా నలరి ♦ తన్మధు బిందువు లా విసీలకుం
తల తలమీఁద రాల్చె నది ♦ తత్పరిరంభణసౌఖ్య మంత క
గ్గలమయి కన్నుగోనలను ♦ గలిమ్మ ముదశ్రులు రాల్చెనో యనన్. 1-107

కం. మల్లీ కోరకవల్లీ, వేల్లిత కుసుమిత పలాశ♦వృక్షము హార
ప్రోల్లస దీశ నఖాంకిత, పల్లవపాణి స్తనంబు♦వలె నమరుఁజెలీ! 1-110

కం. అన్నలువ దీని పిరుదుం, జన్నులు గావింప సరకు ♦ జాలమిని కడున్
సన్నముగా గీసెఁ జుమీ, నెన్నడు మది గాకయున్న ♦ నెఱిఁ జిక్కు నొకో! 1-142

చ. అలికచ చన్నులాత్మ హృద♦యస్థ సుమాశుగ తాపవహ్ని కీ
లల నిజధైర్యకాంచన ధ♦రాధరమున్ గఱుగంగ పైకిఁ జి
ప్పిలనగు రెండు బూదెల య♦భీష్టలతల్ వెలిఁ బ్రాకఁ బూయు మే
లలరుల గుత్తులో మదనుఁ♦డాడెడి బంగరు బొంగరంబులో! 1-148

చ. కనుఁగవ కెంపు రేగఁగను ♦ గబ్బి చనుంగవ మీఁద హారముల్
పెనఁగొని యూగ పెందురుము♦వీగ శ్రమాంబు కణంబులం గడుం
దనులత దోఁగ నందెలు ప♦దంబుల మ్రోగ మరుండు వీగ జ
వ్వని మగలాగుఁ జూపి హరి♦భావము రంజిలఁ జేసె నయ్యెడన్. 1-184

ఉ. మచ్చిక యింతఁజల్లి పలు♦మారు కుసుంబులు వాని పేరెదన్
గుచ్చి కవుంగలించి తళు♦కుం గనుఱెప్పల నప్పళించి మో
విచ్చుచు నొచ్చెనంచు నల♦యించుచు తేనియ లొల్కఁ సారెకున్
ముచ్చటలాడె నాసుమతి♦నోఁచిననోము ఫలించెనా చెలీ! 2-48

కం. విరితల్పము మకరధ్వజ, శర కల్పంబయ్యె మేన ♦ సఖు లలదిన యీ
సిరిగందము విరహాంబుధి, నురు గందంబయ్యె నరము♦నుం భరమయ్యెన్. 2-55

చ. నెల యపరాద్రిఁజేరె రజ♦నీసతిగర్వము జాఱె నిండువె
న్నెల పొగరెల్లఁ దీరె నలి♦నీలలనామణి గేరెఁ దూర్పునన్
దెలతెలవారె నీ వతఁను ♦ దేవియు దేవర పోల్కి నేకమై
గలసెద రమ్మ చెప్పె కల♦గం బనియేమిటి కమ్మ కొమ్మరో! 2-116

ఉ. జాఱిన నానతో నతని♦సన్నిధ నిల్వఁగ నోడి పాన్పుపైఁ
జేరినత్రోడ నాపయికిఁ♦జేరి యొయారముతో కవుంగిటన్
జేరగఁదీసి వాఁ డపుడుఁ ♦ జేసినచేతలు నీకుఁ దెల్పఁగా
నేరుతునమ్మ యన్నిటికి ♦ నే నిఁక నోరుతునమ్మ కొమ్మరో! 2-126

ఉ. వల్లనివాని కెందు దయ♦వచ్చునె వచ్చిన నిందు వానితో
నల్లికబిల్లికై పెనఁగు ♦ నాచెలి పంపునె పంప వచ్చునా
గొల్లఁడు? వానిపొందు తన♦కుం బదివేలకుఁ జాలుచాలునే
పల్లవపాణి! వానిఁ బలు♦బాసలు జేసిన నమ్మ నేనిఁకన్. 2-179

సీ. తనుబాసి యన్య కాం♦తాసక్తుఁ డగుటకు సైరించ నలుల చ♦కోరనయన
శౌరిని బాహు పా♦శంబులఁ బిగఁబట్టి పెందొడల్ దొడలతోఁ ♦ బెనచిపట్టి
గొనబు వాతెఱఁ బంటి♦కొద్దినీ నజ్జునజ్జుగనొక్కి మీఁదెక్కి ♦ చూచుకములు
వక్షస్థలమునాట ♦ వలుదపాలిండ్లను సాము కండెంబుల ♦ సారెసారె [2-196

తే. గీ. గ్రిమ్మకుగ్రిమ్మ మెఱుంగు జె♦క్కులను వాడి,గోరు నాడగ వడిరక్కి ♦ కుసుమశరుని
సమరమున నతనిమేన ము♦చ్చెమట బుట్ట, పెనఁగి తన పంత మీడేర్చు♦కొనియె నపుడు.

ఆ. వె. ఒదిగి యొదిగి యొక్క♦ముదిత చేతుల సిగ్గు,పట్టుఁ గప్పి నిలిచెఁ ♦ బద్మనయను
చూపు దొంగ రగుటు ♦ కోపక మరుగృహ, ద్వారమున కమర్చు♦తలుపు లనఁగ. 3-58

ఆ. వె. చన్నుదోయిఁ గప్పి♦శయముల మదనస,దనము బయలుపఱచి ♦ స్తనయుగంబు
బయలుపఱచి సిగ్గు♦పట్టు చేతులఁ గప్ప, దానిఁ జూచి నవ్వె ♦ దానవారి. 3-63

శా. చేరం బిల్చి యొకర్తు గుబ్బల పయిం ♦ జేయుంచె నొక్కర్తు నిం
డారం గౌఁగిటఁ జేర్చె నొక్కతెకు నొ♦య్యారంబు మీఱ న్మణీ
హారంబుల్ సవరించె నొక్కతెకు నా♦హారంబుగా మోవి ప
ల్మారుం గ్రోలఁగ నిచ్చె నొక్కతె కడున్ ♦ లాలించె ముద్దిచ్చుచున్. 3-119

## శ్రీ గ్రంథమండలి ప్రచురించిన శృంగార ప్రబంధములు.

| | |
|---|---|
| * రాధికా సాంత్వనము (సప్తపదులతో) | ముద్దుపళని |
| * సత్యభామా సాంత్వనము | లింగనమఖి శ్రీకామేశ్వరకవి |
| * అహల్యాసంక్రందనము | సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు |

(ఏకాశ్వాసరాధికాసాంత్వనము, వచనజైమినీభారత—
సారంగధరచరిత్రలలోని భాగములతో)

| | |
|---|---|
| * హంసవింశతి | అయ్యలరాజు నారాయణామాత్యుఁడు |

## క్రమశః మున్ముందు వెలువరింపఁబడు శృంగార ప్రబంధములు.

| | |
|---|---|
| ** గోపాలలీలాసుధాలహరి | ప్రయాగ కామేశ్వరకవి |
| ** గాఢేయోపాఖ్యానము | అనంతార్యుఁడు |
| ** ఉషా పరిణయము | దామెర్ల అంకభూపాలుఁడు |
| ** మదనమోహినీ విలాసము | తక్కెళ్లపాటి లింగకవి |
| ** రంభా నలకూబర విలాసము | బండి వేంకటస్వామినాయఁడు |
| ** రత్నావళీ పరిణయము | ధూర్జటి వేంకటరాయకవి |
| ** నృసింహ విలాసము | పైఁడిపాటి వేంకటనృసింహకవి |
| ** వల్లభాంబా పరిణయము | అక్కినపల్లి నరసింహకవి |
| ** నాగ్నజిత్తీ పరిణయము | వల్లూరి నరసింహకవి |
| ** భద్రిరాజపుత్రిచరిత్రి | చినవేంకటార్యకవి |
| ** సునందా పరిణయము | చింతగుంట కోదండరామకవి |

# సంస్కరణపత్రము

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 12 | కుంకుమ | గుంకుమ |
| 1 | 14 | కేళీ | కేళి |
| 2 | 27 | కృపాలుని♦ | కృ♦ాలుని |
| 2 | 27 | రహించు | వహించు |
| 16 | 5 | ఆక్కట | అక్కట |
| 17 | 7 | నగాని | నంగాని |
| 18 | 12 | నాటి | నాఁటి |
| 18 | 26 | అరఁగులు | అఱఁగులు |
| 19 | 29 | యా, తా | యా,త్రా |
| 20 | 2 | దోస్సిమ | దోస్సీమ |
| 20 | 7 | పురములు | పురములు, |
| 24 | 4 | మూరు | మూఱు |
| 25 | 19 | లోడి | లౌడి |
| 26 | 13 | పాపమొన | పాపపుమొన |
| 26 | 15 | నరకు | నఱకు |
| 36 | 1 | దాకనిపోల | దాని కపోల |
| 37 | 29 | పెనఁగి | పెనఁగె |
| 43 | 22 | ల్వాడియ ♦ వారిగ | ల్వాడి య♦వారిగ |
| 44 | 29 | జగి ♦ మో | జిగి♦మో |
| 54 | 13 | క ్లసంచి | కట్లసంచి |
| 56 | 9 | నేర్చుచు | నేర్పుచు |
| 66 | 24 | నళికికకదలు | నళికి కదలు |
| 79 | 24 | ముడునను | ముడువను |
| 96 | 2 | యనన | యవన |
| 104 | 26 | లెఱపా | లెఱబా |
| 109 | 22 | పొ లు | పొళ్లలు |
| 114 | 22 | బుణో్యపలబబ్ధం | బుణో్యపలబ్ధం |
| 115 | 3 | లరిగూళ్లు | లరిగోళ్లు |
| 115 | 8 | గోరకపుణు | గొరకపుణుకు |
| 117 | 4 | చిన్నెలవనఁ | చిన్నెల వనఁ |
| 117 | 22 | బుతు | బుభు |
| 118 | 30 | మయూ ♦ ఖ | మయూ♦ఖ |
| 120 | 4 | జొనుపుచు | జొనుపుచుఁ |
| 123 | 25 | కౌతుకనల్లి | కౌతుకవల్లి |
| 125 | 20 | దొలఁగి | దొలంగి |
| 129 | 10 | బ్రిధమ | బ్రిథమ |
| 132 | 29 | విధమదెలెల్ల | విధ మదెల్ల |
| 134 | 24 | విస్పోట | విస్ఫోట |
| 152 | 10 | జిగిదేఱునల | జిగిదేఱు ♦ నల |
| 152 | 29 | నెళవుగం | నెళవుగఁ |

పీఠికలో.

| పుట. | కాలం. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| ౭ | ౧ | ౧౩ | దూతీమః_ | దూతీమ్_ |
| ౭ | ౧ | ౨౩ | ప్యాపారం | వ్యాపారం |
| ౮ | ౧ | ౨ | తీయందము | తీయందనము |



